హిందూధర్మశాస్త్ర గ్రంథమాల 14.

శ్రీ

# ఆంధ్రకవి తరంగిణి

## ఆఱవ సంపుటము



రచయిత:

శ్రీ చాగంటి శేషయ్య



హిందూ ధర్మశాస్త్ర గ్రంథ నిలయము
కపిలేశ్వరపురం, తూర్పుగోదావరిజిల్లా.



కపిలేశ్వరపురం కేశనకుఱ్ఱు యస్టేట్ల జమీందారువారగు

శ్రీ బలుసు బుచ్చి సర్వారాయఁడుగారు

ఆంధ్రకవి తరంగిణి ముద్రణమునకు విరాళములొసంగిన
భాషాభిమానులు.

---

## రా జ పో ష కు లు :

౧. శ్రీబలుసు బుచ్చిసర్వారాయుడు జమీందారువారు,
కపిలేశ్వరపురం, కేశవతుద్రి ఎస్టేట్సు, కపిలేశ్వరపురం.

## ప్ర ధా న పో ష కు లు :

౧. శ్రీబిక్కిని వెంకటరత్నముగారు, భూస్వామి ఎం.ఎల్.ఎ. మాజీ మంత్రి, రామచంద్రపురం కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకి అధ్యక్షులు, చోడవరము.

## పో ష కు లు :

౧. శ్రీబలుసు బుచ్చిపట్టాభిరామయ్యగారి కుమారులు అచ్యుతరామయ్యగారు, భూస్వామి, కపిలేశ్వరపురం.
౨. శ్రీమద్దూరి సూరన్నగారు, వర్తకులు, గోపాలపురం.
3. శ్రీబెజవాడ రామచంద్రారెడ్డిగారు, భూస్వామి, బుచ్చిరెడ్డిపాలెం.
౪. శ్రీవాడ్రేవు విశ్వసుందరరావు బహద్దర్ వారు,
జమీందారు, వేగాయమ్మపేటయెస్టేటు.

## స హా యు లు :

౧. శ్రీ దేశరాజు వేంకటసుబ్బారావుగారు, భూస్వామి, కపిలేశ్వరపురము.
౨. శ్రీ పోతాప్రెగడ సూర్యనారాయణగారు, భూస్వామి, ప్రొప్రయిటరు: సుజనరంజనీ ప్రింటింగువర్కుప్సు, రాజమహేంద్రవరము.

౩. శ్రీ వట్టికూటి పట్టాభిరామయ్యగారు వునకనమిల్లియస్టేటు జమీందారు, వెల్ల.

౪. శ్రీ బండారు చినవెత్తియ్యఅనే రామకృష్ణయ్యగారు, భూస్వామి, వాడపాలెం.

౫. శ్రీ బలుసు వెంకటరామారావుగారిభార్య మాణిక్యంగారు, భూస్వామిని, కపిలేశ్వరపురము.

౬. శ్రీ కొరపాటి వెంకటాద్రియుడుగారి భార్య శ్రీమతి సత్యవతమ్మగారు, భూస్వామిని, కపిలేశ్వరపురము.

౭. శ్రీ కేసాప్రగడ వెంకటరమణరాజేశ్వరరావుగారు, భూస్వామి, అన్నంపల్లి.

౮. శ్రీ పోతాప్రగడ కృష్ణమూర్తిగారు, ప్రొప్రయిటరు, మాస్టరు మాన్‌ప్రింటర్సు, కాకినాడ.

౯. శ్రీ వాజ్రెవు రత్నేశ్వరరావుగారు, భూస్వామి, పసలపూడి.

౧౦. శ్రీ నెక్కంటి దొరయ్యగారు, భూస్వామి, కపిలేశ్వరపురం.

౧౧. శ్రీ నెక్కంటి రామయ్యగారు, భూస్వామి, అసిస్టెంటు యింజనీరు, కపిలేశ్వరపురం.

౧౨. శ్రీ బుద్ధవరపు మహాదేవుడుగారు, బి. ఎ. బి. ఎల్. వకీలు. రామచంద్రపురము.

౧౩. శ్రీ లక్కరాజు సుబ్బారావుపంతులుగారు, అడ్వకేటు, భూస్వామి, కాకినాడ.

౧౪. శ్రీ ఉప్పులూరి వెంకటరమణమూర్తిగారు, భూస్వామి, అడ్వకేటు, కాకినాడ.

౧౫. శ్రీ నెక్కంటి జగపతిరామయ్యగారు, భూస్వామి, ప్రొప్రయిటరు రైసుమిల్లు, వెదురుమూడి.

౧౬. శ్రీ ఏకా ఆంజనేయులుపంతులుగారు, భూస్వామి, గుంటూరు.

౧౭. శ్రీ కె. వెంకయ్యచౌదరిగారు, భూస్వామి, డివిజనలు యింజనీరు, ప్రస్తుతం కాకినాడ.

౧౮. శ్రీ ఏలూరిపాటి నరసింహాసర్వోత్తముఖయాజులుగారు, భూస్వామి, బిళ్ళకుర్రు.

౧౯. శ్రీ తురగా పురుషోత్తంపంతులుగారు, ఎమ్. ఎల్. సి. పలివెల.

౨౦. శ్రీ మల్లాడి సత్యలింగం నాయకర్సు చారిటీసువారు, సత్యలింగవరం, కాకినాడ.

౨౧. శ్రీ అయ్యగారి మోహనరావుపంతులుగారు బి. ఏ., బి. ఎల్., అడ్వకేట్, సీతానగరం, విశాఖపట్టణంజిల్లా.

౨౨. శ్రీ రావుసాహెబ్ పట్టమట్ట శేషగిరిరావుపంతులుగారు, ప్రొప్రియిటరు, జార్జిప్రెస్, కాకినాడ.

౨౩. శ్రీ వెంటూరు దొరయ్యగారు, భూస్వామి, కోటిపల్లి.

౨౪. శ్రీ బొప్పన దొరయ్యగారు, భూస్వామి, కందులపాలెం.

౨౫. శ్రీ వైట్ల వీర్రాజుగారు, భూస్వామి, కందులపాలెం.

౨౬. శ్రీ తురగా రామచంద్రరావుపంతులుగారు, భూస్వామి,
ఇన్‌కమ్‌ట్యాక్సుఆఫీసరుగారు, కాకినాడ.

**Sir C. RAMALINGAREDDY Kt.**

M. A. (Cantab.,) Hon. D. Litt.,

Vice-Chancellor, Andhra University.

"I have read with much pleasure and appreciation Chaganty Seshayya's " Andhra Kavi Tarangini ". It is a remarkably fine contribution to the History of our literature and our country. He has taken trouble to study the latest archaeological material available and make his treatment of the different Poets as scientifically accurate as possible.

.........Sri Seshayya seems to be fitted both by his knowledge of the subject and his scientific spirit to present the Andhra world with an authoritative Lives of Andhra Poets.

He does not mix up Puranas with history and legend with truth and that is a rare and refreshing feature."

---

**Dr. M. H. Krishna, M. A. D., Litt. (Lond.)**

Director of Archaeology, Government of Mysore.

".........I find that it gives us a vast amount of information. I am sure that a copy of your entire work should be in our library......Let me hope that you will succeed in pushing your gigantic work through."

---

**THE HINDU:**

Research into the records of the past brings forth continually new facts on the history of literature and the present book is thefi rst of many volumes which the author proposes to bring out in an attempt to write a new history of Telugu poets. According to earlier historians of Telugu literature, the maximum number of Telugu poets worth the name did not exceed three hundred and fifty. But the author includes many more whose names have hitherto lain hidden in the unfathomed caves of time. The author has unearthed considerable interesting material by an intensive study of inscriptions......"

ANDHRA PRACHARINI LTD.,

KAPILESWARAPURAM.

(*East Godavari Dt.*)

## ఆంధ్రకవి తరంగిణినిగూర్చిన కొన్ని అభిప్రాయములు :

కింకవీంద్రఘటాపంచానన, విద్వత్కవి, బాలసరస్వతి,
బాలకళానిధి, కళాప్రపూర్ణ,
మద్రాసు ప్రభుత్వ ఆస్థానకవి,
శతావధాని **శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి**

**అ భి ప్రా య ము :**

ఆశీరుభయకుశలోపరి____

మీరు రచించిన "ఆంధ్రకవితరంగిణి" చాలభాగము చదివితిని. స్థూలదృష్టులకు మీపరిశ్రమము గోచరింపదేమో కాని తక్కిన యావదాంధ్రకవులే కాదు. పండితులే కాదు. పామరులే కాదు. వీరెల్లరుకన్నుల నద్దుకొందురనియే నా యూహయము. ప్రప్రథమమున

"మార్గదర్శి మహర్షిః"

అనుచొప్పున శ్రీగురుజాడ వారి యుద్యమమునకు పూనిరి. కొంతవఱకే కృతకృత్యులయిరి. వారిని నేను ప్రత్యక్షముగా నెఱుంగుదును. మాకంటె సర్వదా కొంత పెద్దలయినను సమకాలీనులనే. పిమ్మట వీరేశలింగము పంతులవా రారంభించి చాలవఱకు కృతకృత్యులయిరి. తరువాత మీరు దీనికి నుపక్రమించిరి. ఇప్పటికి వారిద్దరిని సూత్రకారులుగను, వృత్తికారులుగను, భావించుచో మీకు భాష్యకారస్థానములభించు ననుకొంటిని......భవతు, ఇప్పటికి భాష్యకారస్థానము మీదే. మీయుద్దేశము సర్వదా జయప్రదమగు గాక! విద్యాశాఖాధికారులు మీపరిశ్రమను గమనింతురుగాక!

ఇంతే. స్వస్తి.

క్షీ ర సా గ ర బి ల్డిం గ్సు
గవర్నరుపేట, విజయవాడ.

చె॥ శా॥
శతావధాని

## శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు

"మీ కృషి ప్రశంసనీయమైనది. ఏతద్గ్రంథమును రచించుటలో మీరు చూపిన విమర్శనశక్తియు పరిశోధనాశక్తియు నాకు సంతోషమును గూర్చినవి. ......... ఇది పరిశోధకులకును, విద్యార్థులకును ఎక్కువ యుపయోగకరముగ నుండగలదని నా విశ్వాసము. ...... మీ 'ఆంధ్రకవితరంగిణి' ఆంధ్రకవులచరిత్రకంటెను ప్రాధాన్యము వహింపగలదని నాతలంపు.

## శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు

(ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రధాన పండితులు)

"మీగ్రంథము మీరుచేసిన కూలంకష పరిశ్రమకు ఫలము. కవిజీవిత కవిచరిత్రకారులు అడుగుపెట్టలేని గహనములలో మీరు రాచబాటలు వైచితిరి."

## శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, మద్రాసు.

"...మీకవితరంగిణిని చాలవఱకు చదివితిని. అందు మీరుతీసికొనినశ్రమ అపారము. దానిప్రయోజన మపరిమితము. వెనుకటి విషయములనేగాక ఆయాకవులనుగూర్చి యిటీవలి విమర్శనలమూలముగాను శాసనాదిపరిశోధనల మూలముగాను బయలువడిన యనేకవిషయములనుగూడ పొందుపరచి యాకవులచరిత్రను సమగ్రము గావించితిరి. ఏవిషయమునను తీవ్రవాదములకు లోనుగాక నిష్పాక్షికమగు చారిత్రకదృష్టిని నెలకొల్పుటకు మీరుచేసిన ప్రయత్నము మిగుల ప్రశంసనీయము. తక్కిన భాగములుకూడ త్వరలో ప్రకటితములగునని యాశించుచున్నాడను..."

## శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు

(ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రధాన పండితులు)

"........మీకవితరంగిణి కల్హణుని రాజతరంగిణివలె సారస్వతములో ముఖతిలకంగా ప్రకాశింపకలదు......ఆధారవస్తువివేచనలో మీసమగ్రవిజ్ఞానమును ప్రమాణీకరణదృష్టి యుద్యోతకమగుచున్నది."

శ్రీ గంటి జోగిసోమయాజులుగారు: ఆంధ్రవిశ్వవిద్యాలయ పండితులు

“.........చాల మనోహరముగా అనేక విషయముల గూర్చి వ్రాసితిరి. ఇంత గొప్పపని చేయుటకు పూనుకొని వ్యయమునుప్రయాసమును లెక్కింపక సాధించుట మిక్కిలి కొనియాడతగినది.........”

### శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు

.............గ్రంథరచనమునందంతటను పరిభూతపరిశ్రమము భవదీయము కానవచ్చుచునేయున్నది............పరమేశ్వరానుగ్రహమున మీ సంకల్పమునకెట్టి వికల్పము రాజాలదు, మీరు చేయుకృషి సఫలమగును.

### శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు

(మదరాసు విశ్వవిద్యాలయము రిసెర్చి పండితులు)

“......తమ గ్రంథమువలన పూర్వవిమర్శకుల రచనలను ఇంక చూడవలసిన యావశ్యకత లేకపోయినది. ఆంధ్రకవితరంగిణి యందు తామవలంబించిన పద్ధతి యధునాతన చరిత్ర రచనాపద్ధతి వంటిది, మీ యత్నము కడు ప్రశంసనీయము.”

ఆంధ్రపత్రిక: “.........శేషయ్యగారు నిష్పక్షపాత బుద్ధితో యథార్థమెంతయో గ్రహించటానికి అత్యధికంగా శ్రమపడ్డారు. అనుమాన ప్రమాణంతో కూడికొన్న చరిత్రకు యిదమిత్థమను నిర్ణయాలు మొండిగా చేసి చరిత్రకు అపకారం చేయకుండా చారిత్రిక వస్తువుల నందించి సూచనమాత్రం తన ఊహానుచెప్పి పాఠకులకు నిర్ణయాలకు సదవకాశమిచ్చారు. వీరిప్రయత్నం ప్రశంసనీయమే.”

ఆంధ్రప్రభ: “ఆంధ్రులకు సమగ్రమైన కవులచరిత్ర గ్రంథము లేని లోటు దీనితో తీరినట్టయినది. తక్కిన సంపుటములను కూడ త్వరలో వెలువరించడానికి తగిన ప్రోత్సాహం యివ్వవలసిన భారం ఆంధ్రుల పైనున్నది”

# విజ్ఞాపనము

భాషాభిమానులును, వదాన్యులును, కపిలేశ్వరపురం, కేశనకుఱ్ఱు యస్టేట్లజమీందారులునగు శ్రీబలుసు బుచ్చిసర్వారాయుఁడుగా రీసంపుటమున కయ్యెడిద్రవ్యము నంతయు నొసఁగి నాయుద్యమమునకు గొప్ప సాహాయ్య మొనర్చినందులకు వారికిఁ గృతజ్ఞతావందనముల నర్పించుచున్నాఁడను. వారికిని, వారికుటుంబమునకును పరమేశ్వరుఁడు చిరాయురారోగ్యముల నొసంగి రక్షించుగాక !

ఈసంపుటముతో నాదాపుగఁ బురాణయుగము పూర్తియైన దని చెప్పవచ్చును. సప్తమసంపుటము శ్రీకృష్ణదేవరాయలజీవితముతో మధ్యయుగ మారంభ మగును.

ఆంధ్రలోకము నాయుద్యమము నెడలఁ జూపెడి యాదరాభిమానములపై భావికార్య మాధారపడియున్నదని మనవిచేయుచున్నాఁడను.

విరోధి సంవత్సరము,
సుబ్రహ్మణ్యషష్ఠి.

విధేయుఁడు,
గ్రంథకర్త.

# విషయసూచిక



శ్రీరామచంద్ర

# ఆంధ్రకవితరంగిణి



## ఆఱవసంపుటము



## 69. శ్రీధరుఁడు

ఇతనిచరిత్ర మేమియుఁ దెలియదు. ఈతఁ డొకఛందోగ్రంథమును రచించినట్లు లక్షణవేత్తలు తమలక్షణగ్రంథములయం దీతని పద్యముల నుదాహరించియుండుటచే నీతని పేరు తెలియవచ్చినది. ఈ క్రిందిపద్యములు రంగరాట్ఛందము నం దుదాహరింపఁబడినవి.

క. మగణం బెప్పుడు శుభకర
మగు నైనన్ గ్రూరగణము నది డాసినచోఁ
దెగి చంపు బుధుఁడు క్రూరుం
డగుగ్రహమును గదిసి క్రూరుఁ డగుఁ దనుమాడ్కిన్.

క. సురనరతిర్యగ్గౌరన
వరగతు లగు భూసురాదివర్ణాక్షరముల్
గురులఘువులు నరసురగతు
లరిరాయవిభాల సోమయవనీపాలా!

క. అల్పప్రాణము లతిమృదు
జల్పోచితవచనపంక్తి ఖ ఘ ఛ ఝ ఠముఖా
నల్పకఠోరాక్షరముల
వల్పాటగునవి మహాయుతప్రాణంబుల్.

క. విదితముగ రాహుభుక్తికి
నొదవినపమునూఁడు జీవయుక్తము లవి యను
న్నది మొదలు నెదుటితారలు
పమునాలుగు మృతము లనఁగఁబడు నెఱిఁగొనన్.

చ. వెలయఁగ బొండుమల్లియలు వేనలి నంగమునన్ విభూషణా
వళులు ధరించి తేఁబసుపువన్నియపుట్టము గట్టి కుంకుమం
బలఁది పసిండితామరలు హస్తములన్ వెలుఁగొంద భర్మని
ర్మలరుచిఁ బొల్చు వైశ్యకులమాతృక భూరిధనప్రదాయి య్యై.

గీ. కృతులఁ ద్రత్వత్రయమ్మును దత్వమొకటి
యటులుగాక తవర్ణత్రయము ద్రకార
మొకటి ప్రాసంబులుగ నిల్పు సుకవిచంద్రు
లవనిలోఁ ద్రివర్ణప్రాస మంద్రు శౌరి.

ఈతనిగ్రంథమునుండి యుదాహరణములను గైకొనకపోయినను, అప్పకవి యీతనిని దనగ్రంథమునఁ జేర్కొనియుండుటచే నీతఁ డప్పకవికిఁ బూర్వుఁ డనుటనిశ్చయము.—శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు శ్రీధరచ్ఛంద మళియరామరాయలముత్తాత కంకితమీయఁబడినదని బద్దెనసీతిశాస్త్రముక్తావళిపీఠికలో వ్రాసియున్నారు. శ్రీధరచ్ఛందము నందు బద్దెననీతిశాస్త్రముక్తావళిలోనిపద్యము లుదాహరింపఁబడినవని రామకృష్ణకవిగారు వ్రాసియుండుటచే నాగ్రంథ మాయనయొద్ద నున్నదని యూహింపఁదగియున్నది. నాకు శ్రీధరునిగ్రంథము లభింపలేదు. అళియరామరాయలముత్తాత ఆరవీటి బుక్కరాజు. ఇతఁడు ప్రసిద్ధపురుషుఁడు. రామకృష్ణకవిగారు ఆరవీటిబుక్కరాయని వ్రాయక యళియరామరాయలముత్తాత యని యేల వ్రాసిరో తెలియకున్నది. బుక్కరాయలు బాహుబలముచేఁ గీర్తిని సంపాదించినవాఁడుకాని కవిపండితపోషకుఁ డనుకీర్తి యీతనికి లేదు. రామరాజభూషణుఁడును పింగళిసూరనార్యుఁడును బుక్కరాయలనువర్ణించినపద్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

సీ. తనభవ్యధామంబు తనభవ్యధామంబు
కరణి మిత్రోన్మేషకరము గాఁగఁ
దనధర్మగుణములు దనధర్మగుణము ల
ట్లతులితక్షితిమార్గగతుల నెసఁగఁ
దనమహాహవదీక్ష దనమహాహవదీక్ష
పగిది నానావనీపకులఁ బెంపఁ

దనయుంబకంబులు దనయుంబకము లట్ల
పరభీరువిముఖతఁ బరిఢవిల్లఁ
గీ. బరఁగుఁ గరినాద్రి జపలు తజ్జరరకమర
కూటకిటిగూఢచరణదిక్కోటికరటి
కుటిలతాసహాభూసౌఖ్యఘటన భూరి
భుజబలవిహారి యారవీటిబుక్కశౌరి.

వసుచరిత్రము.

క. ఆచంద్రునివంశంబున
భూచంద్రుం డారెవీటిబుక్కనరేంద్రుం
డాచక్రవాళశైల
క్ష్మాచక్రస్ఫూర్తికీర్తిసాంద్రుండు పుట్టెన్.

క. ఆబుక్కనృపాలునిబా
హాబలము కొలంది తదసిహతరిపుపీర
ప్రాబల్యనిరాకృతనల
కూబరునకుఁ దెలియఁ దెలిసికొనఁ గలఁడె విన్.

చ. మతి సజుఁడంచు రూపమున మన్మథుఁ డంచు సమానవృత్తిఁ బ్రహ
స్పతి యనుచున్ వదాన్యతను భానుసుతుం డనుచు న్నుతించు నా
ర్యతతి "నిరంకుశాఽకవయ"యం చది యొప్పుట గాదె బుక్కభూ
పతికి సముండు లేఁడు తలఁపన్ భువనంబుల నేగణంబులన్.

నరసభూపాలీయము.

అయినను రామకృష్ణకవిగారి వాక్యములయందు గౌరవముంచి యీ కవిని బదునైదవశతాబ్దికవులలోఁ జేర్చితిని. వల్లభరాయప్రణీతక్రీడాభిరామమందలియొకపద్య మీతని ఛందోగ్రంథమునం దుదాహరింపఁబడినదని శ్రీ కే. రాఘవాచార్యులు గారనియుండుటవలనను, వల్లభామాత్యునికాలము క్రీ. శ. ౧౪౦౦ ప్రాంత మగుటవలనను, శ్రీధరకవి పదునైదవశతాబ్దియం దుత్తరార్ధమున నున్నవాఁడని చెప్పవచ్చును. ఆరెవీటిబుక్కరాయలకాలముకూడ నదియే. ఈసందర్భమున రాఘవాచార్యులుగారు, "అళియరామరాజుముత్తాత యగుసోమభూపాలున

కంకిత మీయఁబడినశ్రీధరచ్ఛందమున "మంచనవింటివో" యనుక్రీడాభి రామములోనిపద్య ముదాహరింపఁబడినది" అనివ్రాసియున్నారు. అభి యరామరాజుముత్తాత బుక్కభూపాలుఁడుగాని, సోమభూపాలుఁడు గాఁడు సోమభూపాలుఁడు బుక్కభూపాలునకు ముత్తాత. శ్రీధరచ్ఛంద కృతిపతి యాసోమభూపాలుఁడైనచో క్రీడాభిరామమందలిపద్య ముదా హరింపఁబడుట కవకాశము లేదు. శ్రీధరచ్ఛందమును జూచినఁగాని సత్యమును నిర్ణయింపఁజాలము.

ఈక్రిందిపద్యము శ్రీధరచ్ఛందములోనిదని లక్షణగ్రంథములలో నుదాహరింపఁబడినట్లు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులుగారు వ్రాసి యున్నారు.

క. మయరసతజభగణంబులు
నయ ధన భయ విలయ బంధన శ్రీ తేజో
జయములు క్రమమున నొసఁగును
ప్రియసరసవచోభిరామ! పిన్నయసోమా!

దీనినిబట్టియుఁ బైనివ్రాసిన "సురనర" అనుపద్యమునుబట్టియు, శ్రీధరచ్ఛందకృతిపతి పిన్నయసోమభూపాలుఁ డని తెలియుచున్నది. పిన్నయసోముఁడు ఆరెవీటివారిలోనున్నాఁడు. కాని యాతఁడు పైనిఁ జెప్పినట్లు బుక్కరాయలకుఁ బ్రపితామహుఁడు. శ్రీధరచ్ఛందములోని దని పైనినుదాహరించిననాల్గవపద్యములో "శౌరి" యనిసంబోధన మున్నది. దీనినిబట్టి యీగ్రంథము సోమభూపాలునకుఁగాక దేవున కంకిత మీయఁబడియున్నదనియు, నీపద్యములు వేఱువేఱుగ్రంథము లలోనివయి యుండుననియుఁ దోఁచుచున్నది. పైనివ్రాసినట్లు గ్రంథ మునుజూచినగాని యిదమిత్థమని నిర్ణయింపలేము.

లక్షణదీపికనురచించినగౌరనమంత్రి శ్రీధరచ్ఛందమునుండి లక్ష్య ములను గైకొని తనగ్రంథమున నుదాహరించెనని కొంద అనుచున్నారు. ఆంధ్రసాహిత్యపరిషత్తునందు గౌరనలక్షణదీపికలు రెండుప్రతులున్న వనియు నందొకదానియందు శ్రీధరునిఛందమునుండి యుదాహరణము లున్నవనియు రెండవప్రతియందు లేవనియు, బ్ర. శ్రీ చిలుకూరి పాప య్యశాస్త్రిగారు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికయందు వ్రాసియున్నారు.

దీనినిబట్టి లక్షణదీపికప్రతులలోఁ బాఠభేదములున్నవనియు, నిస్సందేహముగాఁ గాలనిర్ణయము చేయుటకు లక్షణదీపిక యాధారముగాఁ జాలదనియుఁ దేలుచున్నది

కవికాలనిర్ణయమునకుఁ దోడుపడునని ఆరవీటివారివంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.

| | |
|---|---|
| (౧) తాతపిన్నమ | ౧౨౯౦ |
| సోమభూపాలుఁడు | ౧౩౨౦ |
| రాఘవదేవ | ౧౩౫౦ |
| (౨) పిన్నమరాజు | ౧౩౮౦ |
| బుక్కరాయలు | ౧౪౧౦ |
| రామరాజు | ౧౪౪౦ |
| శ్రీరంగరాజు | ౧౪౭౦ |
| అళియరామరాజు | ౧౫౦౦ |

అళియరామరాజు తనడెబ్బదేండ్లవయసున తళ్ళికోటయుద్ధములో క్రీ.శ. ౧౫౬౫ వ సంవత్సరమునఁ జనిపోయెనని చరిత్రకారులు నిర్ణయించియున్నారు దానినిబట్టియాతనిజననము ౧౫౦౦ ప్రాంతమగుట నిశ్చయము. దానిననుసరించి యాతనిపూర్వులజననసంవత్సరములఁ బైనఁ గనుపఱచితిని

పైవంశవృక్షమునుబట్టి అళియరామరాయల ముత్తాతబుక్కరాయల నిస్పష్టమగుచున్నది. ఈవంశవృక్షములోఁ బిన్నమరాజులిరువురున్నారు. ఇందులో మొదటి పిన్నమరాజునకు సోమభూపాలుఁ డనుతనయుఁ డున్న మాట వాస్తవము. రెండవపిన్నమరాజునకు సోమభూపతి యనుకుమా

రుఁ డున్నట్లు తెలిపెడి యాధారములు నాకు లభింపలేదు. పైని నుదాహరించిన పద్యములనుబట్టి మొదటిపిన్నమరాజు కుమారుఁడైన సోమరాజునకు శ్రీధరచ్ఛందము కృతియిచ్చెనందుమేని, యాకాలము క్రీ శ ౧౩౫౦–౧౩౭౦ ప్రాంతమై యాగ్రంథమునుండి గౌరనమంత్రి లక్ష్యములను గైకొనెనని తలంపవచ్చును. కాని క్రీడాభిరామమునుండి లక్ష్యములను గ్రహించెనని చెప్పవలనుపడదు. రెండవ పిన్నమరాజునకు బుక్క–రాయలుగాక సోమభూపాలుఁడను నింకనొక తనయుఁ డున్నాఁడని ధ్రువపడి యతఁడే కృతిపతియయ్యేనేని యాకాలము క్రీ శ. ౧౪౫౦ ప్రాంతమై యుండును. ఆపక్షములో శ్రీధరుఁడు క్రీడాభిరామమునుండి లక్ష్యములను గైకొనెననిన నొప్పును గాని గౌరనమంత్రి శ్రీధరుని గ్రంథమునుండి లక్ష్యములను గ్రహించెనని యనరాదు. శ్రీధరుని గ్రంథము లభించినగాని సత్యము బయటపడదు. భావిపరిశోధనమునఁ దెలియు విషయములనుబట్టి కవికాలమును స్థిరముగా నిర్ణయించుకొందము. శ్రీధరుఁడు పైని జెప్పినకాలములలో నేకాలమువాఁడైనను, బద్దెననీతిశాస్త్రముక్తావళినుండి లక్ష్యములను గైకొనెననుట కభ్యంతరముండదు క్రీడాభిరామమునుండి లక్ష్యములను గైకొనెనని చెప్పుచున్నారు కావునఁ బ్రస్తుతమీతని గ్రంథకాలము క్రీ. శ. ౧౪౫౦ ప్రాంత మనుకొందము.

---

# 70 కృష్ణమాచార్యుఁడు

ఈకవినిగూర్చి శ్రీ నిడదవోలు వెంకటరావుపంతులు M. A. గారు భారతి (పార్థివ–భాద్రపదము) లో నిట్లువ్రాసియున్నారు

"తెలుగున తొలివచనకావ్యకర్తయు, వచనసంకీర్తన వాఙ్మయమునకు మూలపురుషుడును, వైష్ణవభక్తాగ్రేసరుడు నగు కృష్ణమాచార్యుఁడు కాకతీయచక్రవర్తులలో కడపటివాడగు రెండవప్రతాపరుద్రుని కాలమున నసగా క్రీ. శ. ౧౨౯౫ నుండి ౧౩౨౬ వఱకుఁ గలకాలమున విలసిల్లెనని ప్రతాపచరిత్రమును, ఏకశిలానగరవృత్తాంతమును చెప్పుచున్నవి. తిరుపతి దేవస్థానమున సంకీర్తనాచార్యులలో ప్రథములు. తాళ్లపాక అన్నమయ్యగారు (క్రీ. శ. ౧౪౦౮–౧౫౦౩) కృష్ణమాచా

ర్యుని తమసంకీర్తన లక్షణమున పేర్కొనుటచే పైకాలము ధ్రువమగుచున్నది. అన్నమయ్యగారి మనుమడు చిన్నన్న తనపరమయోగి విలాసమున నీతని ప్రశంసించియున్నాడు. ఇంతే కాక ఆచార్యసూక్తిముక్తావళియందు కృష్ణమాచార్య ప్రశంస కలదు. వీనినిబట్టిచూడ కృష్ణమాచార్యుడు వైష్ణవమతవాఙ్మయమున కాంధ్రదేశమున ప్రథమాచార్యుడని చెప్పనొప్పును.

ఈతడు సింహాచలక్షేత్రనివాసియని సింహాచలనరసింహస్వామికి భక్తుండై యతనిపేర ననేకసంకీర్తనలు రచియించెనని సింహాచలక్షేత్రమాహాత్మ్యచరిత్రము తెలుపుచున్నది. సింహగిరినరహరి వచనములను పేర సంకీర్తనలు కృష్ణమాచార్యులవని నేటికిని తెలియుచుండుటచే నిది నిజమని చెప్పనొప్పును. ఆచార్యసూక్తిముక్తావళిలో—

కృష్ణమాచార్యుల కీర్తనలవియు
నిత్యభోగములయ్యె నేటికైన
మఱికొన్నినాళ్ళకు మల్కినేబనువాడు
మ్లేచ్ఛాధిపతి వచ్చి మిన్నరాయు
దివ్యవిమానంబు తెగటార్చి కోవెల
బారచాపల నైలభాసితముగఁ
జుట్టించి కాల్చిన సుడిసి మోడహాములు
కాలి భక్తోక్తిచే గదలకుండె

అని యొక్కయైతిహ్యము (విస్తరభీతి నీయైతిహ్యము నీయలేదు) కూడ పైవిషయమును ధ్రువము చేయుచున్నది.

మఱియు తిరుపతిక్షేత్రముపై మహమ్మదీయులు దండెత్తివచ్చినపుడు శ్రీవేంకటేశ్వరస్వామిని సంబోధించుచుచెప్పిన వేంకటాచల విహారశతకమునకూడ—

"కృష్ణమాచార్య సంకీర్తనంబులఁ జొక్క
సింహాద్రియప్పని చేతగాదు"

అనువాక్యము కృష్ణమాచార్యుని సింహాచలక్షేత్రవాసమును, అతనిసంకీర్తనప్రశస్తిని తెలుపుచున్నది.

లక్షణశిరోమణి మతమున తెలుగున వచనరచన అయిదువిధములు ; (౧) గద్య (౨) బిరుదుగద్య (౩) చూర్ణిక, (౪) వచనము (౫) విన్నపము. వీనిలో కడపటిమూడు తెలుగుల రచనములను కృష్ణమాచార్యుడు రచియించియున్నాడు. కృష్ణమాచార్యునికి ముందు గద్య, బిరుదుగద్యలున్నను వచనములు, విన్నపములు, నున్నట్లు కానరాదు. కావుననే కృష్ణమాచార్యుని తొలివచన కావ్యకర్తయని పేర్కొంటిని.

౧ చూర్ణికలు.

కృష్ణమాచార్యుడు వీనినిరచియించినట్లు తాళ్లపాక అన్నమయ్యగారు సంకీర్తలక్షణమున నిట్లుచెప్పినారు. చూర్ణికలక్షణము నీపద్యమున కలదు.

క. ధర కృష్ణాచార్యాదిక
పరికల్పితపదము తాళబంధచ్ఛందో
విరహితమై చూర్ణాఖ్యం
బరగును నిర్యుక్తనామభాసితమగుచున్.

(౫౪ పద్యము)

౨ వచనములు.

ఇవి వచనశతకము లనిచెప్పనొప్పును. శతకములవలె వీనియందు మకుటనియమము, సంఖ్యానియమము నుండును. శతకములలో వృత్తజాతు లుండును. వచనములలోఁ గేవల గద్యముమాత్రమేయుండును. శతకములలోవలె నొక్కొక్కయెడ సంఖ్యానియమము సడలుటగలదు. శతకములందువలె నిందు భక్తిరసము పొంగిపొరలుచుండును.

శైవవైష్ణవవాఙ్మయమున నిట్టిప్రశస్తరచనముగల వచనములెన్నియేని కలవు. శైవమున పురాతన శంకరవచనము లనుపేర' నను రక్షింపవే భవానీమనోహరా' అను మకుటముగల వచనములు ప్రచారమున నున్నవి. వైష్ణవమున 'వెంకటేశ్వరవచనములు (వేంకటేశ్వరా!' అను మకుటముగలవి తాళ్లపాక తిరుమలయ్యగారివి) భారతి ౨సంపు ౨సంచికలో కొన్నిప్రకటితములైనవి వాని నొకపరి చదువుడు.

సింహాగిరి నరహరివచనములు—"సింహాగిరినరసింహా నమో నమో దయానిధీ" అనుమకుటముతోనున్న వచనములు కృష్ణమాచార్యరచితములు ప్రాచ్యలిఖితపుస్తకశాలలోఁ గలవు. ఇవియే విష్ణునామసంకీర్తన ఫలమను పేర తంజావూరిపుస్తకశాలలో నున్నవి.

3. విన్నపములు.

ఇవి 'నమోనమోలక్ష్మీవల్లభా' అనుమకుటము గలవి. ఈవిన్నపములు శఠకోపముని ద్రావిడవేదమునకు తెనుగు. కృష్ణమాచార్యుఁడీద్రావిడవేదమును తెలుఁగు కావించినట్లు తాళ్ళపాకచిన్నన్న పరమయోగివిలాసావతారికలో నిట్లు చెప్పినాఁడు:

"శఠమతరాద్ధాంతసంహారి యైన
శఠకోపమునిబోలు శఠకోపముని
వేదంబు తెనుఁగుగావించి, సంసార
ఖేదంబు మాన్చిన కృష్ణమాచార్యు"

అని ప్రత్యేకముగ పేర్కొనినాఁడు.

విన్నపము మచ్చుతునక.—

"అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! మీకు పునఃపునఃప్రదక్షిణనమస్కారంబు చేసి నాతుచ్ఛమనస్సున మిమ్ము వర్ణించెద. వాక్పతి బృహస్పతి దివస్పతుల కైనను వర్ణింపనలవి కాని మీదివ్యతిరునామములు వర్ణించుచున్నాఁడనో దేవ! అచ్యుత! అనంత! ఆశ్రితరక్షక! అఖిలాండకోటి బ్రహ్మాండనాయక! ఆదిమధ్యాంతరహిత!......

శరణాగతవజ్రపంజరా! నాదురితంబులు ఖండించి మీదాసానుదాసులకు దాసుండనై వర్తించే బుద్ధిపుట్టించి నాదుర్గుణంబులు మాన్పక మీపతితపావనబిరుదు ప్రతిష్ఠించి పతితుండనైన నన్నురక్షింపవే ఆశ్రితజనమందార! అఖిలలోకాధార! అఘదూర! నమోనమో లక్ష్మీవల్లభా!"

తెలుగువాఙ్మయమున మధురకవితాశాఖకు చెందినయిట్టిరచనములకు పర్యాప్తమైన పరిశీలన మేని లేదు. ఈవచనములయందును విన్నపములయందును వెల్లివిరియుభావములు విశ్వజనీనములై రవీంద్రుని

గీతాంజలిని దలపించుచుండును. వైష్ణవమత వాఙ్మయమున నభిమానము గలిగిపరిశ్రమచేయువా రీవచనములను విన్నపములను సంపాదించి ప్రకటించిన భాషావాఙ్మయచరిత్రకారుల కవి యత్యంతోపాదేయము లగుటయేకాక భక్తజనులకు పారాయణయోగ్యములుగకూడనుండును.

కేవలమతసంప్రదాయపేటికలయం దడగియున్న యిట్టికృతిరత్నము లను వెలికిదీసి సాహితీసౌధములో ప్రకాశింపజేయుట సాహిత్యోపాసకులకర్తవ్యము. అప్పుడు కృష్ణమాచార్యుని కాంధ్రవాఙ్మయమున గలస్థానము కాలమే స్థిరీకరింపగలదు"

ఈకవి మూఁడవసంపుటమునఁ జేర్పఁదగినవాఁడుకాని, ప్రమాద వశమున నీతనిచారిత్రమును వ్రాసి మఱచియుంచిన కాగితముపైని కాలము ౧౩౯౫-౧౪౨౬ అని నేనువ్రాసికొని యుండుటచే నిప్పటివఱకును నీతనిచారిత్రమును బ్రకటింపలేకపోయితిని. ఈతని నాంధ్రపత్రికాముఖమున నాస్మృతికిఁ దెచ్చిన శ్రీ "విద్యారత్న" పండితుల కెంతయుఁ గృతజ్ఞుఁడను.

నేను బదునాలుగేండ్లవయసులో నున్నప్పుడు "భవానీమనోహరవచనము"లను "వేంకటేశ్వరవచనము"లను వ్రాసికొని యప్పుడప్పుడు పఠించుచుండెడివాఁడను. శ్రీవేంకటరావుగారనినట్లు వీనిని బ్రకటించుటవలన నాంధ్రలోకమునకు మితిలేనిమేలు చేకూరఁగలదు. ఒకటి రెండు వచనములను మచ్చున కిందు వ్రాయవలయునని యత్నించితిని గాని సింహగిరినరహరి వచనములు నాకులభ్యము కాలేదు. సంపాదించి వాని ననుబంధముగనైన నీయఁ బ్రయత్నించెదను.

---

# ౬. రాయకవి (అయ్యలరాజు)

# త్రిపురాంతకుఁడు (తిప్పయ్య)

ఈకవిని "అయ్యలరాజు త్రిపురాంతకుఁడని" పిలుచుచుందురు. ఈతఁడు ఒంటిమిట్టరఘువీరశతకమును రచించెనని చెప్పుదురు, వావిళ్ళవా రాశతకమును ముద్రింపించియున్నారు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నీ శతకముయొక్క రెండు తాళపత్రప్రతులున్నవి. అందొకదానియందు ౧౦౦ పద్యములును నొకదానియందు ౮౦ పద్యములు నున్నవి. ఈరెండుప్రతులును వావిళ్ళవారి ముద్రణప్రతికి మాతృకలు. ఈ రెండుప్రతులలోను గ్రంథకర్తృనామముగల పద్యము లేదు. తంజావూరు పుస్తకభాండాగారమునఁ దాళపత్రములపై వ్రాయఁబడిన రఘువీరశతకప్రతులు నాలుగు (391–395 సంఖ్యకలవి) కలవనియు నందు 393 వ సంఖ్య కల ప్రతిలో గ్రంథకర్తృనామము గల యీక్రిందిపద్యము కలదనియు, నాంధ్ర విశ్వవిద్యాలయమువారు ప్రకటించిన గ్రంథముల పట్టికలో నున్నది.

మ. అతులప్రౌఢిమమీఱ రాయకవి యయ్యలరాజు సత్పుత్రుఁ డం
చితభక్తిం ద్రిపురాంతకుండు రచియించెం జల్లుపద్యంబులన్
శతకం బొక్కటి దీనినీకు నిను మాచంద్రార్కమై నిల్పు ప
ర్వతకన్యానుత యొంటిమిట్టరఘువీరా జానకీనాయకా !"

ఈపద్యము లభింపకున్నచో నీశతకము త్రిపురాంతకుఁడు రచించినట్లు చెప్పుట కాధారము లేకపోయెడిది. ఈపద్యమువలన నీశతకకర్తృత్వ మీతనియందు ధ్రువమైనది.

శ్రీకృష్ణదేవరాయల యాస్థానకవులలోనివాఁడని చెప్పఁబడు అయ్యలరాజు రామభద్రకవి రచించినరామాభ్యుదయమునందలిగద్యము బట్టికూడఁ ద్రిపురాంతకకవి యొంటిమిట్టరఘువీరశతకమును రచించినట్లు స్పష్ట మగుచున్నది. ఆగద్య యిది: —

"ఇది శ్రీమదొంటిమిట్టరఘువీరశతకనిర్మాణకర్మఠ జగదేకఖ్యాతిగను ర్వాయలరాజుతిప్పయమనీషి పర్వతాభిధానపౌత్రార్కమార్యపుత్త్రి

పరిశీలిత సమిద్ధరామానుజ మతసిద్ధాంత మర్మ ముమ్మడివరదాచార్య కటాక్షవీక్షాపాత్ర హృదయపద్మాధిష్ఠితశ్రీరామభద్ర రామభద్రకవి ప్రణీతం బైన".

ఈగద్యమునుబట్టి కొందఱు రఘువీరశతక కర్తృత్వము రామభద్రునియం దారోపించుచున్నారు. ఈ గద్యకు రెండు విధములుగను నర్థము చెప్పుటకవకాశ మున్నది. కాని, పైపద్యములభించినపిమ్మట నీశతకకర్త,తిప్పయమనీషియని నిశ్చయమైనది. రెట్టమతశాస్త్రమును రచించిన అయ్యలరాజు, భాస్కరకవులు తమపుస్తకమునం దీశతక నిర్మాణకర్త తిప్పనార్యుఁ డనియే వ్రాసియున్నారు. కావున నీశతక కర్తృత్వ విషయమున నిఁక సంశయింపఁబని లేదు.

ఈశతకమునకుఁ బీఠిక వ్రాసినగన్నవరపుసుబ్బరామయ్యగారు "ఈకవి రామాభ్యుదయకర్త యగురామభద్రకవికి ముత్తాతయని వీరేశలింగముపంతులుగారు వ్రాసియున్నారు. అది సరియని తోఁపదు. తిప్పయమనీషి పర్వతాభిధాను లన్నదమ్ములు కావచ్చును. ఇట్లయినచో రామభద్రకవి కీతఁడు పెత్తాతయగును. ఈతఁడు శ్రీకృష్ణదేవరాయల కించుక పూర్వుఁ డగును" అనివ్రాసియున్నారు. కాని యీయూహ సరియైనది కాదనియు, వీరేశలింగముపంతులుగారి యూహయే సరియైన దనియు నాయభిప్రాయము రామభద్రకవి, త్రిపురాంతకునకు మునిమనుమఁడగునా ? తమ్ముని మనుమఁడగునా యనుటనుగూర్చి రామభద్రకవిచారిత్రమున వ్రాసెదను.

ఈత్రిపురాంతకకవి తనగోత్ర మేదియో యిందుఁ జెప్పలేదు. కాని, రెట్టమతశాస్త్రకర్తలు తాము కౌండిన్యగోత్రోద్భవుల మని చెప్పుకొని యుండుటచే నీకవి గోత్రమును కౌండిన్యగోత్రమే యని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఈగోత్రవిషయమైకూడ రామభద్రకవి చారిత్రమునవ్రాసెదను. రెట్టమతశాస్త్రకర్త లీత్రిపురాంతకుని వంశములోనివారే.

ఈకవిగృహనామము రాయకవివారైనట్లు పైపద్యములోఁ జెప్పఁబడియున్నది. అది సత్యమైనట్లు రెట్టమతశాస్త్రరచయితలుకూడ స్పష్ట

పరచియున్నారు. అందుతో సంబంధించినపద్యములను వారిచారిత్రమునందిచ్చెదను.

శతకకవుల చారిత్రకర్త లీకవిచారిత్రమున నీకవియింటిపేరును గూర్చియు, గోత్రవిషయమునను గొన్నివాక్యములను వ్రాసియున్నారు. అందుఁ గొంత పొరబాటున్నదనితోఁచుచున్నది. ఆవిషయములను గూడ రామభద్రకవిచారిత్రమునఁ జర్చింపఁదలఁచి యిటవిడచితిని.

ఈత్రిపురాంతకకవి కర్ణాటకమండలాధిపతియొద్ద నాస్థానకవిగా నున్నట్లీశతకమందలియీక్రిందిపద్యమునఁ జెప్పియున్నాఁడు.

శా. ఆకర్ణాటకమండలాధిపతిచే నాస్థానమధ్యంబులో నా
నాకావ్యంబులు మెచ్చఁ జేసితివి నానారాజులుం జూడఁగా
నీకుం బద్యములిచ్చెచో నిపుడు నాకేదేవి నాయాస్యమున్
రాకుం డెట్లు వసించుగాక రఘువీరా జానకీనాయకా. [illegible]

ఈకవి నాదరించినకర్ణాటధీశుఁ డెవఁడో తెలియలేదు. ఈకవిని ముసిమనుమఁడైనరామభద్రకవి క్రీ. శ. ౧౫౪౦ ప్రాంతమున నున్నవాఁడనిచరిత్రకారులయభిప్రాయము. దానినిబట్టి యితఁడు క్రీ. శ. ౧౪౨౦ ప్రాంతమునం దుండియుండును. ఆకాలమునఁ గర్ణాటకరాజ్యమును బరిపాలించుచున్నవాఁడు సంగమవంశములోనివాఁడైన రెండవదేవరాయలు. ఆతఁడు కవిపండితపోషకుఁడని, ప్రఖ్యాతికలదు. కావున నీకవి రెండవదేవరాయల యాస్థానకవి యనిచెప్పవచ్చును. ఈయూహనుబట్టి యీతఁడు శ్రీనాథాదులతో సమకాలికుఁడై యుండునని తెలిసెడి. ఈతఁడు రచించిన కావ్యము లెవ్వియో తెలియలేదు. రామభద్రకవి కేనియుఁ దెలిసినట్లు గాన్పింపదు.

ఈతఁడు రచించినశతకము "రఘువీరాజానకీనాయకా" అను మకుటముతో ౧౦౮ మత్తేభశార్దూలవృత్తములతో నున్నది. ఈమకుటమునకు ముందు "ఒంటిమెట్ట" యనుశబ్దము కొన్నిపద్యములలో మాత్రమే యున్నది. ఈశతకమునకు "ఒంటిమెట్టరఘువీరశతక" మనునామము మకుటమునుబట్టి రాలేదనియు, ఒంటిమెట్టయందుండు శ్రీరామచంద్రునిబట్టి వచ్చెననియుఁ దలంపవలసియున్నది.

ఈతనికవిత్వశైలి యనర్గళమై మనోహరముగా నున్నది. శైలిఁ జూచుటకై కొన్నిపద్యముల నిట వ్రాయుచున్నాఁడను. అచ్చటచ్చట గొన్ని వ్యాకరణమంగీకరింపని ప్రయోగములు గానఁబడుచున్నవి.

మ. జనకుం డెవ్వఁడు నీకు, నీకడుపులో సర్వంబు నుండంగ నీ
యునికిస్థానము దుగ్ధవార్ధినడుమన్ యోగీంద్రహృద్దేహ! యే
మనివర్ణింపుదు నీమహత్త్వములు సర్వైశ్వర్యముల్ పుణ్యవ
ర్తనరాజన్యయశోవిహార రఘువీరా ... ... ౮౩

మ. పరనారీకుచకుంభపాలికలపైఁ బాదాబ్జయుగ్మంబుపైఁ
గరమూలంబులపైఁ గపోలతటిపైఁ గంఠంబుపైఁ గొప్పుపైఁ
బరువుల్ వాఱెడునాతలంపులు మిమున్ భావింపఁగాఁ జేసిన
ర్వరసాధీశ్వర నన్నుఁ బ్రోవు రఘువీరా! ... ... ౬౯

శా. బాలత్వంబునఁ గొంతకాలము వృథాపాపంబు దుర్బుద్ధినై
చాలం జవ్వనమందు గర్వమతినై సంసారినై దుష్క్రియా
జాలభ్రాంతిఁ జరింతుఁ గాని నినుఁ గాంక్షం గొల్వలేదయ్య హే
రాళంబైనది చింత వంత రఘువీరా! ... ... ౭౩

ఈకవి గృహనామము, రాయకవివారు కారనియు, పైనిను దాహరించిన "అతులప్రౌఢిమమీఱు" అనుపద్యములోని "రాయకవి" యనుశబ్దము అయ్యలరాజునకు బిరుదువాచకముగాని, గృహనామము కాదనియు, వీరియింటిపేరు పుత్తేటివారనియుఁ గొంద అనుచున్నారు. రాయకవిశబ్దము గృహనామమైనను గావచ్చును. లేదా బిరుదునామమైనను గావచ్చును. ఒకప్పుడు పౌరుషనామములే గృహనామములుగా మారిపోవుచుండును. దిట్టకవి, నిమిషకవి, అనునవి యిందులకు సాక్ష్యములు. అయ్యలరాజు పూర్వులెవరైన యీరాయకవి నామమును సంపాదించియున్నచో, వీరిగృహనామ మదివఱకే "రాయకవి"గా మాఱియుండును. లేదా, అయ్యలరాజు గొప్పకవి యైనచో, రాయకవియను బిరుదము నాతఁడు సంపాదించినను సంపాదించియుండవచ్చును ఈవిషయములేవియుఁ బైపద్యమునుబట్టి యిదమిత్థమని నిర్ణయింపఁబడ జాలవు. కాని రామాభ్యుదయకర్త గద్యలో ఒంటిమెట్టరఘువీరశతకము నుమా

త్రిమే స్మరియించి, యయ్యలరాజునుగూర్చి యేమియుఁ జెప్పకుండుటచే అయ్యలరాజు రామకవిబిరుదమును బొందఁదగినంత గొప్పకవి కాఁడేమో యనిసంశయము కలుగుచున్నది. ఈవంశమువారియింటిపేరు పుత్తేటివారగునా కాదా? యనువిషయమును నిర్ధారణముచేయుట కీపుస్తకము సాహాయ్య మొనర్పఁజాలదు. కావుననాయంశము నిట విడచి, రామభద్రకవిచారిత్రమునఁ జర్చింప యత్నించెదను. అవి రామభద్రకవిచారిత్రమునఁ జర్చింపవలసినవగుటచే నిందు వ్రాయలేదు.

పైని నుదాహరించిన ఉ-పద్యమువంటి పద్యమొకటి భాగవతమున నష్టమస్కంధమున వామనావతారకథలో నున్నది. అదియిది—

శా. ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపైఁ నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందు కరంబు క్రిందగుట మీఁదై నాకరంబుంట మే
ల్గాదే! రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే

ఈ రెండుపద్యములకును సంస్కృతభాగవత మాధారము. లేక త్రిపురాంతకుని బోతన యనుకరించెనో తెలిసికొనవలసియున్నది.

---

## 72. తాళ్లపాక అన్నయాచార్యులు

ఈతఁడు ఋగ్వేది నందవరీక బ్రాహ్మణుఁడు. ఆశ్వలాయనసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు. ఈయనకు అన్నమయ్య అన్నమయ్యంగారు, అన్నమాచార్యులు, అన్నయ్యగురువు, అన్నయార్యుఁడు అని నామాంతరములు కలవు. ఈతాళ్లపాకవారు బ్రాహ్మణులయినను, తిరుమల శ్రీవేంకటేశ్వరభక్తులై, తిరుపతియందు నివసించుచుఁ, బండితులై గురుపదము నొందినవారగుటచే, నచ్చటి శ్రీవైష్ణవులతోఁ బాటుగ వీరికిని నామాంతమున "ఆచార్య" 'అయ్యంగారు' అనుశబ్దములు చేరుచువచ్చినవి. వీరుస్మార్తులయ్యును వైష్ణవమతమునం దభిమానముగలవారై, కొన్ని యాచారములలో వైష్ణవుల ననుకరించుచు వచ్చిరి.

ఈ యన్నయార్యకవి శ్రీవేంకటేశ్వరస్వామిభక్తుఁడై యాంధ్రమున "అధ్యాత్మసంకీర్తనలు, శృంగారసంకీర్తనలు, శృంగారమంజరి,

శృంగారలక్షణము" అను గ్రంథములను రచియించెను. ఈతఁడు గొప్ప గాయకశిరోమణి. ఈతఁడు కీర్తనలను గానముచేయుచున్నప్పుడు, శ్రీ వెంకటేశ్వరస్వామి నృత్యముచేయుచుండువాఁడని భక్తులీతనిని వేనోళ్లఁగొనియాడుచుందురు. ఈతఁడు స్వయముగా రచించినకీర్తనలను బాడి తనప్రియుఁడై చుట్టునున్నవారినిగూడఁ దన్మయులనుగాఁ జేయుచుండెడివాఁడఁట! ఇతఁ డుభయభాషాపండితుఁడు పంచరాత్రాగమ సార్వభౌముఁడు. సంగీతరత్నాకరము, సంగీతచంద్రిక, సంగీతచూడామణి, సంగీత సుధాకరాదిగ్రంథములందును భరతశాస్త్రమునందును జెప్పఁబడిన పదలక్షణములను బూర్తిగఁ దెలిసికొని, సంస్కృతభాషలో సంకీర్తన లక్షణము అను గ్రంథమును వ్రాసి, తదనుగుణముగఁ గీర్తనలను వ్రాసెను. భగవత్సాన్నిధ్యము లభించుటకు భక్తిశృంగారరసములు రెండును సమ ప్రాముఖ్యములని యీ కవులయుద్దేశము. భగవంతుని విలాసపురుషునిగా భావించి, భక్తిశృంగారములను సమ్మేళనమొనర్చి కీర్తనలను రచించిరి. కేవలైహికసుఖమువలన భగవత్సాన్నిధ్యము చేకూరదని బోధించుచు నధ్యాత్మసంకీర్తనలను రచించిరి. ఈతాళ్లపాక యన్నయాచార్యకవియు నీతనితనయుఁడును రచించినగ్రంథములు రాగిరేకులపై వ్రాయఁబడి తిరుపతిదేవస్థానమునం దున్నవి. ఈనడుమనే యవి కొంతవఱకు ముద్రణభాగ్యము నందినవి. ఈకవి కుమారులును, మనుమలునుగూడఁ గవులై యనేకగ్రంథములను రచియించియున్నవారు. ఈతాళ్లపాకవారివంశవృక్షము నీక్రిందనిచ్చుచున్నాఁడను. వీరందఱును గవులును బండితులునై శ్రీవేంకటేశ్వరస్వామివారి కత్యంతప్రియభక్తులై తమధనమును శ్రీవేంకటేశ్వరున కర్పించుచు, వేంకటేశ్వరుని మహిమలను వేనోళ్లఁగొనియాడుచు గ్రంథములను రచియించియుండిరి. శ్రీవేంకటేశ్వరభాండాగారమునుండి యీకవుల కప్పుడప్పుడు గొంతద్రవ్యమీయఁబడుచుండినట్లు కన్పట్టుచున్నది. శ్రీవేంకటేశ్వరస్వామివారి యాస్థానమున వీరాస్థానకవులుగనుండి పారితోషికముల నందుచుండెడివారు.

అన్నయాచార్యులు=తిమ్మాంబ, అక్కాంబ. ఇరువురు భార్యలు

(తిమ్మాంబవలన) నరసింహయ్య ఇతనికి నాంచారమ్మ అనంతమ్మ యిరువురు భార్యలు

(అక్కాంబవలన) పెదతిరుమలాచార్యులు. భార్య తిరుమలాంబ

(కుమార్తె) =భర్త రేవణూరి తిరుమలాంబ. కొండయార్యుడు.

రేవణూరి వెంకటార్యుడు శకుంతలాపరిణయ కృతికర్త

నారాయణ (నాంచారమ్మ) వలన

అప్పలార్యుడు (అనంతమ్మ వలన)

అన్నయార్యుడు (అనంతమ్మవలన)

పెదతిరుమలయ్య ఇతని భార్య మంగమ్మ

అన్నయ్య

పెదతిరువెంగళయ్య

చిన్నన్న అనే కోనేటి తిరువెంగళనాథుడు అష్టమహిషీ కళ్యాణాదిగ్రంథకర్త.

తిరువెంగళనాథుడు

తిరువెంగళప్ప

ఈయన్నయాచార్యకవి క్రీ.శ. ౧౪౦౮వ సంవత్సరమున జన్మించి ౯౫సంవత్సరములప్రాయమున ౧౫౦౩వ సంవత్సరమునఁ గీర్తిశేషుఁడయ్యెనని తిరుపతిదేవస్థానమువారు ప్రకటించినగ్రంథములలో నుదాహరించియున్నారు. రాగిరేకులపై గ్రంథాదియం దిట్లున్నదఁట "స్వస్తిశ్రీజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౩౪౬ అగు నేటిక్రోధిసంవత్సరమందు తాళ్ళపాక అన్నమాచార్యులు అవతరించిన పదారేండ్లకు తిరువెంగళనాథుఁడు ప్రత్యక్షమైతే అది మొదలుగాను శాలివాహనశకవరుషంబులు ౧౪౨౪ అగు నేటిదుందుభిసంవత్సర ఫాల్గుణ బ ౧౨ నిరుథానకు తిరువెంగళనాథదేవునిమీఁద అంకితముగాను తాళ్ళపాకఅన్నమాచార్యులు విన్నపంచేసిన అధ్యాత్మ సంకీర్తనలు"

దీనినిబట్టి క్రీ.శ. ౧౪౨౪వసంవత్సరము మొద లీతఁడు ౧౫౦౩ వఱకు గేయములను రచించుట కారంభించెనని తెలియుచున్నది. ఈకవి కవిత్వశైలి తెలియుటకై కొన్నిగేయముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

ఈకవిరచితములుమాత్రమే కాకుండ, తాళ్ళపాకవారిరచనము లన్నియు, రాగిరేకులపై వ్రాయఁబడి ఆలయమునందలి యొకచిన్నగది యం దుంచఁబడినవఁట. అన్నమాచార్యులు సంస్కృతాంధ్రములలో ముప్పదిరెండువేల కీర్తనములను రచియించియుండెను. అవియన్నియు ముద్రితములు కాలేదు. ఇతఁడు జీవితమంతయు, గీర్తనా రచనమునందును వెంకటేశ్వరుని సేవయందును గడపి ధన్యతఁ గాంచెను. ఇతనికి భగవంతుఁడు ప్రత్యక్షమగుచుండెడివాఁడని ప్రతీతికలదు. కాని యిప్పుడీవిషయమును నమ్మెడివా రరుదు. భగవంతునిలీల లపారములు. సామాన్య మానవునిబుద్ధి కతీతములైన వన్నియు నసంభవములే యని తలంచెడు వారి కన్నమాచార్యునివంటి భక్తిపరుల యనుభవములు సంభవములు గాఁ దోఁపవు. కాని యవియసంభవములని త్రోసివేయరాదు. ఈసందర్భమున నాచిన్నతనమునాఁటి సంఘటన మొకటి స్మృతికివచ్చుచున్నది. దాని నిట వ్రాయకుండ నుండఁజాలను. నేను పండ్రెండేడ్లవయసులో నుండఁగా మాయింట శ్రీవెంకటేశ్వరుని దీపారాధనము జరిగినది. దీపారాధనకు మాయింట బాలురుసహా స్నానముచేసి శుచిగానుండి మంత్రపుష్పమును సమర్పించుట ఆచారము. కాని యానాఁడు నేనింట లేకుండుటచే నాదీపారాధనమునఁ బాల్గొనలేదు. మఱిరెండుమూఁడు దినములు గడచినపిమ్మట నాకించుకజ్వరము వచ్చినట్లుండెను. మా తండ్రిగారి కానాఁడు వెంకటేశ్వరుఁ డావేశమై మొన్నటిదీపారాధనసమయమున వీఁడు లేఁడు. వెలికోతివలె నుండిపోయినాఁడు. రాఁబోవుశనివారమున వీనిచేఁ బ్రత్యేకము దీపారాధనముచేయింపుఁడని చెప్పెను. మాతండ్రిగారికప్పుడప్పుడిట్లు వెంకటేశ్వరుఁ డావేశమగుచుండెడివాఁడు. ఆయనయాదేశానుసారముగ మఱుచటిశనివారమున నేను స్నానముచేసి దీపారాధనముచేయ నుద్యుక్తుఁడనైతిని. ఇంతలో మరల మాజనకునకావేశమై "ఈరోజున దీపారాధనమువలదు. మీకుజాతాశౌచమువచ్చినది" అనియెను. మా యమ్మ మొదలగు నచ్చట నున్నవా రాశ్చర్య

మునొంది "పురు డెచ్చటనుండి వచ్చినది ? ఎవరు ప్రసవమైరి" యని ప్రశ్నించిరి. "చోడవరములో ఆదినారాయణభార్యప్రసవమైనది. మగ శిశువుకలిగెను" అనిప్రత్యుత్తరమిచ్చెను. "అయిన మేము పురుడు పట్ట వలయునా ?" యనిమాయమ్మ యడుగ "నేనుజెప్పినం బట్టనక్కఱలేదు. రేపు మధ్యాహ్నమునకు మీకు వర్తమానము వచ్చును." అనిబదులు చెప్పెను. ఇంతలో నానాఁడు మాతండ్రిగారి కావేశముతగ్గినది. నేను దీపారాధనము మానివేసితిని. స్వామిచెప్పినట్లే యామఱునాఁడు మధ్యాహ్నమునకు చోడవరమునుండి వర్తమానము వచ్చినది. మా గ్రామమున కాగ్రామము పండ్రెండుమైళ్లదూరములో నున్నది. అప్పుడు మాపినతండ్రి పెదతండ్రు లుండెడివారు. పురుడు వెళ్ళినపిమ్మట దీపారాధనము చేసితిని. మాతండ్రిగారు జీవించియున్నంతకాలము దీపారాధనలు తఱుచుగా మాయింట జరుగుచుండెడివి. అప్పుడప్పుడు మాతండ్రి గారి కావేశమగుచుండెడివాఁడు మాతండ్రిగారు గతించినపిమ్మట శుభ కార్యము లయినప్పుడు దక్క తఱుచుగా దీపారాధనలు జరుగుటయును లేదు మాయింటనెవరికిని వెంకటేశ్వరుఁ డావేశించుటయును లేదు. ఈసంఘటనముపై నేను వ్యాఖ్యానమును చేయను. ఇంచుకేనియు మార్పుచేయకుండ జరిగినది జరిగినట్లు వ్రాసితిని. ఇది యేఁబదియేండ్ల నాఁటిమాట.

అన్నమాచార్యునికీర్తనలు వ్యాకరణనియమములకు లొంగవు. కాని భక్తిరసము వీనియందుపొంగిపొరలుచుండును భగవంతునితోఁ బ్రత్యక్షముగ మాటలాడునట్లుండును. ఈగాయకశిరోమణి సుప్రసిద్ధ భక్తాగ్రేసరులైన త్యాగరాజు క్షేత్రయ్యలకు మార్గదర్శకుఁడై కీర్తిం గాంచెను. అన్నమయ్య వెంకటేశ్వరభక్తుఁడు. త్యాగయ్య శ్రీరామ భక్తుఁడు. క్షేత్రయ్య గోపాలభక్తుఁడు. ముగ్వురును తమరారాధించిన స్వరూపములయందుఁ బరమేశ్వరునిఁ బ్రత్యక్షము చేసికొని యానంద మయులై సచ్చిదానందసాక్షాత్కారమును బొందఁగలిగిరి. మానవజన్మ మును సార్థకముగఁ జేసికొనిరి.

ఈకవి రచించినకీర్తనములలో జోలపాటలు, ఉయ్యాలపాటలు, తలుపులుదగ్గఱపాటలు, మేలుకొలుపులు, తుమ్మెదపదాలు, లాలిపదాలు

చిలుకపదాలు, కోకిలపదాలు, మంగళహారతులు, వెన్నెలలు మొదలగు ననేకవిధములగు గేయములను రచించి యనేకులకు మార్గదర్శకుఁ డైన యీకవినిగూర్చి యెంతవ్రాసినను దనివిదీరదు — ఈకవి వేంకటాచల మాహాత్మ్యము, ద్విపదరామాయణమునను గ్రంథములనుగూడ రచియించెనని యనెదరు కాని నాకాగ్రంథములు లభింపలేదు.

శృంగారసంకీర్తనలు:—

ముఖారి—జంపెతాళం.

పల్లవి. జానామ్యహం తే సరసలీలాం
నానావిధ కపటనాటక సఖత్వం॥

చరణము. కిం కరోమి త్వాం కితవ పరకాంతాన
ఖాంకురప్రకటనమతీవ కురుషే
శంకాం విసృజ మమ సర్వం నకరుణం
కిం కారణం తైః ఖేలన మిదానీం॥
కిం భాషయసి మాం కితవ మానసతయా
డాంభికతయా విడంబయసి కిం
గాంభీర్య మావహసి కాతరత్వేన తవ
సంభోగ చాతుర్య సాదరతయా కిం॥
కిమితి మామనునయసి కృపణ వేంకటశైల
రమణ భవదభిమతసురత మనుభవ
ప్రియదేన మత్ప్రియం ప్రచురయసి మానహర
మమతయా మదన నిర్మాతా న కిం త్వమ్॥

కాంభోజి.

పల్లవి. తలవాకిలి మాటలెల్లా దయ్యా మెఱుంగు
మెఱుంగని దానంగాను యేమందునేను॥

చరణము. మంతనము లాడుకొంటూ మంచముపై నేరుకొంటూ
యంతతడవునుండరా యిద్దరు మీరు
అంతలో నేరాగాను ఆపెం జూపి యెవ్వతంటా
యెంతకెంత నన్నడిగే వేమందు నేను॥

అంగములొరసుకుంటూ నాయములు ముట్టుకొంటూ
యెంగిలి పొత్తందుకోరా యిద్దరు మీరు
సంగడి నేగూచుండరా సతి నాచెలి యనుచు
యింగితా నంబే రడిగే వేమందు నేను॥
రమ్మి కౌంగిలించు కాయము లుబ్బించుకొంటూ
యిమ్ములం గూడియుండరా యిద్దరు మీరు
పమ్మి నేదగ్గరగాను పైకొనికూడితి విట్టె
యెమ్మెల శ్రీ వెంకటేశ యేమందునేను॥

అధ్యాత్మసంకీర్తనలు.

సామంతం.

పల్లవి. ఏవం శ్రుతిమత మిద మేవ త
ద్భావైతు మతః పరం నాస్తి॥

చరణము. అతులజన్మభోగసక్తానాం హితవైభవసుఖ మిద మేవ
సతతం శ్రీహరిసంకీర్తనం తద్వ్యతిరిక్తసుఖం వక్తుం నాస్తి॥
బహుళమరణపరిభవచిత్తానాం ఇహపరసాధన మిద మేవ
అహిశయనమనోహరసేవా తద్వ్యాహరిణం వినా విధిరపి నాస్తి
సంసారదురితజాడ్యపరాణాం హింసావిరహిత మిద మేవ
కంసాంతక వేంకటగిరి పతేః ప్రశంసైవ పశ్చా దిహ నాస్తి।

వరాళి.

పల్లవి. ఏమి గలదిందు నెంత పెనంగిన వృథా
కాముకపు మనసునకు గడమొదలు లేదు॥

చరణము. వత్తిలోపలినూనెవంటిది జీవనము
విత్తుమీఁదట పొల్లువిధము దేహంబు
భక్తిసేయుట యేమి పాసిపోవుట యేమి
పొత్తులసుఖంబులకు పోరలుటలు గాక॥
ఆకాశపాకాశ మరుదైన కూటంబు
లోకరంజకము తమలోనిసమ్మతము
చాకి మణుగులజాడ చంచలపుసంపదలు

చేకొనిననేమి యివి చెదరిన నేమి॥
గాదె పోసినకొలుచు కర్మిసంసారంబు
వేడివిడువనికూడు వెడమాయ బ్రదుకు
వేదనలనెడ తెగుట వేంకటేశ్వరుకృపా॥
మోదంబు వడసినను మోక్షంబు గనుట॥

శృంగారమంజరి:—

గతినొప్పు నిలువెల్లఁ గన్నులై యమరఁ
గ్రాఁగినగందఁబు క్రమ్మఁ బన్నీటఁ
దోఁగినచెంగావి దొడరి శైత్యమున
గ్రాఁగినహృదయంబు రతిరాజుచేత
మాఁగినమతియుఁ బ్రమాదంబువలన
నీఁగినవగలును నేత్రాంబుధార
లాఁగినజెప్పలు నైయున్నయింతి
గనుఁగొని కరుణావికాసచంద్రికలు
నీలోత్పలాక్షిపై నిండంగఁ జల్లి
భామినియున్న పూఁబానుపు చేరి
చిట్టంటిచేతల సేదలు దీర్చి
చెదరినయలకలఁ జిక్కుల్లఁ దీర్చి
యెడలేనిపులకల నింపు పుట్టించి
కళలమర్మంబులకడ గానుపించి
యాలింగనాదిసౌఖ్యముల నొందించి
కరఁగించి మరగించి కలికిఁ గావించి
యుడివోని సురతాబ్ధి నోలలాడించి.

ఈయన్నయాచార్యుని నివాసము మొట్టమొదట కడపమండలములోని రాజంపేటతాలూకాయందలి తాళ్ళపాక యనుగ్రామమనియు, నాగ్రామమునుబట్టియే వీరిగృహనామ మేర్పడినదనియు, నీతఁడు పిన్నవయసునందే స్వగ్రామమునువీడి తిరుపతికివచ్చి వెంకటేశ్వరభక్తుఁడై క్రమముగా వైష్ణవమతమునం దభిమానము హెచ్చినందున వైష్ణవమతమును స్వీకరించె ననియుఁ దెలియుచున్నది.

ఈకవి చనిపోవునప్పుడు. శ్రీవెంకటేశ్వరునిపై ననుదినమును ర్తనలను జేయుచుండుమని తనకుమారున కాజ్ఞయిడె ననియు నారీతి నే పెదతిరుమలాచార్యులును తరువాతివారును గీర్తనలను రచించుచు చ్చిరనియుఁ జెప్పెదరు.

ఈకవికాలములోఁ గర్ణాటరాజ్యమును, దేవరాయలు, మల్లిఖా నరాయలు, విరూపాక్షరాయలు, సాళువనరసింహరాయలు, తుళువ రసరాయలు, వీరనరసింహరాయలు, శ్రీకృష్ణదేవరాయలు అనువా లు పరిపాలన మొనర్చియున్నారు

ఇతఁడు "వెంకటేశ్వరా!" యనుమకుటముతో ౧౦౫ ఉత్పల ంపకమాలావృత్తములు గలయొకశృంగారశతకమును రచియించి, యలమేలుమంగకుఁ గృతి యిచ్చెను. శతకాంత పద్యమిది.

అమ్మకుఁ దాళ్లపాకఘనుఁ డన్నఁడు పద్యశతంబుఁ జెప్పెఁ గో
కొమ్మని వాక్ప్రసూనములఁ గూరిమితో నలమేలుమంగకున్
నెమ్మది నీవు చేకొని యనేకయుగంబులు బ్రహ్మకల్పముల్
సమ్మదమంది వర్ధిలను జవ్వనలీలల వేంకటేశ్వరా !

పెదపాటిజగన్నాథకవి యీశతకమునుండి యీక్రిందిపద్యమును గైకొని తనప్రబంధరత్నాకరమునఁ జేర్చుకొనియెను.

ఉ. అరిసెలు నూనెబూరెలును నోఁగులుఁ జక్కెరమండెగల్ వడల్
బురుడలు వాలమండెగ లపూపము లయ్యలమేలుమంగ నీ
కరుదుగ విందుఁ బెట్టెఁ బరమాన్నశతంబుల సూపకోట్లతో
నిరతవినిర్మలాన్నముల నేతులసోనల వేంకటేశ్వరా!

ఈశతకమందలి ప్రథమపద్యమిది:—

శ్రీసతి నీల జాంబవతి శ్రీయమునాసతి సత్యభామ ధా
త్రీసతి రుక్మిణీరమణి దేవియిలాసతి వీరలందఱున్
జేసినసేవఁ జేసెదను జేకొను శ్రీయలమేలుమంగ నీ
మూసినముత్యమై యురముముంగట చెంగట వేంకటేశ్వరా!

ఇతని పదకవిత్వము నీతని పౌత్రుఁడైన చినన్న మిక్కిలిగా ర్తించి యున్నాఁడు.

# ౩ పిడుపర్తి నిమ్మనాథుఁడు (నిమ్మయార్యుఁడు)

పాలకురికిసోమనాథకవికిఁ బ్రియశిష్యుఁడై యిఁదులూరిఅన్నామాత్యునిచే డోకిపఱ్ఱును నగ్రహారముగా గ్రహించిన పిడపర్తి శివరాత్రికొప్పయ్య కీనిమ్మనాథుఁడు మనుమనిమనుమఁడు. ఆడోకిపఱ్ఱును ప్రౌఢదేవరాయనిచే మరలసంపాదించిన పెదసోమయ్య కీతఁడు పౌత్రుడు. ఈకవితండ్రిపేరు పినసోమయ్య. గురుదీక్షాబోధను ద్విపదగా రచించిన పిడపర్తి (మొదటి)బసవకవికీతఁడు పెదతండ్రికుమారుఁడు. పద్యబసవపురాణమునురచించిన పిడపర్తి సోమనాథున కీతఁడు పెదతాతమనమఁడు. ఈసోమనాథుఁడు తనపద్యబసవపురాణమునం దీనిమ్మనాథుని గూర్చి యిట్లు వ్రాసియున్నాఁడు.

సీ. శ్రీమన్మహాలింగసేవాసముద్భూత
        పరమసుఖామృతవరపయోధి
    కలితచతుష్షష్టికాలశివార్చనా
        మహనీయనిష్ఠాసమన్వితుండు
    భవిపాకవర్జన ప్రథితసువ్రతనిత్య
        పావనచిత్పూర్తి భవ్యమూర్తి
    శుద్ధాత్మ పిడుపర్తి సోమయదేశిక
        సత్పుత్రుఁ డష్టభాషావిదుండు

తే. భవుల కెన్నఁడు కవితచెప్పనిఘనుండు
    కాంతు లుడిగినసమలోష్టకాంచనుండు
    శాంతిదాంతిమయస్వాంతసంయుతుండు
    జగతిఁ బెంపారు నిమ్మయాచార్యవరుఁడు.

ఇందలి "అష్టభాషావిదుండు" "భవులకుఁ గవిత చెప్పనిఘనుండు" అను వాక్యము లీనిమ్మనాథుఁడు కవియని చెప్పుచున్నవి కాని యాతఁడు రచించినగ్రంథము లేవియో తెలుపుటలేదు. ఈనిమ్మయాచార్యుఁడు క్రీ.శ. ౧౩౯౦-౧౪౪౦ కాలమువాఁడు.

మదరాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున "నిజలింగచిక్కయ్యకథ" యను యక్షగానమొకటి యున్నది. ఆభాండాగారమునం

ఖిలపుస్తకములపట్టికలో నాగ్రంథకర్త పిడుపర్తి నిమ్మనాథుఁడని వ్రాయుచు నీక్రిందిపదముల నుదాహరించియున్నారు. ఈగ్రంథప్రతు లా భాండాగారమున నాలున్నవి. (R. 279. D. 1891 to 1895) అందొక దానియందు బ్రౌనుపండితుఁడు ఇంగ్లీషుభాషలోఁ గథాసంగ్రహమును వ్రాసియుంచెను.

"గగనరూపగు చుండి కలికేశు పేర
శంకరపిడుపర్తి చతురకవిత్వ
పారాయణుండు పర్వతలింగఘనుఁడు
నెరయంగ పిడుపర్తి నిమ్మనాహ్వయుఁడు
చిరతరనిజలింగచిక్కన్న ............"

ఈద్విపదలనుబట్టి యీగ్రంథము చుండిగ్రామమందలి కలికేశ్వరున కంకితము చేయఁబడినట్లును, కవితండ్రిపేరు పర్వతలింగమైనట్లును తెలియుచున్నది. చుండియనుగ్రామము నెల్లూరుమండలమునందున్నది. కానిపిడపర్తినిమ్మనాథునినివాసము నిజాము రాష్ట్రములోనిపిడపర్తి. అచటనున్నవాఁడు నెల్లూరుమండలమందలి చుండి దేవుని కంకితమొసంగుట పొసంగదు. నిజామురాష్ట్రమున చుండి యనుగ్రామ ముండెనేమో తెలిసికొనవలసియున్నది. అయినను పిడపర్తినిమ్మయార్యుని తండ్రిపేరు పినసోమయ్యగాని పర్వతలింగము కాఁడు. కావున నాగ్రంథకర్త యీనిమ్మయార్యుఁ డనరాదు.

రెగళ్లగనిమ్మనాథుఁ డనునొకకవి గురునంబిచరిత్ర మనునొక యక్షగానమును రచించిరాచపీటియందలి వీరభద్రేశ్వరునికంకితము చేసెను. దానిప్రతులు మూఁడు మదరాసుప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము నందున్నవి (D No. 1870, 1871, 1972) ఆనిమ్మనాథుఁడే పైని వ్రాసిననిజలింగచిక్కయ్యకథను రచియించెననియు, పిడపర్తినిమ్మన రచియింపలేదనియు నానమ్మకము. గురునంబిచరిత్రగ్రంథాంతమందలి యీక్రిందిద్విపదలను జూడుఁడు.

"నదిదక్షయజ్ఞాపహారునిపేర
మునుకొని విశ్వతోముఖమూర్తిపేర

వలనగు కళ్యాణవాసుని పేర
వినుతింప శ్రీరాచవీటినివాస
ఘనభద్రకాళికాకాంతుని పేర
నంకితంబుగ సదాచారైకవర్తి
శంకరపిడుపర్తి సద్గురుమూర్తి
కరజాతుఁడగు చుండికలికేశు పేర
పరకవీశ్వరుఁడు పర్వతలింగసుతుఁడు
నిరుపమ రెగళ్లగ నిమ్మనాథుండు
నరసురాద్భుతగురునంబిచరిత్ర
యుక్తిగానము చేసె ననుపమప్రీతి
దక్షత నాచంద్రతారార్కముగను
నిది విన్నఁజదివిననీప్సితార్థములు
సదమలమతులకు సమకూర్చు శివుఁడు.

ఈద్విపదలును జైనవ్రాసినద్విపదలును నొక్కపోలికగా నున్నవి. ఇరువురును బర్వతలింగపుత్రులే. ఈద్విపదలలో కొంచెము పొరపాటున్నట్లు కన్పట్టుచున్నది. చుండికలికేశుఁడు శంకరపిడుపర్తిగురుమూర్తి కరసంజాతుఁడగుట అసంభవము. చుండికలికేశుఁడు మానవవ్యక్తి యనుట కవకాశము లేదు. గురునంబిచరిత్ర గ్రంథాదిని—

క. ధవళగిరి సన్నివాసుని
ధవళోరగభూషితాంగు ధవళాంశుధరున్
ధవళభసితత్రిపుండ్రుని
ధవళాంగునిఁ జుండికల్కిదైవముఁ గొలుతున్.

అనిచెప్పియుండుటచేఁ జుండికలికేశుఁడు దైవమనియునిమ్మనాథుఁ డాతనిభక్తుఁడనియు స్పష్టమగుచున్నది. రెగళ్లగనిమ్మనాథుఁడు పర్వతలింగము పుత్రుఁడనియు, పిడపర్తిశంకరగురునిశిష్యుఁ డనియు నీతఁడే నిజలింగచిక్కయ్యకథనురచియించి చుండికలికేశునకును గురునంబిచరిత్రమునురచియించి రాచకొండవీరభద్రదేవునకును నంకిత మొసంగెనని యు మనము నిశ్చయింపవచ్చును. రాచకొండ నిజామురాష్ట్రములోని

నుట నిశ్చయము. పిడుపర్తివంశములోనివాఁడైన శంకరగురుపుత్రుఁ
నాతనిశిష్యుఁడైన రేగళ్లిగ నిమ్మనాథుఁడును గూడ నిజామురాష్ట్రవాసు
నియుఁ జుండిగ్రామము నిజామురాష్ట్రముననే రాచకొండ సమీప
మున నుండుననియు సిద్ధారణము సేయవచ్చును. రేగళ్లిగనిమ్మనాథుని
చారిత్రమును వేఱుగ వ్రాసెదను.

---

## ౬ పిడుపర్తి (మొదటి) బసవకవి

పిడుపర్తివారు మొట్టమొదట నియోగిబ్రాహ్మణులు. పిమ్మట పాలకురికిసోమనాథునకు శిష్యులై వీరశైవమతమునాశ్రయించినవారు. సోమనాథునకుఁ బ్రియశిష్యుఁడైన శివరాత్రికొప్పయ్య కీబసవకవి మునుమనుమఁడై యున్నాఁడు. వీరివంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.

శివరాత్రికొప్పయ్య.
(పాలకురికిసోమనాథుని శిష్యుఁడు)
(ఇందులూరిఅన్నయామాత్యునిచే దోకిపఱ్ఱు
అగ్రహారముఁగా బడసినవాఁడు)

బసవయ్య

పెదసోమయ్య కొప్పయ్య కొండవీటి భువనయ్య
లింగము దేవర

పినసోమయ్య దేవయ్య చిక్కయ్య బసవయ్య పాలకురికయ్య
మల్లము

శ్శంకయ్య కొమగయ్య నిమ్మనాథుఁడు సోమయ్య బసవయ్య ఇతఁడేకవి.

బసవయ్య

సోమన్న దేవయ్య గుంటూరి సోమన్న పాలన్న గురువన్న బస
వీరయ్య (పద్య వన్న
బసవపురా
ణకృతికర్త)
బసవన్న
(ప్రభులింగలీలకృతికర్త)

ఈకవికిఁ బితామహుఁ డైన పెదసోమయ్య క్రీ. శ. ౧౩౬౦ ప్రాం తమున జన్మించెనని పాలకురికి సోమనారాధ్యునిచరిత్రమున (3 వ సంపుటము ౧౩౯ వ పుట) వ్రాసియున్నాఁడను. దానినిబట్టి యీకవి ౧౪౨౦ ప్రాంతమున జన్మించి ౧౪౪౦ ప్రాంతమునుండి గ్రంథరచనముఁ జేసియుండును. ఇతఁడు గురుదీక్షాబోధ, పిల్లనైనారుకథ, బ్రహ్మోత్తరఖండము మొదలగు శైవగ్రంథములను రచియించియుండెను.

ఇతనికుమారుఁడైనసోమనాథకవి తండ్రిప్రోత్సాహముచేఁ బసవపురాణమును బద్యకావ్యముగా రచించి యందీకవినిగూర్చి యీక్రింది పద్యములనువ్రాసియున్నాఁడు. పైనిఁజూపిన వంశవృక్షమున కీపద్య బసవపురాణమే యాధారము.

సీ. గురునాథుఁ డగుపాలకురికిసోమేశుండు
చెప్పినకృతులెల్ల నిప్పుడమిని
బ్రకటింప వచ్చినప్రత్యక్షబసవేశు
డని భక్తజనులు వినుతి సేయ
భక్తిమర్మములు దప్పకయుండ నర్థముల్
చెప్పి శిష్యులను రక్షింపనేర్చు
నొనర దీక్షాబోధయును పిల్లనైనారు
కథయు బ్రహ్మోత్తరఖండమునను
తే. నాదిగాఁగల శివరహస్యములు పెక్కు
శివశరణులు మెచ్చ ద్విపదలు చేసి భక్తి
సభల వెలయించి మించినసజ్జనుండు
బంధుసురమణి పిడుపర్తి బసవశౌరి.

సీ. ద్రవిడకర్ణాటాంధ్రయవనభూములఁ బేర్మి
గొన్నాఁడు పెక్కులు సన్నుతముగఁ
దలయెత్తినది మొదల్ ధరగల్గుమర్త్యాధి
పతులచేఁ బూజలు వడసినాఁడు
కాలకంధరుని సత్కమలంబుఁ బూజించుఁ
బంచాక్షరిజపించుఁ బాయకెపుడు
భవిపాకవర్జితపరివిమలవ్రతుఁ డన్య
మంత్రాంగదాహముల్ మానినాఁడు

తే. కవిత భవులకుఁ జెప్పనిసవినయుండు
బంధుజనములఁ బ్రోవఁ బొల్పడ్డవాఁడు
నిత్యజంగమపూజనాన్వితసుబుద్ధి
వసమె పొగడంగఁ బిడుపర్తి బసవఘనుని

గీ. అట్టిబసవనార్యుఁ డతులశివార్చనా
రతుఁడు ధర్మయుతుఁడు వ్రతియు నైన
వీర్నకోటిమల్లవిభుపుత్రినాగాంబఁ
దగవివాహమయ్యెఁ దత్పురంధ్రి.

సీ. ప్రాణేశునాజ్ఞకు నడు గెన్నఁడునుదాఁట
దత్తమామలసేవ నర్థిఁ జేయుఁ
గలలోనైనను గల్లలాడద యెప్డు
పేదసాదలఁజాలనాదరించుఁ
బతిభక్తి గలపుణ్యసతులఁ బెద్దఁగఁజూచుఁ
గులటల. గన్న దవ్వులఁదొలంగుఁ
బతిసోదరులకడ భయభక్తిఁజరియించుఁ
గోడండ్రి నేరాండ్రఁగూడి మెలఁగు

ఆ. శమదమాపయుక్త శాంభవపదభక్త
పుత్రపౌత్రముఖ్యభూరిసఖ్య
పుణ్యగణ్యగాత్రి భూరిక్షమాధాత్రి
సన్యగుణకదంబ నాగమాంబ.

ఈపద్యములనుబట్టి కవిసమర్థతయు, శీలమును, కవిరచించిన గ్రంథనామములును దెలియుచున్నవి. ఈకవిరచించినగ్రంథములన్నియు ద్విపదకావ్యములు. వానిలో గురుదీక్షాబోధ మాత్రమే ముద్రితమైనది. తక్కినగ్రంథములిపు డెచ్చటను గన్పట్టుటలేదు. గురుదీక్షాబోధలోఁ గవి తననుగూర్చి యిట్లు చెప్పుకొనియున్నాఁడు.

"పిన్నప్రాయమునఁ జెప్పితి శివకథలు
ప్రన్నన తెనుఁగునఁ బదరితికొన్ని
నడివయసునఁ బిల్లనయనారుచరిత
నుడివితి ద్విపదగా సూక్తులను
కాల మాసన్నంబు గాకటమున్నె
లాలితకావ్యకళాప్రౌఢిఁ బేర్మి
సకలాగమపురాణసమ్మతమైన
యొకశివకథ నింక నొనరింపవలయు."

ఈగ్రంథమును దెలుఁగున రచింపఁజేయుమని వీరభూపాలుఁ డను వానితోఁ గర్ణాటక్షేశమునందుండి శైవాగమవేది యైనవీరశైవదేశికుఁడు వచ్చిచెప్పెననియు నాభూపాలునిప్రార్థనపైఁ దానీగ్రంథమును రచియించితిననియుఁ గవి కృత్యాది నీక్రిందిద్విపదలలోఁ జెప్పియున్నాఁడు.

"తెలుఁగుకవిత్వంబు తేటగాఁజెప్ప
బలియుండు పిడుపర్తిబసవనాహ్వయుఁడు
వానిచేఁ జెప్పింపవలయు నీచరిత
మారూఢి ద్విపదగా ననఁ దఃపోసి
వీరబాణాఖ్యవిభుతిమ్మశౌరి
వీరభూపాలుండు వేడ్కదైవార
ధీనిధి పిడపర్తి దేవతయ్యకును
మానిని మల్లమాంబకుఁ దనూభవుని
భవుభక్తులు నుతింపఁ బొల్పడ్డసుకవి
భవులకు కవితఁ జెప్పునిశీలవంతుఁ
బరమమహేశ్వరపదసేవనైక
పరతంత్రపిడపర్తిబసవనాహ్వయుని.

ఈవీరభూపాలుఁ డేప్రదేశమునకుఁ బ్రభువో తెలియదు. ఇతని తండ్రి తిమ్మశౌరి యనియుఁ దాతవీరబాణుఁ డనియు, సూర్యవంశీయుఁ డనియు (రాజతేజుండు [గహరాజునంశజుఁడు) భరద్వాజగోత్రుఁడనియు మాత్రమే కవి యీగ్రంథమునఁ జెప్పియున్నాఁడు. కర్ణాటకమునుండి వచ్చి వీరశైవుఁ డీగ్రంథమును రచింపఁజేయుమనియితనితోఁ జెప్పియుండుటచేతను కవి, నిజామురాష్ట్రమండలి పిడపర్తినివాసుఁడగుటవలనను, నీవీరభూపాలుఁడుకూడఁ బ్రస్తుతమునఁ దెలంగాణమనిపిలువఁబడియెడి నిజామురాష్ట్రాంతర్భాగమున నేప్రదేశముననో చిన్నసంస్థానాధిపతియైయుండునని తోఁచుచున్నది. వీరభూపాలీయమను నొకలక్షణగ్రంథముకలదు. ఆవీరభూపాలు డీతఁడేమో యనిసంశయము కలుగుచున్నది ఈవిషయమునుగూర్చి తరువాతవ్రాసెదను.

కెరియపద్మరసు అనుకన్నడకవీశ్వరుఁ డీగ్రంథమును మొదట సంస్కృతమునను బిమ్మటఁ గర్ణాటకమున రగడగనురచియించెననియు దానిని దా నాంధ్రీకరించితిననియుఁగవి యీక్రిందిద్విపదలలో నుడివియున్నాఁడు.

"భావింప నాజిహ్వ పావనంబయ్యె
భావశుద్ధుఁడు కెరియపద్మరసు తొల్లి
అకలంక వేదవేదాంతసిద్ధాంత
సకలాగమగ్రంథజాలము ల్గూర్చి
సరవిఁ గావించె దీక్షావిధానంబు
గరిమ నాసంస్కృతగ్రంథార్థ మెల్ల
వారికిఁ దెలియంగ వశముగాదనుచు
బోరున నయ్యర్థములు కన్నడమున
నెరవార రగడ గావించె గ్రంథములు
వరుస సాక్షులుగా వ్రాసి చూపుచును
జరిపినబహుశాస్త్రసారంబు గాని
నరులు చేసినకల్పనాకృతి కాదు.
కృతులకైవడి చమత్కృతులు బుట్టించి
చతురులు చేసినచరితంబు గాదు

పరమరహస్యంబు భక్తిసాధనము
దురితదూరంబు ముక్తికుమూలంబు
గావున నిట్టిదీక్షాబోధకవిత
గా వేడ్క తెనుంగున గావింపఁగంటి.

ఇతనికవిత్వశైలి తెలియుటకై కొన్నిద్విపదల నిట నుదాహరించెదను.

"గురునాథుఁడును ముముక్షులకును దీక్ష
కరుణించి గతిఁజూపఁ గలవాఁడు గాక
వివరింపఁ గులగోత్రవిద్య లేమిటికి
శివునట్లు మాయఁ బాసినమహాత్మునకు.
నెన్నఁగా శివతత్వ మెఱిఁగియే భ్రమలఁ
జిక్కఁగఁ దోలఁ గనేర్చినవారికంటెఁ
జిత్తంబు శివునిఁ గూర్చినవారికంటె
నిత్తెఱంగున గురువు లెవ్వ రున్నారు. ౧ ఆ.
సంగతరసములు జంగమనాథు
నంగీకరించిన ప్రాణలింగమున
కనురక్తి నర్పించునది జంగమున
కనయంబు రుచులు సమర్పింపుటయ్యె
గురువరునాజ్ఞ గల్గి భక్తులనిజభావ
భరితుఁడై యుండెడిభావలింగమున. ౩ ఆ.

ఈకవినివాసము నిజాము రాష్ట్రమందలి పిడపర్తి అనుగ్రామము. ఇతనికుమారుఁడును మనుమఁడునుగూడ కవులైగ్రంథములను రచియించినవారు. వారిచారిత్రములను వేఱుగ వ్రాయుచున్నాఁడను. ఈ పిడపర్తికవులనివాసము గుంటూరుమండలమందలి పిడపర్తియై యుండునని కొంద ఱూహించిరి. కాని యంతకంటె నిజామురాష్ట్రమందలి పిడపర్తి యనుటయే సమంజసమని నాయభిప్రాయము. ఆకాలమున గుంటూరుమండలముకంటె నిజామురాష్ట్రమునందే వీరశైవమత మెక్కువవ్యాప్తినందియున్నది. అందుచే నిట్టిగ్రంథము లాప్రాంతమున రచియింపఁబడియుండునని నిశ్చయింపఁదగియున్నది.

## 5 పిల్లలమఱ్ఱి పినవీరన్న

వాణీకటాక్షము నందిన మహాకవివతంసులలో నగ్రగణ్యుఁ డగు నితఁడు అవతారదర్పణము, నారదీయపురాణము, మాఘమాహాత్మ్యము మానసోల్లాససారము, శకుంతలాపరిణయము, జైమినీభారతము అను గ్రంథములను రచియించి వాసిఁ గాంచియున్నవాఁడు. ఈతనిరచనములలోఁ దుదిరెండుపుస్తకములు దక్క తక్కినవి నామమాత్రావశేషము లైనవి. ఆగ్రంథము లింతవఱకు బయలుపడకపోవుట యాంధ్రులదురదృష్ట మని చెప్పవచ్చును.

### ఇ త ని ర చ న ము లు

ఈకవి తానురచించినపుస్తకనామములను శకుంతలాపరిణయము నందలి యీక్రిందిపద్యమునఁ గృతిపతి పలుకులుగాఁ జెప్పియున్నాఁడు.

సీ. రచియించినాఁడవు రమణీయవాగ్రీతి
నవతారదర్పణం బభినవముగఁ
బలికినాఁడవు తేటపడఁ జేసి నారదీ
యము సత్కవిశ్రేణి యాదరింపఁ
జెప్పినాఁడవు శేముషీవిశేషంబున
మాఘమాహాత్మ్యంబు మంజుఫణితిఁ
గావించినాఁడవు ఘనబుద్ధి మానసో
ల్లాససారము సముల్లసితశయ్య
భారతీతీర్థయతిసార్వభౌమ గురుకృ
పాతిశయలబ్ధకవితావిభూతిఁ గలిగి
గౌరవము గాంచినాఁడవు కవులచేత
విపులచాటూక్తినిర్నిద్ర! వీరభద్ర!

గీ. కలదు చాలంగఁ బ్రేమ నీవలన నాకు
వేడ్క నడిగెదఁ గవు లెల్ల వేడ్కపడఁగ

షట్సహస్రికులోద్భవసచివులందు
సుకృతిగాఁ జేయు నాకొకసుకృతిఁ జేసి.

పైపద్యమున జైమినీభారతమును జెప్పలేదు. దీనినిబట్టి శకుంతలాపరిణయమునకుఁ బిమ్మట జైమినీభారతమును రచియించిన ట్లూహింపఁదగి యున్నది.

పైనిఁ బేర్కొనినగ్రంథములలో నవతారదర్పణమునకు మాఱుగా నవరసదర్పణ మనిశకుంతలాపరిణయముద్రితప్రతి యందున్నది. గ్రంథము లభింపకపోవుటచే నిజమైనపే రిదియని స్పష్టము చేయఁజాలము. ముద్రాపకులు అవతారదర్పణమనుట కంటె నవరసదర్పణమనుటలో నర్థ మున్నదని యోచించి కాఁబోలు పద్యములో నవరసదర్పణ మని యుంచి 'నవతార' పాఠము నాఫుటకడుగునఁ జేర్చినారు. నవరసశబ్దమువలన యతిభంగముకాదాయని యనుకొని కాఁబోలు నటఁ బ్రశ్నార్థసూచకచిహ్నము (?) నుంచినారు. మొత్తముమీఁద నవతారదర్పణ మని యుండుటయే యుచితమని తోఁచుచున్నది. భగవంతునిదశావతారముల నందుఁ గవి వర్ణించియుండెనేమో! ఈతనివంశీయుఁ డగు పినమల్లి సోమయామాత్యుఁడు తన సీమంతినీ పరిణయమున నవతారదర్పణ మనియే చెప్పియున్నాఁడు.

## శకుంతలా పరిణయము

శకుంతలాపరిణయము నాల్గాశ్వాసములశృంగారప్రబంధము. శకుంతలాదుష్యంతులపరిణయగాథ యిందు వర్ణితము. కవిత యెట్లుండవలయునో కృతిపతిముఖమున శకుంతలాపరిణయమునం దీక్రిందిపద్యములలోఁ గవి జెప్పియున్నాఁడు.

శా. ప్రఖ్యాతంబన మిశ్రబంధమన నుత్పాద్యంబనంగాఁ ద్రిధా
వ్యాఖ్యాతంబగు వస్తు వందు మఱి యధ్యాహారముం జేయఁగాఁ
బ్రఖ్యాతం బతివృత్త మైనకృతి చెప్ప న్వక్తకు న్శ్రోతకు
న్విఖ్యాతిం గలిగించుఁ బుణ్యమహిమ న్విశ్వంభరామండలిన్.

క. శృంగారము ముఖ్యంబగు
నంగియు సంగములుఁ దలఁప నష్టరసములు
న్నాంగమగునేనిఁ డంకము
బంగారముతోడి యొఱ ప్రబంధము వొందున్.

గీ. కథ ప్రసిద్ధియు మిగుల శృంగారవతియుఁ
బఱగణింపంగ శ్రీమహాభారతమునఁ
గథితమైనశకుంతలాఖ్యానభంగి
నది ప్రబంధంబుఁ జేయు ప్రఖ్యాతి నొంద.

సీ. సరవి పువ్వులుగ మాలకరి పెక్కుతెఱఁగుల
విరుల నెత్తులుగఁ గావించినట్లు
కర్పూరకస్తూరి కావస్తువితతిచే
శ్రీఖండచర్చ వాసించినట్లు
ఒడికంబుగా గందవొడికి నానాసూన
పరిమళంబులు గూడఁబఱచినట్లు
సరఘలు వివిధపుష్పమరందలవములు
గొనివచ్చి తేనియఁ గూర్చినట్లు

తే. భారతప్రోక్తకథ మూలకారణముగఁ
గాళిదాసుని నాటకక్రమము కొంత
తావకోక్తికి నభినవశ్రీ వహింపఁ
గూర్మిఁ గృతిసేయు నాకు శాకుంతలంబు.

పైపద్యములలో నుడివినట్లు కథనుభారతమునుండి గైకొని మహాకవికాళిదాసు రచించినయభిజ్ఞానశాకుంతలనాటకమునందలి యితివృత్తాదులను దీసికొని యీకవి యీయుత్తమప్రబంధమును రచించెను. వ్యాసకాళిదాసులవిజ్ఞానమును గ్రహించి తనయసాధారణబుద్ధికౌశల్యముచేవన్నె వెట్టి పినవీరన రచించిన యీ ప్రబంధమునందలి కవిత్వము మృదుపదభూయిష్ఠమై హృదయంగమముగా నున్నది.

ఇతిహాసరూపముననున్న భారతమునందలి కథను దృశ్యప్రబంధరూపమున నున్న కాళిదాసునాటకమునందలి కథను స్వీకరించి ప్రబంధ

మున కనుకూలమగునట్లు కథలోఁ గొన్నిమార్పులనుగావించి ఈ మహా కవి యీ కావ్యమును రచించెను. కాళిదాసు తననాటకమున కభిజ్ఞాన శాకుంతలమని పేరిడెను. శ్రీనాథుఁడు నైషధమునకు శృంగారనైషధమని పేరిడినట్లే యీతఁడీశాకుంతలమునకు శృంగారశాకుంతలమని పేరిడియెను. భారతమున శకుంతల జననాదివృత్తాంతమును దుష్యంతునకు శకుంతల స్వయముగనే చెప్పి తనకుమారుని యువరాజునుగాఁ జేయఁ గోరెను. కాళిదాసీకథను శకుంతలయొక్క చెలికత్తెలచేఁ జెప్పించెను. పినవీరన తనకావ్యమునఁ గణ్వశిష్యులచేఁ జెప్పించెను. శకుంతలను దుష్యంతుఁడు మరల గ్రహించుటకు భారతమున నాకాశవాణియు నాటకమున నుంగరమును బ్రబంధమున నీరెండునుగూడఁ గారణములైనవి. ఇట్లే మఱిరెండుమూఁడువిషయములలోఁ బినవీరన మార్పులను గావించెను. వీనియుచితానుచితముల విమర్శించుట కిట తావుచాలదు. ఇట్టివిమర్శనములను జేయఁబూనినచో నీగ్రంథము చాల పెద్దదగును. దేశకాలపాత్రానుసారముగఁ గవులు కావ్యనిర్మాణమును జేయుచుందురు. వానినన్నిటిని దెలుపుచుఁ గావ్యవిమర్శనముచేయుట కీగ్రంథ ముద్దేశింపఁబడలేదు. పినవీరనకవిత్వ మనర్గళధారకలిగి సమసంస్కృతాంధ్రపదసంయుతమై మనోహరముగా నున్నది.

## శకుంతలా పరిణయకృతిపతి—చిల్లర వెన్నయమంత్రి

ఈశకుంతలాపరిణయము నీతఁడు చిల్లరవెన్నయమంత్రి కంకితము చేసెను. కృతిపతి కౌండిన్యగోత్రుఁడు; ఆఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; తండ్రి నాగరాజు; తాత మేడనమంత్రి; ఎఱ్ఱయమంత్రి, వెన్నమంత్రి యనువారీతని పెదతండ్రులు; వెన్నయ, మేడన, ఆడెన, ఎఱ్ఱన వీరభద్రుఁడు ననువారీతనిసోదరులు. కృతిపతినివాసము సోమరాజుపల్లె. ఈగ్రామము నెల్లూరుమండలములోని బిట్రగుంటకు సమీపమున నున్నది. బిట్రగుంటయం దున్నభైరవస్వామి కృతిపతికి నిష్టదైవము భైరవస్వామిని గవి యీక్రిందిపద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. పగడంపుఁ జిగురుజొంపము సొంపు విహసింపు
కడునొప్పుఁ గుఱుచకెంజడలవాఁడు

విదియచందురుతోడ నీడుజో డాడెడు
రమణీయదంష్ట్రాంకురములవాఁడు
సీధుపానక్రీడఁ జెంగల్వపూఁజాయఁ
దొంగలించెడు కన్నుదోయివాఁడు
క్రొత్తనీలాలరంగునకు నించుక మించి
మెఱుఁగారు నల్లనిమేనివాఁడు
తే. పృథివి కవతంసమై యైనబిట్రగుంట
దానకంబుగ నవతార మైనవాఁడు
భైరవస్వామి సకలసంపదల నొసఁగి
మనుచుఁ జిల్లర వెన్నయామాత్యవరుని.

తిపతినివాస మగుసోమరాజుపల్లిని గవి యీక్రిందిపద్యములలో ప్ర
ము చేసియున్నాఁడు.

సీ. లవణాబ్ధివేలహేలాకాంచి యగుసంధ్రి
ధరణీమండలికి ముత్యాలజల్లి
సంగ్రామపార్థ రాజన్యరాజ్యశ్రీకిఁ
బెంపు మీఱిన జగజంపువెల్లి
దాతలు సముదంచితప్రసూనములుగాఁ
గామితార్థము లిచ్చు కల్పవల్లి
యఱువదినాల్గువిద్యలకు నపూర్వఘుం
టాపథం బైనపట్టనమతల్లి
తే. పంటనృపకౌస్తుభములకుఁ బాలవెల్లి
కదనజయలక్ష్మి తొలుచూలు గన్నతల్లి
విపులభుజగర్వదర్పితవిమతరాజ
రాజహృద్భల్లి సోమరాజుపల్లి.

క. ఆనగరము పైతామహ
మైననిజస్థానముగ సమంచితలక్ష్మిం
దానొంది మంత్రి మేడన
జానుగ భజియించె సప్తసంతానములన్.

పైపద్యమునందలి పంటనృపకౌస్తుభశబ్దము, ఈగ్రామము పంటరెడ్డి ప్రభువుల పరిపాలనముక్రింద నున్నట్లు సూచించుచున్నది. కృతిపతిని నాతనిపూర్వులను రాజాస్థానములయందు మంత్రులని యనేకపద్యములలో వర్ణించియున్నను, వారేభూపతులకడ మంత్రులుగ నుండిరో చెప్పకపోవుటచే, వారొకప్రభువును గొలిచియుండలేదనియు, భూస్థితి గలవారై స్వతంత్రజీవనము చేయుచు, రాజకార్యములయందుఁ బ్రభువులకుఁ దోడ్పడుచుండువారనియు నూహింపఁదగియున్నది. కృతిపతిని, దత్పూర్వులను వర్ణించినముప్పదిపద్యములలోను, జారిత్రమున కుపయోగించునంశములు లేనందున వానినివిడచి కృతిపతినివర్ణించినరెండుపద్యములనుమాత్ర మిక్రిందవ్రాయుచున్నాఁడను.

సీ. విలసితం బైనకావలి వెన్నమారాధ్య
మణిదత్త యగుశైవమంత్రశక్తి
సమధికస్ఫూర్తితో శాశ్వతైశ్వర్య
బీజం బైనశంభుపూజాఫలంబు
ప్రమథాధిపతిఁ గూర్చి భక్తితోఁ గావించు
సోమవారవ్రతసుకృతగరిమ
యన్నమాంబిక కంధరాంతరంబునఁ జాల
శోభిల్లు మంగళసూత్రలక్ష్మి
తే. సకలసౌభాగ్యములకును సాధనములుఁ
గారణంబులుఁ దగుబోధకములు గాఁగ
సచివసంఘంబులోనఁ బ్రశస్తిఁ గాంచె
విశ్వనుతకీర్తి చిల్లర వెన్నమంత్రి.

మ. వెలయం జిల్లర వెన్నయప్రభుఁడు దా వేదోక్తసంసిద్ధవే
ళలఁ బ్రాసాదపుఁబంచవర్ణమునఁ గాలగ్రీవుఁ బూజింపఁగా
నలవాటై మఱి యొండెఱుంగవు తదీయశ్రీనివాసంబునం
బలుకుం బంజరశారికాశుకములు స్పంచాక్షరీమంత్రమున్.

ఈపద్యములనుబట్టి యీవెన్నమంత్రి శివారాధనతత్పరుఁ డనియు, గావలివెన్నమారాధ్యునిచే మంత్రోపదేశము నొందినవాఁ డనియుఁ దెలియుచున్నది.

## జై మి ని భా ర త ము

ఇందుఁ గవిత్వలక్షణమును

ఉ. అల్లనవిచ్చు చెంగలువలందు రజంబను కప్పురంబుపైఁ
జల్లఁగఁ జల్లనై వలచుసౌరభముల్ వెదజల్లుభావముల్
పల్లవహస్త చన్నుఁగవ పయ్యెద జీబుగఁ దోఁచుభాతిగాఁ
బిల్లలమఱ్ఱి వీరన యభిజ్ఞుఁడు చెప్పఁగనేర్చు కబ్బముల్.

అని చెప్పియుండెను. ఆవిధముగానే యీతనికవిత్వము సౌరభములను వెదజల్లుచు నాకర్ణనీయముగా నుండును. సంస్కృతభాషలో జైమిని మహర్షి వ్యాసభారతమువలెనే యొకభారతమును రచించెనని చెప్పుదురు. కాని యీతఁడు వ్యాసశిష్యుఁ డగుజైమినికాఁడు జైమినికవి మహారాష్ట్రదేశస్థుఁ డగునొకబ్రాహ్మణుఁడై యుండునని శ్రీటేకుమళ్ల అచ్యుతరావుగా రభిప్రాయపడియున్నారు. (భారతి ప్రభవ మాఘ మాసము.) కాని యది యిప్పు డెచ్చటను లభించుటలేదు. అశ్వమేధపర్వ మొక్కటిమాత్రము ప్రచారములో నున్నది. దానినే పినవీరన యాంధ్రీకరించెను. సంస్కృతాశ్వమేధపర్వము నాకు లభింపక పోవుటచే నాంధ్రీకరణ మెట్లున్నదియుఁ జెప్పఁజాలను వ్యాసభారతాశ్వమేధపర్వము కంటె నిందుఁ బెక్కుకథ లధికముగా నున్నవి. పినవీరన కవి వయసు చెల్లినపిమ్మట ననుభవజ్ఞాన మధికమైనతరువాత రచించిన దగుటవలనఁ గాఁబోలు శకుంతలాపరిణయముకంటె జైమినీభారతరచనము ప్రౌఢమై మనోహరముగా నున్నది. లక్షణగ్రంథకర్త లీతనిగ్రంథములనుండి పెక్కుదాహరణములను గైకొని యుండుటచే నీతఁడు లాక్షణికకవులలో నెన్నఁదగినవాఁడు. ఈతనిగ్రంథములయందు వ్యాకరణ మంగీకరింపనిప్రయోగములు కొన్ని యచ్చటచ్చటఁ గానవచ్చుచున్నవి. కాని లక్షణవేత్తలు వానిని నెరసులుగాఁ బరిగణించియుండిరి.

కవిత్వముయొక్కయు. జైమినిభారతముయొక్కయుఁ బ్రశస్త్యమును గృతిపతిముఖమున నీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

ఉ. ఆదట సప్తసంతతులయందును నొక్కొకకాలమందు వి
చ్ఛేదము గల్గు నాఁటికిఁ జెప్ప విశ్వర్యయు మేయుగంబునన్

లేదు కవిత్వసంతతికి నిక్కము తత్కవితావిలాసమున్
జాతులు నిష్టదైవము ప్రసాదము నా హరికీర్తనంబునన్.

క. నా మది నిరతము భారత
రామాయణకథలఁ బ్రేమరంజిలు నందున్
జైమినిభారత మనఁగా
భూమి నపూర్వము పురాణముల గణియింపన్.

తే. ఆపురాణంబు గనఁ దెనుఁ గయ్యెనేనిఁ
జెప్ప నేర్చినకవియుఁ బ్రసిద్ధుఁ డేనిఁ
దెనుఁగు నుడికారమున మించు గనియెనేనిఁ
గుందనము కమ్మవలచినచంద మగును.

## జైమినిభారత కృతిపతి సాళువ నరసింహరాయలు

ఈజైమినిభారతమును గవి సాళువనరసింహరాజున కంకితము చేసెను. ఈనరసింహరాజు చంద్రవంశపురాజులలోనివాఁ డని చెప్పవచ్చు నాతనివంశము నీకవి యిరువదిపద్యములలో వర్ణించియున్నాఁడు. ఈసాళువవంశపురాజులతోఁ గవులచారిత్రమున మన కప్పు డప్పుడు పని యుండును కావున జైమినీభారతము ననుసరించి సాళువవంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.

### సా ళు వ వం శ వృ క్ష ము

గుండశౌరి



ఇతనిని తుళువవంశమునకు
మూలపురుషుఁడని కొంద
రనుచున్నారు. కానియది
సత్యము కాదు.)

ఇమ్మడినరసింహరాయలు పెరియతంగమ చిక్కతంగమ

ఈవంశవృక్షములోఁ గనుపఱచినసాళ్వమంగు, మహమ్మదీయులనుజ యించి సాంపరాయనికి రాజ్య మొసంగి సాంపరాయరాజ్యస్థాపనాచా ర్యబిరుదమును వహించిన ట్లీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. దురములో దక్షిణాసురతాను నెదిరించి
కొనివచ్చి సంపరాయని కిచ్చి
సామ్రాజ్యమున నిల్పి సంపరాయస్థాప
నాచార్యబిరుదవిఖ్యాతిఁ గాంచె
శ్రీరంగవిభుఁ బ్రతిష్ఠించి మర్యాదవేలు
మాడ లర్చేన్పు నమ్మడికి నొసఁగ
మధురాసురత్రాణు మడియించి పరపక్షి
సాళువబిరుదంబు జగతి నెరపె

తే. గబ్బితనమునఁ దేజిమొగంబు గట్టి
తఱిమి నగరంపుగవనులు విఱుగఁ ద్రోలి
తాను వ్రేసినగారు నుద్దవిడిఁ దెచ్చె
సాహసంబున నుప్పొంగు సాళ్వమంగు.

ఈసాళ్వమంగు తిరుమలశ్రీవెంకటేశ్వరునగోపుర విమానమునకు బంగారపుశిఖర మెత్తించి వేయించిన శిలాశాసనము తిరుమలదేవాల యముయొక్క రెండవప్రాకారమందలి లోపలిగోపురమున కుత్తరపు గోడయందు న్నది. అం దిట్లు వ్రాయఁబడియున్నది.

"స్వస్తి శ్రీ జయాభ్యుదయశకవరుషంబులు ౧౪౦౧ అగు నేంటి వికారిసంవచర ఆషాడశుద్ధదశమిమందవారాన స్వస్తి శ్రీ మన్మహామం డలేశ్వర మీసరగండ మంగిదేవమహారాజులు తిరుమలదేవర శుభ[illegible] దినగగు సువర్ణాదిశిఖరమును ఎత్తించెను. మంగళమహా శ్రీశ్రీశ్రీ" దీనిని

బట్టి యీసాళ్వమంగు క్రీ. శ. ౧౩౫౯ సంవత్సరప్రాంతము నందుండి నట్లు స్పష్టము.

కృతిపతికిఁ దండ్రి యైనగుండరాజును బినతండ్రి యైనసాళ్వతిప్ప రాజును నీక్రిందిపద్యములలోఁ గవి వర్ణించియున్నాఁడు.

ఉ. వీరలలోన నగ్రజుఁడు విక్రమకేసరి గుండధారుణీ
ధారుఁ డుదారుఁ డాతనిప్రతాపము దిక్కులఁ బిక్కటిల్లు దు
ర్వారవిరోధివీరనగరంబులకున్ హరుకంటిమంట లై
వైరినృపాలసైన్యవనవాటికి దావకృశానుపంటలై.

సీ. అమితవైభవముచే నసమానవైభవ
కుశలాయుధుల నద్రిగుహాల కనిచె
దోఃప్రతాపంబుచేఁ దులితప్రతాపదా
వానిలాప్తుల నరణ్యములఁ ద్రోచె
వినుతధైర్యంబుచే విఖ్యాతధైర్యమం
ధానాద్రులను సముద్రముల ముంచె
ఘనకీర్తిచే సముత్కటకీర్తిచంద్రులఁ
గడకొండ యవలిచీఁకట్లఁ గలిపె

తే. వీర మీసరగండ కటారి సాళ్వ
పంచఘంటా నినాదాదిభయదబిరుద
కాహళారావసంపాతకంపితారి
దీప్తబలసీరి సాళువతిప్పశౌరి.

ఈసాళువతిప్పరాజు, కర్ణాటరాజ్యప్రభువును సంగమవంశజుఁడు నైన రెండవ దేవరాయసహోదరి హరియమ్మను బరిణయ మాడెనని చరిత్రకారులు వ్రాసియున్నారు.

పైయుత్పలమాలలో వర్ణితుఁడైనగుండరాజే జైమినిభారతకృతి పతి యైననరసింహరాయలకుఁ దండ్రి. తండ్రిపేరుతోఁ గూడఁ జేర్చి యీతనిని సాళువగుండనరసింహరాయ లందురు.

## సాళువనరసింహరాయలు

ఈసాళువవంశపురాజులు కర్ణాటప్రభువులైనసంగమరాజులయొద్ద దండనాథులై యుండెడివారు. ఈనరసింహరాయలనుగూర్చి కొమఱ్ఱాజు లక్ష్మణరావుపంతులుగారు మహమ్మదీయమహాయుగమున వ్రాసినమాటల నిట నుదాహరించెదను.

"ఈసాళ్వమంగరాజు పుత్త్రుఁడు గౌతరాజు; అతనిపుత్త్రుఁడు గుండరాజు. ఇతఁడు ద్వితీయహరిహరరాయలయొద్ద మంత్రిగను దండనాయకుఁడుగను నుండెను. అతనికుమారు లిద్దఱు. తిమ్మరాజు, నరసింహరాజు. ఈనరసింహరాజే ప్రస్తుతకథానాయకుఁడు. ఇతనితండ్రి యగు గుండమరాజు విజయనగరరాజునొద్ద దండనాయకుఁడుగా నుండి కొంత రాజ్యము సంపాదించెను. సాళువనరసింహరాజు విజయనగరరాజ్యము యొక్క తూర్పుభాగమునకంతటికిని అధిపతిగానుండి యనేకయుద్ధములలోఁ దనపరాక్రమముఁ జూపి సర్వజనులచే నాయకుఁడుగాఁ బరిగణింపఁబడుచుండెను. విరూపాక్షరాజశేఖరరాయలకాలములో నితఁడు ప్రబలెను. విరూపాక్షరాయలప్రభుత్వకాలములో నుత్కలదేశాధీశుఁ డగు పురుషోత్తమదేవగజపతి విజయనగరముమీఁదికి దండెత్తిరాఁగా, ఈ నరసింహరాజు వాని నోడించెను. ఇట్లీతనిబలము దినదినాభివృద్ధిఁ జెందుకాలములో విజయనగరరాజులు విషయలంపటులై తమబలమును గౌరవమును పోఁగొట్టుకొనుచుండిరి. కడపటిరాజగువిరూపాక్షరాయల యెడఁ బ్రజలందఱికిని ద్వేషము కలిగెను శత్రువులను జయింపలేనట్టియుఁ, బ్రజల రంజింపలేనట్టియు రాజును బదభ్రష్టునిఁ జేయుటయే మంచిదని తలఁచి, సాళువ నరసింహరాజు, రాజుయొక్క దుశ్చేష్టితములు ప్రజలకుఁ దెలిపియు, దండనాయకుల కెల్లరకు బహుమతు లొసఁగియు నందఱిని వశపఱచుకొని, విషయానందములో నిమగ్నుఁడైయున్న రాజును పట్టుకొనుటకుఁ దనసేనానాయకుని ముంనుపంపెను. ఈవార్త రాజునకుఁ దెలిసినను, ఆవిషయాంధుఁడు దానిని నమ్మక వర్తమానము తెచ్చినవానినే చంపించెను. సాళువ నరసింహరాజుయొక్క సేనాని వచ్చి కోట నాక్రమించుకొని, తన్నెదిరించువారెవ్వరును లేక లోనఁ

ప్రవేశించెను. అప్పు డా రాజు మేల్కని తనకు సహాయముచేయువా రెవ్వరును లేరని చూచి, దిడ్డిత్రోవను బాఱిపోయెను. సాళువనరసింహా రాజు రాజ్యారూఢుఁడై విజయనగరసామ్రాజ్యమునకుఁ బ్రభు వయ్యెను. ఈరాజు పరాక్రమశాలియగుటచే నంతకుఁ బూర్వ మన్యరాజులచే నాక్రమింపఁబడిన దేశమంతయుఁ దిరిగి సంపాదించెను. కాని యంత్య కాలము సమీపించుటచే ఉదయగిరి, రాయచూరు, కొండవీడు అను మూఁడు దుర్గములనుమాత్రము సాధింపలేక పోయెను అందుచే నతఁడు మరణసమయమున నీ దుర్గములను మీరు తప్పక సాధింప వలయునని తన మంత్రి కాజ్ఞాపించెను. ఈ రాజు న్యాయప్రవర్తనము కలవాఁడై ప్రజలను బుత్రులవలె రక్షించుచు, విద్వాంసులను మిగుల గౌరవించుచు నుత్తమప్రభు వని వన్నెకెక్కెను. ఈసాళువవారు తెలుఁగువారుగాఁ గానవచ్చుచున్నారు. ఎందుకనఁగా వీరికిఁ బూర్వపురాజులు కన్నడపువారయినను, ఈ వంశపువారు రాజ్యారూఢు లయినప్పటి నుండియుఁ దెలుఁగువారికి మంత్రిత్వ మొసఁగుటయుఁ దెలుఁగుకవులకు నాశ్రయ మిచ్చుటయుఁ దటస్థించెను. సాళువ నరసింహరాజు నొద్ద నాదెళ్ల చిట్టి గంగనామాత్యుఁడను నియోగిబ్రాహ్మణుఁడు మంత్రిగా నుండెను. ఈతని కాలమునఁ బిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడను విఖ్యాతకవి యీతని యాస్థానకవిగా నుండి జైమినీభారత మను గ్రంథమును రచించి యీతని కంకిత మిచ్చెను. ఈరాజు ౧౪౯౦ వ సంవత్సరము లోనో, ఆప్రాంతముననో మరణమొందెను."

పైనివ్రాసినచారిత్రకవిషయములు క్లుప్తముగాఁ బినవీరనకవి రచించినయీక్రిందిపద్యములవలనఁ గూడఁ దెలియవచ్చుచున్నవి.

సీ. హతరిపుక్షత్రియుండయ్యు సామ్రాజ్యంబు
గరిమఁ జేయని నాఁటికడమ యొకటి
యోగీంద్రవంద్యుఁడయ్యును సుగ్రీవుని
నోలగించిననాఁటి యొచ్చె మొకటి
భువనైకవీరుఁడయ్యును విభాకరతనూజు
తాఁపుఁ గోరిన నాఁటితక్కు వొకటి

యాదిలక్ష్మీనాథుఁడయ్యెను బలిదైత్యు
నణఁగఁబోయిన నాఁటిదైన్య మొకటి
తే. తలఁచి మూర్ధాభిషిక్తుఁడై ధరణిపతులు
గొల్వ నసహాయశూరత వెలసి దాన
శక్తి నవతార మెత్తిన శౌరిగాక
క్షితిపమాత్రుండె సాళ్వనృసింహవిభుఁడు.

సీ. తిగుళభూములు తెంకులుగఁ జరించినదొడ్డ
జెవ్వులపోతులనెల్లఁ జెండినేచి
ఘనమైన కండకొవ్వునఁ బాఱు తెంచిన
యొడ్డని పెనులావు లూడఁదన్ని
పఱతెంచి చక్కఁగఁ బాలదుర్గము మెట్టి
సుడివడ్డచామలఁ జుట్టుముట్టి
పెనుగొండకడ వ్రాలి పిక్కటిల్లు మొదలైన
ప్రతిపక్షులను హతాహతము చేసి
తే. సత్కవుల తుష్టి దులుచు వసంతవేళ
రాయమీసరగండ ధరావరాహ
విజయవిఖ్యాత గుండభూవిభు నృసింహ
సార్వభౌముని బిరుదైన సాళువంబు.

మ. ప్రతివారంబును నారసింహధరణీపాలుండు భూమీసుర
ప్రతతిం గామితవస్తుసంపదల సంభావించుచోఁ దత్కరో
ద్గతదానాంబుసరిత్తటీతృణసుఖోదంచన్మృగీలోచన
ద్యుతు లిందీవరదామసంపదలఁ జేయున్ దిక్పతిస్త్రీలకున్.

మ. కనకాద్రిప్రతిమానధైర్య! జగదేకస్తుత్యసౌభాగ్య! మో
హనలీలానవపంచబాణ! నిజబాహాశౌర్యవీరావిరా
జినయోపాయవిహార! బోనగిరి, చెంచీకోమ్మ, ధారాపురీ
పెనుగొండాద్యఖిలైకదుర్గహరణ ప్రేంఖత్ప్రతాపోదయా!

ఈ పద్యములను నాశ్వాసాద్యంతపద్యములనుబట్టిచూచినఁ గృతి
పతి యైననరసింహరాయలు దండనాయకుఁడుగా నున్నప్పుడుగాక, విజ

యనగరరాజ్యసింహాసనము నధిష్ఠించి మూర్ధాభిషిక్తుఁడై సార్వభౌముఁ డనిపించుకొనినపిమ్మటనే జైమినిభారతము గృతినందినట్లు కన్పట్టుచున్నది. ఈనరసింహరాయలు క్రీ. శ. 1487 లో విజయనగరరాజ్యమును సంపాదించె నని యీక్రిందిపంక్తులలో లక్ష్మణరావుపంతులుగారు వ్రాసియున్నారు.

"విషయాసక్తుఁ డగువిరూపాక్షరాయనిని అతనిపెద్దకుమారుఁ డగురాజశేఖరరాయలు చంపించెను (౧౪౭౮) ఇతనిని ఈతనితమ్ముఁ డగు రెండవవిరూపాక్షరాలు చంపించెను. కాని యీభ్రాతృహంతకుని పరిపాలన ప్రజల కిష్టమైనది కాదు. అతనిదండనాయకుఁ డగుసాళువనరసింహరాజు సర్వజనులు తనకు ననుకూలురుకాఁగా రాజును వెడలఁ గొట్టి రాజ్యమును ఆక్రమించుకొనెను (౧౪౮౭)

కవి కాల ము

ఈనరసింహరాయలు శ్రీతిరుమలవెంకటేశ్వరస్వామిభక్తుఁ డైనట్లును, ఆస్వామియనుగ్రహమువలననే యీతనిరాజ్య మభివృద్ధి నొందినట్లును గవి పంచమాశ్వాసాదిపద్యములోఁ దెలిపియున్నాఁడు.

క. శ్రీవేంకటాద్రినాథ ద
యావర్ధితరాజ్య సన్నతార్థిజనమహీ
దేవాగ వైరినృపరా
జీవనికరచంద్ర నారసింహనరేంద్రా!

ఈనరసింహరాయలు శ్రీవేంకటేశ్వరస్వామికి మూపాడుపేట, మంగోడు, వెలడ ఆలిపురము నను గ్రామములను, మరికొంతద్రవ్యమును సమర్పించి, శిలాశాసనములను వేయించియున్నాఁడు. ఆశాసనములను గ్రంథవిస్తరభీతిచే నిందు వ్రాయలేదు ఆశాసనములు క్రీ. శ. 1456, 1467, 1468 (2) 1473, 1485 సంవత్సరములలోనివి. ఇందు మొదటిదైన శాసనములలోను నరసింహరాయలప్రశస్తి. "శ్రీమన్మహామండలేశ్వర మేదినీమీసరగండ కఠారిసాళ్వ సాళువగుండయ దేవమహారాజుతనయుఁ డైననరసింహదేవరమహారాజు" అనియున్నది. 1485 సంవత్సరపుశాసనములో "వీరగుండక్షితిపతికుమారు లగుశ్రీమన్

సార్వభౌమనరసింహరాయ"లనియున్నది. దీనినిబట్టి 1485 వ సంవత్సరమునాఁటికే నరసింహరాయలు విజయనగరమహారాజ్యపట్టభద్రుఁడయ్యెనని తెలియుచున్నది. కావునఁ బినవీరనకవి, జైమినీభారతమును క్రీ. శ. 1485 సంవత్సరమునకు బిమ్మటను 1490 వ సంవత్సరమునకుఁ బూర్వమునను రచియించె ననిస్పష్ట మగుచున్నది. సార్వభౌమ మండలేశ్వరపదముల కంతగా భేదము లేదనియు నీరెండును సమానార్థమునందే శాసనములలో వాడఁబడియెననియు నందుచే దీనినిబట్టి జైమినిభారత రచనాకాలమును నిర్ణయింపరాదనియుఁ గొందఱనుచున్నారు కానియీతనివిషయమున నీభేదము పరిగణింపఁదగినదియే యని నాయభిప్రాయము.

నాకుఁ దెలిసినంతవఱకు నీకవిరచనములలో నిదియే కడపటిది. కావున నప్పటి కీతని కేఁబది యఱువదిసంవత్సరము లుండియుండవచ్చును. అందుచేత నీతనిగ్రంథరచనాకాలము పదునైదవశతాబ్దియం దుత్తరార్థమై యుండునని నిశ్చయముగాఁ జెప్పవచ్చును,

శ్రీనాథమహాకవి నైషధమునాంధ్రీకరించి పినవీరనకవికిఁ జూపించినట్లును, అందలి "గమికర్మీకృతనైకనీవృతః" అనువాక్యము నెట్లాంధ్రీకరించితివని యడిగి "గమికర్మీకృతనైకనీవృతుఁడనై" యని చేసిన తెలిఁగింపును విని యాక్షేపణ మొనర్చినట్లును నొకకథ ప్రచారములో నున్నది. ఇది కేవలము కల్పితము. నైషధాంధ్రీకరణము పూర్తియైన కొన్నిసంవత్సరములకుఁ బిమ్మటఁగాని పినవీరనకవి జన్మింపలేదు.

## క వి ని వా స ము

ఈతనినివాసస్థానమును గూర్చి మనకు లభించిన రెండుగ్రంథములలోను గవియేమియుఁ జెప్పియుండలేదు. గృహనామమును బట్టి నైజాం రాష్ట్రమునందలి పిల్లలమఱ్ఱియును, శకుంతలాపరిణయమునుబట్టి నెల్లూరు మండలమునందలి బిట్రగుంట పరిసరముననున్న సోమరాజుపల్లెయునుఁ జైమినీభారతమునుబట్టి కర్ణాటరాజులకురాజధానీనగరమైన విజయనగరమును, నీకవినివాస మని నిర్ణయించుటకుఁ దగినప్రదేశములు.

దాతలనాశ్రయించుసుకవులయొక్కయు, మధురసాస్వాదన మొనర్చు పుష్పంధయములయొక్కయుఁ దెంకిపట్టులను గనిపెట్టుట సుకర

మగు కార్యము కాదు. ఈకవినివాసము సోమరాజుపల్లెయో తత్పరిసర గ్రామమో యైయుండునని శకుంతలాపరిణయపీఠికలో సరస్వతీపత్రికాధిపతులు వ్రాసియున్నారు. వా రట్లువ్రాయుటకుఁ గారణము, శకుంతలాపరిణయకృతిపతి నివాస మాగ్రామమై యుండుటయు నాగ్రంథమునం దాగ్రామమును గవి విశేషముగా వర్ణించుటయు నై యుండును కాని యంతమాత్రమునఁ గవినివాస మాయూరని నిశ్చయింపవలను పడదు.

ఈకవితండ్రి యైనగాదయామాత్యునినివాసము పిల్లలమఱ్ఱియను గ్రామమని, యావంశీయుఁడ ననిచెప్పుకొను పెనుమళ్లసోమయామాత్యుఁడు తనసీమంతినీపరిణయమందలి యీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు. ఇది సత్యమయ్యేనేని, పినవీరనజన్మస్థానము పిల్లలమఱ్ఱి యనుటకు సందియము లేదు.

సీ. కవివర్ణనీయుఁ డాగాదిరాజు వివేక
ఘనుఁడు పిల్లలమఱ్ఱి యనుపురమున
నధివసించుటఁ జేసి యావేర విఖ్యాత
మై ప్రకాశించె నయ్యన్వయంబు
మహనీయకీర్తి నమ్మంత్రిశేఖరుఁ డంతఁ
దనధర్మసతియందుఁ దగినయట్టి
సంతతి లే దన్నచింతాభరము పూని
యతిధైర్యసంపన్నుఁ డౌటకతన
శివునిఁగూర్చి తపంబు నేఁ జేసి పుత్ర
రత్నములఁ గాంతు నన్నట్టియత్నము గని
యాత్మగృహమున నన్నదానాదికార్య
భరము సోదరవర్గము పాలనునిచి.

పినవీరనకవియగ్రజుఁ డైనపెదవీరభద్రుఁడు కర్ణాటదేశమునకేఁగి డెబ్బదిరెండువేలసామంతుల కధికారియై రాయలవద్ద నున్న ట్లీక్రింది పద్యములలో సోమయామాత్యుఁడు చెప్పియున్నాఁడు.

సీ. అతిలాలితాకారు లాకుమారులు పెద
వీరభద్రుఁడు పినవీరభద్రుఁ
డన్ననామములచే నధికప్రసిద్ధులై
యభివృద్ధిఁ గాంచి రనంతరమునఁ
బెదవీరభద్రుఁడు పృథ్వీధినుతకార్య
దక్షుఁడై కర్ణాటధరణి కరిగి
వాసిగా రాయసింహాసనమున నుండి
యధికులౌ రాయచాయాదులకును

మఱియు డెబ్బదివేలసామంతులకును
దానె యధికారియై మహాస్థానులందు
సకలమంత్రివరేణ్యులు సన్నుతింప
భూనుతం బైనకీర్తివిస్ఫూర్తిఁ గనియె.

దీనినిబట్టిచూచినను, పినవీరనకవినివాసము సోమరాజుపల్లియని స్థిరపడదు. శకుంతలాపరిణయరచనాకాలమున నెల్లూరుమండలమునందు పంటరెడ్డిప్రభువులు కవుల నాదరించుచుండుట నెఱింగి పినవీరభద్రకవి శకుంతలాపరిణయమును వారికిఁ గృతియీయఁదలంచి యచ్చటికి వచ్చి, నియోగిబ్రాహ్మణప్రభు వైనవెన్నమంత్రి తన్నాదరించుటచేఁ దాత్కాలికముగఁ గొంతకాలము సోమరాజుపల్లి యందు డిన నుండి యుండును. పిమ్మటఁ గర్ణాటకమునకు వచ్చి జైమినిభారతమును రచించి సాళువనరసింహభూపతికిఁ గృతి నొసంగియుండును. ఈతని యన్నయైనపెదవీరన, యేకర్ణాటరాయలయొద్ద దండనాయకుడుగ నుండెనో తెలిసికొనుటకుఁ దగినయాధారములు దొరకలేదు. కర్ణాటమును బాలించినసంగమవంశజు లగువిరూపాక్షరాయాదులయొద్ద నుండిన నుండవచ్చును. లేదా యీసాళువనరసింహరాయలయొద్ద నుండిన నుండవచ్చును.

## కవిప్రభావమును దెలుపు కథలు

ఈకవిప్రభావమును సూచించుకథ లనేకములు కలవు. కాని యందు రెండువిశేషప్రచారములో నున్నవి. ఈకవియన్నగా రైనపెద

వీరభద్రుఁడు జపముచేసికొనుచు నేకాగ్రచిత్తము లేనివాఁడై యప్పుడే తనభార్యకు నగలుచేయించువిషయము మనసునకు రాఁగా నందును గూర్చి యాలోచించుచుండె ననియు, నింతలో నెవరో పెద్దమనుష్యుఁ డొకఁడు వచ్చి పినవీరన్నను "మీయన్నగా రేమి చేయుచున్నా' రని ప్రశ్నింప నాతఁడు జపము చేసికొనుచున్నాఁ డని చెప్పుటకు మాఱుగా మాయొదినెగారికి నగలుచేయించుట కాలోచించుచున్నా రని ప్రత్యుత్తర మొసంగె ననియుఁ జెప్పెదరు.

సాళువనరసింహరాయలు జైమినీభారతమును రచించుటకుఁ గొంత కాలము గడు వొసంగె ననియు, నాకాలములోఁ బినవీరన గ్రంథరచనమునకై ప్రయత్నింపక విలాసముగాఁ గాలము గడుపుచుండె ననియు, నన్నగారు గడువు సమీపించుచున్నదని చెప్పినను లక్ష్యముచేయక కాలమును వ్యర్థముగాఁ గడపి, తేపటిదినమున గ్రంథమును సమర్పింపవలసినదినము కాఁగా నారాత్రి తనగది నలికించి ముగ్గు లేర్పరిపించి యావునేతితో దీపమును బెట్టిసరస్వతిని బ్రార్థించెననియు, నామె ప్రత్యక్షమై శతఘంటములతో గ్రంథమును రచించు చుండెననియు, బ్రాహ్మణసంతర్పణమున నొక్కసారిగాఁ బూరీలు నములునప్పుడు కలుగునట్లున్న యాధ్వనినివిని యిది యేమియో యని పెదవీరభద్రుఁడు తలుపుసందునుండి చూడఁగా బావగారు వచ్చిరని చెప్పుచు సరస్వతి యదృశ్య యయ్యెననియు, నామె వ్రాయఁగా మిగిలిన స్వల్పభాగమును బినవీరన పూరించి మఱునాఁడు రాజసభకుఁ గొంపోయె ననియు గ్రంథరచనావిషయమున మాటపై మాటరాఁగా "వాణినారాణి" కాదా యని పినవీరన పలికినవాక్యములకు రాజును సభ్యులును గోపింప, సభలోఁ దెర వేయించిరేని వాణియే మీకుఁ బ్రత్యుత్తర మిచ్చు నని కవి యనియె ననియు రా జట్లుచేయింప సరస్వతి తనస్వర్ణకంకణహస్తమును దెరపైఁ జూపి "ఔను. ఔను"అని చెప్పెననియు నొకకథ పూర్వము నుండియుఁ జెప్పుకొనుచున్నారు. పినవీరనకవి భారతీమంత్రోపాసకుఁ డనియు, నాశుధారగా కవిత చెప్పఁగలవాఁడనియుఁ దెల్పుట కీకథ నెవ్వరో కల్పించియుందురు. పినవీరనకవి భారతీమంత్రోపాసకుఁ డని జైమినీభారతమందలి యీక్రిందిపద్యము తెలుపుచున్నది.

సీ. ప్రణవపీఠమున మంత్రపరంపరలు గొల్వ
నుండు నేదేవి పేరోలగంబు.
బావజ్ఞులకుఁ బరాపశ్యంతి మధ్యమా
వైఖరు లేదేవి వర్ణసరణి
జపహారకీరపుస్తక విపంచిసముంచి
తంబు లేదేవి హస్తాంబుజములు
కుందేందుమందారకందళీబృందంబు
చంద మేదేవి యానందమూర్తి

తే. కాంచె నేదేవి కాంచనగర్భచతుర
పూర్వదంతకవాటవిస్ఫుటమనోజ్ఞ
చంద్రకాంతశిరోగృహస్థలవిహార
మమ్మహాదేవి వాగ్దేవి నభినుతింతు.

## ఈకవి యేశాఖాబ్రాహ్మణుఁడు ?

ఈపినవీరనమహాకవి బ్రాహ్మణుఁడు. ఏశాఖీయుఁడు ? ఏగోత్రమువాఁడు? అనువిషయములలోఁ బండితులు భిన్నభిప్రాయులై యున్నారు. కవిత్వవిషయమున నసమానప్రజ్ఞ గలవాఁడనియుఁ గవిత్రయమువారితోఁ దుల్యుఁ డనియు నాతనిరచనములే చాటుచున్నవి. ఆతఁడేశాఖవాఁడైనను, ఏగోత్రమువాఁడైనను, గవిత్వగౌరవమునకుఁ గొఱంతరానేరదు. అయినను శాఖాగోత్రములవిషయమున మూకీభావమువహించుటకంటెఁ దెలిసినంతవఱకు నన్నివిషయములఁ బాఠకులయెదుటనుంచుట చరిత్రకారులపని కావున నాసంగతుల నిటఁ దెల్పి నిర్ణయముబాఠకలోకమునకు విడచుచున్నాఁడను

ఈకవి తనసోదరునిగూర్చిగాని, తండ్రినిగూర్చిగాని, తనపూర్వులనుగురించిగాని, మనకు లభించిన రెండుగ్రంథములయందుఁ బ్రత్యేకముగ నేమియుఁ జెప్పియుండలేదు. ఈతని యితరరచనము లీగ్రంథములకంటెఁ బూర్వరచనములు గనుక ప్రథమరచనలయం దేమయినఁ జెప్పియుండెనేమో తెలియదు. అట్టిరచనలు లభించియున్నయెడల నీయభిప్రాయభేదమున కవకాశమే యుండకపోవును. ఈతనిగద్యలలో "గాదె

యామాత్యపుత్ర" అనిమాత్రము వ్రాసికొనియున్నాఁడు. జైమినిభారతమందలిగద్య నీక్రింద వ్రాయుచున్నాఁడను.

"ఇది శ్రీభారతీతీర్థ శ్రీచరణకరుణాపాత్ర గాదెయామాత్యపుత్త్ర వినయవిద్యాసముద్ర పినవీరభద్రప్రణీతం బైనజైమినీభారతము" శకుంతలాపరిణయగద్యమునందు "వినయవిద్యాసముద్ర" యనుటకుబదులుగా "ఆరాధితామరవీరభద్ర" అనియున్నది. తక్కినదంతయు సమానము.

"అమాత్య" "మంత్రి" శబ్దములు నియోగబ్రాహ్మణసూచకముగా గ్రంథములయం దుపయోగించుచుండుట సర్వసామాన్యవిషయము ఆపదవులను వహింపనివారికిఁగూడ నాపదముల నుపయోగించుట యనేకగ్రంథములలోఁ గాననగును. అందులకు శకుంతలాపరిణయమే యొకనిదర్శనము. అమాత్యమంత్రిశబ్దములకు వ్యుత్పత్త్యర్థమేమి? ధర్మశాస్త్రములయందును రాజనీతిగ్రంథములయందును, నాశబ్దవాచ్యుఁ డెట్టివాఁడుగా నిర్ణయింపఁబడియున్నది ? యనువిమర్శనముతో మనకిటఁ బ్రసక్తి లేదు. ఈశబ్దములు నియోగిబ్రాహ్మణపరమున రూఢిమైయున్నట్లు బహుగ్రంథములవలనఁ దెలియుచున్నది. కావున నాయర్థమునే గ్రహించి విమర్శన మొనర్పవలసియున్నది. సామాన్యముగా వైదికబ్రాహ్మణులకుఁ బూజ్యార్థద్యోతకములగు "ఆర్య""భట్ట" శబ్దములను గ్రంథములయందు వాడుచుందురు. నియోగబ్రాహ్మణ కవులలోఁ గొందఱికి "ఆర్య" "భట్ట" శబ్దము లుపయోగించినట్లు శ్రీనాథభట్టాదులవలనఁ దెలియవచ్చుచున్నది. కాని "అమాత్య" "మంత్రి" శబ్దము లుపయోగించినవైదికకవులు గానరారు. ఎక్కడనైన నొకరిద్దఱున్నను నది సామాన్యవిధి కాదు నియోగబ్రాహ్మణులలో నామాంతమున "రాజు" అనిచేర్చుట గన్పట్టును కాని వైదికబ్రాహ్మణులలో నట్టియాచారము గాన్పింపదు.

గాదెయామాత్యపుత్త్రుఁడ నని గద్యలో వ్రాసికొనియుండుటచే నీతఁడు నియోగిబ్రాహ్మణుఁ డని నిశ్చయింపవలసియున్నది.

ఇచ్చట సామాన్యవిధిని విడచి ప్రత్యేకవిధి నన్వయింపఁజేయవలయు ననినచో గాదెయ వైదిక బ్రాహ్మణుఁడై మంత్రిపదవి నధిష్టించి నట్లుచూపవలసియుండును. తనతండ్రియు, దాతయుఁ గవులనిమాత్రమే

పినవీరన యీ క్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు. కాని మంత్రిత్వపదవి వహించినట్లు చెప్పియుండలేదు.

క. తాతయుఁ దండ్రియు నగ్ర
భ్రాతయునుం దాను భువనభాసురకృతిని
ర్మాతలు పిల్లలమఱ్ఱివి
ఖ్యాతునిఁ బినవీరుఁ బోలఁగలరే సుకవుల్.

గాదెయ మంత్రిత్వమును వహించె నని చెప్పుటకుఁ దగిన యాధారములు గన్పట్టుటలేదు.

పినవీరనకవికి సమకాలికుఁడో, యించుకతరువాతివాఁడో యైన కొఱవిగోపరాజు పూర్వకవులను స్తుతించుటలో నియోగిబ్రాహ్మణకవులను మాత్రమే వర్ణించిన యీ క్రిందపద్యములోఁ బిల్లలమఱ్ఱి పినవీరన్నను గూడఁ జేర్చియున్నాఁడు.

చ. అనఘు హుళక్కిభాస్కరు మహామతిఁ బిల్లలమఱ్ఱి వీరరా
జును ఘను నాగరాజుఁ గవిసోమునిఁ దిక్కనసోమయాజిఁ గే
తనకవి రంగనాథు నుచితజ్ఞుని నెజ్జని నాచిరాజుసో
మన నమరేశ్వరుం దలఁతు మత్కులచంద్రుల సత్కవీంద్రులన్.

ఈపద్యమునుబట్టిచూచినను నీకవి నియోగిబ్రాహ్మణుఁ డనియే తేలుచున్నది. పినవీరనకవికిఁ దరువాత నూఱుసంవత్సరములలో నున్న ముద్దరాజు రామన్న రాఘవపాండవీయమునకు వ్యాఖ్యానమువ్రాయుచు ప్రథమమిాఁదిక చటతపలకు గసడదవ లాదేశ మగునన్నసూత్రము ప్రాసస్థానమున నిత్యముగాని తదితరస్థలములయందు వైకల్పికమని దెలుపుటకుదాహరణముగఁ బినవీరన విరచితమైన శకుంతలాపరిణయమునందలి పద్యము నిచ్చుచు "పిల్లలమఱ్ఱి పినవీరమరాజుగారున్ను" అనివ్రాసియున్నాఁడు. దీనినిబట్టిచూచినను జిరకాలమునుండి యీకవి నియోగిబ్రాహ్మణుఁడుగనే పరిగణింపఁబడుచుండె నని తెలియుచున్నది.

పినవీరనవంశము లోనివాఁడ నని చెప్పుకొనిన పెనుమళ్ల సోమయామాత్యుఁడు తనసీమంతినీపరిణయములోఁ బినవీరనతండ్రిని "గాదిరాజు" అని వ్రాసియున్నపద్యమును బైనివ్రాసియున్నాఁడను. మధ్య

నొకటిరెండుపురుషాంతరముల పేరులు తెలియక విడచిపెట్టినను, సోమయామాత్యుఁడు గాదిరాజు మొదలుకొని తాను తుదగాఁ గల వంశమును పేరులతోఁగూడ వర్ణించియున్నాఁడు. పాఠకులకు సుబోధకమగునట్లా వంశవృక్షము నీక్రిందనిచ్చితిని.

గాదిరాజు=నాగమాంబ(భరద్వాజగోత్రుఁడు)




పెదబసవయ్య చినబసవయ్య ఉమ్మన్న= తిమన్న
భావమ్మ
నరసన్న=వెంకాయమ్మ

గాదిరాజునకు సంతానము కలుగకపోఁగా నాతఁడు శివునారాధించి తనయులం గాంచెదనని శ్రీశైలసమీపారణ్యమునకుఁ బోయి కలబందపలుకులం దినుచు నుగ్రతపంబు సేసియుఁ గార్యంబు గానక నంతకంటె నిబిడారణ్యమున వేయిసంవత్సరములనుండి తపంబు చేసికొనుచున్నయొకసిద్ధుని నాశ్రయించి మంత్రోపదేశమునొంది బిల్వపత్రమాత్రాహారియై యామహామంత్రమును బునశ్చరణసేయుచు వీరభద్రేశ్వరునారాధించి యాదేవునితోఁ బోరాడి సంతానవరముఁ బడసి తదంశచే

నిరువురుగవలలగు పుత్రులం గనియెను వారే పెదవీరన, పినవీరననామ ధేయులు. పినవీరన వీరభద్రావతారమగుటకు నిదర్శనముగ జనియించు సమయముననే జడధరియించి పుట్టెనఁట! తరువాత వీరిరువురకు సోదరిగ్నె భద్రకాళియంశమున నొక యాఁడశిశువుఁ గలిగెనఁట. ఈయంశములను దాదాపుగ ముప్పదిపద్యములలోఁ గవి చెప్పియున్నాఁడు. గ్రంథవిస్తరభయమున నాపద్యముల నిం దీయలేదు. పినవీరన కేడెనిమిదితరములలోనివాఁ డగుసోమయామాత్యుఁడు చెప్పినమాటలను విశ్వసింప కుండుటకుఁ గారణముగపడదు.

పైనివ్రాసినవిషయములను బట్టి పినవీరనకవి నియోగిశాఖాబ్రాహ్మణుఁ డని స్పష్టమగుచుండగాఁ గొందఱీతనిని వైదికశాఖాబ్రాహ్మణుఁడని వాదించుచున్నారు వారివాదమున కాధారములు రెండు. మొదటిది పినవీరనకవి జైమినిభారతమునఁ బూర్వకవులను నుతించుచు వ్రాసిన:—

మ. కవులం బంకజగర్భసన్నిభుల వర్ణింతు వల్మీకసం
భవుఁ వ్యాసుని గాళిదాసు బిలహూన్ బాణున్ మయూరున్ శుకున్
భవభూతిన్ శివభద్రు మల్హణుని ఘంటామాఘునిం జోరు భా
రవి మానన్నయభట్టుఁ దిక్కకవి నేఱాప్రెగ్గడన్ సోమునిన్.

అనుపద్యములో నన్నయభట్టును 'మా' నన్నయభట్టు అని చెప్పుట. రెండవది శృంగారశాకుంతలమున;—

క. ఆసుకవిచేత శివభజ
నాసక్తునిచేతఁ గశ్యపాన్వయుచేతన్
భాసురసుకవితాల
శ్రీసదనునిచేత వలయుఁ గృతి చెప్పింపన్.

అనుపద్యములోఁ గవి తాను కశ్యపగోత్రుఁడ నని చెప్పుకొనుట.

## ఈ కవి గోత్ర మేమి?

పిల్లలమఱ్ఱి యనుగృహనామము గలవారు వైదికబ్రాహ్మణుల లోను నియోగిబ్రాహ్మణులలోను గూడఁ గలరు. వైదికపిల్లలమఱ్ఱివారు కాశ్యపగోత్రులు. నియోగిపిల్లలమఱ్ఱివారు భారద్వాజగోత్రులు.

నన్నయభట్టుశబ్దమునకు, బూర్వ మందున్న 'మా' యనునక్షరము, పినవీరనను వైదికబ్రాహ్మణుఁ డనుటకు దగినంత సాక్ష్యము కాజాలదు. నన్నయభట్టు వైదికబ్రాహ్మణుడనుట నిర్వివాదాంశమైనప్పుడిది కొంతవఱ కైననుపయోగించునేమో కాని, యదియును వివాదాంశమైనప్పు డీవాదమువలన నుపయోగ ముండదు. ఇతరసాక్ష్యము వలనఁ బినవీరన నియోగిబ్రాహ్మణుఁ డనినిర్ధారణ మయ్యెనేనియప్పుడు నన్నయకూడ నియోగి కావలసివచ్చును. నన్నయను బ్రత్యేకముగా నుతించినశకుంతలాపరిణయములోని యీక్రిందిపద్యములో 'మా' యనునక్షరముగాని, ఆయర్థమును సూచించుమఱియొకయక్షరము గాని పదము గాని లేదు. అందుచే నన్నయయుఁ, దానును నేకశాఖకుఁ జెందినవారమనిసూచించుటకై పినవీరనకవి పైపద్యములోని 'మా' యనునక్షరము నుపయోగింపలేదని యెఱుంగవలయును.

క. ఇట్టుల మగుమతి భారత
ఘట్టమునకు నడవ యచ్చుఁ గట్టినకవితా
పట్టాభిషిక్తు నన్నయ
భట్టోపాధ్యాయుఁ దలఁచి పరమప్రీతిన్.

నన్నయభారతమును బినవీరనజైమినీభారతమును నాంధ్రీకరించుటచే వారిగ్రంథములు భారతనామసామ్యము నొందినందున జైమినీభారతములో 'మా' యుపయోగించెనేమో లేక 'నా' కుబదులు లేఖకులు ప్రమాదమున 'మా' యనివ్రాసిరో మా యని వ్రాసినను అంతమాత్రమున శాఖైక్యము నదిసూచింపదు. శ్రీనాథమహాకవి హరవిలాసములో వైశ్యుఁ డైనతిప్పయశెట్టిని "మా" తిప్పయశెట్టియని వ్రాసియున్నాఁడు. తిప్పయసెట్టి వైశ్యుఁడు శ్రీనాథుఁడు నియోగిబ్రాహ్మణుఁడు. ఇట్టి యుదాహరణములింకను జూపవచ్చును. కావునఁ "మానన్నయభట్టు" అనువాక్యములోని 'మా' నుబట్టి పినవీరన వైదిక బ్రాహ్మణుఁ డని నిర్ణయింప నవకాశము లేదు.

ఇఁకను గార్శ్యపగోత్రుఁ డనువిషయ మున్నది. పినవీరన జైమినీభారతమున నెచ్చటను దనగోత్రమును జెప్పియుండలేదు. పైనిజెప్పిన కందపద్యమునఁ దప్ప, శకుంతలాపరిణయ గద్యయందుఁగూడఁ గవి తన

గోత్రమును జెప్పియుండలేదు. జైమినీభారతమున గ్రంథాంతమున గద్యకుముందుఁ గవియొక్కయుఁ గృతిపతియొక్కయు నామాదికమును దెలుపుచు నొకసీసపద్యమును వ్రాసియున్నాఁడు.

సీ. నీకును మల్లమాంబాకుమారునకు సో
మకులాంబునిధిపూర్ణిమావిధునకు
భరతకీర్తికిఁ దులాపురుషాదిదానాంబు
జంబాలితాస్థానసౌధునకును
బరరాజభీకరధరణీవరాహున
కాత్రేయపవిత్రగోత్రునకును
గుండయనరసింహమండలేశ్వరునకు
నభ్యుదయము పరంపరాభివృద్ధి
తే. కరముగా భారతీతీర్థగురుకృపాస
మృద్ధసారస్వతుఁడు సత్కవీంద్రసఖుఁడు
సుకవిమల్లకసోల్లసత్కులిశహస్త
పల్లవుఁడు చెప్పెఁ బినవీరభద్రసుకవి.

ఈపద్యములోఁ గృతిపతియొక్క గోత్రమును జెప్పియుఁ గవి తన గోత్రమును జెప్పలేదు. పినమళ్ళసోమయామాత్యుఁడు పైనివ్రాసిన పద్యములలోఁ బిల్లలమఱ్ఱివారిని భారద్వాజగోత్రు లనియే చెప్పియున్నాఁడు కశ్యపగోత్రుఁ డని చెప్పఁబడినకందపద్యమును సోమనామాత్యుఁడు చదివియుండలేదా ? చదివి యుండెనేని యీ వీరభద్రకవిని దన పూర్వునిగా వర్ణించుకొనుటయు భారద్వాజగోత్రుఁడని చెప్పుటయు సంభవింపదు. ఈ పద్యము నాతఁడు చూడకయుండవలయును లేదా యీ పద్యములేని ప్రతి యాతనికి లభించి యుండవలయును. అట్లయినచో నీపద్యము ప్రక్షిప్తమై యుండును.

సోమయామాత్యునిసీమంతినీపరిణయములోని వంశవర్ణనమును జదివినవారికి, శకుంతలాపరిణయములోని పైకందపద్యము నాతఁడు చూడలే దనుటకంటె నాపద్యములేనిప్రతి యాతనికి లభించియుండు నని తలఁచుటయే సమంజసముగ నుండునని తోఁచును. అయిన నీపద్య

మును దొలఁగించినచో నర్థముచెడకుండ నాకథపట్టు సరిగా నుండునా? అని యోచింపవలసియున్నది. ఈకందపద్యము కృతిపతి కృతికర్తను వర్ణించుచుఁ గృతినొందుటకై తనతలంపును వెల్లడిచేయుసందర్భమున నున్నది. కవి యిట్టిసందర్భమును జైమినిభారతమునందును గలుగఁజేసి యున్నాఁడు. ఈరెండుగ్రంథములనుండియు నాకథపట్టుల నిట వ్రాయుచున్నాఁడను. పాఠకు లీక్రిందిపద్యములను జదివి పై కందపద్యము యొక్క యవసర మున్నదియు లేనిదియు నిర్ణయించెదరు గాక!

వ. ఆరాజపరమేశ్వరుం డొక్కనాఁడు ... పురాణేతిహాసకథాప్రసంగం
బుల వినోదించుచు ... ... జై. భా. ౧౫

వ. ఆమంత్రిమందారం బొక్కనాఁడు పురాణేతిహాసప్రసంగంబుల వినో
దించుచుఁ దనమనంబున ... ... శ. ప. ౧౫

ఉ. ఆదట సప్తసంతతులయందును నొక్కొకకాలమందు వి
చ్ఛేదము గల్గు నటేఁటికిఁ జెప్ప విపర్యయమేయుగంబునన్
లేదు కవిత్వసంతతికి నిక్కము తత్కవితావిలాసమున్
జాతులు నిష్టదైవము ప్రసాదమునో హరికీర్తనంబునన్.
జై. భా. ౧౬

శా. ఇల్లిల్లుం గుడియు న్వనంబును నిధానంబుం దటాకంబు రం
జిల్లుం గొండొకకాలమేఁగ నవి విచ్ఛేదంబునుం బొందు నే
పొల్లుం బోనిది కీర్తికిం గృతియ పో భూమండలిం దానికిం
దెల్లం బిప్పుడు రామభారతకథాధీనప్రబంధావళుల్ ...
శ. ప. ౧౬

క. నామది నిరతము భారత
రామాయణకథలఁ బ్రేమ రంజిలు నందున్
జైమినిభారత మనఁగా
భూమి నపూర్వము పురాణముల గణియింపన్. జై. భా. ౧౭

సీ. వల్మీకసంభవు వాక్యసంపన్నత
దశరథాధీశనందనునికీర్తి
సాత్యవతేయు వాచావిలాసంబునఁ
గాంతేయపంచకాగ్రణి ప్రశస్తి

చిత్తపవచనరాజినిబంధనంబున
ధారమహాపురాధ్యక్షు మహిమ
కాళిదాసవిశాలతాప్రౌఢత
విక్రమాదిత్యభూవిభునిచరిత

తే. మఱియుఁ దత్తత్కవీంద్రసమగ్రవాగ్వి
భూతిఁ దెలుపుచు నున్నది పూర్వరాజ
శీలదానాదిచర్యావిశేషములను
కీర్తి సదనంబు కృతియు తర్కింప ధరణి... ... శ. ప. ౧౭

తే. ఆపురాణంబు గనఁ దెనుఁ గయ్యె నేనిఁ
జెప్పనేర్చినకవియుఁ బ్రసిద్ధుఁ డేనిఁ
దెనుఁగు నుడికారమున మించుఁ గనియె నేనిఁ
గుందనము కమ్మవలచినచంద మగును. జై. భా. ౧౮

క. ఆచంద్రతారకంబుగ
భూచక్రమునందుఁ గీర్తిఁ బోషింపఁగఁ దా
రోచిష్ణు వగుప్రబంధము
నైచిత్రి యొనర్చు సుకవివరుఁడు గలిగినన్... శ. ప౧౮

సీ. అమృతాంశుమండలం బాలవాలము గాఁగ
మొలిచె నొక్కటి జగన్మోహనముగఁ
జిగిరించె విజయసింధుగతకైతవడింభ
శయనీయవరపలాశములతోడఁ
బితృదేవతలకు నంచితసత్త్రశాల యై
చెట్టు గట్టెను గయాక్షేత్రసీమ
నిలువ నీడయ్యె నిందీవరప్రియకళా
కోటీరునకు భోగికుండలునకు

తే. మఱ్ఱిమాత్రంబె పిల్లలమఱ్ఱి పేరు
పేరువలె గాదు శారదాపీఠకంబు
వారిలోపలఁ బినవీరువాక్యసరణి
సరసులకు నెల్ల గర్ణరసాయనంబు జై. భా. ౨౩

సీ. నన్నపార్యుఁడు ప్రబంధప్రౌఢవాసనా
సంపత్తి సొంపు పుట్టింపనేర్చు
తిక్కనయజ్వ వాక్ఫక్కికామోదంబు
చెలువు కర్ణముల వాసింపనేర్చు
నాచిరాజునిసోము వాచామహత్త్వంబు
సౌరభంబుల వెదచల్లనేర్చు
శ్రీనాథభట్టు భాషానిగుంభంబుల
పరిమళంబులఁగూడఁ బఱచనేర్చు

తే. మహితగుణశాలి పిల్లలమఱ్ఱివీర
నార్యుఁ డాయింటఁ బైతామహం బగుచును
వెలయుచున్నది నేఁడు కవిత్వలక్ష్మి
యఖిలసత్కవినికరంబు నాదరింప శ.ప. ౧౯

క. అని విన్నపంబు చేసిన
నను( గనుఁగొని యలరి నాధనఁబు ఋణముగాఁ
దినక యుపార్జించెయశో
ధన మిటుగావలదె యాశ్రితత్వం బనుచున్ జై.భా. ౨౩

మ. అని సాధ్వీమణి నాగమాంబకును విద్యాభారతీజాని గా
దనకుం బుత్త్రిని వీరభద్రపదపద్మధ్యానశుద్ధాంతరం
గుని నన్నుం బిలిపించి లోనఁ దనకోర్కు ల్సందడింపంగ మ
న్నన దైవాఱఁగ గారవించి పలికెన్ గంభీరవాక్ప్రౌఢిమన్.
శ.ప. ౨౧

పైపద్యములలో సంశయాత్మక మైనకందపద్యము నీయలేదు. ఆపద్యము శకుంతలాపరిణయములో 20వసంఖ్య కలది. ఆపద్యమును విడిచి వేసినను కథపట్టునకు లోపమురాలేదు. ఆపద్యము కేవలము గోత్రమును జెప్పుటకే వచ్చినట్లు కనుపట్టుచున్నది. కవినామమును, అతనితలిదండ్రుల నామములను, ఆతనియిష్టదైవనామమునుగూడ ౧౯, ౨౧వ పద్యములలోఁ జెప్పియున్నాఁడు. గోత్రమును జెప్పఁదలఁచినచోఁ గవి యాపద్యములోనే చెప్పియుండును. కాని యందుకొఱకుఁ బ్రత్యేకముగ నొక క్యమును వ్రాయ నగత్యములేదు.

ప్రక్షిప్తమని యనుకొనుచున్న పద్యములోని "శివభజనాసక్తుని చేత" ననువాక్యముకూడ నీ పద్యము ప్రక్షిప్తమనునూహకు బల మొసంగుచున్నది. పినవీరభద్రుఁడు శివభజనాసక్తుఁడైన ట్లెచ్చటను జెప్పియుండలేదు. గద్యలో "ఆరాధితామరవీరభద్ర" అనివ్రాసికొని యున్నాఁడు. పైకందపద్యమునకుఁ దరువాతిపద్యములోనే "వీరభద్రపద పద్మధ్యానసముద్ధాంతరంగుని" అని చెప్పుకొనియుండుటచే నాపద్యము నకు ముందుపద్యములో "శివభజనాసక్తునిచే"నని పునరుక్తిగ గవిచెప్పి యుండఁడు.

పైనివ్రాసిన యంశములనన్నిటిని నిష్పాక్షికముగ విమర్శించి నచో నీకందపద్యము ప్రక్షిప్తమనియుఁ బినవీరన నియోగిబ్రాహ్మణుఁ డనియు దోఁపకమానదు. ఇతఁడు నియోగిశాఖకుఁ జెందినవాఁడని యీ తనిగద్యయందలి "గాదయామాత్య"శబ్దమే స్పష్టముగాఁ జెప్పుచున్నది.

పినవీరనమహాకవి యనర్ఘమైనకవితాధారగలవాఁడు. ఈతని శైలి తెలియుటకై కొన్నిపద్యములను వ్రాసియీతనిచారిత్రమును ముగిం చెదను.

### ఇతఁడు ఎఱ్ఱాప్రెగ్గడను నుతింపలేదా?

ఈతఁడు శకుంతలాపరిణయమున నెఱ్ఱాప్రెగ్గడను నుతింపలేదు. జైమినీభారతమున నుతించియున్నాఁడు. దీనికిఁ గారణము శకుంతలాపరి ణయకృతిపతియైన చిల్లరవెన్నయమంత్రి కుటుంబమునకును నెఱ్ఱా ప్రెగ్గడ కుటుంబమునకును వివాదముండి యుండునని యందుచే నాకృతిపతి యెఱ్ఱాప్రెగ్గడనుగూర్చి యొక్కమాటనైనను దనగ్రంథ మున వ్రాయనీయలేదనియు శ్రీ చేకుమళ్ళ అచ్యుతరావుపంతులు గా రాంధ్రసాహిత్య పరిషత్పత్రికలో (సంపు ౧౬ సంచిక ౨-3) వ్రాసియున్నారు. ఆహేతు వాధారరహితమును నసమంజసమునని నాయభిప్రాయము. శ్రీనాథ మహాకవి యెఱ్ఱాప్రెగ్గడను గాశీఖండ మున స్మరించి భీమఖండమున నుతింపలేదు. దీనికిఁ గారణ మేమందుము ?

## మెచ్చు పద్యములు

జైమినిభారతము:—

ఉ. అంగవిహీను నిల్లటపుటల్లునిఁ బ్రిల్లదు నీచభామినీ
సంగతు వామనున్ బధిరు సాధ్వసమానసు మామకుఁ గాముకున్
వెంగలి నంగనాజితుని నిర్దయుఁ గ్రోధిఁ బ్రమత్తు మంత్రిఁ జే
యంగొఱగామి కెల్లఁ గుదురంచు గణింతురు నీతికోవిదుల్. ౧ ఆ.

మ. జననీ! భూపతి ధర్మనందనునియజ్ఞం బర్మిలిం జూడఁ గో
రి నను గట్టడ చేసెఁ బట్టణము వారిం గొంచుఁ బొమ్మంచు నీ
వును వేగం బయనంబు గమ్మన సుదేష్ణం జూచి కోపించి యీ
ధనధాన్యాదులు వీఁటఁబుచ్చి ననుఁ బుత్త్రా! వెళ్ళిరమ్మందురే.
౨ ఆ.

ఉ. జూదరి దుష్టు దుర్వ్యసనుఁ జోరుని సజ్జనదూషకున్ మృషా
వాదిఁ గృపావిహీను గృహవప్రవిఘాతకు లోభి సంతత
స్వోదరపూరకున్ బిశును నుద్ధతునిం బెడబాయు లక్ష్మి వే
దాదిసమస్తవిద్యలు పరాన్నపరాయణుఁ బాయు నైవడిన్. ౩ ఆ.

ఉ. దుర్జయరాజమండలవిధుంతుదమూర్తి యుధిష్ఠిరక్రతూ
త్సర్జిత మైనయీ హయవతంసము ద్రిమ్మర నంగరక్షగా
నర్జునుఁ డేఁగుదెంచు నిటలాక్షుని గెల్చినజోదు విక్రమో
పార్జితలీలఁ బట్టుఁడు రయంబున శూరులు ధాత్రిఁ గల్గినన్. ౪ ఆ.

చ. కనుఁగొని నన్ను నాహవముఖంబున మార్కొని నిల్వ నీక కా
దనిమిషసిద్ధసాధ్యులకు నైన నసాధ్యము కార్యకాంక్ష నె
మ్మనమునఁ గల్గెనే దురభిమానము మాని ప్రియం బెలర్ప న
న్నెనసిన వేడ్కతోడ వరియింపు హయంబుఁ బరిత్యజించెదన్. ౫ ఆ.

మ. సరవిం జేకొని జాతకర్మముఖసంస్కారంబులున్ వేదశా
స్త్రరహస్యంబులుఁ గార్ముకాదివివిధాస్త్రప్రౌఢియుం బాపని
ర్వారణంబై నుతి కెక్కురామకథయున్ రాజేంద్ర! వాల్మీకి స
త్కరుణన్ మా కెఱిఁగించెఁ గాంచె మము సీతాదేవి యిక్కాన
లోన్. ౬ ఆ.

శా. మాతల్లిన్ వనితామతల్లిని సభామధ్యంబునం బ్రోల్చి య
ప్రీతుల్ పల్కి-న పాతకంబునకుఁ జేరెం గాల మిన్నేళ ని
న్నాతంకంబునఁ బెట్టుచున్న పితృపుత్త్రాళిల్ విసర్జించి నీ
నూతుం గృష్ణుఁ దలంచుకొమ్మనఁగ నచ్చోఁ బుట్టె నుత్పాతముల్
2 ఆ.

చ. అతులితభక్తిఁ గృష్ణుఁ గనకాసనసంగతుఁ జేసి రత్నసం
తతుల నలంకరించి యమునందనుఁ డర్మిలి ధారవోసెఁ ద
త్క్రతుఫల మమ్మహాత్మునికరంబున నప్పు డనల్పకల్పక
క్షితిరుహపుష్పవృష్టి గురిసెన్ మొరసెన్ దగ దివ్యదుందుభుల్ 19 ఆ

శకుంతలాపరిణయమునందలి శైలి తెలియుటకై మహాకవి కాళిదాసురచించిన అభిజ్ఞాన శాకుంతలనాటకములోని కొన్ని శ్లోకములను వానికిఁ బినవీరన రచించిన పద్యములను వ్రాసిన బాగుగనుండునని యెంచియిట్లు చేయుచున్నాఁడను.

అసంశయం క్షత్రపరిగ్రహక్షమా
యదార్య మస్యా మభిలాషి మే మనః
సతాంహి సందేహపదేషు వస్తుషు
ప్రమాణమంతః కరణప్రవృత్తయః

ఉ. సందియ మేల యీవికసనసారసలోచన రాజపుత్త్రి నా
డెందము మౌనికన్యలబడిం జననేరదు నిక్కమంబ యే
చందమునందు సంశయవిచారపదం బగునట్టివస్తుసీ
మం దమచిత్తవృత్తులు ప్రమాణము లుత్తములైనవారికిన్.

అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధునవమనాస్వాదితరసమ్
అఖండం పుణ్యానాం ఫల మివ చ తద్రూప మనఘం
నజానే భోక్తారం కమిహ సముపస్థాస్యతివిధిః

చ. కొనగొని తావి మూర్కొనని క్రొవ్విరి యెవ్వెడ వజ్రసూచి దా
యనిరతనంబు జిహ్వచవి యానని తేనియ గోరుమోపి గి
ల్లని చిగురాకు లాలితవిలాసని కేతన మాలతాంగి దా
ననుభవకర్త నేఘనుఁడొ యావిధి యత్న మెఱుంగనయ్యెడన్.

యాస్య త్యద్య శకుంత లేతిహృదయం సంస్పృష్ట ముత్కంఠయా
కణ్ఠస్తమ్భితబాష్పవృత్తికలుష శ్చిన్తాజడం దర్శనమ్
వైక్లబ్యం మమ తావతీదృశ మహో స్నేహాదరణ్యౌకసః
పీడ్యన్తే గృహిణః కథం సుతనయావిశ్లేషదుఃఖై ర్నవైః

ఉ. పొమ్మనఁ జూచుఁ జూచి మదిఁ బుట్టిన ప్రేమము పేర్మి బాష్పముల్
గ్రమ్మినఁ గ్రమ్మఱం బెడమొగం బయి కన్నుల నీరుమ్రింగుచుం
గ్రమ్మఱఁ దా శకుంతల మొగం బగు నశ్రులు నించుఁ గొంతసే
పమ్మునిజాలిఁ బొంది ధృతి యంతయు నిల్వక విచ్చిపాఱఁగన్.

ఉ. ఎంచ మునీంద్రులందు విజితేంద్రియుఁ డైనతపస్వి కూర్మిగా
వించి శకుంతలం బెనిచి విస్మృతి నొందినమోహపాశముల్
త్రెంచుకొనంగ లేక తియతీపులఁ జిత్తముఁ గాసివెట్టె శీ
లించిన నెవ్వఁ డింక వదలింపఁగ నోపెడు పాశబంధముల్.

పాతుం నప్రథమం వ్యవస్యతి జలం యుష్మాస్వపీతేషు యా
నాద త్తేప్రియ మణ్డనాపి భవతాం స్నేహేనయాపల్లవమ్
అద్యేవః కుసుమప్రసూతిసమయే యస్యా భవత్యుత్సవః
సేయం యాతి శకున్తలా పతిగృహం సర్వై రనుజ్ఞాయతామ్.

సీ. అలపెఱుంగక తావకాలవాలములకు
నెమ్మితో నెరవొంద నీరువోసి
క్రమవృద్ధిఁ బొందుమార్గంబు లారసి వచ్చి
పూటపూటకుఁ జాలఁ బోదిచేసి
ప్రేమాతిరేకత ప్రియమండనమునకుఁ
జిగురాకుఁ గొనగోరఁ జిదుమ వెఱచి
పరిపాటి పల్లన ప్రసవోద్గమం బైన
సఖులు దానును మహోత్సవ మొనర్చి

తే. తల్లియై పెంచె మిమ్ము నీతలిరుఁబోఁడి
యత్తవారింటి కరిగెడు నాలతాంగి
క్షితిరుహములార! పుష్పితలతికలార!
యనుమతింతురుగాక కళ్యాణయాత్ర.

అస్మాన్ సాధు విచిన్త్య సంయమధనా నుచ్చైః కులంచాత్మన
స్త్వయ్యస్యాః కథ మప్యబాన్ధవకృతాం స్నేహప్రవృత్తించతాం
సామాన్యప్రతిపత్తిపూర్వక మియం దారేషు దృశ్యా త్వయా
భాగ్యాయత్త మతః పరం న ఖలు తద్వాచ్యం వధూబన్ధుభిః

సీ. మహనీయసంయమంబ మహాధనంబుగా
మతియించి వర్తించు మమ్ముఁ దలఁచి
మొనసిన శాపానుగ్రహసమగ్రమైన
బ్రహ్మణ్యత తేజు గాధేయుఁ దలఁచి
గణన కెక్కిన దేవగణికాతతికి రత్న
ముకురమై వెలుఁగు మేనకఁ దలంచి
యూహింపరాని వచ్చి యూరిత్రిముఖ్యులు
దనుఁబ్రోవు చేసిన చెల్లుబడి దలంచి
గీ. మిక్కిలిగ మన్ననయుఁ జేసి మొలఁపవలదు
తక్కువయుఁ జేయ వలవ దంతఃపురంబు
సతులలోపల సరియుగా సరవితోడ
నీశకుంతల భూకాంత యేలు మనియె.

ఈశాకుంతలమును, పెద్దాడనాగరాజును గృష్ణకవియుఁ బద్య కావ్యములుగా రచించియున్నారు. శాకుంతలనాటకము నాంధ్రీకరించినవారు పెక్కురున్నారు.

పినవీరనకవికి శ్రీనాథునియం దపారగౌరవము. ఈతనిగ్రంథములయం దాతనిపోకడలను విశేషముగాఁ గైకొనియున్నాఁడు.

---

## ఈకవి పురుషార్థసుధానిధిని రచించెనా ?

ఆంధ్రసాహిత్యపరిషత్తునం దున్నయుదాహరణగ్రంథసంఘాత పిల్లలమఱ్ఱివీరయ్య పురుషార్థసుధానిధిలోనివని యీక్రింది రెండుపద్యముల నుదాహరించియున్నాఁడు. ఈవీరయ్య జైమినిభారతకృతికర్తయే నాయని సంశయము కలుగుచున్నది. పినవీరన్న రచించిన శాకుంతలము

లోని కొన్నిపద్యముల నుదాహరించి యాకృతికర్తను పిల్లలమఱ్ఱిపీరయ్య యనియే యతఁడు చెప్పియున్నాఁడు. కావున నీపురుషార్థసుధానిధి కూడఁ బినవీరన్నరచితమే యని యూహింపఁదగియున్నది. కాని యిది యూహామాత్రమే.

సీ. కాశకర్పూరనీకాశఁగా భావింపఁ
గవితానిరూఢిఁ బ్రఖ్యాతి నెసఁగు
యావకారుణదేహయష్టిఁగాఁ జింతింప
మదకుంభియానల మరులు గొలుపు
నీలజీమూతసన్నిభఁగా విలోకింప
సకలమాయాప్రపంచంబు నడచుఁ
గనకచంపకధామ గౌరిఁగా శీలింప
నంహస్సమూహంబు సంహరించు
గీ. శంభుదేవి విశాలాక్షి సదనుకంప
యోగిజనసేవ్య యోగపయోదశంప
శ్రీకరకటాక్షలేశరక్షితనిలింప
ముజ్జగంబుల మొలపించు మూలదుంప.

సీ. భర్గభట్టారకు పర్యాయమూర్తికి
షాణ్మాతురుని కూర్మిజనకునకును
మేషరాజము నెక్కు మేటిరౌతున కమ
రాధీశుపొరుగుదిశాధిపతికి
హరిణవాహనుని నెయ్యపుసంగడీనికి
సామిధేనీప్రియస్వాంతునకును
యాయజూకులయిండ్ల యనుఁగుఁ జుట్టమునకు
స్వాహాస్వధాప్రాణవల్లభునకు
గీ. దండములు వెట్టెదము మోడ్చెదము కరములు
సేవయొనరించెదము మమ్ముఁ గావు ప్రోవు
యాగవేదికి విచ్చేయు మారగింపఁ
బ్రథమజన్ములయింటికల్పు ముమంబ.

పినవీరన "తండ్రియుఁ దాతయు నగ్రిభ్రాతయుఁ దాను భువన భాసురకృతినిర్మాతలు" అని చెప్పియుండుటచే నీవీరయ పిల్లలమఱ్ఱి పెదవీరయ్య యైనఁగావచ్చును. ఈపురుషార్థసుధానిధి విద్యారణ్యులు సంస్కృతమున రచించినపురుషార్థనిధి యనుగ్రంథమునకుఁ దెలుఁగేమో యని యును, శ్రీకీయభాష్యసారమునకు మానసోల్లాసమను పేరుగలదనియు నదియే యితఁడు రచించినమానసోల్లాస మై యుండుననియు శ్రీ టి. అచ్యుతరావుపంతులుగా రూహించియున్నారు.

పినవీరన తనగురువు భారతీతీర్థు లనివ్రాసియుండెను. ఈతఁ డెవ్వరో తెలియదు. శంకరాచార్యపీఠము నలంకరించినభారతీతీర్థస్వామి యేమో !

## పిల్లలమఱ్ఱి, పెద్దన్న పినవీరనలు సోదరులా ?

శ్రీనాథమహాకవిరచించినహార విలాసమును గృతినందిన అవచి తిప్పయసెట్టికిఁ బిల్లలమఱ్ఱిపెద్దన్నగురువై యుండెనని శ్రీనాథుఁడు హార విలాసమున నీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

ఉ. పన్నటనాఁడు సత్కరుణఁ బిల్లలమఱ్ఱిమహాప్రధాని పె
ద్దన్న గురూత్తముండు తగ నక్షరశిక్షయు దైవమార్గసం
పన్నతయున్ వివేకపరిపాటియునుం గృపసేసె నర్థి నే
డన్నకు సెట్టిసెట్టి త్రిపురాంతకునిం దగఁ బ్రస్తుతింపఁగన్.

ఈపద్యమందలిపెద్దన్నయే పినవీరన కగ్రజుడైన పెదవీరనయని తలంచి యితఁడు తిప్పయసెట్టికి గురువుకావునను దిప్పయసెట్టినివాసము నెల్లూరు కావునను, చినవీరన్ననివాసముకూడ నెల్లూరని కొంద ఱను చున్నారు కాని యది యంగీకరింపఁదగినదికాదు. శ్రీనాథునిజననము క్రీ.శ. ౧౩౮౦ ప్రాంతము. కొందఱు ౧౩౬౦ ప్రాంత మనుచున్నారు. శ్రీనాథునికంటెఁ దిప్పయసెట్టి చాలపెద్దవాఁడనియు నాతనికంటె ముప్పదినలువదేండ్లు చిన్నవాఁడైనశ్రీనాథునకును నాతనికిని సఖ్యము కుదిరెననియు నందుచేతనే శ్రీనాథుఁడు బాలసఖుఁ డయ్యెననియుఁ గొందఱనియున్నారు. ఇదియే సత్యమైనచోఁ దిప్పయసెట్టిజననము క్రీ. శ. ౧౩౫౦ ప్రాంతమగును. ఇతనికి గురువైన పెద్దన్నజననము ౧౩౩౦

ప్రాంతమగును. ఆపక్షములో నితనిసోదరుఁ డైనపినవీరన్నకు జైమిని భారతరచనమునాఁటికి ౧౫౦ సంవత్సరముల ప్రాయమగును. తిప్పయ సెట్టి శ్రీనాథునితో సమకాలికుఁడనియు, నాతనిజననము క్రీ.శ.౧౩౮౦ ప్రాంతమనియు నంగీకరించినను చినవీరన్నకు జైమినిభారత రచనము నాటికి ౧౦౦ సంవత్సరములవయసుండునని తేలినది. కావున నాపెద్దన్న యీపినవీరన్న కగ్రసోదరుఁడు కాఁడు. వీరిబాంధవ్యమును దెలుపుట కాధారములు లభింపలేదు.

సాళువనరసింహరాజు కవి పండితపోషకుఁడగుటయేగాక స్వయముగఁ గవియుఁ బండితుఁడునై యుండెను. సాళ్వాభ్యుదయమను పదుమూఁడుసర్గలమహాకావ్యము నీతనివిజయములను వర్ణించుచు డిండిమభట్టు బిరుదాంచితుఁడగురాజనాథకవి రచియించియుండెను. నరసింహరాయలు క్రీ.శ. ౧౩౯౦ ప్రాంతమున స్వర్గము నలంకరించెను

ఈనరసింహరాయనిపేర నవరత్నములు, రాజ్యాంగపద్ధతులపద్యములును రచియింపఁబడినవనియు వీనికిఁ గర్త పిల్లలమఱ్ఱి పినవీరనయే కాఁదగుననియు వ్రాసి వానిని శ్రీ ప్రభాకరశాస్త్రిలుగారు చాటుపద్యమణిమంజరిలోఁ బ్రకటించియున్నారు. వాని నీక్రింద నిచ్చెదము.

**నవరత్నములు :**

సీ. దివదినంబును నెల్లదివిజులఁ బోషించుఁ
గైరవబంధుఁ డేకార్యకాంక్ష?
అప్పటప్పటికి లోకాంధకారము మాన్చి
నినుఁ డేమిలాభంబు నిచ్ఛగించి?
సచరాచరం బైన జగతియెల్ల భరించు
ఫణిపతి యేఫలప్రాప్తిఁ జూచి?
అదనున వర్షించి యఖిలజీవులఁ బ్రోచు
జలధరం బే ప్రయోజనముఁ గోరి?
గీ. పరహితం బాత్మహిత మని పరమపుణ్యు
లన్య లొనరించుమేలు తా రాసపడరు
సకలభాగ్యోదయ! కటారి సాళువాంక;
గుండభూపాలు నరసింహమండలేంద్ర!

సీ. ఆకారసంపద ననుసరించినవిద్య
విద్యకుఁ దోడైన వినయగుణము
వినయగర్భిత మైన విక్రమారంభంబు
విక్రమార్జిత మైన విభవగుణము
విభవానుగుణ మైన వితరణోన్మేషంబు
వితరణోపేతమై వెలయు ప్రియము
ప్రియవచోనిరతమై పెంపొందు సత్కృతి
సత్కృతిఁ జేకొన్న చారుకీర్తి
గీ. చారుకీర్తికి నెల వైన పౌరుషంబు
పౌరుషంబున వర్తించు భాగ్యభూమి
భూమి పాలించు నృపతికి భూషణములు
గుండభూపాలు నరసింహమండలేంద్ర !

సీ. సర్వజ్ఞుఁడగు మంత్రి సవదరించినరాజు
కార్యఖడ్గమ్ముల క్రమము మెఱుంగు
కార్యఖడ్గమ్ములక్రమము మెఱిఁగినరాజు
బహువిధంబుల మూలబలముఁ గూర్చు
బహువిధంబుల మూలబలముఁ గూర్చినరాజు
శత్రుల నవలీల సంహరించు
శత్రుల నవలీల సంహరించినరాజు
ధరణి యేకాతపత్రముగ నేలు
గీ. కావున మహాప్రధానాగ్రగణ్యబుద్ధి
యధిపు సామ్రాజ్యమునకు సర్వాంగరక్ష
రాయమలవరగండ ! వీరప్రచండ
గుండభూపాలు నరసింహ మండలేంద్ర!

సీ. సంగీతధర్మంబు సాహిత్యధర్మంబు
తెలియఁ జేయుట ప్రజ్ఞగలఫలంబు
వితరణప్రౌఢియు వినయసంరూఢియు
గైకొంట సంపదగలఫలంబు
దుర్జనశిక్షణమును సుజనరక్షణమును
గల్గుట నిజశక్తిగల ఫలంబు
బ్రాహ్మణభక్తియుఁ బరహితశక్తియుఁ
గావింపు విభవంబు గలఫలంబు
గీ. బట్టు విప్రేంద్రు విద్యార్థి పసఁగ దాత
కిదియ లక్షణ మెన్నంగ నెలమి నెపుడు
సాళువ క్షోణిపతివంశజలధిచంద్ర!
గుండభూపాలు నరసింహ మండలేంద్ర!

సీ. బంగారునకు సౌరభము జనించినయట్లు
కులజుఁ డుత్తమగుణకలితుఁ డేని
కస్తూరి నికరంపుఁ గాంతి జెందినయట్లు
ఉత్తమోత్తముఁడు శ్రీ నొందెనేని
భావింపఁ జెఱకునఁ బండు పండినయట్లు
[illegible]దాత ప్రియవచోనిరతుఁడేని
అలరు గంధపుమ్రాన నలరు పూచినయట్లు
శ్రీమంతునకుఁ గీర్తి చెందెనేని
గీ. భవ్యగుణసాంద్ర! సకలవైభవసురేంద్ర!
సహజ దాన శిబీంద్ర! భాషాఫణీంద్ర!
సాళువ క్షోణిపతివంశజలధిచంద్ర!
గుండభూపాలు నరసింహ మండలేంద్ర!
సీ. వాహ్యాళిచో మత్తవారణ సూకరా
శ్వములఁ గన్గొనుచోట సాముచోట
ఆరగించెడిచోట నాస్థానంబుచోట
నిద్రవోయెడిచోట నేఁతచోట
వేఁట వెళ్లెడిచోట విందుచెప్పినచోట
నాటపాటల వేడ్క నలరుచోట
వైద్యుచే.............. నిఱకటంబైనట్టి
తెరువున నని మొనల్ దీర్చుచోట
గీ. దైవతస్థానవైభవ తతులచోటఁ
గ్రొత్తవారలఁ గాన్పించుకొనెడుచోట
నాత్మరక్ష యేమఱకుండునతఁడె రాజు
గుండభూపాలు నరసింహ మండలేంద్ర!
సీ. ప్రియముతో నిజమాతృపితృభక్తి యొనరించు
ధర్మాత్ములకు వేఱె దైవమేల?
మమతమై సర్వభూతములందు దయగల్గు
ధన్యులకును వేఱె తపములేల?
సరససత్కవి కావ్యసరణి వినోదించు
నతిపుణ్యులకు వేఱె యమృతమేల?
సతతంబు సత్యభాషానిష్ఠ వదలని
కృతికృతులకు వేఱె క్రతువులేల?
గీ. ప్రాణపద మైన లలితాంగిఁ బాయకుండు
పురుషులకు వేఱె దేవేంద్రపురమదేల?
రాయచౌహత్తమల్లధరావరాహ!
గుండభూపాలు నరసింహ మండలేంద్ర!

సీ. ఘనికులఁ గావింపఁదగదు సోదర్యుల
బడవాళ్ళఁ జేయఁ జొప్పడదు కటికం
తగదు దుర్గాధిపత్యము జ్ఞాతి కొసఁగంగ
ధనము కావలిఁ బెట్టఁదగదు ఖలుని
దేశాధికారిగాఁ దప్పదొప్పదు క్రూరు
జనవు ప్రమాదంబు సాహసునకు
కాదు ధీరుఁ దలారికము ప్రతిష్ఠింపంగఁ
గీడు వంచకుని వాకిటను నిల్ప
గీ. నమ్మ ననుమాన మగువాని నమ్మఁదగదు
నమ్మియుండిన పోట ప్రాణంబు గనిన
ప్రాణమునకుఁ దగఁ జేయంగవలెఁ జికిత్స
గుండభూపాలు నరసింహమండలేంద్ర!

సీ. మంత్రాధిపునితోడ మర్మజ్ఞుతో రాజ
హీనునితోడను నిగ్రహింపఁజనదు
అతిమదాంధునితోడ నంగనాసక్తుతోఁ
గాముకుతోఁ దనధనాత్మ చెప్పఁదగదు
నింద్యగుతోఁ బరనిందాభిలాషితోఁ
గృతఘ్నునితోడఁ గూడఁ జనదు
రాజవిద్వేషితో భూజనద్రోహితో
వంచకుతోఁ గొత్తు వలదు సేయఁ
గీ. బరఁగ నీరీతిఁ జరియించు నరవరునకు
నూర కెవ్వరు మూర్ఖులై వైరులగుచు
నడచికొని యవశ్యంబు చెడక పోరు
గుండభూపాలు నరసింహ మండలేంద్ర!

రాజపద్ధతి—
సీ. శస్త్రమహలఁజాఁడై యుద్యోగశీలుఁడై
భాషలలిపు లెల్లఁ బరికించి
వాక్పటుత్వముగల్గి వ్యసనము మాని య
గ్రముఁ గూర్చ దక్షుఁడై శ్రమము దెలిసి
ప్రజలనుఁ జల్లనై చలములఁ బోషించి
సుకృతియై శూరుఁడై శుద్ధి మెఱసి
రాజదోషములఁ భూరమణుఁ బొందగనీక
పరమర్మభేదియై వెర దెలంగి
గీ. గుప్తమంత్రుఁడై కుశలుఁడై కొలు వెలింగి
చారచక్షుఁడై దేశవిచార మరయు

నట్టి సన్మంత్రి గలిగినయతఁడు రాజు
గుండభూపాలు నరసింహ మండలేంద్రు!

రాష్ట్రపద్ధతి—

సీ. వర్ణాశ్రమంబుల వరుస దప్పఁగనీక
జారచోరాదుల పేరడంచి
దేవభూదేవతాస్థితులు పాలించుచు
సత్పువిన్నప మైన నాదరించి
అబలుని బలవంతు లదరి త్రోవఁగనీక
వ్యవహారధర్మముల్ తివిరినడపి
కొలువున్నిలలోపలిపోరు లడఁగించు
గళ్లకూళ్లకు నంజుళ్లు మాన్పి
గీ. నిఖిలదేశంబులను జక్క నిజగృహంబు
లరయువిధమున దివ్యాజ్ఞ లనువుపఱచి
యప్రమత్తుఁడై ధరయేలునతఁడు రాజు
గుండభూపాలు నరసింహ మండలేంద్రు!

దుర్గపద్ధతి—

సీ. తృణకాష్ఠజలసమృద్ధిని బ్రధానంబుగా,
గలకాలమును సమగ్రంబు సేసి
కోట యాళ్వరి కొమ్మ కొత్తళంబు లగడ్త
లట్టళ్లు యంత్రంబు లనువుపఱచి
ధాన్యంబులాదిగాఁ దగుపవరణ లెల్ల
నొకటియుఁ గొదవ లేకుండ నునిచి
నీతిమార్గంబున నెనరైన దొరలను
బలసి ఠాణెములందుఁ గొలువు నింపి
గీ. నగరికావలి సావధానముగ నునిచి
చోద్య మిది యెట్టివారి కభేద్యమనఁగ
నట్టి దుర్గంబు లందుండు నతఁడు రాజు
గుండభూపాలు నరసింహ మండలేంద్రు!

బలపద్ధతి—

సీ. బేడు పైతరువులు పెట్టక చేజీత
రవణ దప్పకయ జీతంబు లిచ్చి
చేరువ దొర లిచ్చుజీతంబు నచ్చుట
రాకయుండుట విచారంబు చేసి

సీ. ఆమంత్రిపుంగవుం డష్టభాషాకవి
వర్యుఁడై పొగడొందె వసుధయందు
ద్విపదగా నారసింహపురాణ మొనరించి
భక్తి నహోబలభర్త కిచ్చె
బాలభారత మంధ్రభాషను వచనకా
వ్యంబు చేసెను గవీశ్వరులు మెచ్చ
సౌభరిచరితంబు జక్కులకథ చెప్పె
లాలిత నవరసాలంకృతముగ
మఱియుఁ బెక్కుకృతు ల్పటుమతి రచించె
ఖ్యాతి నరసింగరాయలచేతఁ గొనియె
నగ్రహారంబులును వివిధార్థములును
వెలసెఁ గొండమ బెండ్లియై విభవమెసఁగ.

నరసింహపురాణమును ద్విపదకావ్యముగను, బాలభారతమును వచనకావ్యముగను, సౌభరిచరితమును యక్షగానముగను నీకవి రచించిన ట్లీపద్యములోఁ జెప్పబడియున్నది. ఇందొక్కగ్రంథమైనను లభించినచోఁ గవిచారిత్ర మింక నధికముగఁ దెలిసియుండును. ఈకవికిఁదాతయైన తిప్పన కర్ణాటాధీశ్వరుఁడైనప్రౌఢదేవరాయలకడ దండాధీశుఁడుగ నున్నాఁడు. కావున, నీచెన్నశౌరికూడఁ గర్ణాటప్రభువులయాశ్రయమున నున్నాఁడని చెప్పుట సమంజసము. చెన్నశౌరి కగ్రహారముల నొసంగినది సాళువగుండనరసింహరాయలై యుండును. కావునఁ బిల్లలమఱ్ఱిపినవీరన్నయు నీతఁడును సమకాలికు లని యెంచఁదగియున్నది. కావున నీకవి పదునైదవశతాబ్దియం దుత్తరార్థమున నున్నవాఁడనుట నిశ్చయము. ఈతనివంశమునుగూర్చి తక్కినవిషయములు హరిభట్టుచారిత్రమునఁ జూడనగును. ఈకవి రచించినగ్రంథములు లభింపకపోవుటచే వానినిగూర్చి యేమియు వ్రాయఁజాలకపోయితిని.

---

# పిడుపర్తి సోమనాథకవి

ఈకవి వీరశైవుఁడు; పాలకురికిసోమనాథుని శిష్యప్రశిష్యశిష్యుఁడు బసవశౌరిపుత్రుఁడు; దేవనార్యునకును, మల్లమదేవికిని పౌత్రుఁడు వీర శైవులు తమకులగోత్రసూత్రాదులను జెప్పరు. కావున వానినిగూర్చి యేమియుఁ దెలియదు. ఇతఁడు వీరశైవమతావలంబి యగునియోగిబ్రాహ్మణుఁడు.

ఇతఁడు పాలకురికిసోమనారాధ్యుఁడు రచించినద్విపదబసవపురాణమును, నేఁడాశ్వాసములపద్యకావ్యమునుగా రచించి, సోమనారాధ్యునికే యంకితముచేసెను. ఈవిషయమును గ్రంథాంతమున నీక్రిందిపద్యములలోఁ గవి చెప్పియున్నాఁడు

చ. వసుమతిలోన భక్తు లభివర్ణన మొందఁగఁ జేయుచుండ శ్రీ
బసవపురాణమున్ ద్విపదపద్ధతిఁ జెప్పెను పాలకుర్కిసో
మనగురుని యామహామహుఁడు మత్కులదేశికుఁ డౌట దానిఁ బెం
పెసఁగఁగఁ బద్యభారతి రచించితి నేను తదంకితంబుగన్.

ఉ. ఏ రచియించినాఁడ నన నెంతటివాఁడ శ్రుతాగమత్రయీ
పారగుఁ డైనసద్గురుఁడ పాలకురీపురిసోమనాథుఁ డే
దారి రచించె నాక్రమము దప్పక యుండఁగ దత్కృపారస
ప్రేరణఁ దత్పదాబ్జములు ప్రీతి భజించుట గాక యీక్రియన్.

కవికిఁ దండ్రియగునబసవశౌరి, "యీగ్రంథమును రచించి పాలకురికిసోమనాథుని కంకితము సేయు"మని కవితో ననినట్లు చెప్పినయీ క్రిందిపద్యములవలన గ్రంథప్రాశస్త్యమును గవిసమర్థతయుఁ గృతిపతి శక్తియుఁ దెలియునుకావున గ్రంథవిస్తరభీతియున్నను నాపద్యముల నన్నిటి నీక్రిందఁ బొందుపఱచుచున్నాఁడను.

సీ. తనకల్మి బుధదీనతాద్రికి దంభోళి
తనబల్మి షడ్రిపుధ్వాంతహేళి
తనమూర్తి శిష్యహృద్వనవసంతస్ఫూర్తి
తనకీర్తి దశదిశాంతః పరిపూర్తి

తనదాంతి సంతతధ్వస్తాఘవిభ్రాంతి
తనకాంతి రోషపద్మమదంతి
తనచిత్త మీశ్వరార్చనవిధాయత్తంబు
తనవిత్త మార్యలోకనుతవిత్త

తే. మనుచుఁ గొనియాడ మహి కెక్కినట్టిఘనుఁడు
దేవనార్యుని నెయ్యంపుదేవియైన
మల్లమాదేవి పుత్త్రుఁ డామ్నాయవేది
భవ్యగుణహారి పిడుపర్తిబసవశౌరి.

క. నను నొకనాఁ డాత్మాంక
స్థునిఁ గనుఁగొని పాలకురికిసోమేశుని పే
రను బసవపురాణము ప
ద్యనిబద్ధత వెలయఁ జేయఁ దలఁచితిని సుతా!

మ. అది వేదాగమసారసంగ్రహము సత్యజ్ఞానసంపాదకం
బది రుద్రాదిమహాపురాతనకథావ్యాప్తంబు పాపాపహం
బది సద్భక్తివివృద్ధికారణము ముక్త్యావాస మల్లాను నీ
వది చెప్పందగుఁ బద్యకావ్యముగఁ గావ్యప్రజ్ఞ సేవ్యంబుగన్.

క. ఆకృతి సోమేశుఁడు దా
నై కావింపఁడు హృదీశుఁ డామ్నాయవచో
నీకోక్త భక్తి సుగతిం
జేకొని పోషింప నిట్లుచేసెన్ ద్విపదల్.

క. ఆ వేదార్థము ద్విపదలు
నీ విప్పుడు పద్యములుగ నిర్మించిన భ
క్తావలి మెచ్చున్ శివకవు
లీ విధ మంగీకరింతు రిష్టము మాకున్.

ఆ. సోముఁ డేమి చెప్పె సోమేశుద్విపదలే
పెట్టి పద్యములుగఁ బెనఁచె నంచు
నన్యుఁ లనఁగవలదు నాయయ్య శిష్యుల
మగుట మనకుఁ జెల్లు నవియు నిలుప.

సీ విరచించె జైమిని వేదపాదస్తవం
బొకపాదమున వేదయుక్తి నిలిపి
పారిభక్తి వైదికం బని శృతులిడి చెప్పెఁ
బ్రతిభ సోమేశుఁ డారాధ్యచరిత
సరవి శ్రీనాథుఁ డాచరిత పద్యప్రబం
ధము సేసెద్విపదలు తఱచు నిలిపి
యాతండు పద్యకావ్యము సేసె నైషధ
మంచితపూర్వవాక్యములఁ బెట్టి

తే. సోమగురువాక్యములఁ బెట్టి భీమసుకవి
గరిమ బసవపురాణంబుఁ గన్నడించెఁ
గానఁ బూర్వకావ్యము వేఱుగతి రచించు
వారి కాదికావ్యోక్తులు వచ్చి నెగడు

క. నీవును సోమేశునిద్విప
దావళి బుగ్గములు చేయు మందులయర్థం
బావంతయు దిగవిడక
యేవియు మున్నందు లేని విడక కుమారా!

సీ. చదివించినారము శబ్దార్థసారముల్
కావ్యనిర్మితశక్తి గలదు నీకు
మనకులాచార్యులైన మహిమ నీరశైవైక
మార్గంబు చూపినమహితయశుని
సోమేశ్వరునిఁ గృతిస్వామిఁగా నియమించి
బసవపురాణంబు పద్యకావ్య
మర్థిఁ గావింపుమీ యని యానతీయఁగఁ
గరములు శిరమునం దిరవు కొలిపి

ఆ మీకు నంకితముగ నాకొకకృతి
సేయువేడ్క నాకుఁ బాయ దెపుడు
నేర మీయనుజ్ఞమీఱినడవ నెట్లు
సేయు మన్న నట్లచేయువాఁడ.

క. అని యేను విన్నవించిన
విని నను గారుణ్యదృష్టి వీక్షించి మహా
త్మ్ముని బాలకురికి సోమే
శుని గృతిపతి సేయు సకలశుభదము మనకున్.

క. నాకొకకృతి నీదలచుట
చేకొని సంతసము నాకు జేయుటకైన
న్నాకృతి గురువుల కిచ్చిన
నాకును సంతసము శతగుణం బగుబుత్త్రా!

ఈకవి ప్రభులింగలీల లనుద్విపదకావ్యమునుగూడ రచించెను. దానియముద్రితప్రతి మదరాసునం దున్నది. అల్లమప్రభు వను శివభక్తు నిలీలలను, చామరుసయ్య యనునాతడు ౨౫ గతులలో ౧౧౧౧ పదములుగా రచియించినట్లును, వాని నీసోమనాథకవి ద్విపదలుగా జేసినట్లును, ఆద్విపదలను దాను పద్యములుగారచించితినని పిడుపర్తి పాలనార్యపుత్త్రు డగుబసవనకవి తనప్రభులింగలీలలలో నీక్రిందిపద్యములలో జెప్పియున్నాడు.

ఉ. చామరుసయ్య మున్ను పదసంఖ్యకు వేయునునూటపద్దకొం
డై మతి యిర్వదేనుగతులందును నీప్రభులింగలీల యెం
తేమహిమన్ రచించె నది తెల్లముగా బిడుపర్తివాసుడౌ
సోమగురుండు దా ద్విపదచొప్పెడ జెప్పె విచిత్రవైఖరిన్.

క. ఆసోమగురుడు ద్విపదగ
జేసినప్రభులింగలీల క్షితి వెలయంగా
నాసక్తి పద్యకావ్యము
భాసురగతి పాలనార్యబసవన చేసెన్.

ఈకవి తండ్రియైనబసవన్న "గురుదీక్షాబోధ" అనుద్విపదకావ్యమును మఱికొన్నిగ్రంథములనురచించెను. అతనిచరిత్ర మిందు వేఱొకతావున వ్రాసితిని.

పాలకురికిసోమనారాధ్యుడు తనశిష్యుడును బ్రతాపరుద్రునిమంత్రియు నైనయిందులూరిఅన్నామాత్యునితో జెప్పి యఱువదిమువ్గురు

శివభక్తులకొఱకు రెండవప్రతాపరుద్రమహారాజునొద్దనుండి గైకొనిన దోకిపఱ్ఱు అగ్రహారము కొంతకాలమునకు మరల ప్రభువులవశమై పోఁగా నీకవికి ముత్తాతయైన పెదసోమగురుఁడు ప్రౌఢదేవరాయలవలన తిరిగి సంపాదించినట్లు కవి బసవపురాణమందలి యీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

సీ. సకలరాజన్యమస్తకన్యస్తమణికాంతి
పుంజరంజితపదాంభోజయుగళుఁ
డకుటిలాగమపురాణామ్నాయసమ్మత
వీరశైవవ్రతవిశ్రుతుండు
పరపాకపరసతీపరధనపరమర్మ
వచనాదిదురితవివర్జితుండు
పంచాక్షరీమంత్రపఠనప్రభావమూ
ర్ఛితాంతర్గతరిపునికాయుఁ
డసమశివలింగసంతతధ్యానజనిత
పరమసమ్మోదసంపూర్ణభావకలిత
మానసేంద్రియవర్గుండు మహితయశుఁడు
కులపవిత్రుండు పెదసోమగురువరుండు.

క. ఆది బ్రతాపుఁడిచ్చిన
యాదోఁకిపురంబు నడుమ సంకిలి వడినన్
మోదమునఁ బ్రౌఢరాయని
సోదయితునిచేతఁ వచ్చె నిందఱు నెఱుఁగన్.

ప్రౌఢదేవరాయలు కర్ణాటరాజ్యమును క్రీ.శ. ౧౪౨౨ మొదలు ౧౪౪౭ సంవత్సరము వఱకును బరిపాలించినవాఁడు కావున నీపెదసోమగురుఁ డాకాలమున నున్నవాఁడనుట నిశ్చయము. ఆతనిజననము క్రీ.శ. ౧౩౬౦ ప్రాంతమని పాలకురికి సోమనారాధ్యునిచరిత్రమున వ్రాసియున్నాఁడను. ఆతని మునిమనుమఁ డయిన యీ సోమనాథకవి జననము క్రీ.శ. ౧౪౫౦ ప్రాంతమనియు గ్రంథరచనాకాలము ౧౪౮౦ ప్రాంతమని నిశ్చయింపవచ్చును.

బసవనిఁగూర్చియు, బసవపురాణమునుగూర్చియు, పాలకురికి సోమనారాధ్యునిచరిత్రమున వ్రాసియున్నాఁడను. అందలికథలే యీ పద్యబసవపురాణమున వ్రాసియున్నవి.

ఈకవికవిత్వము సంస్కృతాంధ్రపదసమమై యనర్గళధారకలిగి భక్తిరసపూరితమై మనోహరముగా నున్నది. శైలిచూపుపద్యముల నీ క్రింద నిచ్చుచున్నాఁడను.

చ వినుబసవన్న! విప్రులకు వేదములం బదియాఱుకర్మముల్
వినఁబడు గాన నందొకటి లెక్కకు తక్కున గాకయుండఁ జే
సిన నతఁడగ్రజోత్తముఁడు చేయమి నీచుఁడు గాన వానిఁ జే
సినను విరోధమే శివవశీకృతికిం దలపోసిచూడుమా. ౧ఆ.

ఉ కుంచముఁ గొంచురం డతనిఁ గొల్చి భజించెను గింజగిట్రలున్
మంచిగఁ గొల్చుకుంచ మది మల్లనయాకవి యక్కఱల్ వెసన్
దుంచఁగఁ జాలుదైవ మని తోడివణిక్కులు లింగమూర్తి పూ
పించి నగంగవీరులను జేతులఁ జేర్చి సభర్జనోక్తులన్. ౨ఆ

మ. కరి యచ్చోటికి వచ్చి తంతురచనాకౌశల్యమున్ గాంచి కో
పరసావేశముతోడ నీశ్వరునిపైఁ బామట్రి సంధించె నే
పురుషో యంచు నిజశ్రవశ్చలనసంభూతోరువాతంబుచే
హరుపైఁ బాదురుపోవఁ దట్టె ఘనతుండానీ కపానీయమున్. ౩ఆ

శా. చక్షుశ్శ్రోత్రవిభూషణుండు గనియెన్ సంఫుల్లసన్మల్లికా
ద్రాక్షాముఖ్యలతాప్రతానకపరీతస్ఫీతశాఖాశిఖా
దక్షోణీచరదధ్వసీనవితతాధ్వశ్రాంత్యపాయక్రియా
ధ్యక్షంబై కనుపట్టినట్టియొకసంతానాఖ్యధాత్రీజమున్ ౪ఆ

క. అమ్మమ్మ! రమ్మ మాలిం
గ మ్మాకోనియున్నవాఁడు గ్రక్కున లెమ్మా
లెమ్మా వడ్డించి పదా
ర్థమ్మని శివపూజ వేగిరమె దీర్పంగన్. ౫ఆ

మ. ఘటగర్భస్థితకాలజిహ్మగ ముదగ్రక్రోధమై పొంగుచుం
బటుఘోషంబున మ్రొగ్గుచుం బడగఁ దద్భాండంబులోఁ గొట్టుచుం

జటులాంకారత రోయఁజూచున్ మెఱయుచు వంప్రిల్ నూఱుచు న్నాల్కలు
తృటనేగంబునఁ గోయుచుం బ్రకటతాతిథ్యంబుతో నండఁగన్ ౬౯

చ. చదువులు శాస్త్రముల్ కథలు చర్చలు నేటికి నన్యమార్గులం
జదివిన నెట్టుగున్ ఘనవిశిష్టభవచ్ఛివభక్తదేహముల్
చిదిమినఁ బాలుగారెడినె? చెప్పెడి దేమన మానవేంద్రుతో
వదలని నిష్ఠఁ బల్కె బసవప్రభుఁ డాద్విజులందఱున్ వినన్. ౭౯

ఈకవి రచించిన ప్రభులింగలీల లనునైదాశ్వాసముల ద్విపదకావ్యమును నైష్ఠికస్వామిఁ డగు నెల్లూరిరామలింగయ్యప్రోత్సాహముపై సిద్ధపీఠదేశికున కంకితముచేసిన ట్లీక్రిందిపదములవలనఁ దెలియుచున్నది. ఈరామలింగస్వామినివాసము కాంచీపురము.

మహిమాయితుఁడవ నెల్ల ధర్మదాత్రివిఖ్యా
వహ దేశికుఁ గా ధర్మవాణిజ్యసరణి

* * *

కలికంఠభక్తుల కెరుఁగఁ గన్నట్టి
చిఱుతొండనంబి విశిష్టవంశజుఁడు
అసదృశజ్ఞానక్రియాశక్తి భక్తి
రసికుండు నెల్లూరిరామలింగయ్య
నన్ను రప్పించి మన్నన గారవించి
యున్నతాసనమున నుంచి పిమ్మట్టి
సోమయదేవ! విశుద్ధస్వభావ!
శ్రీమన్మహాదేవ! సేవానుభావ!
కులగురుం డగుపాలకురికిసోమేశుఁ
డేమి చెప్పినకృతు లీల వెలయించి
భవకీలజనకుండు బసవనార్యుండు
సవిశేషభాష దీక్షాబోధఁ జెప్పె
బసవపురాణంబు పద్యకావ్యముగ
రసికులానసఁగ మీరలుచేసినారు

ప్రభులింగలీలకుఁ బ్రతిచెప్ప నరిది
యభవుభక్తులస్థితి కది యాలవాలము

* * *

కలితకర్ణాటకకావ్యంబు గానఁ
దెలియ దెవ్వరికిని దెనుఁగున మీఱు
శుద్ధసంవిన్మాత్రపశోభితుం డైన
సిద్ధవీరేశ దేశికచక్రవర్తి

* * *

మద్గురుస్వామికి మహితధీనిధికి
సద్గతిప్రదునకు సహజకీర్తనున
కంకితంబుగ ద్విపదాభిరామముగ
శంకరుభక్తులు సంతోషమంద.

అల్లమప్రభుఁ డను వీరశైవగురునిలీల లిందువర్ణింపఁబడినవి

ఇది పాలకురికిసోమేశప్రసాద
విదితాష్టభాషాకవిత్వప్రవీణ
భూమిత్రిపురుప ర్తిబసవేశుపుత్ర
సోమయ దేవాఖ్య సుకవీంద్రముఖ్య
ప్రణీతమై విలసిల్లు ప్రభులింగలీల

ప్రభులింగలీలయందలిమఱికొన్నిపదములను మచ్చునకిట నుదాహరించెదను.

కోటకు వెలుపలఁ గోశమాత్రమున
వాటంబులై పుష్పవాటికలమర
మరకతమణికుట్టిమస్థలంబులును
నిరతంబు ముత్యాలు నెరపుచు రనఁగ
నందుఁ జుట్టును పుష్పితాశోకతరులు
కందర్పనవనిమఁగంబులో యనఁగ
మాకందమందారమాలూరతతులు.
మానివాసనిగాని మలయమారుతము

పూని పువ్వులతావి పొందింపలేదు
తానేమి గొరయని తత్పురారాము
మానితపవమానమాణవకములు
బహుపథికశ్రమ పశ్యతోహారతి
విహరించుఁ బురిలోన వెలిచల్లగాలి. ౩ తె.
పొగడు వేదములను బొగడు శాస్త్రముల
కగపడువాఁడు గాఁ డదహరీంద్రాద్రి
సురల కసాధ్యుండు సొలవక తపము
నిరతంబు చేయుమునివ్రాతమునకుఁ
దగిలినయట్లుండుఁ దగులక యుండు
సగుణనిర్గుణరూపసంగతుం డిట్టి
సుతు లెవ్వరికి లేరు సుకృతిరో మనలఁ
గృతకృత్యులనుజేయ నేతెంచినట్టి
గురుమహేశ్వరుఁ డనికొనియాడి పాడి
చిరతరసుఖవార్ధిఁ జిక్కి సొక్కి
మగువయు మగఁడు కుమారవర్యునకుఁ
దగుపేరు పెట్టంగఁ దలపోసి మనము
నామరూపక్రియానటనవిదూరు
నేమని పేరిడి యిలఁ బిల్వవచ్చు
సంసారియును గాఁడు చర్చించిచూడ
సంసర్గియును గాఁడు శరణవత్సలుఁడు
మర్త్యుండు దాఁ గాఁడు మహిఁ జూడఁగా న
మర్త్యుండు దాఁ గాఁడు మహితవర్తనుఁడు
గాఁడు వర్ణాశ్రమకలితవర్తనుఁడు
కాఁడు కాఁ డనుటకుఁ గన్నడభాష
నల్లమ యనుటకు నర్థంబు గాన
నల్లమప్రభురాయఁ డని పేరుపెట్టి

* * * *

పాలకురికిసోమనాథుఁడు మొదటిప్రతాపరుద్రునికాలమువాఁ డనితలం

చినకొండఱు పండితు లీపిడప ర్తికవుల కాలమును దదనుగుణముగ నిర్ణ యించిరి. కాని యది యసంగీకార్యము. ఈతని ప్రభులింగలీలలను బద్య కావ్యముగాఁ జేసినపిడుప ర్తిబసవకవి యీసోమనాథునిపిడుప ర్తి వాఁ డని చెప్పియుండుటచే నీతఁడునునీతనితండ్రియు నిజాము రాష్ట్రమం దలిపిడుపఱ్ఱు నివాసులనుట నిశ్చయము.

---

## 8 దూబగుంట నారాయణకవి

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; మైత్రావరుణగోత్రుఁడు; బ్రహ్మ నామాత్యునకును నాగమాంబకును బుత్త్రుఁడు.

ఈకవి పంచతంత్రము నాంధ్రమునఁ బద్యకావ్యముగ రచియించి తమ్మభూపాలుని తనయుఁ డగుబసవనృపతి కంకిత మొనర్చెను. కృతిపతిని వర్ణించినపద్యమును, కృతిపతి కవితో ననినట్లు చెప్పినపద్యములను నీ క్రిందఁ బొందుపఱుచుచున్నాఁడను.

సీ. మండలాధిపమూర్ధమకుటమాణిక్యసం
భావితాంచితపాదపంకజుండు
కల్పితహేమాద్రికల్పమహాదాన
ధారుణీదేవసంతర్పకుండు
పరిచరసహావాసభామామనఃప్రియ
భాసురకుసుమశరాసనుండు
మానితాంగకసర్వమంగళాలంకృత
శేఖరీకృతరాజశేఖరుండు

గీ. వల్లభూపాలతమ్మభూవల్లభేంద్ర
శుక్తిముక్తాఫలం బన, జూడ నమరి
మాన్యసామంతవిద్వదమాత్యనృపతు
లోలిఁ గొలువంగ బసవేంద్రుఁ డొక్కనాఁడు.

వ. విద్వత్సంభాషణసమయంబున,

చ. హరిహరభక్తు నర్యనుతు నాంధ్రకవిత్వవిశారదు న్మహీ
శ్వరవరమాననీయుఁ గులవర్ధను శాంతుఁ బ్రసిద్ధుఁ బ్రబంధవాచకా

భరణము నాగమాంబకును బ్రహ్మయమంత్రికి నాత్మసంభవున్
సరసుని మాబగుంటపురశాసను నారయ నామధేయునిన్.

క. తలపించి హితులు చెప్పఁగఁ
బిలిపించి కవిత్వగోష్ఠిఁ బ్రియ మెసఁగంగాఁ
బలుకుచు నితాంతభక్తిం
దలుకొత్తఁగ నంకురించు దరహాసముతోన్.

క. తనముఖచంద్రమరీచులు
జనసముదయచకోరములకు సాంద్రానందం
బొనరింప వేడ్క నన్నుం
గనుఁగొని యిట్లనియె వినయగౌరవ మెసఁగన్.

చ. సుమధుర మానసికకవిత సూరిసభాంతరయోగ్యతామనో
హరసరసార్థగుంభనల నందము గావున నారనార్య సు
స్థిరగతిఁ గీర్తి నన్నెసఁగఁ జేసి సమస్తజగత్ప్రసిద్ధమై
పరఁగుచునుండ మాకొక ప్రబంధ మొనర్పు ప్రియంబెలర్పఁ
గన్.

వ. తత్ప్రబంధం బెయ్యది యనంటేని

ఆ. పంచతంత్రి యనఁగ నంచితగీర్వాణ
భాష మున్ను చెప్పఁబడిన యట్టి
కావ్య మంధ్రభాష గ్రాహ్యంబుగాఁ
గూర్పవలయు నీవు నేర్పు మెఱయ,

వ. అని వినయంబునం దాంబూలనవాంబరాభరణంబు లొసంగి
వీడుకొల్పినం బ్రియంబంది మదాత్మగతంబున.

చ. పసగలనీతిశాస్త్రమని ప్రాజ్ఞులు మెచ్చిన పంచతంత్రికిన్
వసుమతిఁ దమ్మరాజుబసవక్షితినాథుఁడు నాథుఁ డౌటకుం
బొసగి యశోవిలాసినికిఁ బుట్టినయి ల్లని సన్నుతింపఁ బెం
పెసఁగె సముద్రముద్రితమహీస్థలిరాజసభాంతరములన్.

కని మైత్రావరుణగోత్రుఁ డైన ట్లీకిందిగద్యవలనఁ దెలియ
నగును.

"ఇది శ్రీమైత్రావరుణగోత్రపవిత్ర బ్రహ్మనామాత్యపుత్ర సుకవిజన విధేయ నారాయణ నామధేయ ప్రణీతం బైన పంచతంత్రియను మహా ప్రబంధంబు" ఇతనికి నారయ, నారాయణ అను రెండు నామములు గలవు

ఈగద్యయందుఁగాని కవి తనునుగూర్చి చెప్పినపైపద్యములయందుఁగాని తనగృహనామమును చెప్పియుండలేదు. దూబగుంటపుర శాసనుఁడ ననిమాత్రమే చెప్పియున్నాఁడు. దూబగుంటకుఁ గరణ మగుటచే దూబగుంటనారాయణకవియని ప్రజ లనుచువచ్చిరి కాని కవి యింటిపేరు ప్రబంధవాచకాభరణము వా రైనట్లుపైని వ్రాసినచంపకమాలావృత్తమువలనఁ దెలియవచ్చుచున్నది ప్రబంధశబ్దమునకు వ్రాఁత ప్రతిలో నున్నట్లు 'ప్రసిద్ధ' అనుశబ్దమును పాఠాంతరముగా నంగీకరించితిమేని, కవియింటిపేరు "వాచకాభరణము" అయియుండును. వాచకాభరణశబ్దము కవికివిశేషణ మైనఁగావచ్చును. అది యింటిపేరయినచో నీకవిని "వాచకాభరణము నారాయణకవి" యని బిలువవలసియుండును. "భారతము" "వైయాకరణము" అనునింటిపేర్లు గలవారుకలరు. అట్లే వాచకాభరణమువారును నుండియుందురు

దూబగుంటగ్రామములు నెల్లూరుమండలమున మూఁడుగలవు. నెల్లూరునకు సమీపమునం దొకటి, ఆత్మకూరుప్రాంతమునం దొకటి, ఉదయగిరి కనతిదూరమున నొకటి యున్నవి. ఉదయగిరిసమీపమున నున్నదూబగుంటయందుఁ గవు లుండెడివారని ప్రతీతి కలదనియు, నదియే యీకవినివాసమై యుండుననియు జనమంచి శేషాద్రిశర్మగారు పంచతంత్రపీఠికలో వ్రాసియున్నారు.

దగ్గుబల్లిదుగ్గయ్యకవికృత మైననాసికేతూపాఖ్యానమును, నందిమల్లయఘంటసింగయకవికృత మైనప్రబోధచంద్రోదయమును గృతి నందినయనంతామాత్యుఁడు తమ్మభూపతితనయుఁ డగుబసవనృపాలుని మంత్రి యైన ట్లాగ్రంథములలోఁ జెప్పఁబడియున్నవి. ఆబసవనృపాలుఁడే పంచతంత్రమును గృతి నందినబసవభూపతి యిరువురును తమ్మభూపతితనయులే. ఇరువురును మాధవవర్మసంతతివారే. ఈ కారణ

మును బట్టి నారాయణకవి శ్రీనాథకవికం టె వయసున నించుక పిన్న వాఁడై దుగ్గయ, సింగయ, మల్లయకవులతో సమకాలికుఁడై హూణ శకము పదునైదవశతాబ్దియం దుత్తరార్ధమున నున్నవాఁ డని నిశ్చయింపవచ్చును. కృతిపతి యైనబసవభూపాలుఁ డేప్రాంతమునకు రాజుగా నున్నదియు గ్రంథమునుబట్టి నిర్ణయింప సాధ్యపడలేదు. కృతిపతికిఁ బితామహు డైన పెదవల్లభుని భార్య "అన్నలదేవమ్మ"యనియు, నీపెదవల్లభునిపితామహుఁడు "అన్నలదేవుఁ" డనియుఁ గవి పేర్కొనియున్నాఁడు. అన్నలదేవుఁ డనుపేరుగల దైవమొచ్చటనో యుండియుండు ననియు, నాదేవునిపేరులే పైనిచెప్పినవారికిఁ బెట్టియుండు రనియుఁ దలంచుచున్నాఁడను ఆదేవునినివాసము దెలిసినచో నాప్రాంతముననే గవినివాస ముండును. కావునఁ గవినివాసమును దెలిసికొన నవకాశముగలుగును. తమ్మనృపాలునిశాసనములు ఉదయగిరిపైని గన్పడుచుండుటచే నాతనినివాసము ఉదయగిరియనినిశ్చయింపవచ్చును. ఆపరిసరముననున్న దూబగుంటయే కవినివాసము. ఒకశాసనములో బసవనృపాలుఁడు ఉదయగిరి నేలినట్లుండుటచే కృతిపతినివాసము ఉదయగిరి యనుట నిశ్చయము.

కృతిపతినివర్ణించినపద్యములలో నొకచోట

గీ. రామరఘుకంతిసగరధర్మజదిలీప
భోజసర్వజ్ఞసోమేశరాజసరణి
ధాత్రిఁ బాలించెఁ దమ్మభూధవసుతుండు
శాశ్వతంబుగ బసవభూమీశ్వరుండు.

అనివ్రాసియున్నాఁడు. ఇందలిసర్వజ్ఞసోమేశుఁడు పశ్చిమచాళుక్యచక్రవర్తియై పండ్రెండవశతాబ్దియందున్నవాఁడు.

ఈతనికవిత్వమున నపప్రయోగములు స్వల్పముగాఁ గలవు. కాని యవి గణింపఁదగినవి కావు. "ప్రబంధము నా జలరాశి దానిలోపల నెరసు ల్గణింతురె యపారముతో మణు లెల్ల నుండగన్" అనుసూక్తి యిట ననువర్తనీయము.

ఈతఁడు హరిహరభక్తుఁడు. ఈపంచతంత్రమును బైచరాజువేంకటనాథకవికూడ నాంధ్రీకరించి హరిహరనాథున కంకిత మిచ్చియుం

డెను. ఈయిరువురికవిత్వము నం దెవరికవిత్వము మనోహరముగా నుండు ననువిషయమునఁ బండితులు భిన్నాభిప్రాయులై యున్నారు. ఇందును గూర్చి వేంకటనాథకవిచారిత్రమునఁ గొంత వ్రాసియున్నాఁడను.

ఈపంచతంత్రమున మిత్రలాభము మిత్రభేదము, సంధివిగ్రహము, లబ్ధనాశము, అసంప్రేక్ష్యకారిత్వము ననునైదుతంత్రములను గూర్చి చెప్పఁబడినది. కావున దీనికిఁ బంచతంత్రమనిపేరు. ఇంతవఱకు వ్రాసినపిదపఁ గృతిపతితండ్రియైనతమ్మభూపాలుఁడు వ్రాయించినశిలాశాసనములు రెండులభించినవి. ఒకటి యుదయగిరిపైని కాశీవిశ్వేరునకు గుడికట్టించి ప్రతిష్ఠచేయించినట్లును, ఇంకొకటి గోపాలకృష్ణున కొకయాలయమును నిర్మించినట్లును దెలుపుచున్నవి ఆశాసనముల నీక్రిందఁ బొందుపఱుచుచున్నాఁడను. (నె శా. సం. పుటలు ౧౩౭౩-౧౩౭౬)

"శుభమస్తు॥ స్వస్తి శ్రీజయాభ్యుదయశాలివాహన శకవరుషంబులు ౧౩౮౨ అగు నేటివికృతిసంవత్సర శ్రావణ శు ౧౧ ఆ కంటమరాజు వలభలకుమారుఁడు తమ (తమ్మ) రాయనింగారు వుదయగిరి మీఁదిమన్యానం కాని విశ్వేస్వర దేవరకు నగరుకట్టించి ప్రతిష్టచేయించి యీ దేవునికి నైవేద్యంనకును దీపారాదనకు మదినానకుబియ్యంచో దెన౧। పెసలున=నెఇవి-। యీమరియాదను సేను సర్పించిరి. యీదేవునికి అంగరంగవయిభవాలకును నడిమితూముంకిందను వరిచేను ౧౦౦౦ యీవరిమడి నిరోహరి లేక చెల్లిఅట్లుగాను పెటితిమి యీధర్మశాసనానకు తప్పక యీదుర్గం యేలినవారు పాలించిబ్రతుకువారు మంగళమహాశ్రీశ్రీశ్రీంజేయును"

"శుభమస్తు॥ స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౩౮౨ అగునేంటి వికృతిసంవత్సర శ్రావణశు౧౧ ఆ. రఘువంశంరాజు బెజవాడ పాడిగడించిన మాధవవర్మమనుమండు రణరంగభైరవమల్లికావల్లభ సహకారబాంధవ వాసబిరుథరగండం డనంబరగిన కంటమరాజు వలభయ్యకుమారుండు తమ్మరాయనింగారు వుదయగిరిమీందిమన్యాన గోపాలక్రిష్ణునికి నగరుకట్టించి ప్రతిష్టసేయించిరి. యీదేవునికి నైవేద్యానకున్ను దీపారాదనకున్ను దినానకుబియ్యం చోదెన౧। పెసలు=

నెయ్యన-॥ యీమరియాదను సమర్పించిరి. యీ దేవునికి అంగరంగవైభ వాలకున్ అమళ్ళుచెరువు వెనకను నడిమితూముక్రిందను కుం౧౦౦౦ యీ పట్టి వరిమడ్లు నిరోపాధి లేక చెల్లిఅట్టుగాను దారవోసి సమర్పించిరి యీ మరియాదను ధర్మం యెవ్వరు పాలించినాను యీకట్టును సమర్పించి బ్రితుకువారు. స్వదత్తాద్విగుణంపుణ్యంపరదత్తానుపాలన. పరదత్తాపహా రేణస్వదత్తంనిష్ఫలంభవేత్. మంగళంమహా. శ్రీశ్రీశ్రీం జేయును."

పంచతంత్రకృతిపతి యగుబసవభూపాలునకు సవతిసోదరుఁడైనబసవరాజు కుమారుం డగుసింగయయొక్క శాసన మొకటికలదు. అది యీకవికాల నిర్ణయమున కుపయోగించునని తలంచి యీక్రింద నిచ్చుచున్నాఁడను. శుభమస్తు॥ స్వస్తి శ్రీ జయాభ్యుదయ శాలివాహనశక వర్షంబులు౧౪౭౦ అను నేటి బహుధాన్య సంవత్సర వైశాఖ శు ౧౫ ఆ. శ్రీమన్మహా రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీకృష్ణదేవరాయ మహారా యలుంగారు పృథివీరాజ్యముసేయుచుండంగాను సాళువ తిమ్మరుసయ్యం గారు మహాప్రిధాను లై నడపంగాను వసిష్ఠగోత్రిం సూర్యవంశోద్భవు లైన హొసబిరుదరగండ సహకారబాంధవ మల్లికావల్లభ రణరంగభై రవ గండభనంజయ బిరుదాంకు లైన బెజవాడ దుర్గావరప్రసాదు లైన మాధవవర్మ వంశోద్భవులైన కంఠమరాజు (కొమ్మరాజు)గారి కొమాం రుండు అన్నలదేవరాజు. ఆయనకొమారుండు సింగరాజు. ఆయనకొమా రుండు పెదవల్లభరాజు.—ఆ పెదవల్లభరాజుంగారి పెద్దదేవులైన అన్నల దేవి కొమాళ్లు సింగరాజున్ను తమ్మరాయంమన్ను – చిన్నదేవు లైన రాయకమ్మ కొమాళ్లు ప్రిభాకరపట్టణం గట్టించిన ప్రిభాకరరాజున్ను పాపరాజున్ను యీనలుగురిలోను తమ్మరానింగారి కుమాళ్లు వుదయ గిరియేలిన బసవరాజున్ను తిరుమలరాజున్ను వల్లభరాజున్ను పాపరాజుం గారికిన్ని ధనంజయగోత్రులైన కీర్తిపాటి సిరిగిరిరాజుంగారి కొమారిత వల్లమదేవులుంగారికిన్ని కొమారుం డైన శ్రీ మన్మహామండలేశ్వర సింగయ్యదేవ మహారాజులు తమతల్లి దండ్రింగారికిన్ని తమఅన్న బసవ రాజుంగారికిన్ని పుణ్యముగానున్ను తనకీర్తి సుకృతాలు ఆచంద్రార్కు లై వుండేటట్టుగానున్నూ శేయించిన ధర్మాలు ......... ...పూర్వ నాయంకర మైన చాంగల......... కేశవదేవరకు గోపురమున్ను...

...... ...... ...... ......కు గోపురప్రాకారాలున్ను గుడిన్ని చాంగలమ్మ గుడిన్ని తమతల్లి వల్లమదేవులుంగారి పేరను తిరుమలదేవర గుడిమంటపమున్ను వీధిన్ని కట్టించి తమ అన్న తిరుమలరాజు బెట్టి నగుండ్లమడుగు తిమ్మసముద్ర మని అగ్రహారానను వినాయక శివ విష్ణు దేవాలయాలున్నూ తటాకారామాదులున్ను బ్రహ్మప్రతిష్ఠలున్ను ప్రతిష్ఠించి బెజవాడవద్దను తమతాత మాధవవర్మకుం బ్రత్యక్షమైన దుర్గాదేవికి తొలినిర్మితమైవుండిన గర్భగృహముముందరి అంతరాళికమున్ను పదిలం•శేయించి ఆ ముందరను నల్లశీనపురాళ్లున్ను అంతరాళికమును ఆముందరను తొమ్మిది అంకణాలరంగ మంటపమున్ను ఆ ముందరను భోగమంటప మైన మూఁడు అంకణాలభద్రమున్ను కటించి రాతిగోడాను పెట్టించి పీఠముకట్టించి యప్పుడు భూమిలోననుండి వెళ్లనెత్తిన కేశవనాథుకిన్ని మీఁదఁ బ్రతిష్ఠసేయించి దుర్గిదేవమ్మ వుద్భవమై వుండిన కొండ వుత్తరపుదిక్కు-చట్న తూర్పుపడమర్లు నిడుపు తొమ్మిదిచేతులున్ను ...... ...... ......వ్రాయించి నిలిపిన ధర్మశాసనము. శ్రీశ్రీశ్రీశ్రీ శ్రీశ్రీదుర్గాదేవమ్మ తన వరప్రసాదులైన యీగుడిగటించ్చిన సింగరాజుంగారికిన్ని ఆయన కుమాళ్లు పాపరాజు కొండరాజు బసవరాజు వల్లభరాజు నాగరాజుచేత రాజుంగారికిన్ని ఆయుష్యాభివృద్ధిచేసి వంశాభివృద్ధిచేసి రాజాభివృద్ధిచేసి రక్షిం ... ...(ద. హిం శా. సం. ర. సంఖ్య ౭౮౯.) పైని నుదాహరించిన బసవభూపాలుని తండ్రి శాసనములు క్రీ. శ. ౧౪౬౦ సంవత్సరమునాఁటివి. ఈ సింగరాజు శాసనము క్రీ శ. ౧౫౧౮ నాటిది. ఈసింగరాజుతండ్రి ౧౪౮౦-౧౫౯౦ ప్రాంతమునందుండును. ఈ రెండు కాలములనడుమనున్న బసవభూపాలుఁడు ౧౪౭౦ ప్రాంతమున దూబగుంట నారాయణకవిచే నీ పంచతంత్రమును కృతినందియుండు నని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

ఈ బసవభూపాలుని గృహనామము "పూసపాటి" వారని శ్రీ టేకుమళ్ల అచ్యుతరావుగారికిందివాక్యములలో ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికయందు వ్రాసియున్నారు. "ఈ పూసపాటి మాధవవర్మ వంశములో నాఱవపురుషుఁడుగా బసవక్షితీంద్రుఁడు జనించెను" మాధవవర్మ గృహనామము "పూసపాటి" వారని తలంచుట కాధారములు

లేవు. పూసపాటివారు తమ వంశమునకు మూలపురుషుఁడు మాధవ వర్మ యని చెప్పుకొనినమాట నిజమే. మాధవవర్మ వంశములోని యొకానొకపురుషుఁడు పూసపాడు నివాసముగాఁ జేసికొనుటచే నప్పటి నుండియు నావంశీయులు పూసపాటివా రైరి. అంతమాత్రముచే మాధవవర్మ యింటిపేరు పూసపాటియనిగాని, బసవభూపాలుని యింటిపేరు పూసపాటి యనిగాని తలంపవీలు లేదు. మాధవవర్మ వంశములో జనించిన మఱియొకపురుషుని నివాసమునుబట్టియో, అట్టిమహాపురుషుని పేరునుబట్టియో, గృహనామము లేర్పడుచుండుట కవకాశము కలదు. ఈ బసవరాజు గృహనామము కంఠమరాజువా రైనట్లు పైనివ్రాసిన శాసనములలో కంఠమరాజుపే రుదాహరించుటనుబట్టి యూహింపఁదగి యున్నది. "మాధవవర్మ వంశములో నాఱవపురుషుఁడయిన" యని శ్రీ యచ్యుతరావుగారు వ్రాసినవాక్యములు సంశయకారణములుగనున్నవి. మాధవవర్మ వంశములోఁ గొన్నివందలసంవత్సరములు గడచినపిదప జన్మించిన కొమ్మరాజనునతని కీ బసవరా జాఱవపురుషుఁడు. గాని మాధవవర్మ కాఱవపురుషుఁడు కాఁడు. మాధవవర్మ శా. శ. ౮౮౨ నాఁటివాఁడని అచ్యుతరావుగా రుదాహరించినసీసమాలికయం దున్నది. మాధవవర్మగృహనామము పూసపాటివారని వాదముకొఱ కంగీకరించినను, ఆతనిసంతతివారందఱును పూసపాటివారుగా నుండురని యెంచ రాదు. గృహనామము లనేకకారణములచే మార్పుఁ జెందుచుండును. పిఠాపురము బొబ్బిలిసంస్థానాధిపతు లగురావువారును, వెంకటగిరిసంస్థానాధిపతు లగువెలుగోటివారును జటప్రోలుసంస్థానాధిపతు లగు సురభివారును వేతాళరెడ్డివంశీయుల మని చెప్పుకొనుచున్నారు. కావున సాధనాంతరములు లభించువఱకును బసవనృపాలునిగృహనామము కంఠమరాజువా రనియే యంగీకరింపవలసియున్నది ఈబసవనృపాలుఁడు గజపతులకు సామంతుఁడై యుదయగిరిప్రాంతమున నున్నవాఁడనియు, నారాయణకవి యుదయగిరిసమీపమునం దున్నదూబగుంటనివాసియనియు నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

సంస్కృతమున విష్ణుశర్మయనుపండితుఁడు పంచతంత్రమును రచియించియుండెను. దాని నాధారముగాఁ దీసికొని యితఁడును, బైచ

రాజువేంకటనాధకవియు శిష్టుకృష్ణమూర్తిపండితుఁడును బద్యకావ్యములను రచియించియుండి; నెల్లూరువాస్తవ్యు లగు "ఉల్లంగిరామచంద్రరావుగారు" కూడ నీపంచతంత్రమును బద్యకావ్యముగా రచియించినట్లును సంస్కృతమున క్షేమేంద్రుఁడు కూడఁ బంచతంత్రిని వ్రాసియున్నట్లును శ్రీ టేకుమళ్ళ అచ్యుతరావుగారు వ్రాసినదానినిబట్టి తెలిసికొంటిని. నా కాగ్రంథములు లభ్యములు కాలేదు. భానుకవి యనునతఁడు కూడనాంధ్రమున బంచతంత్రమును వ్రాసియుండెను. కవిపేరు తెలియని పంచతంత్రమొకటి కలదు.

ఇతనికవిత్వము మృదుమధురపదభూయిష్టమై చక్కనిధారఁ గలిగి మనోహరముగా నుండును. సౌమ్యసౌరభమిళితమై చూచుటకింపుగా నుండు పుష్పము హస్తమం దున్నప్పు డెట్టియానందము నొడముచుండునో, అట్టియానంద మీతనిపద్యములను జదువునప్పుడు పాఠకునిహృదయమునకుఁ గలుగుచుండును. కవితాశైలి తెలియుటకై యీతనిపద్యములను గొన్నిటిని నుదాహరించుచున్నాఁడను.

చ. నడవడి మంచి దైనను జనంబులు పెద్దఁగఁ జూతు రాతనిన్
నడవడి చక్కఁగాని నరు నచ్చినచుట్టము నైనఁ జేరనీ
రెడ గలుగంగఁ దోలుదు రహీనతయున్ లఘువృత్తియు న్మహిన్
నడవడిచేత వచ్చుటది నైజము దీని నెఱుంగ వింతయున్. ౧౦౮మి

శా. ఆలస్యంబును గామినీజనరతివ్యాసక్తియున్ జన్మభూ
లోలత్వంబును రోగమున్ ఘనభయోల్లోభంబు సంతోషమున్
బోలంగా నివి యాఱు నెప్పుడు జగత్ప్రాజ్యప్రతాపోన్నయ
శ్రీలం జెందఁగ విఘ్నకారణములై చెల్లున్ ధరామండలిన్. ౧౭౬ను

ఉ. వచ్చినవారికిన్ వగవఁ జయ్యన వారలు లేచి క్రమ్మఱన్
వచ్చుట లేమి డెల్ల మిఁక వారణముల్ మగుడంగ నింతగా
వచ్చిన నున్నవారము నవశ్యముఁ జత్తుము గాన దీనికిన్
జెచ్చెరఁ జింత సేయుము విశేషమతిం బ్రతుకం దలంచినన్. ౯౧సం

ఉ. ఎక్కువ చెప్పఁ జూపఁ గలయింట జనించుకులాంగనాళిలోఁ
జక్కఁదనంబు గల్గి గుణసంపద మించి యలౌకికస్థితిన్

నిక్కక యేమృగాక్షి పతి నిర్మలచిత్తము పట్టు భక్తిమై
నక్కమలాక్షి యెవ్వనికి నాలగు వాఁడు కృతార్థుఁ డిమ్మహిన్.

33 ల.

చ. కలువరుఁ బెంచినన్ ఘటముగర్భమునం గలసత్త్వవంతయుఁ
దలఁగక యిమ్మి మేకఁ గొన దానికిఁ బిల్లలు రెండు గల్గు న
మ్మలకలు రెంటికిం గలుగు మానుగ మాడలు నాల్గు వానికి
ట్లలిమిటి నెన్న నెన్మిదిఁ బదాఱును ముప్పదిరెండుఁ బుట్టఁగన్.

౧౧ అసం.

ఎఱ్ఱాప్రెగ్గడకవికిఁ బోషకుఁడైనప్రోలయవేమారెడ్డికిఁ గనిష్ఠసోదరుఁడగుమల్లారెడ్డికి మునిమనుమఁడైనకోమటిరెడ్డియొద్ద పూబగుంటకొమ్మనసోమయాజి మంత్రిగా నుండి యనేకధర్మశాసనములు వ్రాయించెను. ఈకోమటిరెడ్డి నెల్లూరుమండలమందలి కందుకూరు తాలూకాలోని చుండిప్రాంతమున రాజ్యముచేసినట్లు కన్పట్టుచున్నది. కొమ్మనసోమయాజికి హరిహరనాథుఁడు, రామచంద్రుఁడు, నారపరాజు అనిముగ్వురుకుమాళ్ళు. కొమ్మనసోమయాజి మైత్రావరుణగోత్రుఁడే. ఇతనిశాసనములు శా. శ. ౧౩౫౨ లో నున్నవి (నె. శా. సం. పుట ౪౯౫-౫౦౧) మననారాయణకవియు సోమయాజి కుమారుఁడైననారపరాజును ఒకవ్యక్తికాఁజాలఁడు. నారాయణకవితండ్రిపేరు బ్రహ్మయామాత్యుఁడు. నారపరాజుతండ్రిపేరు కొమ్మన సోమయాజి. ఈ నారపరాజునకు మననారాయణకవిమనుమఁడేమో! లేక దాయాదియో! ఈ విషయమున నింకను బరిశోధనము కావలసియున్నది. పూబగుంట యనునింటిపేరు శా. శ. ౧౩౫౦ నాఁటినుండి యున్నట్లు పైశాసనముల వలనఁ గన్పట్టుచున్నది.

# 9 దగ్గుబల్లి దుగ్గన కవి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; శాండిల్యగోత్రుఁడు; తిప్పనార్యతనూజుఁడు; ఇతనితల్లి యెఱ్ఱమ్మ; పోతనయెఱ్ఱన లితని కగ్రజులు; కవిసార్వభౌమబిరుదాంచితుఁడైన శ్రీనాథమహాకవి కితఁడు మఱఁది.

ఈకవి కాంచీపురమాహాత్మ్యము, నాసికేతోపాఖ్యానము అను రెండుపద్యకావ్యములను రచియించెను. ఇందు మొదటిగ్రంథమును చెందలూరిగంగయమంత్రికుమారుఁడగు దేవయామాత్యునకును, రెండవకావ్యమును చెందలూరి అనంతామాత్యునితనయుఁడగు గంగయామాత్యునకు నంకితము చేసెను. కృతిపతు లిరువురు నన్నదమ్ములబిడ్డలు. కాంచీపురమాహాత్మ్య మిప్పు డెచ్చటను గనపడుట లేదు. నాసికేతోపాఖ్యానము మూఁడవ యాశ్వాసములోఁ గొంతవఱకు ముద్రితమైన ప్రతిని నేను జూడఁగల్గితిని. కృతిపతి యైనగంగయమంత్రి తనను గూర్చి పలికినట్లు కవి యీక్రిందిపద్యములలోఁ జెప్పుకొనియున్నాఁడు.

చ. శ్రుతులవిహారదేశములు సుస్థిరవాక్యపదప్రమాణశా
స్త్రతతులయిక్క లాగమపురాణచయమ్ముల కేలిసద్మముల్
స్మృతులనివాసముల్ కవిసమీహితసత్కవితాగుణప్రసా
దితములు దగ్గుబల్లి కవితిప్పయదుగ్గనిగద్యపద్యముల్.

క. హితమతివి సకలవిద్యా
చతురుండవు చాటుపద్యజాలంబుల నా
కతులితకీర్తులఁ గలిగిం
చితి దుగ్గనకవివరేణ్య శివకారుణ్యా.

సీ. శ్రీనాథసుకవి కూరిమిసేయుమఱఁదివి
దుగ్గయకవిరాజ దగ్గుబల్లి
తిప్పనార్యునకు సతీమణి యెఱ్ఱమ
కును దనూజుఁడవు పోతనకు నెఱ్ఱ

నామాత్యవర్యునకు ననుఁగుఁదమ్ముండవు
శాండిల్యగోత్రుఁడా సరసమతివి
చెప్ప నేర్తువు కృతులు సుస్థిరముగాఁగఁ
గాన నీవు రచింపఁగఁ గడగియున్న
నాసికేతచరిత్రంబు నాదు పేర
నంకితము సేయు కవిరాజు లాదరింప

ఉ. మా పినతండ్రి గంగయ యమాత్యశిఖామణి తత్తనూభవుం
డా పెనుపొందు దేవసచివాగ్రణి కిచ్చితి నంధ్రభాషఁ గాం
చీపురనాథు దివ్యకథఁ జిత్రతరంబుగ విస్తరించి నీ
మోపుదు నార్యహృద్యమధురోక్తుల సత్కృతులొప్పఁ జెప్పఁగన్

కృతిపతు లాపస్తంబసూత్రులును కశ్యపగోత్రులు నగు నియోగి బ్రాహ్మణులు. వీరివంశమును గవి యిఱువదిపద్యములలో వర్ణించియున్నాఁడు. కాని యందుఁ జరిత్రాంశములు లేవు. కృతిపతియైన గంగయామాత్యుఁడు మాధవవర్మవంశములోనివాఁడైన తమ్మభూపతితనయుఁ డగు బసవనృపాలుని మంత్రియైన ట్లీక్రిందిపద్యములలో వర్ణించి యున్నాఁడు.

సీ. చతురంగబలముల జయవాడదుర్గాంబ
వరమునఁ బడసి దుర్వారలీల
జగతీస్థలం బెల్ల సాధించి జయశాస
నములు దిగ్దంతిదంతముల నిలిపి
పేదబాలునకుఁగాఁ బ్రియసుతమోహంబు
పట్టక బెజవాడ పాడి నిలిపి
కలయంగఁ బురమునఁ గాంచనవర్షంబు
గురియించి దేవతాకోటి పొగడ

గీ. వసుధ నెగడిన మాధవవర్మ వంశ
వర్ధనుం డగుతమ్మభూవరుని బసవ
పార్థివున కార్యుఁడై కృపాపాత్రుఁ డగుచు
ఘనత మెఱసె ననంతయగంగవిభుఁడు

సీ. రమణ దుర్గాభైరరాజు పెద్దనమంత్రి
వరసుతు రాజశేఖరునుపుత్రిఁ
బావనచారిత్రి బతిహితారుంధతిఁ
దాలిమి భూదేవతాసమాన
సజ్జనాశ్రితబంధుజనదీనపోషణ
సన్మానమానస శాంతమూర్తి
పరమదయాపాంగ భాగ్యసంపన్నిధి
లాలితాకార సలక్షణాంగి

గీ. నారమాంబిక భార్యగా భూరిమహిమ
నఖిలదిక్కులఁ దనకీర్తి యతిశయిల్ల
వెలసె నెల్లజనంబులు వినుతి సేయ,
గాంతిచంద్రుఁ డనంతయ గంగవిభుఁడు

నందమల్లయ ఘంటసింగయకవులచేఁ బ్రబోధచంద్రోదయ మనుబద్యకావ్యమును గృతినందిన దీగంగయామాత్యుఁడే. దుగ్గయకవి శ్రీనాథునకు బావమఱదియైనను మిగుల చిన్నవాఁడై శ్రీనాథుఁడు పండితుఁడైనపిమ్మట నీతఁడు శిష్యుఁడైనందున శ్రీనాథునకు నీతనికి వయసునఁ జాలయంతరముండునని తలంపవలసియున్నది. ఇతఁడు ౧౪౧౦ సంవత్సర ప్రాంతమున జన్మించి ౧౪౬౦ ప్రాంతమున నీకావ్యమును రచియించి యుండును. నందిమల్లయఘంటసింగయలకంటె నితఁడు కొంచెము పెద్దవాఁడై యుండును. ప్రబోధచంద్రోదయమును రచించు నాఁటికి బూర్వమే గంగయామాత్యుఁడు నాసికేతోపాఖ్యానమును గృతినందియుండెను. దుగ్గనకవి. కాంచీపురనాథమహాత్మ్యమును ౧౪౭౦ ప్రాంతమున రచియించియుండును. నాసికేతోపాఖ్యానకథ ఉపనిషత్తులయందున్నది. బ్రహ్మమానసపుత్త్రుఁ డగునుద్దాలకుఁ డనుముని బ్రహ్మచర్యమునందుండి ఘోరతపస్సు చేయుచుండెను. మహర్షు లతనిని గృహస్థుఁ గమ్మని బోధించిరి. ఆతఁ డీయకొనలేదు. బ్రహ్మ యాతనికడ కరుదెంచి వివాహ మాడుమని చెప్పెను. కాని యాతఁడు వినలేదు. నీ కుద్భవించినకుమారుఁడు నీకు వివాహముసేయునని బ్రహ్మ యానతిచ్చి తిరోహితుఁ డయ్యెను. ఈయద్భుతసంఘటన మెట్లు జరుగునో చూడ

వలయునని యుద్దాలకుఁడు తపోనిరతుఁడయియే యుండెను. ఒకనాఁ డాతనిస్వప్నమున నొకస్త్రీని గలిసికొనినట్లై వీర్యపతన మయ్యెను. ఆతఁ డావీర్యమును పద్మపత్త్రము నందుంచి, దానిపై నొకయాకు వైచి గట్టిగా కట్టివైచి నదీగర్భమునఁ బడవైచెను. సూర్యవంశపువాఁడయిన రఘువనుదురాజు తనయ చంద్రవతి, నిండుజవ్వని, చెలులతోఁగూడి స్నానార్థము నది కేఁగి స్నానము చేయుచున్నంత నాకుతోఁజుట్టఁబడిన యాకందుకము సమీపమునకు రాఁగా దానిం దీసి విప్పి లోపలనున్న పద్మపత్త్రంబు నాఘ్రాణించెను. అం దున్నయుద్దాలకునివీర్య మామె నాసాపుటంబునంబడి యుచ్ఛ్వాసంబుతో గర్భంబునఁ బ్రవేశించెను. చంద్రవతి గర్భముం దాల్చెను. కుమారి గర్భవతియయ్యె ననువార్త క్రమక్రమమున రా జెఱింగి దుఃఖించి, కులము కళంకితంబయ్యె నని తలంచి కోపించి యామె నొకఘోరారణ్యంబున నొంటిగ విడిచి రండని భటుల కాజ్ఞాపింప వా రట్లు చేసిరి. దిక్కుఁగానక యామె యేడ్చుచుండ నొకఋషి యటకువచ్చి యామెవలన సకలవృత్తాంతంబు నెఱింగి దివ్యజ్ఞానంబుచేఁ జూచి యొకమహాత్మునివీర్యంబు గర్భంబున నుండుటనుగాంచి యామె నోదార్చి తనయాశ్రమంబునకుఁ దీసికొనిపోయి యుంచెను. ఆమె యొకమగశిశువుం గనెను. అతఁడే నాసికేతుఁడు. నాసికమూలమున నాఘ్రాణింపఁబడిన వీర్యమువలనఁ గలిగినవాఁడని యాతనినామముచే స్ఫురింపఁబడుచున్నది. చంద్రవతి యాయర్భకు నొకపెట్టెయందుంచి, యీతనిజననమునకుఁ గారకుఁ డైనమహానుభావు నీమందసము చేరుఁగాక యని యాశీర్వదించి యాపెట్టెను నదీజలములఁ ద్రోయించెను. స్నానార్థ మరుదెంచినయుద్దాలకునికడ కామందసము రాఁగా దానిం దీయించి బ్రహ్మవర్చస్సుతో నున్నయాబాలకుని తనయాశ్రమమునకుఁ గొంపోయి యతిప్రేమమునఁ బెంచుచుండెను చంద్రవతి కొంతకాలమున కరణ్యములవెంట హానాసికేతా! ఎందున్నవాఁడ వని యాక్రోశించుచుఁ దిరిగి తిరిగి యీబాలుఁ డున్నయాశ్రమమునకు వచ్చి ఓనాసికేతా! యని యాక్రోశింప నాబాలుఁడు 'ఓ'యని మాఱుపలికెను. చంద్రవతి యాతనికడకు వచ్చునంత కుద్దాలకుఁడు సమిధలకై యరణ్యమున కేఁగెను. చంద్రవతి యాబాలకునివలన యావదుదంతమును

విని, యీమునియే తనభర్తయని నిశ్చయించుకొని యాతఁడు వచ్చిన ప్పటి కాయాశ్రమమునంతయుఁ బరిశుభ్రముచేసి యలికి ముగ్గులువెట్టి తాను సమీపమందలిపొదలో నుండెను. ఉద్దాలకుఁడు వచ్చి యాశ్రమము నలంకరించినవా రెవ్వరని బాలు నడిగెను. మాయమ్మ వచ్చి యివి యన్నియుఁ జేసెనని చెప్పి యాబాలుఁ డామెనుజూప నామె యామునికి నమస్కరించి బాష్పోదకంబులచే నాతనిపాదంబులం గడిగెను. ఉద్దాలకుఁడు దివ్యదృష్టిచే నంతయు నెఱింగి, బ్రహ్మవాక్యము దప్పదని తెలిసికొని యామె చెప్పినరీతిగ నామెతల్లిదండ్రులయొద్ద కామెను దీసికొని చని, యచ్చట సకలబంధుమిత్రపురోహితమంత్రిజనంబులయెదుట నామె నిర్దోషియని స్థిరపరచి యందఱిసమక్షమున నామెం బరిణయమాడి సతీసుతసమేతుఁడై యాశ్రమంబునకువచ్చి, కాలముం గడపుచు, నొక్కింతకాలంబునకు, యోగనిష్ఠలోనుండి యగ్నిహోత్రంబునకు సమిధలం దేకుండ నున్నపుత్రునిఁగాంచి నగ్నికార్యంబునకంటె యోగానుష్ఠాన మెక్కువయని వాదించు నతనిపైఁ గోపించి, నాకిదు రాడితివి గాన యమునింజూడఁ బొమ్మని శపించెను. నాసికేతుఁడు విలవిలఁ దన్నుకొనుచుఁ బ్రాణంబులవిడచి యమనగరంబునకుఁ బోవ నాతఁ డెదురువచ్చి పూజించి యాతనికిఁ బుణ్యాపాపవిచక్షణాధర్మంబులం జెప్పుచు నాతనికి స్వర్గనరకంబులఁ జూపించుచుండెను ఇంతవఱకుఁ గల గ్రంథము మాత్రమే ముద్రిత మైనది. తక్కినది యిప్పు డెచ్చటను లభించుటలేదు.

గోదావరిమండల మందలి రామచంద్రపురము తాలూకా పెద్దాడ నివాసి యగు మిక్కిలి మల్లికార్జునకవి కూడ నీ కథనే పద్యకావ్యముగా రచించెను. అందు నాచికేతుఁడని చెప్పఁబడినది. కఠోపనిషత్తునందును, భారతాను శాసనికపర్వమునందును గూడ నీ కథ యున్నది. ఆరెండిటియందునుగూడ నీతనిపేరు నాచికేతుఁడనియున్నదని యుఁ బునహాయందున్న భండార్కరు లిఖితగ్రంథములు రెండిటిలోను నాసికేతఃఅనియేయున్నదనియు, నాసంస్కృతగ్రంథమే దుగ్గకవికిని మల్లికార్జునకవికిని గూడ మూలాధారమనియు, నాలిఖితగ్రంథ మే పురాణామునుండి యెత్తి వ్రాయఁబడినదో తెలియలేదనియు నీకథకును కఠోప

రిషత్తునందలి కథకును భారతమునందలికథకును నొకదానికొకటి సంబంధము లేదనియు శ్రీ టేకుమళ్ల అచ్యుతరావుగారాకథలను వేఱువేఱుగావ్రాసియుండిరి (భారతి-అక్షయ సంవత్సర పుష్య, మాఘమాసములు) తండ్రి తన కుమారుఁడైన నాసికేతునకు యమునిఁ జూడఁబొమ్మని క్రోధముతో ననుటయు, నాతఁడు యమునింజూచి స్వర్గనరకముల దర్శించి యమునివలన ధర్మజ్ఞానముల నెఱింగివచ్చుటయు ననిగ్రంథములయందును సమానమే. ఉపనిషత్తునందును భారతమునందును నాచికేతుని జననగాథ చెప్పఁబడలేదు. ఉద్దాలకుని కోపకారణము మాత్రము మూఁడుగ్రంథములయందును మూఁడు విధములుగాఁ జెప్పఁబడినది.

౧. కఠోపనిషత్తునందలి ఋషి యుద్దాలకుఁడు గాఁడు. వాజశ్రవసుఁడు. అతఁడు 'విశ్వజిత్తు' అనుయజ్ఞముచేసి బ్రాహ్మణులకు దక్షిణల క్రిందఁ దనసర్వస్వమును ధారవోయుచుండఁగా నాచికేతుఁడుబాల్యచాపలమున నడుమ నడుమ "నన్నెవరి కిచ్చెదవు" అని పలుమాఱడిగెను. అందులకు విసువుఁజెంది "నిన్ను యమున కిచ్చెద" ననెను. నాచికేతుఁడు ప్రాణములఁ గోల్పోయి యమలోకమునకుఁ బోవునప్పటికి యముఁ డెచ్చటికోపోయి మూఁడు దినములవఱకు రాలేదు. ఆమూఁడు దినములును నాచికేతుఁడు శుష్కోపవాసములతో నుండెను. యముఁడందులకుఁ జింతనొంది మూఁడువరములఁ గోరుమనియెను. నాచికేతుఁడు (౧) తండ్రి యెన్నఁడును దనపైఁ గోపింపకుండునట్లును (౨) తన కొక యనూనమైన యజ్ఞవిధానమును యముఁడు నేర్పునట్లును (౩) మనుష్యుఁడు మరణించినపిమ్మట జీవుఁ డుండునని కొందఱును, ఉండఁడని కొందఱును దలంచుచున్నారు కావున నీసంశయ నివారణము చేయునట్లును గోరెను. యముఁ డావరముల నొసంగి జ్ఞానోపదేశము చేసి తండ్రికడకు మఱలఁ బంపెను.

భారతమునందలి కథ యిట్లున్నది. ఉద్దాలకుఁడు సమిధలు పుష్పములు మొదలగునవి దెచ్చి నదియొడ్డునఁ బెట్టి మఱచిపోయి యింటికి వచ్చి వానిని దెమ్మని కుమారుని నియమించెను. నాసికేతుఁడు నదికిఁ బోయి వచ్చి ప్రవాహవేగమున నవి కొట్టుకొని పోయెనని చెప్పెను. ఆకలిబాధచే నీరసముగా నున్న యాముని కందుపైఁ బట్టరాని

కోపము వచ్చి యమలోకమునకుఁ బొమ్మని తిట్టెను. నాసికేతుఁడు విలవిలఁ దన్నుకొనుచుఁ బ్రాణములను విడచెను. ముని పశ్చాత్తప్తుఁడై బాలకుని శవము నొడిలోఁ బెట్టుకొని యేడ్చుచుండ నింతలో మరల బాలకుఁడు లేచి తండ్రికి యమలోకమునందలి విషయములను జెప్పెను.

భండార్కరుగారి వ్రాఁతప్రతియందలి కథయే దుగ్గనకవి నాసికేతోపాఖ్యానమునకు మూలాధారము. ఉద్దాలకుని కోపకారణము అందెట్లున్నదియుఁ బైనివ్రాసియే యుంటిని.

పవిత్రమైన యీకథను గ్రహించి దుగ్గనకవి తన కవితాశక్తిని వినియోగించి యొకగ్రంథమునుగా రచించెను. ఇతని కవిత్వము మృదువై మనోహరముగానున్నది. ఈగ్రంథమును జదువువారలకు ప్రతిపద్యమునందును బవిత్రత గోచరించుచుండును. దుగ్గకవి శ్రీనాథునకుఁ బ్రియశిష్యుఁడైనను శ్రీనాథునకువలెశృంగారవర్ణనాభిలాషయితనికి లేదు. నాసికేతోపాఖ్యానమున నుద్దాలకునియొక్కయు, చంద్రవతియొక్కయుఁ బాత్రములను జక్కఁగా పోషించినాఁడు. మిక్కిలి మల్లికార్జునుని కవిత్వముకంటె నీతని కవిత మనోహరముగా నున్నది. ఇతఁడు శివకేశవులయందు సమానభక్తి కలవాఁడని నాసికేతోపాఖ్యానమందలి ప్రథమ ద్వితీయపద్యములు చెప్పుచున్నవి. ఈక్రిందిపద్యములోఁ గవి తాను వ్రాయఁదలఁచినకథను గొనియాడియున్నాఁడు.

క. ఏకథ పురాణసమ్మత
మేకథ వేదప్రసిద్ధ మేకథపుణ్య
శ్లోకస్తుత్యగుణాన్విత
మేకథ చదువంగ వినఁగ నింపైయుండున్.

శ్రీనాథున కితఁడు బావమఱదియేగాక శిష్యుఁడు నాతనియెడల విశేషగౌరవముగలవాఁ డనుమున క్రిందిగద్యవలనఁ దెలియుచున్నది.

“ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్యపుత్త్ర కవిసార్వభౌమ సకలవిద్యాసనాథ శ్రీనాథ మహాకవీంద్రప్రసాదలబ్ధకవితావిశేషదగ్గుబల్లితిప్పనార్యప్రియతనూజ దుగ్గననామధేయప్రణీతం బైన నాసికేతోపాఖ్యానం బనుమహాప్రబంధంబు”

దీనినిబట్టి శ్రీనాథునకుఁ గవిసార్వభౌమబిరుదము లభించినపిమ్మట నే యీగ్రంథము రచింప బడినట్లు కన్పట్టుచున్నది. శ్రీనాథునకుఁ గవిసార్వభౌమబిరుదము క్రీ శ ౧౪౧౦ సంవత్సరప్రాంతమున లభించిన దని యాతనిచరిత్రమున వ్రాసియుంటిని. నాసికేతోపాఖ్యానమును గృతినందినగంగయామాత్యుఁడుఁ బసవభూపాలునియొద్దమంత్రియైనట్లు పైనివ్రాసినపద్యములలోఁ జెప్పఁబడినది. బసవభూపాలుఁడు క్రీ. శ. ౧౪౬౦-౧౫౦౦ సంవత్సరములనడుమనున్నవాఁ డనిసూబగుంటనారాయణకవిచారిత్రమున వ్రాసియున్నాఁడను. నాసికేతోపాఖ్యాన మీకాలములో ననఁగా ౧౪౬౦ ప్రాంతమున రచియింపఁబడియుండునని నిశ్చయింపవచ్చును. ఇందువలన నీకావ్యము శ్రీనాథుఁడు చనిపోయిన పిమ్మట రచియింపఁబడినట్లు స్పష్టమగుచున్నది.

కృష్ణామండలమునందలిబందరుతాలూకాలో దగ్గుమల్లి యను గ్రామ మున్నది. గుంటూరుమండలమున తెనాలితాలూకాలో గోవాడగ్రామమునకు సివారు గానున్నదగ్గుమల్లియున్నది. ఆమండలములోనే బాపట్లతాలూకాలో దగ్గుబాడు అనుగ్రామము కలదు. ఇందేదియో యొకగ్రామము కవినివాసమైయుండుననియు, నీగ్రామమునుబట్టియే కవియింటిపే రేర్పడినదనియుఁ దలంపవలయున్నది.

కృతిపతి యైనచెందలూరిగంగనామాత్యునివంశమునకు మూలపురుషుఁ డగుచెందలూరి యయితనామాత్యునిఁ గవి యీక్రిందిపద్యములో వర్ణించియున్నాఁడు.

సీ తనమంత్రశక్తి యుద్ధతవైరిమంత్రింద్ర
కుంజరంబులకు నంకుశము గాఁగఁ
దనమోహనాకృతి తరుణీజనారామ
తతులకు నవవసంతంబు గాఁగఁ
దనదానమహిమ విద్వచ్చకోరములకుఁ
బ్రత్యగ్రచంద్రాతపంబు గాఁగఁ
దననిత్యలక్ష్మి బాంధవహితాశ్రితచాత
కములకుఁ గాలమేఘంబు గాఁగ

గీ. దనచరిత్రంబు బహుళపాతకమహాంధ
తమసరాశికి దినకరోదయము గాఁగ
శ్రీలు నిండార విలసిల్లెఁ జెందలూరి
యయితనామాత్యవరుఁడు విఖ్యాతయశుఁడు.

ఈపద్యమునుబట్టి కృతిపతియింటిపేరు చెందలూరి వారైనట్లు తెలియుచున్నది. చెందలూరు గుంటూరుమండలములోని ఒంగోలు తాలూకాలో నున్నది. ఈచెందలూరునుబట్టి కృతిపతియింటిపే రేర్పడి యుండును. వీరివంశవృక్షమునీక్రింద నిచ్చెదను.

అయితన్న=దేవమాంబ

---

కొమ్మన=దుగ్గమ అన్నయ్య అబ్బన మాచన అప్పన
(అయ్యప)

---

పెద్దన నారన అనంతయ్య=గంగయ్య
తిప్పాంబిక

---

ఎల్లన దుగ్గన కొమ్మన గంగన=నారమ
(ఇతఁడేకృతిపతి)

ఇట్లుండఁగాఁ బ్రబోధచంద్రోదయకర్త లైనమల్లయసింగయ కవులు వీరియింటిపేరు పెసరవాయవారని తమప్రబోధచంద్రోదయమున నీక్రిందిపద్యములో నుడివియున్నారు.

ఉత్సాహ ! రసికశేఖరాగ్రగణ్య ! రసవదుక్తినైపుణా !
ప్రసవవాసనావిశేషపరిమళీకృతప్రధీ
విసరహృత్కరండమండవినుతభోగిమండలా !
పెసరువాయవంశవార్ధిబిసరుహారిమండలా !

"పెసరువాయ" అనుగ్రామమున్నదేమో! మొట్టమొదట వీరు చెందలూరువారై కొంతకాలమునకు దరువాతఁ బెసరువాయ నివాసముగాఁ జేసికొనుటచేఁ బెసరువాయ వారైరేమో! ఎటులఁగవలసియున్నది. ప్రబోధచంద్రోదయములో వర్ణితమైనవంశమునకును బైనిఁ జూపిన వంశవృక్షమునకును భేదము లేదు. ఈకవి కవితాశైలి తెలియుటకై కొన్నిపద్యముల నిట నుదాహరించెదను.

నాసికేతోపాఖ్యానము:—

ఉ. ఏమనిచెప్పుదాన నిది యెవ్వరికైన వినంగఁ బోలునే
నేమిఁగనానిఁ బొందఁ గలనేనియు నెన్నఁడు నిట్టినాకు న
క్షేమద మయిన గర్భ మనుకీ డిటు చేకుఱె నింక నాకు నో
కోమలులార! చెప్పుటకుఁ గొంకిన గర్భము దాఁగనేర్చునే ౧౮

సీ. తలిదండ్రులకుఁ గాని దాననై పోయితిఁ
దోడఁబుట్టువులకు దూరమైతి
సరివారిలోపల నడి కొడి గట్టితిఁ
జుట్టలలోపల రట్టువడితిఁ
బురపురంధ్రీజనంబుల కెల్ల నెరవైతి
సకలదేశముల నాడికలఁ బడితి
నిడుమలు గుడువఁ గాఁబడవులపాలైతిఁ
గడపట్టనొకముద్దుకొడుకుఁ గనియు

గీ. సుతుని గన్నులనైనను జూచుచుండ
కతనిఁ బే రేటివఱుతఁ బోనాడికొంటి
నిన్ని వెంటల నను దైవ మిట్లు సేసె
నేమిసేయంగఁ గలదాన నింక నేను. ౨౮

ఉ. నావుడుఁ గాలుఁ డిట్లను మనంబలరారఁగ నాదుసీమలో
నేవివరంబు నీవడిగితేనియుఁ దెల్లమిగాఁగఁ జెప్ప సం
భావనఁ జిత్రగుప్తు లగుపాత్రులఁ బంచెద జూచిరమ్ము మా
సీవరయంచుఁ బంపె నొకనిం గరణంబులఁ బిల్వఁ గింకరుల్

ఈదుగ్గనకవి రచించిన శివకాంచీపుర మాహాత్మ్యములోనివని, పెదపాటిజగ్గన సేకరించినప్రబంధరత్నాకరమందలి యీక్రిందిపద్యములు ప్రబంధరత్నావళినుండి కైకొని యీక్రింద నుదాహరించుచున్నాఁడను.

సీ. క్షోణీరథంబులు సూత్రించిన ట్లింద్ర
 చాపంబు చాపమై సంఘటింప,
బ్రహ్మాండభాండంబు పగిలించు గర్జలు
 సింహనాదస్ఫూర్తిఁ జేయుచుండ
సౌదామనీదామజాలము ల్దిక్కుల
 స్వప్రతాపానలజ్వాలలుగను
నాహార్యహారిణోద్యదశనిసంఘంబులు
 దివ్యాస్త్రవితతులు తేజరిల్ల
గీ. నాకు శరవృష్టి శరవృష్టి నఖిలలోక
బాధకోద్గ్రీష్మభీష్మకుంభత్ప్రతాప
మార్చె నర్జునయుతశిఖండ్యభివర్ధ (?)
నాఖ్యవర్షర్తు నారాయణాఖ్యమూర్తి.

సీ. బంధూక మడరించెఁ బరపయ్యె గేదంగి
 కడిమి పుష్పిత మయ్యె గంధి పూచె
నర్జునం బలరారె నరవిందములు కేరె
 భూస్థలి నెఱులు పుక్కిలించె
గండూపదము లుబ్బెఁ గలఁగె హంసచయంబు
 నటియించెఁ గప్పలు నమిలి చెలఁగె
జాతకంబులు మించె సాగరం బెడయించె
 హరిగోపములతోడ నాడె లేళ్లు
గీ. మత్తభృంగంబులకుఁ దేనె రిత్త యయ్యె
గండుఁగోయిలకూఁతలు గట్టుకొనియె
చూలుకొన స్వాతిచూటిఁ బొదువ (?)
విష్ణునకు నిద్రపోయెడు వేళ యయ్యె.

కృతిపతికి బ్రిభుడైన బసవనృపాలుఁడు నెల్లూరుమండలములోని యుదయగిరి దుర్గ పరిపాలకుఁడైనట్లు శాసనములు చెప్పుచున్నందున నాతని మంత్రియైన గంగయామాత్యుఁడుకూడ ఉదయగిరి నివాసుఁడని చెప్పనొప్పును. దుగ్గయకవి నివాసము గుంటూరుమండలమైనను ఉదయగిరి యందుఁ గృతిపతితోఁబాటుగఁ గొన్నినాళ్లచ్చట నివాస మేర్పరచుకొనియుండును.

—o—

## 80 మనుమంచిభట్టు.

ఇతఁడు బ్రాహ్మణుఁడు భైరవాచార్యపుత్త్రుఁడు.

ఇతఁడు హయలక్షణవిలాసమను నొక పద్యకావ్యమును రచించి కంపభూపతి కంకితముచేసెను. ఈగ్రంథకర్త్రాది లభింపకపోవుటచే నీకవినిగూర్చి యింక నేమియుఁ దెలియలేదు. ఆశ్వాసాంతగద్యలో "ఇది సకలసుకవి జనసంస్తూయమాన కవితాచాతురీధురీణ నిఖిలభాషాప్రవీణ భైరవాచార్యపుత్త్ర పరమపవిత్ర మనుమంచిభట్ట ప్రణీతం బైన హయలక్షణవిలాసంబునందు" అని యుండుటచే నీకవి భైరవాచార్యపుత్త్రుఁడనియుఁ గవితాచాతురీధురీణుఁడనియు మాత్రము తెలియవచ్చినది.

హయలక్షణ విలాసమునుగూర్చి ఆంధ్రకవితరంగిణి ౨౪౧–౨౪౪ పుటలలో కొలనిగణపతిదేవకవి చారిత్రమునఁ గొన్నిపంక్తులను వ్రాసియుంటిని. వాని నీకవిచారిత్రమున కనుబంధముగాఁ జదువఁగోరెదను.

ఈకవి యేకాలమువాఁడు? కృతిపతియైనకంపభూపతియెవ్వరు? అనుప్రశ్నలకు సమాధానము కావలసియున్నది.

ఈ కంపభూపతి యెవ్వరో తెలియలేదు. "ఔబళ కంపధరాతలేశ్వరా" "ఔబళాధిపకంపా" "యౌభళరాజకంప" "ఔభళప్రభుని తనయకంపరాజ" యని సంబోధించుటచే నీతని తండ్రిపేరు "ఔబళరాయఁడని" తెలియుచున్నది.

ఈ కంపరాయలు సాళువవంశములోనివాఁడని నూచించుచు నీక్రిందిపద్యములలోఁ గొన్ని వాక్యముల నుదాహరించియున్నాఁడు.

క. మేలుదెస గీడు సుళ్లును
మేలుధృవుల్ గీడుచోట మేల్కొనియున్నన్
మేలుం గీడును జేయును
సాళువబిరుదాంక కంపజగతీనాథా.

ఉ. తిన్ననికుక్షిమూలమున తేజులరంధ్రయుగంబు క్రిందటన్
బన్ననిరీతి నుండు నుపరంధ్రములందుఁ దురంగజాతికిన్
బన్నగఁ గంఠపార్శ్వములఁ బైకొని వన్నెలు నిల్పుచుండఁగా
సన్నుతి జాళుకీతిలక సాళువకంప నృపాలమన్మథా ... ...

"మసలుగ తారి సాళువసమంచిత కంపనృపాలధీమణీ !"

"చాయగప్పనిరి సాళు వాంక"

వీనినిబట్టి యీకంపరాయఁడు సాళువవంశీయుఁడని నిశ్చయింప వచ్చును.

ఈసాళువవారికి "మీసరగండ, కటారిసాళ్వ, ధరణీవరాహః బర్బరబాహ, బాహ త్తిమల్ల" ఇత్యాదిబిరుదములున్నట్లు పిల్లలమఱ్ఱిపిన వీరన్న సాళువగుండనరసింహరాజునకుఁ గృతియిచ్చిన జైమినిభారతము నందలి యీక్రిందిపద్యభాగములవలనఁ దెలియుచున్నది.

"గీ. ఔర ! మీసరగండకటారిసాళ్వ
పంచఘంటానినాదాదిభయదబిరుద
కాహళారావసంపాతకంపితారి
దీప్తజలసీరిసాళువతిప్పశౌరి.

అనిసాళువతిప్పరాజును,

క. ధరణీవరాహునకుబ ర్బరబాహునకు ... ...
క ... భీకరచౌహ త్తిమల్లబిరుదాంకునకున్.
క. మీసరగండనికిఁగటా రీసాళువమునకు ..."

అని సాళువగుండనరసింహరాజును వర్ణింపఁబడియున్నారు.

ఈబిరుదములే మనుమంచిభట్టుకంపభూపతికిని వాడియున్నాఁడు. ఈక్రిందిపద్యములనుజూడుఁడు.

గీ. ఇట్లుచెప్పినపాటిని నెల్లసుళ్ళు
నిలిచె నేని యుఁ దమతమఫలముని చ్చు
నట్లుగాకుండు నందల్పమధిక మైనఁ
జండభుజబల! మీసరగండ! కంప! ఆ ౨.

క. ఘోటంబులసుళ్ళుండిన
ఘోటంబులుపతులమీఱికులమునడంచున్
పాటించుచుండిన నడచును
పాటించిరి శాస్త్రవిదులు బర్బర బాహా! ఆ ౩.

గీ. అశ్వరత్నంబునకును పళ్ళుహయమునడిమి
పళ్ళుతురగముకడపట్టికడను
క్రమముతోనవమాదివర్షములమూఁట
హారెణవిలసిల్లు రాయచౌహత్తమల్ల! ఆ ౩.

క. నిరుపమ తేజోవిభవా
కరమునఁగడునొప్పు మీఱుగంధర్వముదాఁ
బరికింప నింద్రిసత్వము
ధరణీరమణీయబాహా ధరణివరాహా!

క. లుఠితమదలోభిసారగ
పఠితగుణాంకితమహాత్మ! ప్రిబంధానన
కఠినంపుహృదయభూరుహ
కుఠార! కఠారిరాయ గుణరత్ననిధీ. ౨ ఆ.

ఈకంపభూపాలుని సితనితండ్రి యైనయాంబళరాయని బ్రి. శ్రీ. వీరేశలింగముఃపంతులుగారిట్లుగుర్తించియున్నారు. "ఈకంపభూపాలుఁడు దక్షిణమధురాపురవిజయయాత్రకయి ౧౩౬౯వ సంవత్సరప్రాంతమునఁబంపఁబడి నట్లుమధురావిజయములోఁ జెప్పఁబడిన కంపభూపాలుఁడుకాఁడు. ఆకంపభూపాలునితండ్రియే బుక్కరాయఁలు. ఈ కంబభూపాలునితండ్రి యాంబళరాయఁడు. ఆకాలమునందు సాళువవంశమున

నౌబళభూపాలుఁడొకఁడుండెను. సాళ్వమంగన్నృపాలున కగ్రభార్యయు గుండభూపాలునకు ద్వితీయపుత్త్రుఁడును వీరయౌబళుఁడయినట్లు జైమిని భారతములోని యీక్రిందిపద్యము తెలుపుచున్నది

మ. జననంబందిరిగుండభూవిభునకున్ సందాకబంధారిగా
తనయున్ శ్రీనిధివీరయౌబళుఁడు నుద్యత్కీర్తిమాదయ్యయున్
ఘనతేజోనిధిగుండబమ్మఁడును సంగ్రామస్థలీపార్థ స
జ్జనమందారులు సాళ్వమంగనృపుఁడున్ సావిత్రిమంగాంకుఁడున్.

కృతిపతియైనకంపపృథ్వీపతి యీయౌబళునికొడుకైనను కావచ్చును. లేదా మనుమని కొడుకైనను కావచ్చును. కొడుకేయైనపక్షమునఁ గృతిపతియుఁ గవియు పదునాల్గవ శతాబ్దాంతమున నుందురు; కాకున్నయెడల పదునైదవశతాబ్దాంతముననుందురు. ఇది యూహయేకాని నిశ్చయమని చెప్పవలనుపడదు. మనుమంచి భట్టారకు నందఱును, పూర్వకవులలోనివాఁడనుచున్నారు.”

పంతులుగారింతమాత్రము వ్రాసి యూరకున్నారు.

ఈకంపరాయలకొఱకు నేను వెదకుచుండఁగా కర్నూలుజిల్లా పెద్దచింతకుంటగ్రామములో ఔబళార్యఓబళమ్మలతనయుఁడైనకంపభూపతి శాసనమొకటియున్నట్లు దొరతనమువారిశాసనసంగ్రహపురిపోర్టు వలనఁ దెలియవచ్చినది. (A, R. 264 of 1936). ఇతఁడే హయలక్షణవిలాసకృతిపతియై యుండునని నిశ్చయించుకొంటిని. కాని యీశాసనకాలమునకు, శాలివాహన, క్రీస్తుశకములకుండెడియంతరమును బొరపాటున రెండుమాఱులుకలిపి, మనుమంచిభట్టు క్రీ శ. ౧౪౨౦ ప్రాంతమువాఁడని కొలనిగణపతిదేవకవిచారిత్రమునఁ దప్పుగావ్రాసితిని.

సుప్రసిద్ధపండితు లగు శ్రీనిడదవోలువేంకటరావుపంతులు M.A. గారు, భారతిపత్త్రికలో, (విరోధిసంవత్సర–ఆషాఢము) ఆశాసనమును బ్రకటించుటయేగాక, తిరుపతియందున్న కంపభూపతిశాసనమును మఱియొకదానినికూడ నుదాహరించిరి. శ్రీ పంతులుగారి పరిశోధనమువలనఁ జరిత్రకారులకగపడకుండ దాగియున్నకంపభూపతిబయలువడుటయు మనుమంచిభట్టు కాలము సరిగానిర్ణయమగుటయుఁ దటస్థించినది. అం

పలకు వారికిఁ గృతజ్ఞుఁడనై వారిచ్చిన శాసములోని యవసర భాగమును
గారువ్రాసిన వాక్యములను నీక్రిందఁ బొందుపఱచుచున్నాఁడను

"ఓనమఃస్వస్తి జయాభ్యుదయ శకవరుషంబులు ౧౩౬౭౮అగు
నేదుర్మతి సంవత్సర పుష్య శు౧౫గు. స్వస్తి చతుర్దశభువనాధీశ్వరు లైన
శ్రీచింతకుంటశ్రీరామేశ్వర దేవర శ్రీగోపినాథ దేవరలయొక్క దివ్యశ్రీ
పాదపద్మంబులకున్ను గ్రామదైవాలకున్ను నిజసేవకుఁడైన శ్రీమన్మ
హామండలేశ్వర మీసరగండ కఠారిసాళువానం గంపయ్యదేవ మహా
రాజులకున్ను కందాయమ్మకున్ను గర్భరత్నాకరుడైన శ్రీమన్మహా
మండలేశ్వర అవుబళయదేవమహారాజులకు వోబాయంమ్మకున్ను
సుపుత్రుడైన శ్రీమన్మహామండలేశ్వర మీసరగండ కఠారిసాళువకంప
య్య దేవమహారాజులు సాష్టాంగదండము బెట్టి సమర్పించిన ధర్మశాస
నం. * * *

అవుబళయ్యకున్ను వోబాయమ్మంగారికెన్ని సుకృతంగాను
సోమగ్రహణపుణ్యకాలమందు సర్వమాన్యంగాను ధారవోసి యిస్తిమి
గాన ఆచంద్రార్కస్థాయిగాను సర్వమాన్యంగాను చలం గలందులకు...
శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ (Pages 231, 232 Mac. L. R. 259 (15-3-6) B. L R.
Vol 15–386).

"పైశాసనమువల్ల సాళువకంపరాజు ఔబళరాజునకు, ఓబాయ
మ్మకు పుత్రుడనియు, కంపరాజునకు, కందాయమ్మకు పౌత్రుఁడనియు
మీసరగండ కఠారిసాళువబిరుదాంకితుడనియు తెలియుచున్నది. హాయ
లక్షణవిలాసమున "ఔబళార్యునికంపాఅనియు, "మీసరగండ కఠారి
సాళువాంకఅనియుసంబోధనలుండుటచేత, నీశాసనమునప్రస్తుతుడైనకం
పరాజునకే హయలక్షణవిలాసము కృతి యీయబడెనని స్పష్ట మగుచు
న్నది. మఱియు నీఔబళార్యునికంపరాజుశాసనము క్రీ. శ. ౧౪౫౯ నా
టిది తిరుపతి దేవస్థానమున గలదు. చూడుడు తిరుపతి దేవస్థానశాసన
సంపుటము ౨.పుట ౧౨. సాళువనరసింహరాయనిశాసనములు నెం ౮
౫రు) ఇందు ఔభళకంపరాజు ప్రతిదినమును నిత్యమాడలు దేవునికి సమ
ర్పించుటకు వేయిపణముల నొసగెనని చెప్పబడినది. ఇది తమిళశాస
నము.

ఈశాసనకాలము శా.శ. ౧౩౮౦ బహుధాన్య మార్గశిర శుద్ధ ౧౦ ఆదివారము. ఇది క్రీ. శ. ౧౧-౨ ౧౪౫౮తో సరియగును. పై రెండుశాసనములవలన మనుమంచిభట్టుకాలము క్రీ. శ. ౧౪౪౨-౧౪౫౮ ప్రాంతమని నిశ్చిత మగుచున్నది."

హయలక్షణవిలాసములోఁ గృతిపతిని "ఘనతరాధిప చాళుక్య కంపభూప" "చరణపతితభూపా చాళుకీవంశదీపా" "సరసోదారకుమారకంపనృపతీ చాళుక్యచూడామణీ"యని సంబోధించియుండుటచే నీతఁడు చాళుక్యవంశీయుఁడని సూచన లగుపడుచున్నవి సాళ్వభూపతులు చాళుక్యవంశీయులనుట కాధారములు నాకులభింపలేదు. కాని, యీసాళువశబ్దము బిరుదనామమై, వీరుకూడ చాళుక్యవంశీయులయియుందు రేమో యని సంశయము కలుగుచున్నది. పిల్లలమఱ్ఱిపినవీరన జైమినిభారతమునం దెచ్చటను సాళువవారిని చాళుక్యవంశీయులని చెప్పినట్లు కన్పట్టదు. వరాహపురాణములోఁ దుళువనరసరాజును జాళుక్యనారాయణుఁడని వర్ణించియున్నాడు. దీనియర్థమేమో విచారణ సేయవలసియున్నది. ఎట్లయినను, ఈసాళువచాళుక్యసంబంధమునుగూర్చి యింకను బరిశోధింపవలసియున్నది. బ్ర శ్రీ వీరేశలింగముపంతులుగారీసందర్భమున "ఇతఁడు చళుక్యరాజులకడ దండనాథుఁ డయినందున ప్రభువంశముతో సంబోధింపఁబడెను. ఈకంపమహీపాలునకు సాళువవంశమువారికిఁ గలబిరుదములన్నియు నున్నందునను, చళుక్యవంశజులబిరుదము లంతగా లేనందునను కంపనృపాలుఁడు సాళువవంశజుఁడే యని నిశ్చయింపవలసియున్నది" అనివ్రాసియున్నారు. సాళువవంశజుఁ డనుమాట నిశ్చయమేకాని చాళుక్యవంశముతోటి సంబంధమునుగూర్చిన పంతులుగారివాక్యములు నాకు సంతృప్తిని కల్గింపలేదు. "చాళుకీవంశదీపా" చాళుక్యచూడామణీ"యను సంబోధనలు చాళుక్యప్రభువులయొద్ద దండనాథుఁడగుటచే వచ్చినవని యంగీకరింపఁజాలను. కంపభూపతి చాళుక్యులకు దండనాథుఁ డని చెప్పుటకుఁ దగిన యాధారములను, పంతులుగారీయలేదు. సాళువవంశీయులు మన మెఱిఁగియున్నంతవఱకు విజయనగర ప్రభువు లగుసంగమవంశీయులయొద్ద దండనాయకు లయియున్నారు. కంపభూపతి కాలమునాఁటికి చాళుక్యపరిపాలన మంతరించినది. చాళుక్య

వంశములోనివారు కొందఱు, తత్కాలప్రభువులకడ దండాధిపతులయి, సాళువబిరుదమును బొంది. క్రమక్రమముగా సాళువ వారైరేమోయని తోఁచుచున్నది. భావి పరిశోధనకై ఈ విషయమును సూచించితిని. ఇది యూహామే ఇందెంతవరకు సత్యమున్నదియు నిర్ణయింపవలసిన భారము భావిపరిశోధకులపై నున్నది.

ముద్రితప్రతియొక్క తృతీయాంకురప్రథమపద్యము

క. శ్రీకరకటాక్షవిజయ
శ్రీకాంతాకృష్ణరాయసిద్ధకృపాణా
స్వీకృతసత్వరపర
భీకరభటయూధకంపపృథ్వీనాథా!

అనియున్నది. ఈపద్యమునుబట్టి యీకంపభూపతి శ్రీకృష్ణదేవరాయల కాలమునం దున్నవాఁడనియు, సతనికడదండనాయకుఁడనియుఁ గొందఱు అభిప్రాయపడియున్నారు.

పైశాసనమునుబట్టి కృష్ణరాయలకుఁ బూర్వమే గ్రంథము రచియింపఁబడెనని స్పష్టమగుచున్నది. ఈపద్యములోనికృష్ణరాయలెవ్వరో పరిశోధింపవలసియున్నది.

మనుమంచిభట్టుకవిత్వము, మృదుపదసంయుతమై మనోహరముగా నున్నది. ఇందు వ్యాకరణదోషములు తఱచుగాఁ గన్పట్టుచున్నవి. లేఖకముద్రాపకదోషములను సంస్కరించినఁగాని యవి యెంతవఱకు కవికృతములో నిర్ణయింపలేము. కవితాశైలి తెలియుటకై నాల్గుపద్యముల నుదాహరించుచున్నాఁడను.

చ. పూరము బోవునప్పుడును దుర్గమశత్రునృపాలసైన్యముల్
బోరున గెల్చుచున్నపుడు బొంకముతో మృగయావినోద వి
ద్యారతి దేలునప్పుడు నరాధిపకోటికి వాజులట్లు పెం
పార జయాదికారణము లారసి చూడఁగఁ గల్గనేర్చునే.

మ. పదిలం బారగ సుళ్ళు నాలుగు నురోభాగంబునం దిక్కులం
గదియంగాఁదగు రోచమానము సుముఖ్యస్థానమందుండెనే

నది శ్రీవత్సకి నామధేయ మగు నాయుశ్శ్వంబు చేసూన్చు స
మ్మదలక్ష్మీశ్రయభోగభాగ్యవిలసన్మాన్యప్రతాపోన్నసుల్.

శా॰ పృష్టంబై మహి సత్వసంపద గడున్ బొల్పారి తేజోగుణో
త్కృష్టంబై కడుదూరభారవహమై దీపించు కృష్ణచ్ఛవా
దష్టాభంబుల రూపసంపద కడున్ బొల్పారుచుండు న్మహో
స్పష్టం బైనతురంగమంబు హరిణాసారంబు కంపాధిపా !

గీ. పెక్కువన్నెలఁబులిభంగిఁ బేర్చియున్న
నశ్వనామంబు పరికింప నవనుటంబు
కడఁగి యావాజి నేలక పుడమి నెల్ల
వెడల నడిపింపవలయు భూవిభుని కధిప !

పైశాసనమునుబట్టి కవియుఁ గృతిపతియుఁ గర్నూలుమండలవాసులని నిర్ణయింపవచ్చును. పైనిఁజెప్పిన శాసనకాలమునాఁడు కర్నూలు మండలము సంగమవంశజులక్రిందను సాళువవంశజుల క్రిందనునున్నట్లు గన్పట్టుచున్నది. వారలలోఁ గృష్ణరాయనామధారులు లేరు. యాదవులలోను, రాష్ట్రకూటులలోను గృష్ణరాయనామధారులుండిరి. కాని వారు శాసనకాలమునాఁటికిఁ జాలపూర్వులు. అరవీటివారిలోఁ గృష్ణరాయలుండిరి. వారుకర్నూలుమండలమువారే. కాని వా రాశాసన కాలమునాఁటికిఁ దరువాతివారు. తుళువకృష్ణరాయలే నీపద్యములోని కృష్ణరాయ లనునెడఁ బైశాసనమును విడిచి కంపరాయలకొఱకు మఱల వెదకవలసివచ్చును. ఈపద్యము తప్పులతడకగా నున్నముద్రిత ప్రతిలోనిది. తాళపత్రప్రతులను బరిశోధించినపిమ్మటఁగాని యీపద్యముపై నాధారపడి చరిత్రశోధనకుఁ గడంగుట వృథాయాసమని యీ చర్చ నింతటితో విరమించుచున్నాఁడను.

# ౨. నంది మల్లయ్య, ఘంట సింగయ్య

వీరిరువురు నాఱువేల నియోగిబ్రాహ్మణులు; ఆపస్తంబసూత్రులు; మల్లయకవి కౌశికగోత్రజుఁడు. సింగనామాత్యునితనయుఁడు; దక్షిణామూర్తిశిష్యుఁడు; సింగయకవి భారద్వాజగోత్రుఁడు; నాగయామాత్యునికుమారుఁడు; అఘోరశివశిష్యుఁడు; ఈసింగయకవికి మలయమారుతకవియని నామాంతరము కలదు. ఇందులో మల్లయకవికి, సింగయకవి మేనల్లుఁడు. ఈసింగయకవికి, శ్రీకృష్ణదేవరాయలయాస్థానకవియై పారిజాతాపహరణమును రచించినముక్కుతిమ్మన యని పిలువఁబడియెడినందితిమ్మన మేనల్లుఁడు.

## ప్రబోధ చంద్రోదయము

ఈమల్లయసింగయకవు లిరువురును గలిసి, వరాహపురాణమును బ్రబోధచంద్రోదయనాటకము నాంధ్రీకరించియున్నారు. ఈ కవులు తమవృత్తాంతముల నీక్రిందిసీసపద్యములలోఁ దెలిపికొనియుండిరి.

సీ. అవుడు సభావేది కాగ్రస్థితుల మైన
మమ్ము వాగీశ్వరీమంత్రరాజ
సిద్ధిపారగులఁ గౌశికభరద్వాజగో
త్రుల మహాదేవాంఘ్రిజలజభక్తి
పరతంత్రమతుల నాపస్తంబసూత్రుల
గురుదక్షిణామూర్త్యఘోరశివుల
శిష్యుల నతిశాంతచిత్తులఁ దనకు నా
శ్రితుల భాషాద్వయకృతినిరూఢ
శేముషీభూషణుల నందిసింగనార్య
తనయు మల్లయకవి కులోత్తముని ఘంట
నాగధీమణికూర్మినందనుని మలయ
మారుతాంకితు సింగయమంత్రిఁ జూచి.

వరాహపురాణము.

సీ. కలరు కౌశికగోత్రకలశాంబురాశి
మందారంబు సంగీతనంది నంది
సింగమంత్రికిఁ బుణ్యశీల పోచమ్మకు
నాత్మసంభవుఁడు మల్లయమనీషి
యతని మేనల్లుఁ డంచితభరద్వాజగో
త్రారామచైత్రోదయంబు ఘంట
నాగధీమణికిఁ బుణ్యచరిత్రి యెల్లమాం
బకుఁ గూర్మితనయుఁడు మలయమారు
తాహ్వయుఁడు సింగనార్యుండు నమృతవాక్క-
లీశ్వరారాధకులు శాంతు లిల. బ్రసిద్ధు
లుభయభాషల నేర్పరులుపమరులు స
మర్థు లీకృతిరాజనిర్మాణమునకు.

### వరాహపురాణము

పండ్రెండాశ్వాసములు గలవరాహపురాణము నీకవులు తుళువ నరసింహరాజున కంకితము చేసిరి. కృతిపతి యీగ్రంథమును దనకుఁ గృతి యిమ్మని కవులనుగోరిన ట్లీక్రింది రెండుపద్యములలోఁ జెప్పియున్నారు.

క. మీరిరువురు నెప్పుడును శ
రీరప్రాణములక్రియఁ జరింతురు మిగులం
గూరిమిఁ గృతిఁ బ్రతిపద్యముఁ
జారుఫణితిఁ జెప్పఁగలరు చాటువు గాఁగన్.

క. కావున మీరు దలంచిన
శ్రీవారాహంబు మంచికృతి మాపేరం
గావింపుఁ డనుచు సుముఖుం
డైవీడ్యముఁ గప్పురంబు నర్పించుటయున్.

ఆంధ్రభాషాప్రపంచమున జంటకవులలో వీరే ప్రథములు. వీరి గ్రంథములలో నెవ్వ రేభాగమును జేసిరో నెవ్వ రేపద్యములను రచించిరో చెప్పఁజాలము. ఒక్క-కవిరచించినట్లే శైలి సమానముగా నున్నది

కాని ఎగుడుదిగుడుగా లేదు. మల్లయకవికంటె సింగయకవి పండితుఁడును సమర్థుఁడు నని పరంపరగాఁ జెప్పుకొను జనశ్రుతికలదు "ఈ యిరువురు కవులును గ్రంథరచన చేసినట్లు చెప్ప బడియున్నను, వీరిలో మలయమారుతకవి యనఁబడెడు ఘంటసింగన్నయే ప్రసిద్ధుఁ డైన మంచికవి యైనట్లు గ్రంథాంతరములవలనఁ దెలియవచ్చుచున్నది." అని కవిచరిత్రకారులు వ్రాసియున్నారు. కాని యాగ్రంథములేవియో వారు చెప్పలేదు నాకు లభింపలేదు. కృతిపతి పైపద్యములలోఁ గోరిన కోర్కెకుఁ బ్రత్యుత్తరముగాఁ గవులు చెప్పినపద్యములను రెండిటి నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

ఉ. దేవరవంటిపుణ్యునిఁ గృతిప్రభుఁగా నిలుపంగఁ గల్గుటం
బావనమై ప్రసిద్ధి గను మాకవితావిభవంబు దిక్కులన్
శ్రీవరుపాదపంకజముఁ జెందినజాహ్నవి ముజ్జగంబులం
బావనతం బ్రసిద్ధి గను బాగున శ్రీనరసింహభూవరా!

ఉ. తప్పను నొప్పు లేనికృతి దారకులంబుగ వింటిఁ గొంత త
ప్పొప్పులు రెండు గల్గుకృతి యొప్పనిజాతిలతాంగి తప్పు లే
కొప్పులెగల్గు సత్కృతి గుణోన్నతి వంశవిలాసరేఖలం
జెప్పఁగ సాటిలేనిసరసీరుహలోచనఁ గాదె చూడఁగన్.

## తుళువవంశము సాళువవంశాంతర్భాగమా?

వరాహపురాణకృతిపతి యైననరసింహరాజును నరసరాజని నరసనాయకుఁడనికూడ బిలుచుచుందురు. ఈనరసరాజు తుళువవంశములోనివాఁడును జైమినిభారతకృతిపతి యైనసాళువనరసింహరాజుకడ దండనాయకుఁడు నై యున్నాఁడు. ఈతుళువవంశము సాళువవంశాంతర్భాగమనియు, సాళువనరసింహరాజునకీతుళువనరసరాజు, అన్నమనుమఁడనియు సుప్రసిద్ధచరిత్రకారు లగుకొమఱ్ఱాజులక్ష్మణరావుపంతులుగారు తమమహమ్మదీయ మహాయుగములో (341-348పుటలు) నిట్లు వ్రాసియున్నారు. "నరసరాజు సాళువనరసరాజునకు అన్నమనుమఁడు; ఈశ్వరరాజుపుత్త్రుఁడు. సేనాధిపతి" "ఈతుళువవంశము సాళువవంశాంతర్గతము. సాళువనరసింగరాజు తండ్రిగుండరాజు. అతని కిద్దరుకుమారులు.

మొదటివాఁడు తిమ్మరాజు. రెండవవాఁడు సాళువనరసరాజు. తిమ్మరాజునకు నీశ్వరరాజును నాయీశ్వరరాజున కీతుళువనరసరాజును బుట్టిరి. కావున తుళువనరసరాజు సాళువనరసరాజునకు అన్నమనుమఁడు".

ఇట్లు వ్రాయుటకు శ్రీలక్ష్మణరావుపంతులుగారి కెట్టియాధారములు లభించెనో నాకుఁ దెలియలేదు. బ్ర శ్రీ. వీరేశలింగముపంతులుగారు నందిమల్లయఘంటసింగయకవులచారిత్రములో సాళువగుండనరసరాజునకు తుళువనరసరాజు అన్నమనుమఁడని బాంధవ్యమును జెప్పలేదు. కాని పైనిఁజెప్పఁబడినతిమ్మయయీశ్వరరాజు సాళ్వగుండనరసింహరాజునకు సేనానాయకుఁ డగుటయేకాక దాయాదుఁడుకూడ నయియుండుటచేత నుభయులయనంతరమునను నీశ్వరరాజు పుత్త్రుఁడును సాళ్వగుండ నరసింహరాయని యప్పటిసేనాధిపతియు నైనబలవంతుఁడగు తుళువ నరసింహరాయఁడు సంతానహీనుఁడయి కాలధర్మమునొందినతన ప్రభువుయొక్క రాజ్యభారమును వహించినట్లు తోఁచుచున్నది" అని వ్రాసియున్నారు.

సాళువనరసింహరాజునకును తుళువనరసరాజునకును గలసంబంధమును గూర్చియీచరిత్రకారు లిరువురునుగూడ ప్రమాదమునకు లోనయినట్లు కన్పించుచున్నది. వరాహపురాణములో నందిమల్లయఘంటసింగయకవులు సాళువవంశమును దుళువవంశమునుగూడ వర్ణించియున్నారు. అందు సాళువనరసింహరాజునొద్ద తుళువనరసరాజును, అతనితండ్రి యైనయీశ్వరరాజునుగూడ దండనాయకులనియే చెప్పఁబడినదికాని, ఒకరికొకరు బంధువులయిన ట్లెచ్చటను జెప్పియుండలేదు. ఆభాగముల నిట వ్రాయుచున్నాఁడను.

"వ. తదనంతరంబ కృతిపతికిం బతి యైనసాళువనరసింహరాజరాజమౌళి పావనాన్వయంబు మొదలవర్ణింతుము. చింతారత్నకామగవి కల్పవృక్షలక్ష్మీపక్ష్మలాక్షులతోడం బుట్టి మిన్నుముట్టిన పాలమున్నీటి పట్టి సాయంతనసమయసంఫుల్లమల్లీమతల్లికాగుళుచ్ఛస్వచ్ఛకాంతి నిస్తంద్రుండు చంద్రుండు వంశకర్తగా సకలకలికలుషాపహర్త వంకిదేవమహీభర్త కీర్తికార్తికచంద్రికాప్రభావంబులు వినిర్మించి దశ

దిశాంచలంబులు ముంచెఁ దత్తనూజుండు చతుష్షష్టివిద్యావినూతన భోజుండు గుండరాజు దుండగపురాచతండంబులఁ జెండాడి మండల గ్రావంబు కెలంకుల గెలుపుఁగంబంబులు నిలిపెఁ — దత్సూనుండు గాండీవధన్విసమానుండు సాళువరాజు ఘోరాహవహట్టంబునం బారసికతురగఘట్టంబులం గనుపుగొట్టి ధరానరాహోహబాహుపీఠంబునం గుదురుపఱిచెఁ దత్పుత్త్రుండు నిరాతంకప్రతాపకమలమిత్త్రుండు గౌతరాజు రాజసంబునగుణాలతావితానంబులు సేతుసీతాచల మధ్యపృథ్వీమండలంబున మెండుగొలిపెఁ దత్సుతుండు వీరలక్ష్మీ సమన్వితుండు గుండరాజు విరోధిరథినీవిఖండనప్రచండదోర్దండ మండలాగ్రుండును సముద్దండసాహసక్రియాసమగ్రుండును నై సిర వధికప్రభావదుందుమారులం దిమ్మనాథనరసింగపార్థివులం గాంచె వారిలోన.

సీ. తుహినాంశువంశపాథోరాశి మాణిక్య
మష్ట దిగ్రాజ భయంకరుండు
కర్ణాటరాజ్యరక్షణదక్షబాహాసి
వరవసంతత్యాగవైభవుండు
శివరాత్రి సమయ సంశీలతా గణ
శాలి ధరణీసు పర్వనిస్తారకుండు
విరచితాతుల తులాపురుష దానవిభూతి
సమదరాయకటారి సాళువంబు

గుండవిభునాంసింహ భూమండలేశ్వ
రుండు గణుతింప రాజమాత్రుండు గాఁడు
కిన్నర స్త్రీసమూహ జేగీయమాన
వర్తనంబులుగల చక్రవర్తిగాని."

ఇది సాళువవంశవర్ణనము. పిల్లలమఱ్ఱి పినవీరనకవి చారిత్రమునం దిచ్చిన వంశవృక్షముతో నిది సరిపోవుచున్నది. ఈనరసింహరాజే సాళువగుండ నరసింగరాజు, ఇతఁడే జైమినిభారత కృతిపతి. ఇతనియొద్దనే వరాహపురాణ కృతిపతియైన తుళువ నరసరాజు దండనాయకుఁడుగా

నుండెను. ఈతుళువవంశవర్ణన మీాకిందిగద్య పద్యములలో వరాహ పురాణమునందున్నది.

"అట్టి నరసింగరాజరత్నంబుచేత మన్నన వడసి సైన్యనాయక పట్ట భద్రత్వంబున నిస్తంద్రవిజయలక్ష్మీమహత్త్వంబున మననదభియాతి భయతసత్వంబున దీర్ఘాయు రైశ్వర్యధుర్యుండైన యీాశ్వరనాయకునకుం బ్రియతనూభవుండు నరసవసుధాధ్యక్షుండు నిర్వంచితానుగ్రహంబునం బరిగ్రహించి యిమ్మహాప్రబంధంబునకు శృంగార విభూషణంబుగాఁ దదీయ వంశావతారంబు రచియింతు మది యెట్టిదనిన

ఉ. మిన్నుల మోచి భాగ్యముల మీాజెనకోటల రమ్యహర్మ్యసం
పన్నత సస్యవాటగరిమంబులఁ దోఁటల వాహవారణా
భ్యున్నతిఁ గెలిదీర్ఘికల నుగ్రభటావలి వన్నెకెక్క వా
రాన్నిధి కాంచిపైఁ దుళువరాజ్యము సంతతవీరభోజ్యమై.

క. ఆతుళువరాజ్యమున వి
ఖ్యాతివహించిరి దిగంతకరికటతటసం
భూత మదక్షాళన వి
ద్యాతత్పరకీర్తిఁ బెండ్లిమాడినరాజుల్.

ఉ. వారల కగ్రగణ్యుఁడు నివారితవైరివరూథినీధవ
శ్రీరమణీవిలాసుఁడు విచిత్రకళాకుశలుండు తిమ్మధా
త్రీరమణుండు సంపద వరించె మరాటవరాటలాట గాం
ధారయుగంధరాధిపసదః ప్రకటీకృత బాహువీర్యుఁడై.

చ. అతనికులాంగనాతిలక మైనపవిత్రచరిత్ర దేవకీ
సతి కృతపుణ్యులం గనియె శాంతివతంసుల సజ్జనావన
వ్రత పరిపాలనాగుణ పరాయణచిత్తుల దుర్మదోద్ధతా
హిత వనదావపావకుల నీశ్వరతిమ్మధరాతలేంద్రులన్.

క. అం దగ్రజుండు కవిజన
మందారము పతిహితైకమతి మానవతీ
కందర్పుఁడు తేజోమ
త్యందినమార్తాండుఁ డీశ్వరాధిపుఁ డుర్విన్.

వరాహపురాణకృతికర్త లీవిధముగా సాళువవంశమును వేఱుగను, తుళువవంశమును వేఱుగను వర్ణించియున్నారు. తుళువవంశమును సాళువవంశాంతర్భాగమని యెచ్చటను జెప్పియుండలేదు. సాళువ నరసింగరాజున కన్నయైన తిమ్మరాజే తుళువ తిమ్మరాజై యున్నయెడల సాళువ నరసింగరాజు వర్ణనమైన పిమ్మట, "నాతనియన్నయైన తిమ్మరాజు వంశంబు నభివర్ణించెద" మని ప్రారంభించి ఆతిమ్మరాజే తుళువరాజ్యాధిపతి యయ్యెనని చెప్పియుందురు. అట్లుచెప్పకపోవుటను బట్టియు, సాళువవంశమును వేఱుగాను, తుళువవంశమును వేఱుగాను బ్రారంభించి వర్ణించుటను బట్టియు నీ రెండువంశములకుఁ బ్రభుదండనాయక సంబంధముదక్క వేఱుసంబంధములేదని యూహింపవలసియున్నది. ఈతిమ్మరాజు కుమారుఁడైన యీశ్వరరాజును వర్ణించిన యీక్రిందిపద్యములో నాతఁడు సాళువ నరసింహరాజుయొక్క దండనాయకుఁ డైనట్లుమాత్రమే చెప్పఁబడినది. చూడుఁడు.

సీ. ఉదయాద్రి భేదించె హుత్తరి నిర్జించె
గండికోట పురంబుఁ గదలఁద్రవ్వె
పెనుగొండ సాధించె బెంగుళూరు హరించెఁ
గోవెల నెల్లూరు గుంటుపఱిచె
కుందాణి విదళించె గొడుగుచింత జయించె
బాగూరు పంచము పాడుచేసె
నరుగొండ వెకలించె నామూరు మర్దించె
సీరంగపట్నంబు బారిసమరె
రాయచౌహత్తమల్ల ధరావరాహ
మోహనమురారి బర్బరబాహు సాళ్వ
నారసింహప్రతాప సన్నహనుఁ డగుచు
విశ్వహితకారి తిమ్మయ యీశ్వరుండు.

మ. నరసింగక్షితిపాలుపంపు నుడుగొనాఁ జేసిదండెత్తి యీ
శ్వరభూభర్త పెడందకోట యవనాశ్వవ్రాతముం భీమసం
గరరంగంబునఁ గొల్ల వట్టుకొని వీఁకం గందుకూరిపురాం
తరసీమంబునఁ జక్కఁగా నఱకె దుర్దాంతారిసంతానముల్,

నిజముగా సాళువ తుళువవంశములకు సన్నిహితసంబంధ మున్నయెడల సాళువ నరసింహున కీయీశ్వరరాజు సోదరతనయుః డని చెప్పక సమకాలికులైన యీజంటకవులు దండనాయకుఁ డని చెప్పియూరకుండరు.

ఈశ్వరరాజుకుమారుఁడైన నరసరాజునుకూడ సేనానాయకుని గానే యీక్రిందిపద్యములలోఁ గవులు చెప్పియున్నారు.

క. బుక్కాంబకు జన్మించిరి
చక్కనిరూపములఁ బంచసాయకు లన బెం
పెక్కిన భుజాబలంబున
దిక్కరులన నారసింహ తిమ్మకుమారుల్.

గీ. ఇట్లు తుళువాన్వయాగ్రణి యీశ్వరుండు
పూర్వజన్మతపః ఫలంబునఁ గులంబు
ధన్యత వహింపఁ గన్నపుత్రికులలోనఁ
బ్రభుత గైకొని నరసింహ పార్థివుండు.

సీ. చర్చించిచూచిన సర్వజ్ఞతా పటు
ప్రౌఢిమ మరువంబు పరిమళంబు
పరికించిచూచిన నిరుపమత్యాగల
క్ష్మీవిలాసము దేవతావరంబు
భావించిచూచిన బహుమానసమ్యగ్వి
ధావిశేషోక్తి శిలాక్షరంబు
తర్కించిచూచిన ధర్మసంపాదన
క్రీడావివేకంబు తోడుసీడ
దుర్మదారాతిహరణ చాతుర్యధైర్య
వీర్యగాంభీర్యగుణములు వెన్నతోడఁ
బెట్టినవి సాటిచెప్పుట యెట్టి నృపుల
నీశ్వరప్రభు నరస పృథ్వీశ్వరునకు.

క. పరిచిత బోధునకు నిరం
తరకాంత ఘృణాసనాథునకు సాళ్వశ్రీ

నరసింగ విభుచమూపే
శ్వరనృపతికుమార నరసజననాథునకుఁ.

మనుచరిత్ర పారిజాతాపహరణ ప్రబంధములలోని కృతిపతుల వర్ణనములనుబట్టి చూచినను తుళువవంశము సాళువవంశాంతర్భాగమని యెంచుటకుఁ దగినయాధారములు కనుపట్టలేదు. కావున సాళువ తుళువవంశములు వేఱువేఱువంశములనియే నిశ్చయింపవలసియున్నది. జాగ్రతగఁ బరిశీలించిచూచినచో సాళువవంశీయులు చంద్రవంశక్షత్రియులనియు తుళువవంశీయులు శూద్రులనియుఁ గన్పట్టును.

వరాహపురాణ కృతిపతియైన తుళువ నరసింహరాజునకు వీర నరసింహరాయలు శ్రీకృష్ణదేవరాయలు అనియిరువురు కుమారులు. ఈశ్రీకృష్ణరాయలే కవిపండితపోషకుఁడై కృతికర్తయై కృతిభర్తయై కర్ణాటరాజ్యమును బరిపాలించిన శూరాగ్రేసరుఁడు. ఇతఁడు క్రీ. శ. ౧౫౦౯ మొదలు ౧౫౩౦ వఱకును రాజ్యముచేసినవాఁడు కావుననితని తండ్రియైన నరసింహరాజు పదునైదవశతాబ్దియందుత్తరార్ధముననున్న వాఁడనుట నిశ్చయము. పిల్లలమఱ్ఱి పినవీరన్నయు, నీమల్లయసింగయ కవులును సమకాలికులు. పినవీరన్న సాళువనరసింహరాజునకు జైమిని భారతమును గృతియిచ్చియుండఁగా, నాతనిదండనాయకుఁడైన తుళువ నరసింహరాజున కీజంటకవులు వరాహపురాణమును గృతియిచ్చియుండిరి. ఈనరసనాయకుఁడు "నరసింహవిజయపురాణము," "వరలక్ష్మీకల్యాణము" అనురెండుగ్రంథములను కృతినందెనని తెలియుచున్నది. ఈగ్రంథములనుగూర్చిన విశేషములేమియుఁ దెలియరాలేదు. ఆకవులెవ్వరో యెఱుంగరాదు. నరసింహవిజయపురాణమున నీనరసనాయకుని విజయగాథలే వర్ణింపఁబడియుండునని తోఁచుచున్నది.

## తుళువదేశము

ఈ నరసనాయకుని పూర్వులు పరిపాలించిన తుళువరాజ్యమెచ్చట నుండెడిదో నిశ్చయముగాఁ జెప్పఁజాలము. కాని యిది కర్ణాట దేశములోనిదయి యుండెనను మాట నిశ్చయము. ప్రస్తుతపు దక్షిణా

ర్కాడుజిల్లాలోని కొంతభాగమును ఉత్తరార్కాడుజిల్లాలోని కొంతభాగమును గలిసి తుళువరాజ్యముగాఁ బిలువబడుచుండెడిదని చెప్పవచ్చును.

వరాహపురాణమున నేకాదశాస్వాంతపద్యములలో నరసనాయకుని సంబోధించుచుఁజెప్పిన

" ధరణిసుత దేవకీపుర
వరనిలయ! శ్రీగిరీశవరసంపన్నే
శ్వరవిభుతనయా! సాళువ
నరసింహనృపాల దండనాయకతిలకా!

అనుపద్యములో దేవకీపురము నరసనాయకుని నివాసమని తెలిపియున్నారు. ఉత్తరార్కాటుమండలములోని వెల్లూరు తాలూకాయందలి దేవికాపురమే యిదియని నిశ్చయింపఁదగియున్నది. ఈగ్రామమున నున్న బృహదాంబ దేవాలయములో సాళువ వంశీయులయొక్కయు, తుళువవంశీయులయొక్కయు శాసనములనేకములు గాన్పించుచున్నవి. తుళువనరసనాయకునియొక్కయు నాతనిపూర్వులయొక్కయు నివాసమీపట్టణమే యని నిశ్చయింపవచ్చును. ఈతుళువ నరసనాయకుని పితామహుఁడైన తిమ్మరాజుభార్యపేరు దేవకీదేవి. ఈమె పేరుననే దేవకీపురము నిర్మింపఁబడియె నని తలంపవచ్చును. ఈతుళువరాజులు క్షత్రియులు గారనియు శూద్రులనియు నొకవాదమున్నది. ఈవిషయమునుగూర్చి శ్రీకృష్ణరాయలచారిత్రమున వ్రాసెదను.

## వరాహపురాణరచనాకాలము

వరాహపురాణాశ్వాసాంతపద్యములలో "సాళ్వనరసింగ కుమారాధ్యక్ష దక్షిణదోర్దండ" "నరసింగనృప సామ్రాజ్యరమాభరణ" "సాళ్వశ్రీనారసింహ జనపాలస్వర్ధాత్రీభృత్కంఠీరవ" "సాళ్వనరసింహేంద్రానుకంపాసరిద్వేణీవర్ధితకీర్తికల్పక" "సాళ్వనరసింగధరాధవ దండనాథ" "నరసింగస్వామి నిర్ణీతసంకల్పాభిజ్ఞ" సాళువ నరసింహనృపాలదండనాయకతిలకా" యని కృతిపతిని సంబోధించియుండుటచే సాళువనరసింహరాజు జీవితకాలములోనే యీవరాహపురాణము రచింపఁబడినదనుట నిశ్చయము. ఈసాళువనరసింగరాజు క్రి. శ. ౧౪౫౬ మొదలు ౧౪౯౦ర

వఱకు రాజ్యముచేసెనని కొందఱందురు. కాని యీవిషయమున నభిప్రాయభేదమున్నది. ఇతనిశాసనములు క్రీ శ ౧౪౫౬ మొదలు ౧౪౯౦-౯౧ వఱకు మాత్రమే కనుపడుచున్నవి. కావున నంతవఱకే యాతఁడు జీవించియున్నాఁడని చెప్పవచ్చును. వరాహపురాణము క్రీ.శ. ౧౪౯౦ వ సంవత్సరమునకుఁ బూర్వమునను, ౧౪౮౫ వ సంవత్సరమునకు బిమ్మటను రచియింపఁబడియె ననుట నిశ్చయము.

## సాళువనరసింగరాయుని కుమారులు

కర్ణాటరాజ్యము సాళువనరసింగరాయలకుఁ బిమ్మట నాతని కుమారులకు రావలసియుండెను. అతనికుమారులు ముగ్గురనికొందఱును నిరువురని కొందఱును జరిత్రకారులు చెప్పుచున్నారు. తిరుపతిదేవస్థానములోని యొకశిలాశాసనములో (సం ౨ పుట ౯౯ సంఖ్య ౫౧) సాళువ నరసింగరాయల పేరును, కుమార నరసయ్య, చిక్కతంగమ, పెరియతంగమ, అను మఱిమూఁడుపేరులు నుదాహరింపఁబడియున్నవి. ఈశాసనము అరవభాషలోనున్నది శాసనకాలము లేదు. నరసింగరాయలకును, తక్కినముగ్గురకును గలసంబంధము చెప్పఁబడలేదు కాని నరసింగరాయలకీముగ్గురును కుమారులని కొందఱు చరిత్రకారులయభిప్రాయము కొందఱీయభిప్రాయముతో నేకీభవింపలేదు. వరాహపురాణకృతిపతి యైన తుళువ నరసనాయకునకు కుమారనరసయ్య యను కుమారుఁ డుండెననియు, నాతఁడే యందుదాహరింపఁబడిన కుమారనరసయ్యయనియుఁ గొందఱభిప్రాయపడిరి కాని యందు స్వారస్యము లేదు, సాళువనరసింహరాయలయొద్ద దండాధిపతిగానున్న నరసనాయకుని కుమారుఁడైన కుమారనరసయ్యపే రిందుదాహరింపవలసిన యవసరము లేదు. కావున వారుమువ్వురును సాళువ నరసింహరాయలకుమారులనియే నిశ్చయింపఁదగియున్నది. ఈసాళువనరసింగరాయల కిరువురు కుమారు లనియు, వారిరువురు యుక్తవయసురానివా రగుటచే నరసింహరాయలు తనయవసానకాలమున వారిని, తనదండాధిపతియు సమర్థుఁడు నగు తుళువనరసనాయకున కప్పగించి వీరినిజాగ్రతగ కాపాడి వారికి యుక్తవయసు వచ్చినపిమ్మట రాజ్యమును ధనమును వారిస్వాధీనము చేయుమని వేఁడుకొనెననియు నందుఁ బెద్దవానిని తిమ్మరసు

అనునాతఁడు చంపెననియు, నందుచే రెండవవానిని సింహాసనమెక్కించి నరసనాయకుఁడు రాజ్యభారమును దానువహించి, నడపెననియు, న్యూనిజు అనుపాశ్చాత్యచరిత్రకారుఁడు వ్రాసియుండెననియుఁ జెప్పుచున్నారు. ఈతిమ్మరసు, నాదెండ్లతిమ్మరసు, అని కొందఱును సాళువతిమ్మరసు (కృష్ణరాయలమంత్రి) అని కొందఱును, మఱియొక తిమ్మరసు అనుమంత్రియని కొందఱును నభిప్రాయపడిరి. వీరు సాళువనరసింగరాయలపెద్దకుమారుని ఏల చంపిరో చరిత్రకారు లెవ్వరును స్పష్టపఱుప లేదు. ఇటీవలచరిత్రకారులు కొందఱు ఆతనిని జంపినవారు పైనిఁ జెప్పిన ముప్వురును గూడ కారనియు, తిమ్మరాజు అను పేరుగలశత్రురాజు చంపియుండెననియు నభిప్రాయపడిరి. ఇదియే సత్యమై యుండును. తుళువనరసనాయకుఁడే యాతనిని జంపించెనని యొకయపవాదముకూడ కలదు. ఈయపవాదమునకు భయపడి నరసనాయకుఁడు విశేషసమర్థుఁడయ్యును, నిజముగాఁ గర్ణాటరాజ్యసింహాసనము నధిష్ఠింపఁ గోరికయు శక్తియుఁ గలవాఁడయ్యును, నరసింగరాయలకుమారుని సింహాసనమెక్కించి నామమాత్రమున కాతనిని రాజుగానుంచి తానే సర్వాధికారియై రాజ్యము చేయుచుండెను. కొన్నిశాసనములలో సాళువవంశబిరుదములు తాను ధరించుటయుఁ దానే రాజునని ప్రకటింపయత్నించుటయుఁ జూడ నరసనాయకునిరాజ్యకాంక్షయు, స్వాతంత్ర్యాభిలాషయు స్పష్టమగును. కాని లోకాపవాదమునకుభయపడియో, తనప్రభువున కవసానకాలమునఁ జేసినవాగ్దానము నిలుపుకొనవలయుననియో, నరసింగరాయలకుమారునిఁ దాను జీవించియున్నంతకాలము కర్ణాటరాజ్యాధిపతిగా నంగీకరించెనుమాట మాత్రము యథార్థము. ఈకుమారుని పెనుగొండదుర్గమున నిర్బంధమున నుంచి తుదకాతనిని సంహరించెననిఁ నరసనాయకునిపై నొకయపకీర్తిని కొందఱు చరిత్రకారులు మోపియున్నారు కాని యది వాస్తవముకాదు శాసనము లందులకు వ్యతిరేకముగ సాక్ష్యమిచ్చుచున్నవి. కావున నాయపకీర్తినుండి నరసనాయకుఁడు విడివడుఁగాక!

సాళువనరసింగరాయల పెద్దకుమారుఁ డైనకుమారనరసరాయ లెప్పుడు హతుఁడయ్యెనో తెలియదు. క్రీ. శ. ౧౪౯౩ వఱకు సాళువ

నరసింగరాయలశాసనములు గన్పట్టుచున్నవి. ౧౪౯౨ మొదలు నరసింగ రాయలకుమారుని శాసనములు ప్రారంభమైనవి. ఈ మధ్యకాలములోఁ బెద్దకుమారుఁడు చంపఁబడియుండవలయును. నరసింగరాయలకుమారుని శాసనములలో నాతని పేరు తమ్మారాయఁడని కొన్నిటిలోను నిమ్మడి నరసింహరాయలని కొన్నిటిలోను కలదు. వీరిరువురు భిన్నులనుటకు నవి యొకేకాలమున వ్రాయించినవి, తమ్మారాయఁడని వ్రాసినవి స్వల్పముగను ఇమ్మడినరసింహరాయ లని వ్రాసినవి యధికముగను ఉన్నవి. పెద్దకుమారునిపేరు నరసింహరాయ లని తిరుపతి దేవస్థానమందలిశాసనము చెప్పుచున్నది. నిజముగా నితనికే ఇమ్మడినరసింహరాయలను పేరు సార్థక మగును. ఇమ్మడినరసింగరాయలశాసనము (A. R. 516 of 1906 శా. శ. ౧౪౧౫ (క్రీ శ. ౧౪౯౩) ప్రమాది సంవత్సరమునఁ గన్పట్టుచున్నది ఇమ్మడినరసింగరాయలపేరుగల శాసనములు శా.శ. ౧౪౨౮ వఱకు నున్నవి. వీనియన్నిటిలోను జెప్పఁబడిన యిమ్మడినరసింగరాయలు, ఒకేవ్యక్తియని చరిత్రకారులందఱు నూహించుచున్నారు. పైని వ్రాసినట్లు, ఇమ్మడినరసింగరాయనామమున కర్హుఁడైనవాఁడు నరసింగరాయల పెద్దకుమారుఁడే (ఇతని పేరు కుమారనరసయ్య యని తిరుపతిశాసనములో నున్నదిగనుక) యని తలంచితిమేని, ఆతఁడే పైశాసనముల లోని యిమ్మడినరసింహరాయలని నిశ్చయింపవచ్చును. ఇందుల కాటంకము గల్పించునవి న్యూనిజు మొదలయినవారి వ్రాఁతలు. న్యూనిజువ్రాఁతలను గొందఱు చరిత్రకారు లంగీకరించుట లేదు. సాళువనరసింగరాయలకుమారుల నిరువురిని దిమ్మరసు (తిమ్మరాజు) చంపెనని న్యూనిజు వ్రాసియుండెనని న్యూయల్ పండితుఁడు (Forgotten Empire) అను గ్రంథములోఁ జెప్పియుండెను అదియే సత్యమైనచో నరసింగరాయల రెండవ, మూఁడవకుమారుల నెవరో చంపిరనియు: బెద్దకుమారుఁడైన నరసరాయలు జీవించియుండెననియు, నితఁడే పైశాసనములలోని, యిమ్మడినరసింగరాయలనియు: మనము నిశ్చయింపవచ్చును.

ఈసందర్భమున నిఁక నొకవిషయమునుగూర్చి యాలోచింపవలసియున్నది. సాళువనరసింహరాయలకుఁ దిమ్మభూపాలుఁ డనునొకతనయుఁ డుండెడివాఁ డనియు, నాతఁడు గంగేశపండితునితత్త్వచింతామణి

యను తార్కిక గ్రంథమునకు, తత్త్వవార్త్తికమను పేర నొక వ్యాఖ్యాన గ్రంథమునురచియించెననియు, నందు, సాళువగుండనృపాలునితనయుఁడగునరసింహరాయలకును దిప్పాంబికకును దనయుఁడును, యువరాజును నగుతిమ్మభూపాలరచిత మని యుదాహరింపఁబడెననియు శ్రీ ఆచార్యనే. వెంకటరమణయ్యగారు వ్రాసియున్నారు (Further sources of Vizianagara hislory) తిరుపతి శాసనములో నీతిమ్మభూపాలుని పేరు లేదు. ఈతిమ్మభూపాలుఁడు, మహమ్మదీయులతో నైనయుద్ధములోఁ జని పోయెనని కొంద అందురు. తిరుపతిశాసనమునాఁటి కీతఁడు చనిపోయి యుండుననియు నందుచేతనే యీతనిపే రాశాసనములోని కెక్కలేదనియుఁ దలంపవచ్చును. అయిన నంతకుఁబూర్వము శాస్త్రగ్రంథమునకు వ్యాఖ్యానము వ్రాయఁగలిగినంతవయసు గలకుమారుఁడు నరసింగరాయనికుండెనా? యనిసంశయము కలుగవచ్చును. నరసింగరాయలు తనకుఁ జంద్రగిరిరాజధానిగా నున్నప్పుడు వ్రాయించినశాసనములు క్రీ.శ. ౧౪౫౬ మొదలు కన్పడుచున్నవి. అంతకుఁబూర్వమే డెని మిదిసంవత్సరములు కటకమురాజధానిగా రాజ్యముచేసెనని చరిత్రకారులు చెప్పుచున్నారు. అప్పటికాతనికి ముప్పదిసంవత్సరములు వయసుండెననిన చో నాతనిజననము క్రీ శ. ౧౪౧౬ ప్రాంతమగును. ఆతని ౨౫వ సంవత్సరమునఁ దిమ్మభూపాలుఁడు జన్మించెననియుఁ బైనిఁ జెప్పిన తిరుపతిశాసనము ౧౪౮౦ ప్రాంతమనియుఁ దలంచితిమేని తిమ్మభూపాలుని కప్పటికి ౪౦ సంవత్సరముల వయసుండి గ్రంథరచనాసామర్థ్యము కలిగియుండునని తలంచుటలో విరుద్ధ మేమియు నుండదు. ఇతఁడు తండ్రిజీవితకాలములోనే చని పోయియుండును తిరుపతిశిలాశాసన మసత్యమనుటకుఁ గారణముగుపడదు. అందుఁ గాల మదాహరింపఁబడకపోవుటచే నది యెప్పుడు వ్రాయఁబడినచో చెప్ప జాలము.

సాళువనరసింగరాయల రెండవమూఁడవ కుమారులు శత్రువులచే నిహతులైరనుటకు వారివృత్తాంతము లేమియుఁ దెలియరాకపోవుటయే కారణము. కుమారనరసరాయలే ఇమ్మడినరసింహరాయలనుటకీకనొక యాక్షేపము గన్పడుచున్నది. సాళువ నరసింగరాయలకుఁ దరువాతను, తుళువనరసనాయకునికుమారుఁ డైనవీరనరసింహరాయ

లకుఁ బూర్వమునను గల శాసనములలో, తమ్మరాయలు (ధర్మారాయలు అనికూడ కలదు) ఇమ్మడినరసింహరాయలు, భుజబలరాయలు అనిమూఁడు పేర్లు గనవచ్చుచున్నవి. ఈమూఁడును ఒకేవ్యక్తికిఁ జెందిన పేరులని చరిత్రకారు లూహించుచున్నారు. అది సత్యమే యైనచో, పైనిఁ జెప్పిన సిద్ధాంతమునకు బాధ కలుగ నేరదు. కాక తమ్మరాయలు వేఱొకఁడేని యాతఁ డెవ్వఁడు ? అనుప్రశ్న రాక మానదు. ఇమ్మడినరసింహరాయలకు 'భుజబల' శబ్దమును విశేషణముగాఁ జేర్చినఁ జేర్పవచ్చును కాని, కుమారనరసరాయలను దమ్మరాయలని పిలుచుటకుఁ గారణ మగపడదు. తమ్మరాయలను ఇమ్మడినరసింగయని పిలుచుటయు 'సబబు' కాదు. నరసింగ అనునది నిజనామమైయున్నప్పుడే తండ్రికిఁ దరువాత నితఁ డిమ్మడి యగును గాని మొదటిపేరు తమ్మరాయ లైనప్పుడు అతనిని "ఇమ్మడినరసింగ" యనుట తటస్థింపదు. 'ఇమ్మడినరసింగ' యనునది బిరుదము కాదు. బిరుదముగా నాశబ్దమును వాడవలసివచ్చినచో 'అపర నరసింగ' యనిగాని యట్టియర్థమునిచ్చు మరియొకపదమునుగాని చేర్చవలసియుండును. కావున తమ్మరాయ లిమ్మడినరసింగరాయలు కాఁడు. తిరుపతిశాసనములో 'తంగమ' నామధేయుఁ డైనకుమారుఁ డున్నాఁడు. అతఁడే "తమ్మరాయఁడా?" యను సంశయము కలుగుచున్నది. అయిన నొకేకాలములోఁ దమ్మరాయ, ఇమ్మడినరసింగరాయలశాసనము లెట్లు వచ్చు ననుప్రశ్నవచ్చును? వేఱువేఱుప్రదేశములలో నొకేకాలమున ప్రభువులుగనో రాజ, యువరాజులుగనో యుండ అట్టిశాసనములు బయలువెడలెనేమో పరీక్షింపవలసియున్నది. ఈవిషయముల నింకను బరిశోధించి "నరసింహపంచక" మను పేరనొక గ్రంథమును వ్రాయుట యావసరమని తోఁచుచున్నది.

ఇమ్మడి నరసింగరాయలకాలములో నాతనికిని తుళువనరసనాయకునకును సరిపడక కొంతకాలము శత్రువులుగానుండినట్లును నొకప్పుడు తుళువనరసనాయకుఁడు స్వసైన్యముగా రాజధానీనగర మైనవిజయనగరముపై దండెత్తినట్లును చారిత్రకాధారములు కలవు. దీనికిఁ గారణము తనసోదరుని జంపినతిమ్మరాజుతో నిమ్మడి నరసింగరాయలు స్నేహమును గలిగియుండుటయే యని కొందఱు తలఁచుచున్నారు.

తుళువ నరసనాయకుఁడు, శా.శ. ౧౪౨౫ వ సంవత్సరములోఁ గాలధర్మము నొందినట్లు ఉత్తరార్కాడుజిల్లా దేవికాపురమున నాతని భృత్యులు వేయించినశాసనముల (A.R. ౧౯౦౨ సంఖ్య 3౫౨-3౫౬) వలనఁ దెలియుచున్నది. సాళువనరసింగరాయనికుమారుఁ డైనయిమ్మడి నరసింగరాయనిపే రుదాహరింపఁబడినశాసనములు శా. శ. ౧౪౨౬ (౨౫ సెప్టెంబరు ౧౫౦౪ సం.) లోఁగూడ దేవికాపురముననే కన్పడు చున్నవి (A.R. 3౯౫-3౯౬ of ౧౯౦౨) పైనిఁ జెప్పఁబడిన 3౫౨-3౫౬ సంఖ్యలుగలశాసనములను, 3౯౫-3౯౬ సంఖ్యలుగలశాసనములను వేయించినవా రొక్కరే. ఈయిమ్మడి నరసింగరాయలశాసనము లింకను బెక్కులు కలవు. గ్రంథవిస్తరభీతిచే నిందావివరములసీయ లేదు.

ఈశాసనములనుబట్టి తుళువనరసనాయకుఁడు చనిపోయినపిమ్మట నాతనికుమారుఁ డైనవీరసింహరాయలకాలములోఁగూడ సాళువయిమ్మడి నరసింగరాయలశాసనములు గన్పట్టుచుండుటచే నరసనాయకుఁడు సాళువనరసింగరాయలకుమారులను జంపి రాజ్యము నపహరించె నను ప్రవాదమునందు సత్యములే దని ధ్రువపడుచున్నది. కాని, ఇమ్మడి నరసింగరాయలు నామమాత్రప్రభువనియుఁ దుళువనరసనాయకుఁడే వాస్తవికప్రభువనియు, విజయనగరసింహాసనాధినేతకావలయు ననుసంకల్పము నరసనాయకునకు లేకపోలేదనియు నాతనిశాసనాదులవలన స్పష్టపడుచున్నది. అప్పటిప్రజలట్లుగానేభావించిరి.

దాదాపు ౧౫౦ సంవత్సరములు సంగమవంశజుల నాశ్రయించినకర్ణాటరాజ్యలక్ష్మి, సాళువనరసింహరాయలఁ జేపట్టినట్లనాతలూగి, యిమ్మడినరసింగరాయలపై దయాదృష్టిసారించి తుళువనరసనాయకు ననుగ్రహింప సమకట్టి, యతనికిఁ బిమ్మట నలువదిసంవత్సరములు తుళువవంశజులయింటను నటుపిమ్మటనార్వీటివారియింటను నెలకొనినది.

## తుళువ వీరనరసింహరాయలు

తుళువనరసనాయకునియనంతరమున నాతనిపెద్దకుమారుఁ డైన వీరసింహరాయలు తండ్రిస్థానము నాక్రమించుకొని, సాళువయిమ్మడి

నరసింగరాయలయనంతరమునఁ గర్ణాటరాజ్యసింహాసనము నధిష్ఠించెను. తండ్రిజీవించియున్నప్పుడే తండ్రితోఁగూడ నీతఁడు రాజకార్యములను నిర్వహించుచుండెను. ఇతనితండ్రి యైనతుళువనరసనాయకుఁడు మిక్కిలి తేజశ్శాలియై పరాక్రమవంతుఁడై దేశమున రాజుతో సమాన మగుప్రతిపత్తిని సంపాదించియుండెను. ఆగౌరవము సాళువ నరసింగరాయునియనంతరమున మిగుల నభివృద్ధిచెంది ఇమ్మడినరసింగరాయలు పేరునకు రాజుగా నున్నను తుళువ నరసనాయకుఁడే ప్రభువని ప్రజ లనుకొనుచుండిరి. వీరనరసింహరాయలుకూడ తండ్రివలెనే గౌరవింపఁబడుచు నధికారమును చెలాయించుచుండెను. తండ్రిజీవితకాలమునందే యీతనిశాసనము లొకటి రెండు గన్పట్టుచున్నవి. ఇంతటిప్రతిభాశాలియగుటచేతనే యెట్టియభ్యంతరములులేకుండ నీతఁడు కర్ణాటసింహాసనము నధిష్ఠింపఁగలిగెను. ఈతనిశాసనములు క్రీ. శ. ౧౫౦౫ మొదలు ౧౫౦౯ వరకును గనుపట్టుచున్నవి. సాళువయిమ్మడి నరసింగరాయలను జంపి యీవీరనరసింహరాయలు కర్ణాటసింహాసనము నధిష్ఠించెనని కొందఱు చరిత్రకారులు వ్రాసియున్నారు. ఇదిసత్యమో నరసనాయకునిమీఁద నారోపింపఁబడినట్లే యితనిమీఁదను నింద యారోపింపఁబడినదో చెప్పఁజాలము. క్రీ. శ. ౧౫౦౬ వఱకును, ఇమ్మడి నరసింగరాయలను పెనుగొండయందుఁ గారాగారమున నిర్బంధములో నుంచి వీరనరసింహరాయ లాసంవత్సరముననే యాతనిని జంపించెనని చెప్పుదురు. క్రీ. శ. ౧౫౦౯ వఱకునుగూడ నిమ్మడినరసింగరాయలపేరుదాహరింపఁబడినశాసనములు కొన్నికన్పట్టుచున్నవి. వీనినిగూర్చి యింకను బరిశోధనము కావలసియున్నది.

ఈతనితరువాతఁ గర్ణాటసింహాసనము నధిష్ఠించినవాఁ డీతని సవతిసోదరుఁ డైనశ్రీకృష్ణదేవరాయలు. ఈతఁడు కవియగుటచే నీతని చారిత్రమును వేఱొకచో వ్రాయుచున్నాఁడను.

### వెసరవాయ గంగయామాత్యుఁడు

ఈకవులు రచించిన రెండవగ్రంథము ప్రబోధచంద్రోదయమనునైదాశ్వాసములపద్యకావ్యము. అద్వైతమతవిషయములు సులభముగా బోధపడుటకై గౌతమగోత్రజుఁడును బ్రహ్మజ్ఞానియు నగు కృష్ణ

మిశ్రపండితుఁడు గోపాలమంత్రి యనునాతనికోర్కెపై నీదృశ్యప్రబంధమును సంస్కృతమున రచియించె నఁట! చంద్రవంశపురా జగుకీర్తి వర్మపట్టాభిషేకమహోత్సవసమయమున నీనాటకము ప్రదర్శింపఁబడె నఁట! ఈకృష్ణమిశ్రుఁడు క్రీ. శ. ౧౧౦౦ సంవత్సరప్రాంతమువాఁడు. ప్రబోధచంద్రోదయమనఁగా బ్రహ్మసత్యమ్'' జగన్మిథ్యా యనుజ్ఞానముదయించుటయే. ప్రబోధచంద్రోదయమును రెండవగ్రంథమనిసను గాలమును బట్టి యది ప్రథమగ్రంథమే. ప్రబోధచంద్రోదయము మొదటను దరువాత వరాహపురాణమును రచించియుండిరి.

ఈనాటకము నీకవులు ప్రబంధముగా రచియించి పెసరవాయ గంగయామాత్యునకుఁ గృతి యొసంగిరి. ఇతఁడు కాశ్యపగోత్రుఁడైన నియోగిబ్రాహ్మణుఁడు. తమ్మరాజు కుమారుడైన బసవనృపాలుని యొద్ద మంత్రిగానుండి పేరు గాంచినవాఁడు. కృతిపతివంశవర్ణనము పెక్కుపద్యములలో నిందుఁ గలదు. అందు రెండుపద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

సీ. మాధవవర్మభూమండలేశ్వరవంశ
జలధికి నేరాజు చందమామ
యేరాజుదయశైల మెలమి విభేదించెఁ
గపటాహితమహాంధకార మడఁగ
గజపతిసురధాణి గడిదుర్గముల కెల్ల
నేరాజు వజ్రంపుబోరుతల్పు
మహిమచే నేరాజు మఱపించె నలభగీ
రథపృథురామరఘురమణుల
నట్టిగుణశాలి తమ్మరాయనికుమార
వీరబసవక్షమాచక్రవిభునిచేత
మన్ననలు గాంచినమహితుఁ డితఁడు
మనుజమాత్రుండె గంగయామాత్యవరుఁడు.

సీ. సరిలేని నీతిచాతురిచేత రాజ్యతం
త్రంబును నడపిన నడపుఁ గాన్సి

యనిశంబు పుష్పచందనవనితాది సౌ
ఖ్యంబుల నందిన నందుఁ గాని
సంగీతసాహిత్యసరసవిద్యావినో
దంబులఁ దగిలినఁ దగులుఁ గాని
స్వామిహితాసక్తి సకవనాసదను
శాసనలీలఁ జరపినఁ జరపుఁ గాని
నీళ్ళలోపలి సరసజనీదళంబు
సరవి నిర్లేపుఁడైన సంసారయోగి
సందియము లేదు ప్రఖ్యాతశంభుమూర్తి
యీయయ్యంతయగంగమంత్రీశ్వరుండు.

శ్రీనాథమహాకవిబావమఱఁది యైనదగ్గుబల్లిదుగ్గయకవి రచించిన నాసికేతోపాఖ్యాన మీగంగయామాత్యునకే కృతి యీఁబడినది. ఆ విషయమీక్రిందిపద్యములో ప్రబోధచంద్రోదయమున నీకవు లుగ్గడించి యున్నారు.

క. ప్రఖ్యాతనాసికేతూ
పాఖ్యాన మహాప్రబంధపరిమళితసుధీ
వ్యాఖ్యానశ్రవణోదిత
సౌఖ్యా సంఘటితచింతశంకరసఖ్యా!

## ప్రబోధచంద్రోదయరచనాకాలము

కృతిపతియైన గంగనామాత్యుని ప్రభువగు బసవనృపాలుఁడు దూబగుంట నారాయణకవిచేతఁ బంచతంత్రమును గృతి నందియుండెను. బసవనృపాలునికాలమును శాసనసహాయమునఁ దెలిసికొని నారాయణకవి చారిత్రమున నిర్ణయించియున్నారము. దానినిబట్టి నాసికేతూపాఖ్యాన రచనాకాలము క్రీ. శ ౧౪౬౦ ప్రాంతమని దుగ్గయకవి చారిత్రమునఁ జెప్పియుంటిని. ఈ ప్రబోధచంద్రోదయము కూడ నించుమించుగ ౧౪౭౦ ప్రాంతమున రచింపఁబడియుండును.

ఈగ్రంథముయొక్క ప్రాశస్త్య మీక్రిందిసీసపద్యమునఁ దెలుపఁబడినది.

సీ. వివరింప నిది సర్వవేదాంతసారంబు
తలఁపఁగా నిది గట్టితెలివి త్రోవ
యిది భోగమోక్షసంపదలకు మూలంబు
మోసలే దిది ఘనంబులకు ఘనము
జ్ఞానకర్మరహస్యసాధనంబును నిది
యిది నవరసముల నీనుసురభి
షడ్దర్శనంబులు సరవి నిందున్నవి
సందేహములు దీఱ విందుఁగాని
యీ మహారసపాకము నెఱిఁగినట్టి
జనుఁ డెఱుఁగఁడు మఱి తల్లిచన్నుపాలు
దీనిసరి చెప్ప మది లేదు త్రిభువనముల
దారక దీకృతి నీవంటి దారకుఁగాని.

రాజున కద్వైతమతము నెన్నివిధముల బోధించినను మనసున కెక్కకపోఁగా, కామక్రోధాదులను పాత్రలనుగా బెట్టిరాజులకు సర్వదా హృదయానందకర మగుయుద్ధమునుజ్ఞానాజ్ఞానములకుఁ గల్పించి తన్మూలమున రాజునకు జ్ఞానబోధ గావించుటకై కృష్ణమిశ్రుఁ డీనాటకమును గల్పించె నని పండితులు చెప్పుచుందురు. సంస్కృతనాటకమును బ్రబంధమునుగా రచించుటకు దారిచూపినవారు వీరే. ఈనాటకము దృశ్యకావ్యమగుటచేఁ బ్రబంధమున కనుకూలమగు రీతిని వీ రచ్చటచ్చటఁ గొన్ని మార్పులను గావించియున్నారు.

ప్రబోధ చంద్రోదయ ద్వితీయాశ్వాసాదిని గృతిపతిని సంబోధించుచు.

క. "శ్రీకరవీక్షణ దాన
శ్రీకర నరసింహనృపవశీకర నయవి
ద్యాకరణచతుర్దశవి
ద్యాకర ధీరంగమతియనంతయగంగా!

అని వ్రాసినపద్యమునుబట్టి "పెసరువాయాన్వయవంశాబ్ధిచంద్రుఁ డైన మనగంగయామాత్యుఁడు ముందు జైమినిభారతకృతిపతి యైన సాళువ

నృపాలునిసచివుఁడై యుండినట్టు లెఱుఁగవచ్చును" అని శ్రీవీరేశలింగ ముపంతులుగారు కవులచరిత్రమున వ్రాసియున్నారు. శ్రీ వేదుమళ్ళ అచ్యుతరావుపంతులుగారీయూహ నంగీకరింపక "నరసింహ నృపవశీకరన యవిద్యాకరణ" యను వాక్యమునకు వేఱొకరీతిగా నర్థమును జెప్పియున్నారు.

సాళువనరసింహరాయలను, బురుషోత్తమగజపతి జీవగ్రాహము గాఁ బట్టుకొనెననియుఁ బ్రతాపరుద్రగజపతి రచించిన "సరస్వతీవిలాస" మనుధర్మశాస్త్రగ్రంథమునందును, పశనియనంతవరశాసనమునందును.

"మిత్రం శేషధరస్య దాత్రుపరిష ద్వాస్యైవ సూనో స్సమం
సౌందర్యాదిశయాళుకీర్తి సమతౌ సన్త్యేతు నైవాపరః
జీవగ్రాహమరిం ప్రగృహ్య సమరే కర్ణాటభూమీధవం
దీనోక్తి ప్రవణం నృసింహమనుజాధీశం పున స్త్యక్తవాన్."
"యస్మిన్ నిత్యతరప్రతాపదహనజ్వాలాయమానధ్వజ
స్తంభాబద్ధకుసుంభరక్తవసనప్రేక్షావిభగ్నద్విషే;
సంధా యాభయ యాచనాంజలి మహోగ్రత్వోదయాద్రింభయా
దాత్మానం ముముచే నృసింహనృపతిః కర్ణాటదేశాధిపః॥

అనుశ్లోకములవలన, ఉదయగిరిరాజ్యమును బురుషోత్తమగజపతి కర్పించి సాళువనృసింహరాయలు విముక్తి నందెనని యు, "గజపతులయొద్దమంత్రిగానున్నకాలములోఁ గృతినందినగ్రంథములో శత్రురాజునొద్దఁ దాను మంత్రిగానుండినట్లు వ్రాయించుకొనునని యూహించుట యసంగతమని తోఁచుచున్నది. కనుక నృసింహరాయలను జీవగ్రాహముగాఁబట్టించుటయే గంగమంత్రియొక్క నయవిద్యాకరణమహత్వమని నిర్ణయింపవచ్చును" అని శ్రీ అచ్యుతరావుగా రభిప్రాయపడియున్నారు. వీరియభిప్రాయమే సమంజసమైనది. గంగయమంత్రి పురుషోత్తమగజపతియొక్క మంత్రియుఁగాఁడు. సాళువ నృసింహరాయల మంత్రియునుగాఁడు. ఇతఁడు బసవనృపాలుని మంత్రి. ఈబసవనృపాలుఁడు గజపతికి సామంతుఁడైనట్లును, ఉదయగిరినిజయించినట్లును పైనివ్రాసినసీసపద్యములోని "ఏరా జుదయశైల మెలమిని భేదించెఁ గపటాహితమదాంధ

కార మడఁగ; గజపతిసురథాణి గడిదుర్గముల కల్ల నేరాజు వజ్రింపు బోరుతల్పు" అనువాక్యములవలనఁ దెలియుచున్నది. సాళువనరసింహ రాయని జీవగ్రాహముగాఁబట్టుకొనుటలోఁ బురుషోత్తమగజపతికి బసవ నృపాలుఁడు విశేషసాహాయ్యము చేసియుండును. ఆఘనకార్యమునుసా ధించుటకు గంగయమంత్రి బుద్ధిచాతుర్యము ప్రధానకారణమై యుం డును. ఈభావమే 'నరసింహనృప వశీకరనయవిద్యాకరణ' అను వాక్య ములోసూచింపఁబడినది. పురుషోత్తమ గజపతి క్రీ. శ. ౧౩౬౬ మొదలు ౧౩౯౬ వఱకు రాజ్యమున చేసినవాఁడు. సాళువ నరసింహ రాయలను ౧౩౬౭ ప్రాంతమున గజపతి పట్టుకొనియుండును. క్రీ. శ. ౧౩౭౦ ప్రాంతమున ప్రబోధచంద్రోదయము నీకవులు రచించియుం దురు. సాళువ నరసింహరాయలు గజపతితోసంధిచేసికొని విడివడియుం డును. గంగయామాత్యునకుఁ బిమ్మట వీరు తుళువనరసనాయకునాశ్రయిం చి సాళువ నరసింహనాయకుని జీవితకాలములో శ్రీ వరాహపు రాణమునురచియించియుండవచ్చును.

గంగయామాత్యుఁడు గజపతులయొద్దఁగాని సాళువనరసింహరా యలయొద్దఁగాని మంత్రిగా నుండియుండెనేని, ప్రబోధచంద్రోదయము లోఁగాని నాసికేతోపాఖ్యానములోఁగాని యీవిషయము చెప్పఁబడ కుండ నుండదు.

## శైలినిచూపుటకై మచ్చుపద్యములు

వరాహపురాణము;—

ఉ. ఓపరమాత్ములార! కరుణోదధులార! నితాంతయోగవి
ద్యాపరతంత్రులార! తెలియన్వశమే! భవదీయమైన యీ
నైపుణి చాలుఁ జాలు ననినన్ నిజమూర్తులు దాల్చి తాపసుల్
జా పరమేశ్వరా యనిన జంతువు లన్నియుఁ బోయె మాయమై.

౧ ఆ.

మ. కకుబంధాంతరధాత్రిపై నిది మొదల్గా సార్వకాలంబు న
త్తఱిఁ గోదండ్రికు నొంటకుండెడును ముగ్ధ నాన్నతనూజాత నూ

రక భర్జింపక యేలుకొందు మునివర్యా! నేడు మాయింటఁ బై
తృక మంచు న్మిథిలాపురంబునకుఁ బోయె న్వార్జితశ్రీధుఁడై. ౨ఆ.

చ. అలఘుబలాఢ్యుఁ డయ్యును దనూభవు గావున శాంతచిత్తుఁడై
నిలిచినతండ్రికాలమున నెమ్మది గానములోనిదోసకా
యలవలె నన్నరాజులు బలారిభయంకర! నిన్ను నట్లకాఁ
దలఁచిరి దాడిఁ బెట్టి భుజదర్పము చూపుము వేయునేటికిన్. ౩ఆ.

ఉ. యామవతీవిలాసినికి నైదువతాఁడు సమస్తనిర్జర
స్తోమముకూడు లక్ష్మిసయిదోడు నభోమణిజోడు పాంథకాం
తామృగహింసకు న్వాడలుదర్పకలుబ్ధకు డివ్వెగూడు నె ౪ఆ.
త్తామరపాడు రాగరసధాముఁడు సోముఁడు దోఁచెఁ దూర్పునన్.

శా. ఆనీలుండు వరూథినీపరివృతుండై పోయి తేజోనిధిన్
మానిం గానికినైనఁ గైకొనక భీమభ్రూకుటీనాట్యశే
ఖానైపుణ్యము ఫాలభూమి మెఱయంగా యజ్ఞశాలాస్తర
స్థానస్థాపితరత్నరాజము హరించం దేరుడిగ్గన్వడిన్. ౫ఆ.

సీ. స్వస్తి సమస్తభవ్యగుణసంపన్నుఁడై
నతుషారపర్వతనాయకుండు
స్వస్తి సమస్తదివ్యగుణసంపన్నులై
న నిషధవింధ్యమందర సుమేరు
దర్దరగంధమాదన మాల్యవత్పారి
యాత్రిలోకాలోక చిత్రకూట
మలయప్రముఖబాంధవులకు సంప్రీతి బు
ట్టించిన శుభలేఖ దేవదేవుఁ
డైన శివునకు మనగౌరి నాదిశక్తి
నిచ్చుచున్నాఁడ మీరలు వచ్చునది వి
వాహమున కంచు లేఖలు వ్రాసి పంప
వారు నాకారములుదాల్చి వచ్చి రపుడు ౬ఆ.

క. మల్లోకంబుల జనములు
రోళ్ళన్ రోకండ్లఁ బాడ రోయక మఱియున్

వెల్లవిరిగాఁగఁ దిరిగిన
గళ్ళకు నయగారిమెలఁతుకం గొనిపోయెన్. ౭ ఆ.

మ. అరరే శౌరి బలీ ధ్రువుం డహహా భద్రాశ్వుండు వహ్వా తలో
దరి ప్రహ్లాదుఁడు మేలు బాపు మహీభర్తల్ విప్రులౌరౌరా వణి
గ్వరు లాహా కనుగాపు సాధు మదవద్వ్రాతాప్తిదై తేయసం
హరణప్రౌఢిఁ బ్రసిద్ధుఁ డైనముని మర్ఘ్యూ యందునుద్బాహుఁడై ౮ ఆ

మ. ప్రసవాద్యంబులచే నమో స్త్వమృతరూపాయంచుఁ బూజించి వే
దసమర్థుం డగువిప్రపుంగవునకుం దానంబుగా నిచ్చి గం
ధసమేతంబుగ నర్ఘ్య మిచ్చి యవభక్తంబున్ ఘృతవ్యక్తమున్
వసుధానిర్జరు లారగింప వ్రతియై నక్తంబు చేయందగున్. ౯ ఆ

గీ. శాంతులై నిన్నె నమ్మి నిశ్చలసమాధి
గలుగువారికిఁ దను దాన కానవచ్చు
నాత్మ నీమూర్తి శుద్ధస్వయంప్రకాశ
తత్త్వ మగు నీకు లేదు పృథగ్వ్యవస్థ. ౧౦ ఆ

మ. సమయజ్యోతిషికుండు వీరదనుజస్వర్వ్యోషిదుద్వాహసం
భ్రమలగ్నంబు ఘటింపఁ బెట్టు గడియారం బిట్లనన్ రక్తపూ
రమునం దేలె గుమారికాకరధనుర్జ్యావల్లినిర్ముక్తశా
తముఖార్ధేందుశరక్షతంబు లగు తద్రక్షఃకపాలావళుల్ ౧౧ ఆ

మ అవనీకామిని ఫాలభాగమున హస్తాంభోజముల్ చేర్చి ది
వ్యవరాహాధిపుఁ జూచి దేవ! మును దుర్వాసో మునిస్వామిచే
వివిధశ్రీశమహత్త్వముల్ విని హిమోర్వీభృద్వరాభ్యర్ణపు
ణ్యావని న్నిల్చిన నాఁటి సత్యతపుఁ డేమయ్యెం గృపం జెప్పవే ౧౨ ఆ

ప్రబోధచంద్రోదయము:—

చ. జనకుని పక్షపాతమున సంతతమున్ బలవంతుఁ డైనమో
హుని భుజవిక్రమంబునకు నోర్వఁగ లేక వివేకుఁ డాజిలోఁ
దనబలగంబు దానును యదాయసలై చని వృత్రు కోడిపో
యినసురరాజు చందమున నెక్కడనో యణఁగుండె నంతటన్ ౧౩ ఆ

మ. నియతాత్మ్యంబు విరించి భారతికి నెంతే చిక్క దక్షాధ్వర
ధ్వంసకారీశుఁడు గౌరి కౌఁగిటను జిక్కన్ వార్ధిలోఁ గైటభా
రియుఁ లక్ష్మీయువతీకపోలమకరీరేఖాంకితోరస్స్థలుం
డయి తక్కన్ మఱియున్న జంతువుల కాహా! శాంతి సిద్ధించునే ౯౬

చ. ఉపనిషదబ్జనేత్రి వినయోక్తుల యర్థము లెంగలేక జీ
వపురుషుఁ డవ్వివేకుఁ గని వత్స! జరామరణాదిసంగతుం
డపలుని భేదయుక్తు నను సత్యచిదాత్ముని గాఁగ బల్క నీ
విపులవిలోచనామణి సవిస్తరభంగుల నన్నుఁ దెల్పుమా! ౫౬

## మ ద న సే న ము

ఈకవులలో మల్లయకవి మదనసేన మను ప్రబంధమును రచియించినట్లు పెదపాటిజగ్గన కృతమైన ప్రబంధరత్నాకరములో నుదాహృతములయిన పద్యములనుబట్టి తెలియుచున్నది. ఆగ్రంథము నీకవులిరువురును గలిసి రచించినను జగ్గన తనగ్రంథములో మల్లయకవి నొక్కని నుదాహరించియుండిన నుండవచ్చును. మదనసేన యిప్పు డెచ్చటను గన్పించుటలేదు.

గీ. అపుడు తానావసానంబునందు మధ్య
కీలితంబయి యొప్పెఁ గెంగేలు వలికి
సలియవు గదా యటంచు నానడిమితీఁగ
నుపచరింపఁగ వచ్చినదో యనంగ.

సీ. తళతళమను పతాకలతోడ రవికాంతిఁ
దలతల మను మేటి రత్నములతోడఁ
గనఁగన సొబగధికం బైనపొడవుతోఁ
గనకన మను హేమకాంతితోడఁ
గలకలఁ బల్కు చిల్కలతోడ గృహాద్రిఁ
గలఁ గలహంససంఘములతోడఁ
బరిపరిగతి నాడు బర్హులతో నిజో
పరిపరిగతి మేఘపంక్తితోడఁ

దము ల విహరించు పారావతములతోడ
భ్రమదళివ్రాత సుమవితానములతోడఁ
బ్రమదవనవాసనలచేతఁ బ్రమద మొసఁగి
యొనయు నీమేడతోఁ బ్రీతి యొనయఁ గలదె.

సీ. పరిఫుల్లహల్లకప్రభలు నిండినచోట
సాంధ్యరాగద్యుతి చౌకళింప
వికలనీలోత్పల ప్రకరస్థలంబుల
గిఱికొన్నచీకట్లు గ్రొళ్లుదాఁట
నిర్ణిద్రకుముదవనీప్రదేశంబులఁ
దేటవెన్నెలపిల్ల తీపులాడ
వికసిత కనకారవిందబృందంబులు
బెరయు నీరెండఁ బింపిళ్లు గూయఁ

గీ. బగలు రేయును దమలోనఁ బగలు మాని
కలసి మెలసినబాగునఁ గడలు కొల్పి
వివిధమహిమలఁ దనరు నావిమలసరసిఁ
జూచి నివ్వెఱపడి రాజసూనుఁ డపుడు.

సీ. మెఱుఁగుశృంగములందు మెదలక యున్నవి
నీలమేఘంబులు నీరజాస్య !
వెన్నెలపులుఁగులు వేకువచంద్రుపైఁ
దేలుచున్నవి చూడు తియ్యఁబోఁడి !
మింట నాగడపలు మెల్లమెల్లన విచ్చి
కానరా వయ్యెనో కలువకంటి !
పారిజాతపుఁదీఁగ బహువర్ణపుష్పభా
రంబు మోవఁగ లేదు కంబుకంఠి !

గీ. యనుచుఁ దమలోన గర్భోక్తు లాడుకొనుచుఁ
దనకు నుపచారములు సేయు నన్నుఁగుఁజెలులఁ
జూచి నవ్వుచు సహజన్య చూడ నొప్పెఁ
జారుదోహదలక్షణసహిత యగుచు.

**వామనపురాణము.**

కస్తూరిరంగకవి తనరంగరాట్ఛందమున నందిసింగన వామన పురాణములోనివని యీక్రిందిపద్యములను నిత్యసమాసయతికి లక్ష్యములుగా నిచ్చియున్నాఁడు. నందిమల్లయ్య, ఘంటసింగయకవులుగాని నందిసింగయ కాఁడు. వీరు వామనపురాణమును రచియించినట్లు గనఁబడదు.

క. కాంతాలలామ నీకే
కాంతంబుగఁ బల్కరింతుఁ గల్గినకార్యం
బంతయు ముదమలరఁగ విను
మంతట నీమదికిఁ బ్రీతివిద్దె యుండు సుమీ.

గీ. సరసచిత్రాన్నములును రసాయనములు
భక్ష్యములు నూరుబింబ్లును బాలుజున్ను.

వామనపురాణమును రచియించినవారు, ఎలకూచిబాలసరస్వతియు, లింగమకుంట రామకవియుఁ బొన్నతోట యోబళకవియున్నైయున్నారు. పైపద్యములం దేవామనపురాణముననో యుండియుండును. నందిసింగయ యను వేఱొకకవి యున్నాఁడో, లేక రంగకవి మల్లయ యింటిపేరును బొరపాటున సింగయ్యకుఁ దగిల్చెనో చెప్పఁజాలము.



# 82 కొఱవి గోపరాజు

ఇతఁడు సింహాసనద్వాత్రింశక యనుపండ్రెండాశ్వాసములపద్యకావ్యమును రచియించి, హరిహరుల కంకితము కావించెను. ఈతని గృహనామము కోవెల యని యాంధ్రకవుల చరిత్రకారులు వ్రాసియున్నారు. నేను పదునాలేండ్లవయసులో నున్నప్పుడు, మాబంధువులో కరు క్రొత్తగాఁ గ్రయమునకుఁ గొనినయొకతాటాకుయింటిగోడపై నీ గ్రంథము పెట్టియుండఁగాఁ జూచి నేను దానిని గ్రహించి, యాఱుమాసములు శ్రమపడి కాగితములపైఁబ్రతి వ్రాసితిని. అప్పుడు గోదావరి మండలములోనికాకినాడలో, పోలవరపుసంస్థానాధిపతు లగుశ్రీకొచ్చర్ల

కోట రామచంద్రవేంకటకృష్ణారావుబహద్దరుగారు సరస్వతీపత్త్రికను నడపుచుండిరి. నే నీగ్రంథములోనికొన్నిపద్యములను వ్రాసి పంపుచు, దీనిని సరస్వతిలోఁ బ్రకటింపుఁడని యుత్తరము వ్రాసితిని. ఇంతకంటె మంచిప్రబంధములు కొన్ని ముద్రింప వలసినవిగల వనియు నవి పూర్తియైనఁబిమ్మట దీనిని బ్రకటింతు మనియు నాయన ప్రత్యుత్తర మొసంగెను. ఇంతలో నేను మాయూరువిడిచి గ్రామాంతరమునకుఁ బోవలసివచ్చి యాగ్రంథము నొకపెట్టెలో భద్రపఱచియుంచితిని. నేనాయూరునుండి మూఁడుసంవత్సరములవఱకు మరల మాయూరు రాలేదు. ఈలోపునఁ దస్కరు లీపెట్టెను బట్టుకొనిపోయిరి. మరల దొరకలేదు. ఆతాళపత్త్రప్రతిలో "కొవల" అని యీకవిగృహనామము వ్రాయఁబడియున్నది. ఇప్పు డీగ్రంథము నాంధ్రసాహిత్యపరిషత్తు వారు ప్రకటించియున్నారు. అం దీతని యింటిపేరు 'కొఱవి' వారని యున్నది. కావున నీతనిని కొఱవిగోపరాజని యే యిం దుదాహరించితిని. నిజామురాష్ట్రములోని "కొఱవి" యనుగ్రామమునుబట్టి యీ పేరు వచ్చియుండును.

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు; హారితసగోత్రుఁడు. ఈతనినివాసము వేముగల్లనుగ్రామమయిన ట్లీక్రిందిపద్యములోఁ గవిచెప్పియున్నాఁడు.

శా. రాణా మల్లనకీర్తిచంద్రికలు పర్వం బొంగి మధ్యాశ్రిత
క్షోణీభృద్వనదుర్గమై గుణమణిస్తోమంబుల నిండి య
క్షీణశ్రీపురుషోత్తమాశ్రయము నై చెల్వారి దానామృత
శ్రేణిం ద్యాగసముద్రనామము వహించె న్వేముగల్లీమహిన్.

ఈవేముగ ల్లెచ్చటిదో తెలియదు. మైసూరురాష్ట్రములో కోలారుజిల్లాలో నొకవేముగ ల్లున్నది. నైజాము రాష్ట్రములోఁ గూడ నొకవేముగల్లున్నదని వినుచున్నాఁడను. కాని యది యేజిల్లాలోనున్నదో తెలియలేదు. ఈకవిరచించిన గ్రంథమునందష్టమాశ్వాసములో శ్రీశైలపర్వతమును వర్ణించియాపిమ్మట భువనగిరి, ధర్మపురి, ఏకశిలానగర మనఁబడియెడియోరుగల్లు నిజామురాష్ట్రమునఁ బ్రవహించుచున్న గౌతమీనది

మొదలగు వానిని జక్కగా వర్ణించియున్నవాఁడగుటచేత, వేముగల్లెచ్చటనున్నను, నిజాముర్రాష్ట్రమునందలి పరిచయమీతని కెక్కువగానున్నట్లు గన్పట్టును. ఇతని పెదతండ్రి కుమారులైన బాచనసింగనలు రాచకొండప్రభువైన రెండవసర్వజ్ఞసింగయప్రభువునొద్ద మంత్రులైయుండుట కారణముగా నోపును.

ఏదియెట్లున్నను, కవినివాసము వేముగల్లనుట నిశ్చయము. కవి యే పైపద్యమునకుఁదరువాత "అట్టిపురంబునందు" అని వ్రాసి

క. పూజితు లగుకవులకృపన్
భ్రాజిష్ణుఁడఁ గొంతయాంధ్రభాషావిదుఁడన్
రాజనుతుఁడైన కసవయ
రాజతనూభవుఁడ గోపరాజను వాఁడన్.

కవికాలమును నిర్ణయించుట కవసరమగుటచే నీకవివంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.

వెన్నవిభుఁడు

చెప్ప లేదు

అమరేశ్వరమంత్రి—గంగాంబ

అన్నయ సింగయ—గంగమ

పెద్దిరాజు

అబ్బయ గోపయ సత్తెనారన
=ఎల్లమ

రామరాజు కేసన బాచి సింగన
రాజు

## కసవరాజు —కామాంబిక

### గోపరాజు (కృతికర్త.)

ఈవంశమునకు మూలపురుషుఁడైనవెన్నయామాత్యుఁడు (ఇతనిని కవి చరిత్రకారులు పెన్నయామాత్యుఁడని వ్రాసిరి. కానియది ప్రతివిలేఖకుని పొరబాటువలనగలిగిన ప్రమాదము) వెలనాఁటి పృథ్వీశ్వరునియొద్ద మంత్రిగానున్నట్లు కవి యీక్రిందిపద్యములలో వర్ణించియున్నాఁడు.

సీ. కలుషమండలిక భేకఫణీంద్రుఁ డనరాయ
గజగంధవారణఖ్యాతి మెఱసి
వీరఘోట్టవిభాళుఁ డారూఢబిరుదవి
రోధికళింగనిరోధి యనఁగ
వెలసి నానాఁటికి వెలనాఁటి పృథివీశ్వ
రునిరాజ్యభారధుర్యుండనంగ
నారెలు గన్నడీలఱవలుఁ దెలుఁగులుఁ
దనబిరుదందియఁ దగిలికొలువ
నెగడి సనదవోలు నెలవుగాభూసుర
వంశసాగరామృతాంశుమూర్తి
చక్రవర్తి మాన్యసౌజన్యధన్యుండు
విక్రమార్కనిభుఁడు వెన్నవిభుఁడు.

ఉ. సౌందర్యవంబున న్మతి నిజస్థితి నేర్పునఁ బేర్మి సత్యవృ
త్తిం దుర్తబాణపాతనిరతిం గళల న్సరివత్తు రెట్లు ప
ఙ్త్కీందుఁడుబన్న గేంద్రుఁడున గేంద్రుఁడు పేంద్రుడునింద్రుడున్ హరి
శ్చంద్రుఁడు రామచంద్రుఁడును జంద్రుఁడు వెన్నయమంత్రి
చంద్రుతోన్.

పైపద్యములోఁ జెప్పబడిన పృథ్వీశ్వరుఁడు వెలనాటిచోడుని వంశములో నివాఁడు. ఇతనినిగూర్చి మంచనకవి చరిత్రమున విపులముగావ్రాసి యున్నాఁడను. ఇతఁడు చందవోలు (పైపద్యములోనిసనదవోలే) రాజధానిగా వెలనాఁడు వేఁగి దేశముల నేలినప్రభువు. ఇతని శాసనములు

క్రీ. శ. ౧౨౨౧ సంవత్సరము వఱకునున్నవి. కావున నీవెన్నయామాత్యుఁడా కాలమువాఁడు. ఈవెన్నయామాత్యునిపేరు. వెలనాఁటి గొంకరాజు (పృథ్వీశ్వరుని తాత) శాసనములలో (ద హిం.శా. సం ౪ సంఖ్య ౧౨౦౪-౦౫) గూడ నుదాహరింపఁబడి యుండుటచే గొంకరాజునొద్ద కూడ నీతఁడు మంత్రిగానుండి పిమ్మట పృథ్వీశ్వరునొద్ద మంత్రిగానుండి యుండును. ఈపృథ్వీశ్వరుఁడే నిర్వచనోత్తర రామాయణ కృతిభర్తయైన మనుమసిద్ధితండ్రి తిక్కరాజుచేఁ జంపఁబడినవాఁడు.

ఈవెన్నయామాత్యుని కుమారునిపేరును గవిచెప్పలేదు. కొలఁదికాలముమాత్రమే జీవించియుండుటచేతనో, సుప్రసిద్ధుఁడు కాకపోవుటవలననో పేరుతెలియకపోవుట మూలముననో, యాతనిని బేర్కొనలేదు. లేదా, "పుత్రుండై" యనుటకు బదులుగా బ్రతివిలేఖకుఁడు "పౌత్రుండై" అని వ్రాసియుండెనో, తెలియదు. పౌత్రుఁడనిన వంశములోనివాఁడనికూడఁ జెప్పవచ్చును.

ఈవెన్నయామాత్యుని ప్రపౌత్రుఁడైన యన్నయనుగూర్చి కవి యేమియు నిందుఁజెప్పలేదు. కాని ముప్పదియిద్దరుమంత్రులను వర్ణించిన సీసమాలికలో

"సీ. ఘనదానకర్ణుఁడై గండపెండెము దాల్చెఁ
గొఱవి యన్నామాత్యకుంజరుండు"

అని యుండుటచేతను,

క. వారి సిరినివలచు సిరియును,
నరుదుగ హరిఁగోరుఁ గొఱవియన్నయ యెపుడున్
వరకీర్తి సతినివలచును
వరుసన్ వరకీర్తి యతనివలచు సతతమున్.

అని కీర్తింపఁబడియుండుటమూలమునను, నీతఁడుమహోదాత్తుఁడైయున్నట్లు గనుపట్టుచున్నది. కాని గోపరాజకవి యితనినిగూర్చి యొక్కమాటయైనఁ జెప్పకపోవుటచే నాతఁడీ యన్నయ కాఁడేమో యని సంశయము కలుగుచున్నది. ఈయన్నయకుమారుఁడైన పెద్దిరాజు పల్లికొండరాజయిన మల్లనదేవరాజుచే బహుమానములందినట్లీక్రిందిపద్యములో వర్ణించియున్నాఁడు.

ఉ. అన్నయనామధేయు సచివాగ్రణి పుత్త్రుఁడు పెద్దిరాజు సం
పన్నిధి పల్లికొండ జనపాలుఁడు మల్లనదేవరాజుచే
నెన్నఁగ గుంచె లందలము నెల్లి యుఁగైకొని మంత్రియై ప్రతా
పోన్నతి కెక్కె ధర్మములనొప్పెడు బ్రహ్మవసప్రతిష్ఠలన్.

ఈమల్లనదేవరాజెవ్వఁడో తెలియలేదు తెలుగుచోడులలో మల్లి దేవనామధారు లనేకులున్నారు. వారివంశీయులలోని యేమల్లి దేవుఁడో యైయుండును. పల్లికొండయనుగ్రామము పూర్వము చిత్తూరుమండల మునను నిప్పుడుత్తరార్కాడు మండలమందలి గుడియాతము సమీప మున నొకటియున్నది. అదియే యిదియేమో! కవినివాసమైన వేముగల్లి ప్రాంతమున నున్నదేమో! తెలిసికొనవలసియున్నది.

ఈగోపరాజకవి తనపినతాతయైన సత్యనారననుగూర్చియీ క్రింది పద్యమును వ్రాసియున్నాఁడు. సత్యనారన, సత్యనారాయణయొక్క రూపాంతరము.

క. రామాయణ కృతికృతియై
తా మెఱయుచు నంధ్రకవిపితామహుఁ డనఁగా
భూమిని మించినభీమన
నామంబునఁ బరఁగె సత్యనారన ఘనుఁడై.

ఇందలి మొదటిపాదములోని "కృతికృతియై" అనుటకు "కృతిప తియై" అనియును, బద్యాంతమందలి "ఘనుఁడై"యనుమాటకు "కవి యై" అనియుఁ బాఠాంతరము లున్నవి. సత్యనారనకు 'భీమన' యని నామాంతరమున్నది. ఇతఁడాంధ్రకవితాపితామహబిరుదాంచితుఁడైనట్లు చెప్పఁబడుటచే నితఁడు రామాయణకృతికర్తయే గాని కృతిపతి కాఁడని నిర్ణయింపవలయును.

కవి తనతల్లిదండ్రుల నీక్రిందిపద్యగద్యములలో వర్ణించియున్నాఁడు.

ఉ. నారన కగ్రజుండు సుగుణజ్ఞుఁడు గంగమసింగమంత్రికిం
గూరిమిపట్టి నాఁబరఁగు గోపయమంత్రి నిజానువృత్తిఁ బెం
పారెడు నెల్లమాంబిక కులాంగనగా నుతికెక్కెఁ దారతా
రారుచికీర్తి యాకసవరాజతనూజుఁడు దాఁబ్రసిద్ధుఁడై.

వ. ఇట్లు గోపరాజతనూజుం డైన కసవరాజు దానగుణరాధేయుం డగు రాణామల్లనరేంద్రునకుఁ బరమగురుం డై శైవాచార ప్రథమసింహాసనాధీశ్వరు లైన బ్రహ్మదేవయొడయులకూఁతు. గామాంబిక యను కామినీరత్నంబుఁ బరిగ్రహించి సుగుణగణగణ్యుం డై నెగడె.

ఉ. శ్రేయుఁడు మంత్రిలక్షణవిధేయుఁడు లాలితదానకేళిరా
ధేయుఁడు సర్వసజ్జనవిధేయుఁడు సంతతసత్యవాక్యకౌం
తేయుఁడు నిత్యకీర్తి సుదతీపరిణేయుఁడు భావశుద్ధిగాం
గేయుఁడు గాయకప్రకరగేయుఁ డమేయుఁ డజేయుఁ డున్నతిన్.

సీ. ప్రకటిత సరసవాక్పతి యనఁగా జెల్లి
చతురాస్యుఁ డై పద్మజన్ముఁ డనఁగ
నార్యానుకూలమౌ కార్యంబు దీర్చుచు
సర్వజ్ఞుఁ డై మహేశ్వరుఁ డనంగఁ
గామాంబఁ దనపత్నిగా గారవించుచుఁ
బురుషోత్తముం డయి హరి యనంగ
గోపకుమారుఁడు కొడుకుగా నక్రూర
దృఢమిత్రుఁ డై వాసుదేవుఁ డనగఁ
వేముగల్లు జన్మభూమిగాఁ బెరిగియు
దీవులెల్లమాటఁ దేటపఱచి
హరిపదైకబుద్ధి హరితగోత్రాంబుధి
రాజనంగ గసవరాజు మించె.

క. తంత్రముచేఁ గార్యము పర
తంత్రము గాకుండఁ బతిహితము చేయుమహా
మంత్రులలోపలఁ గసవయ
మంత్రి విచారమున దివిజమంత్రియుఁ బోలెన్.

కసవరాజు మంత్రిగానున్న రాణామల్లనరేంద్రుఁ డెవ్వరో తెలిసినది కాదు. ఈతఁ డొక చిన్నసామంతరా జైయుండును. అన్నయకుమారుఁడైన పెద్దిరాజు మంత్రిగానున్న మల్లదేవుఁడును. ఈమల్లనరేంద్రుఁడును ఒక్కఁడేయయియుండిన నుండవచ్చును. లేదా ఆమల్లన కీమల్లనపుత్రుఁ

డో, మనుమఁడో యయి యుండవచ్చును. ఈమల్లనరేంద్రుఁ డెవ్వఁడో తెలిసినచో కవికాలము తెలియుటకవకాశముకలుగును. కాని యింతవఱకునట్టియవకాశమునాకులభింపలేదు. అందుచేసితని కాలమును మఱియొక మార్గమునఁ దెలిసికొనుటకై ప్రయత్నింపవలసి యున్నది. ఇందులకు రెండాధారములున్నవి. మొదటిది పిల్లలమఱ్ఱి పినవీరన్న నీక్రిందిపద్యములో నుతించియుండుట

చ. అనఘు హుళక్కిభాస్కరు మహామతిఁ బిల్లలమఱ్ఱివీరరా
  జును ఘను నాగరాజుఁ గవిసోమునిఁ దిక్కనసోమయాజిఁ గే
  తనకవి రంగనాథు నుచితజ్ఞుని నెల్లన నాచిరాజు ప్రో
  మన నమరేశ్వరుం దలఁతు మత్కులచంద్రుల సత్కవీంద్రులన్.

రెండవది. ఈకవికి పెదతాతకుమారులైన భావిరాజు సింగనలు అనపోతానాయని కుమారుఁడైన కుమారసింగమనాయునియొద్ద మంత్రులుగా నున్నారని యీక్రిందిపద్యములోఁ జెప్పియుండుట.

క. ఘను లగ్రజులకు నీడై
  వనములుఁ గ్రతువులును గృతులు వడినిచ్చిరి భా
  చనయును సింగనయును దగి
  రనపోతకుమారసింగయకు మంత్రు లనన్.

పినవీరనకవి కాలము క్రీ.శ.౧౪౩౦-౧౪౯౦ అని పినవీరనచారిత్రమున వ్రాసియుంటిని. దీనినిబట్టి యీగోపరాజకవి కాలము దీనికి దరువాతగాని లేదా అధమ మా కాలము గాని యైయుండవలయును. కాని యంతకుఁబూర్వము మాత్రము కాదు. ఇఁక భావనసింగనలనుబట్టి కాల నిర్ణయమును జేసి చూతము. వీరు గోపరాజకవికిఁ బెదతాతకుమారులు, కావున నలువది సంవత్సరములు గోపరాజుకంటెఁ బెద్దవారుగ నుందురు. వీరుమంత్రులుగనున్న అనపోతకుమార సింగయ ప్రభు లెవ్వరో కనుగొందము. శ్రీనాథకవిచరిత్రమున (౫ వ సంపుటము) వీరి వంశవృక్షమునిచ్చి వారికాలమును శాసనసాహాయ్యమున నిర్ణయించి యుంటిని. సింగయప్రభు నామధారు లిరువురున్నారు. వారిరువురకును గుమార శబ్దముకలదు. ఇరువురును అనపోతానాయని కుమారులే. అందు మొదటిసింగమప్రభువు రసార్ణవసుధాకరాద్రిగ్రంథకర్తయై మహా

పండితుఁడని ప్రఖ్యాతిగాంచియుండెను. ఇతనికాలము క్రీ.శ. ౧౩౭౫–౧౪౧౫. ఇతనికడ మంత్రులుగా బాచనసింగనలుండిరేని గోపరాజకవి పినవీరనను నుతించుట పొసఁగదు. రెండవసింగయప్రభువుకాలము క్రీ.శ. ౧౪౦౦–౧౪౬౦ బాచనసింగన లీతనిమంత్రులందుమేని, వారును౧౪౦౦ ప్రాంతమునజన్మించి యాతనికడ నుండిరనియు, గోపరాజకవి క్రీ. శ. ౧౪౩౦ ప్రాంతమునజన్మించి పినవీరనతో సమకాలికుఁడై యాతనిని నుతించియుండెననియు, నిశ్చయముగాఁ జెప్పవచ్చును. కావున నితని కాలము క్రీ. శ. ౧౪౩౦–౧౪౯౦ అగుచున్నది. అనగాఁ బమ్మెరపోతనామాత్యునికంటె నించుకపూర్వుఁ డగుచున్నాఁడు. అయిన నిందుల కొక ప్రతిబంధకముగన్పించుచున్నది. దానినిగూర్చి యాలోచింతము.

వెలనాఁటి పృథ్వీశ్వరునివద్ద మంత్రిగనున్న వెన్నయామాత్యుఁడు క్రీ.శ. ౧౧౮౦–౧౨౩౦ నడుమనున్నవాఁడు. వెన్నయామాత్యునకును గోపరాజకవికిని నడుమ నంతరములు, అయిదును, సంవత్సరములు ౨౦౦ ను నగుచున్నవి. అయినచో నంతరమునకు వ్యవధి ౪౦ సంవత్సరములని తేలినది. సామాన్యనియమము ననుసరించి ౩౦–౩౩ కావలసియుండఁగా ౪౦ వత్సరములనుట విరుద్ధముకాదు గాని సామాన్యధర్మమును మించినదని యొప్పుకొనక తప్పదు. కాని వెన్నయామాత్యునకు అమరేశ్వరమంత్రి పౌత్రుఁడని కవిచెప్పియున్నాఁడు. అతఁడు కేవలపౌత్రుఁడుగాక ప్రపౌత్రుఁడో ప్రప్రపౌత్రుఁడో యై యుండవచ్చును. గోపరాజకవి వెన్నయకుకొన్నితరములు గడచినవాఁడైనను గద్యలోఁ దాను వెన్నయామాత్యునకుఁ బౌత్రుఁడనని చెప్పుకొని యుండుటచే నమరేశ్వర మంత్రికిని వెన్నయామాత్యునకును ౧–౨ తరములు గడచినను బౌత్రుఁడనియే వ్రాసినాఁడని మనము తలంచుటలోఁ దప్పులేదనుకొనినచోఁ బైనిజెప్పినవ్యత్యాసమునకుఁ దావులేక యాకాలము సరియైనదే యగును.

భోజమహారాజు కాలమున నొకబ్రాహ్మణుఁడు తనపొలమున జొన్నసస్యమును వేసికొని యా వెన్నులను బక్షులు దినిపోకుండుటకై యా చేనినడుమ నొకమంచె వేసికొని దానిపైనెక్కియున్నపుడా దారినిబోవు వారిని "వలసినచో నీవెన్నులను గోసికొనిపొండు" యని చెప్పుచుండెడి

వాఁడు. క్రిందికి దిగినప్పుడెవ్వరైన వెన్నులను గోసికొనిపోవుచున్నచో "నిదియేమి యన్యాయము! వెన్నులనిట్లుగోసికొనిపోవచ్చునా ?" యని మొఱ్ఱవెట్టుచుండువాఁడు. అదిచూచిన వారాబ్రాహ్మణుఁడు వెఱ్ఱివాఁడని దలఁచుచుండిరి. ఒకనాఁడు భోజమహారాజామార్గమునఁ బల్లకిపై నేఁగుచు నాబ్రాహ్మణుని విచిత్రచర్యలను గాంచి, పల్లకినిదిగి యామంచెపై కెక్కెను. అప్పుడాతనిహృదయమున నీశరీర మశాశ్వతమనియుఁ బరోపకారమే పరమధర్మమనియుఁ దనధనమును సర్వస్వమును బరులకు దానమీయవలయుననియుఁ దోఁచెను. క్రిందకు దిగునప్పటికా యూహలన్నియుఁ బోయి పూర్వపురీతిగనే యుండెను. అప్పుడా మహారాజా మార్పునకుఁ గారణ మాస్థలమాహాత్మ్యమనియెంచి, యాబ్రాహ్మణుని యభీష్టానుసారముగా నాపంటకుఁ దగినద్రవ్యమిచ్చి, యాభూమిని ద్రవ్వింపఁగా నడుగున రత్నపాంచాలికా సహితమైన స్వర్ణసింహాసనము గాన్పించెను. దానినిదనయాస్థానమునకుఁ దెప్పించిపూజించి సుముహూర్తమున దానినధిరోహింప యత్నింపఁగాఁ బ్రథమసోపానమునందున్న బొమ్మ "మహారాజా! ఈసింహాసనము విక్రమార్కునకు దేవేంద్రునిచే నీయఁబడినది. విక్రమార్కునకుఁగల సాహసౌదార్య విక్రమాది గుణంబులు నీకుండినఁగాని నీకీసింహాసన మధిరోహింపఁదగదు. అతని సద్గుణములను వినుమని విక్రమార్కుఁడొనర్చిన సాహసాదిగుణములను దెలుపుకథయొకటి చెప్పుచుండగాఁ ముహూర్తము దాఁటిపోయెను. ఆ సింహాసనమునకు ముప్పదిరెండు సోపానములున్నవి. ప్రతిసోపానమున నొక్కొకబొమ్మయుండి యొక్కొకకథఁ జెప్పుచు రాజు నాసింహాసన మెక్కకుండఁ జేయుచుండెను. భోజరాజు సింహాసన మెక్కలేదు. శివునందుపైఁ బ్రతిష్ఠించి పూజించుచుండెను.

తొల్లి పార్వతికిఁ జెలికత్తెలుగానుండి యుద్యానవనవిహారము సేయుచు శివునింగలయ వాంఛించుటచేఁ బార్వతిచే బంగారపుబొమ్మలుగానుండునట్లు శపింపఁబడి యాసింహాసనమున నారీతిగాఁ బాంచాలికారూపముననున్న యాస్త్రీలు శాపాంతమునొంది దివ్యస్త్రీరూపధారిణులై యెప్పటియట్ల పార్వతిని గొలువ నేఁగిరి.

ఆవిక్రమార్కునికథలనే యిందుఁజెప్పితినని కవి యీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

క. అప్పరమేశ్వరు కరుణం
గుప్పలుగొను విక్రమార్కుగుణములకొఱకై
చెప్పెద రసభావంబులు
ముప్పిరి గొనునట్లు కథలు ముప్పదిరెండున్.

శా. చిత్రఖ్యాతివిచిత్రవిక్రమనిధి శ్రీవిక్రమాదిత్యచా
రిత్రఖ్యాపన శాసనంబులకు భూరిస్తంభసంభారమై
ధాత్రీపాలురఁ గావ్యవేదులును మోదం బంద సింహాసన
ద్వాత్రింశత్కథల నుణంబులుగఁగావ్యం బొప్పగాఁ జెప్పెదన్.

ఇతఁడాశ్వాసాంతగద్యలలో, నెన్నయామాత్యపౌత్రుఁడనని యీక్రిందివిధముగా వ్రాసికొనియున్నాఁడు. కాని పౌత్రశబ్దమున కావంశము వాఁడను నర్థమును గ్రహింపవలసియున్నది.

"ఇది రాయగజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీరఘోట్టవిభాళాది బిరుదప్రకటచారిత్ర కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాటద్రవిళాంధ్ర మహారాష్ట్రభూపాలరూపనూపుర సుందరచరణారవింద సనదప్రోలిపురవరాధీశ్వర వెలనాఁటి పృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొఱవివెన్నయామాత్యపౌత్ర హారితసగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజ గోపరాజవిరచితంబైన సింహాసనద్వాత్రింశిక యనుకావ్యంబు".

ఇతఁడు సంస్కృతాంధ్రకవిత్వమున కుండుభేదమును దెల్పుచు నాంధ్రకవిత్వ మెట్లుండవలయునో చెప్పి తదనుగుణముగా నీగ్రంథమును రచించియున్నాఁడు.

చ. తెనుఁగునఁ దేటగాఁ గథలు దెల్పినఁ గావ్యముపొందు లేదు మె
త్తన పస చాలదండ్రు విశదంబుగ సంస్కృతశబ్దమూఁదఁ జె
ప్పిన నవి దర్భముండ్లనుచుఁ బెట్టరుపీనులఁ గావునన్ రుచుల్
దనరఁ దెనుంగు దేశియును దద్భవముం గలయంగఁజెప్పెదన్.

ఉ. ఈసరసోక్తికావ్య మొకఁడిమ్ముల సంస్కృతభాషనచ్చుగాఁ
జేసిన నట్లపీడు మరిచేయుట యేటిదియంచుఁ జెప్పగాఁ
జేసి యనాదరం బురకచేయకుఁడీ విలుకాఁడు తూఁటగా
నేసిన నందెపాఱ మఱియేసినవానిద సూటిగావునన్

చ. తెలుఁగున కెల్లఁ దల్లియగుఁ దెల్లము సంస్కృతభాషయందులోఁ
బలుకు లెఱుంగుచోఁ బదవిభాగము నన్వయమర్థమంచు నీ
మలకలకంటె నందులసమర్మము దేటతెనుంగ యొప్పు నా
కొలఁదిప్రియంబుగాదె చెఱకుల్దినుకంటె రసంబు గ్రోలినన్.

వేములవాడ భీమకవి కవిత్వమునం దీకవి కెక్కువ యభిమానమున్నట్లు గన్పట్టుచున్నది. ఆతనిని ప్రత్యేక మొకపద్యమున నుతించుటయే గాక కవిత్వమునఁ దప్పులువట్టునట్టి కుబుద్ధుల స్వభావమును దెల్పుసందర్భమునఁగూడ భీమకవినే స్మరించి యున్నాఁడు.

క. వేములవాడక శుచియై
వేములవాడం జరించు వేములవాడం
దా మెఱసినభీముని నుత
భీముని బలభీమువిమతభీముని దలఁతున్.

ఉ. భీమనపద్య మన్నఁ గడుఁబ్రీతివహించుచు మేలుమేలు నా
నే మిది చెప్పినార మన నిక్కమె ప్రాసముఁగూర్చినాఁడ వో
నేమిది కాదు దీనివడికిక్కడి కర్థమి దెట్టి వీగణం
బేమని పెట్టినాఁ డనవియెగ్గుట వట్టుఁగ బుద్ధి పెద్దలన్.

ఈగ్రంథమున రెండువిశేషము లున్నవి, కథాసందర్భమునఁ జెప్పఁబడిన నీతినిబోధించు పద్యముల నేర్చి కూర్చినచో నదియొక నీతి బోధక గ్రంథమగును. ఆపద్యములలోఁ గథతో సంబంధించిన వాక్యము లుండవు. చక్కనియుపమానములతో నాపద్యములు హృదయానంద కరములై యలరారుచుండును. రెండవది జ్యోతిషము, సాముద్రికము. ఛందస్సు, అలంకారము మొదలగు శాస్త్రవిషయములను సందర్భాను సారముగా నాయాకథపట్టుల నవకాశము గల్పించుకొని తెలిపియున్నాఁడు. ఇతని కవిత్వము రసవంతమై మృదుమధురపదములతో హృద

యంగమముగా నున్నది ఈగ్రంథము. హరిహరులకుఁ గృతి యీయఁబడి నది. ఆరూపమును గవి యీక్రింది పద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. పాపపెండెముగాక పసిఁడియందియయును
నసుఁగుదామరలపై నమరువాఁడు
పెద్దమేకముతోలు నిద్దంపుఁబట్టును
మొలదిండుగాఁ గట్టి మురియువాఁడు
ఎముకపూసలును ముత్యములు పేరులు గాఁగ
నక్కునఁదాల్చి పెంపెక్కువాఁడు
పునుకయుఁ బెనుగుల్లయును గేలుదమ్ముల
నంచలమాడ్కిఁ బాటించువాఁడు
సగముపొడవునఁ దెల్పు నా సగము నల్పు
నయ్యు మెడ నొక్కవన్నియ యగుచు మేను
లెనయ ముక్కంటియును వెన్నుఁడును ననంగ
బొల్చు నా వేల్పు కబ్బంబుఁ బ్రోచుఁగాఁత.

ఈకవి పద్యాంతములను వ్రాయలేదు. వెదకిచూచినఁగాని దొరకని వ్యాకరణదోషంబు లతిస్వల్పముగా నిందున్నను నవి లెక్కసేయఁ దగినవి కావు. ఈవిషయమునఁ గవియిట్లు చెప్పియున్నాఁడు.

ఉ. ఆదరణంబులేక చెడనాడిన బాణమయూరకాళిదా
సాదులకైనఁ దప్పుగల దన్యుల కేమని చెప్ప వీనితోఁ
నేఁడయుఁ గాదు పొమ్మనక యిందులచంద మెఱింగి తప్పినం
గా దని తీర్చి యొప్పుగని కైకొని మెత్తురుగాక సత్కవుల్.

ఇతని కవిత్వశైలి తెలియుటకై పండ్రెండాశ్వాసములనుండియుఁ బండ్రెండుపద్యముల నీక్రిందఁ బొందుపఱుచుచున్నాఁడను.

ఉ. మంత్రములేని సంధ్యయును మానము లేని తపంబు వేదవి
త్తంత్రములేని యాగముఁ బదజ్ఞతలేనికవిత్వము న్సదా
తంత్రులులేని వీణయును దానకరాగము లేనిగీతముల్
మంత్రులులేనిరాజ్యము సమానము లిన్నియు వ్యర్థకార్యముల్

ఉ. ఉల్లసితత్కృపాభరణుఁ డుజ్జయినీపతిఁబోలవచ్చునే
యెల్లముఖంబుల న్విష మనేకవిధంబుల నోలుఁ గ్రుచుండఁగా
నల్లమువ్రియ్య బుస్సనుచు నారకమోగ్రగెడి పాముతోడి పొ
త్తొల్లక తద్భుజాగ్రమున నుర్వి సుఖస్థితినుండు నెప్పుడున్.

ఉ. కాంతుఁడువోలె సోలి యలకంబులుఁ బయ్యెద లొత్తుచున్వన
శ్రాంతులు దీర్చుచున్మిగులఁ జల్లనివాసన నావనస్థలో
పాంతనిదాఘవారి కణహారి విహారి యనంగ నింతుల
న్సంతస మందఁజేయుచు వసంతసమీరుఁడు వీచె నయ్యెడన్, ౩ ఆ

శా. సత్యాలంకృతభాషణాభరణుఁ డుత్సాహప్రశస్తోదయుం
డత్యాసన్నహితోపభోగ్యవిభవాయత్తాధిక ప్రాభవ
ప్రత్యాదిష్టసురేశ్వరుండు నయసంపన్నిత్యుఁ డావిక్రమా
దిత్యుం డుజ్జయినీపురిం బరఁగె నావిత్యప్రభావుం డనన్. ౮ ఆ.

ఉ. మేరువు సంచలించిన సమీరుఁడు నిల్చిన భూమి గ్రుంగినం
దారక లెల్ల డుల్లిన సుధాకరుఁ డగ్నికణంబు లొల్కిన
న్వారిధు లింకిన న్నభము వ్రాలిన భానుఁడు చల్లనైన నం
భోరుహసూతిదప్పినను బొంకుదునే మును పాడికర్మిన్. ౫ఆ.

ఉ. కాముని గాల్చి బూడిదను గంధముగాఁ గొని యొద్దు నెక్కుచుం
బాములు దోలు నెమ్ములు గపాలములుం దనమేనిసొమ్ముగాఁ
గాములఁగూడి యాడుచును గాడు గృహంబుగనున్నవాఁడు గం
గామృతమా దలం జిలికినంత సదాశివుఁ డయ్యె నెల్లెడన్. ౬ ఆ.

ఉ. ఇంతులమానభంగము మహీరుహపంక్తుల దర్పమూల మ
త్యంతమహోత్సవంబుల విహారము జాణలభోగభాగ్యమా
కంతునిప్రాపు కోకిలశుకంబులవాచవిపంటనాఁ బ్రజల్
సంతస మంద నంతట వసంతము వచ్చె వనాంతభూమికిన్. ౭ ఆ.

శా. ధర్మం బెల్లెడఁ జెల్లునా ? ద్విజులవిద్యాగోష్ఠి రాజిల్లునా ?
దుర్మార్గంబులడంగునా ? ప్రజలు సంతోషింతురా ? సత్క్రియా
మర్మంబేర్పడ జన్నముల్ జరుగునా ? మర్యాదవర్తిల్లునా
నిర్మూలంబుగ శత్రులం గెలుపుదా ? నీలక్ష్మి సొంపెక్కఁగాన్.

౯ ఆ.

మ. అలసత్వంబునఁ బ్రొద్దు పుచ్చక నిరాహారుండనై కంచిలోఁ
పలఁ గామాక్షి గుఱించి యుగ్రతపమేఁ బండ్రెండుసంవత్సరం
బులు సేయంగఁ బ్రసన్నగాదు విదపన్ భూపాల నాయాత్మలోఁ
గలగంబాఱుచు దేవి దూఱుచును భిక్షావృత్తినై వచ్చితిన్. ౯ ఆ

మ. అకటా! పేరును పెంపు సొంపు నతిరమ్యాకారముం గల్గు వా
నికి నే నిచ్చెద నంచు గారవముతో నిన్నుంప నీవిట్లు వం
శకళంకం బొనరించి తీవు మొదలెంచం గోర వీమొండివా
నికి మోహించితి మాకుఁ జిచ్చిడితివో నీవేల మేమేటికిన్. ౧౦ ఆ.

చ. పనిచినఁ బోయి రాఁ డొకఁడు పంచిన దానొరుఁబంచు నొక్కరుం
డను విధి గాదటంచు నెదురాడు నొకం డొకఁ డొంటిఁ బోవ రా
దను నొకఁ డప్పు లోఁగినను నాపనిగా దనునొక్కరుండు పొ
మ్మనఁగ జలించునొక్కఁడు జనాధిప యేమ్వారుఁ గష్టసేవకుల్ ౧౧ ఆ

శా. ఆసౌధాంతరసీమ రత్నమయపర్యంకంబుపై నుండి త
ద్దాసీలోకకృతోపచారుఁ డగుచుం దాంబూలపుష్పాదు లు
ల్లాసం బంది చెలంగి కైకొనుచు చాల స్నిగ్ధు దేహం బరీ
హాసోక్తిం బరికించి రాకొమరుఁ డేకాంతంబునం బ్రోడ్డమై ౧౨ ఆ

కవిత్వవిషయమునఁ బమ్మెరపోతనామాత్యునకును నీగోపరాజ కవికిని బోలికలున్నవి. అయిన నంతమాత్రమున వీరిలో నెవరును ఒకరినొకరు ననుకరించిరని చెప్పలేము. వీరిరువురును దాదాపుసమకాలికులు. పోతనకంటె గోపరాజకవియే యించుక పూర్వుఁడనవొప్పును

పద్యారంభముననే క్రియాపదమును జెప్పి పిమ్మట యంత్యనియమములలో వస్తువర్ణనమునుగావించి పద్యాంతమున వస్తునిర్దేశమును జేయుట పోతనకవిత్వలక్షణములలోనొకటి. ఇట్టిపద్యములు భాగవతములోఁ దఱచుగాఁ గాన్పించుచుండును. అట్టి విందును జూపట్టుచున్నవి. ఉదాహరణమునకై రెండుపద్యముల నిచ్చెదను.

మహాస్రగ్ధర. కనియె న్నాభపుత్రజిష్ణున్ ఘనదురితమహాఖండనా
నిర్భవిష్ణున్.
వనమాలాలంకరిష్ణున్ వ్రజవనవిహారద్వల్లవీకేళితృష్ణున్

దనుజేంద్రాద్రికా సహిష్ణుం దరిళమణిమ యద్వారకాబద్ధదృష్ణు
దినకృత్కన్యావరిష్ణున్ ద్విజపతిగతివరిష్ణు గోపాలకృష్ణున్.
౪ ఆ ౨౦

ఉ. పణ్యపథంబు భంగి భయభంగము నొందక చొచ్చె దండకా
రణ్యము శైలగర్భిత హిరణ్యము తాపసచిత్తనిత్య కా
రుణ్యము గంధబంధురసరోజ రజోవనరాజలక్ష్మణా
గణ్యము పత్రపుష్పఫలగణ్యముఁ బుణ్యజనానుగుణ్యమున్

ఇట్టి వనేకములిందున్నవి. ౫ ఆ ౫౩.

అంత్యానియమములను బాటించుచు బద్యములను రచించుట పోతనకవిత్వ లక్షణములలో రెండవది. అట్టిపద్యములను రెండింటిని మచ్చునకీగ్రంథమునుండి యిందు దాహరించెదను.

క. ఆతఁడు త్ర్యంబకశిఖరో
ద్భూతను విఖ్యాతఁ బరమపూతఁ ద్రిలోకీ
మాత మహాపాతకసం
ఘాతవిఘాతాను యాతఁగనియెన్ గంగన్. ౮ ఆ ౧౬౦

ఉ. వాహముఁ దోలిరాజకులవర్యుఁడు చేరెఁ గృతోల్లసన్మృగ
ద్రోహము నిత్య వీరరసదోహము సంజనితాంజనాద్రి సం
దేహము నత్యుదగ్రఘనదేహము నుద్ధతకాన నాంబుధి
గ్రాహము సర్వభీతికర గర్వనిరాహము నవ్వరాహమున్.
౮ ఆ ౩౫

యతిస్థానమును బాదాంతమును బదమధ్యమందుండకుండపదాంతముననుండునట్లు పద్యములనురచించుచుండుట పోతనకవితలో మూఁడవ లక్షణము. అట్టివి గోపరాజుకవితయందునున్నవి.

పోతనకవిత్వపుఁబోలికగల పద్యము లీగ్రంథమునఁ గొన్నికలవు. ఒక్కయుదాహరణ మిచ్చెదను.

మ. నిరయంబైన నిబంధమైన ధరణీనిర్మూలనంబైన దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో

హరిద్వైమనన్ హరుఁడైన నీరజభవుం డభ్యాగతుం డైన నో
దిరుగన్ నేరదు నాదుజిహ్వ వినుమా దేవర్ష్య వేయేటికిన్.

భాగవతము ౧-౫౯౭.

ఉ. మేరువు సంచలించిన సమీరుఁడు నిల్చిన భూమి గ్రుంగినన్
వారక తెల్లఁదుల్లిన సుధాకరుఁ డగ్నికణంబు లొల్కిన
న్వారిధులింకిన న్నభమునా రిలిన భానుఁడు చల్లనైన నం
భోరుహసూతి దప్పినను బొంకుదునే మునుపాడి క్రమ్మఱన్.

సిం.౫౬.౧౯౯

# 83 బమ్మెర పోతనామాత్యుఁడు

పరమభక్తాగ్రేసరుఁడైన యిమ్మహాకవి భాగవత పురాణము నాంధ్రీకరించి శ్రీరామచంద్రున కంకితముచేసెను. ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. కౌండిన్యగోత్రుఁడు కేసయ లక్కమాంబలకుఁ బుత్రుఁడు. ఎల్లనకును మాచమకును బౌత్రుఁడు. ఈకవి తనవంశము నీక్రిందిపద్యములో భాగవతమున వర్ణించియున్నాఁడు.

ఇతనివంశ వర్ణనము

సీ. కౌండిన్యగోత్రసంకలితుఁ డాపస్తంబ
సూత్రుఁడు పుణ్యుండు సుభగుఁడైన
భీమనమంత్రికిఁ బ్రియపుత్రుఁ డన్నయ
కలకంఠి తద్భార్య గౌరమాంబ
కమలాప్తువరమునఁ గనియె సోమనమంత్రి
వల్లభ మల్లమ వారితనయుఁ
డెల్లన యతనికి నిల్లాలు మాచమ
వారిపుత్రుఁడు వంశవర్ధనుండు

ఆ. లలితమూర్తి బహుకళానిధి కేసన
దానమాన నీతిధనుఁడు ఘనుఁడు
దనకు లక్కమాంబ ధర్మగేహిని గాఁగ
మనియె శైవశాస్త్రమతముఁ గనియె

క. నడవదు నిలయము వెలువడి
తడవదు పరపురుషుగుణము దనపతినుడువుం
గడవదు వితరణకరుణల
విడువదు లక్కాంబ విబుధవిసరము వొగడన్.

ఉ. మానినులీడుగారు బహుమానవివారిత దీనమానస
గ్లానికి దానధర్మమతి గౌరవమంజులతాగభీరదా
స్థానికి ముద్దుసానికి సదాశివపాద యుగార్చనానుకం
పానయ వాగ్భవానికిని బమ్మెర కేసయ లక్కసానికిన్.

క. ఆమానినికిం బుట్టితి
మేమిరువుర మగ్రజాతుఁ డీశ్వర సేవా
కాముఁడు తిప్పన పోతన
నామవ్యక్తుండ సాధునయ యుక్తుండన్.

ఈపద్యములనుబట్టి పోతనామాత్యుని వంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.

బమ్మెర భీమన

అన్నయ=గౌరమాంబ

సోమనమంత్రి=మల్లమ

ఎల్లన = మాచమ

కేసన = లక్కమ

---

తిప్పన                 పోతన

ఇతఁడే ఆంధ్రభాగవతకర్త.

నైపద్యములోఁ దనతండ్రిని "శైవశాస్త్రమతముఁ గనియె" అని చెప్పి యుండుటచేఁ బోతనామాత్యుని పితామహప్రపితామహాదులు శైవులు గారనియుఁ దండ్రియే శైవమతమును గైకొనెననియు, నాతనిననుసరించి యాతనిసతీమణియు" సదాశివపాదయుగార్చనానుకంపానయయయ్యె ననియు నాదంపతులకుఁ బెద్దకుమారుఁడైన తిప్పనకూడ "నీశ్వరసేవా కాముఁడయ్యె" ననియు స్పష్టమగుచున్నది. తల్లిదండ్రుల ననుసరించి, చిన్నతనమునఁ బోతనామాత్యుఁడు శైవారాధనతత్పరుఁడైనట్లు భాగవతకృత్యాదియందలి యీక్రింద గనుపరచిన వచనములో "మహేశ్వర ధ్యానంబుచేసి" యనుమాటలనుబట్టి కన్పట్టుచున్నను, బిమ్మటఁ గేవల శైవుఁడుగా నుండక శివకేశవులయందు సమానబుద్ధికలవాఁడైనట్లు, పోతన శ్రీరామ మంత్రోపాసకుఁడగుటంబట్టియు, భాగవతమును శ్రీరామచంద్రున కంకితమొసంగుటనుబట్టియు విస్పష్టమగుచున్నది.

—◆ భాగవతకృత్యాది ◆—

భాగవతాంధ్రీకరణ మొనర్పుమని శ్రీరామచంద్రమూర్తి దన కాజ్ఞయొసంగె ననియు, నట్టియుత్తమగ్రంథరచనావకాశమదృష్టవశము వలనఁ దనకులభించెననియు నాయుత్తమకావ్యమును బూర్తిచేసి ముక్తి నందెదననియు నీక్రిందిగద్యపద్యములలోఁ గవి చెప్పుకొని యున్నాఁడుఁ ఈకవిచారిత్రమున వివాదగ్రస్తము లగువిషయములు గొన్నియుండుట చేతను, వానిని విమర్శించుటకుఁ గృత్యాదిని కవిచెప్పిన యంశము లవసరమగునను తలంపునను, గ్రంథవిస్తరభీతియున్నను నాగద్యపద్యముల నన్నింటి నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

వ. అని యిష్టదేవతలం జింతించి దినకరకుమారప్రముఖులందలంచి. ప్రథమకవితావిరచన విద్యావిలాసాతిరేకి వాల్మీకినుతియించి హయగ్రీవ దనుజకరపరిమిళిత నిగమనివహ విభాగనిర్ణయ నిపుణతాసల్లా

సునకు వ్యాసునకు మ్రొక్కి శ్రీ మహాభాగవత కథాసుధారసప్రి
యోగికి శుకయోగికి నమస్కరించి మృదుమధురవచన వర్గపల్లవిత
స్థాణునకున్ బాణునకుం బ్రణమిల్లి కతిపయశ్లోక సమ్మోదిత సూరు
మయూరు నభినందించి మహాకావ్యకరణ కళావిలాసుం గాళిదాసుం
గొనియాడి కవికమలరవిన్ భారవిం బొగడి విదళితాఘు మాఘు విను
తించి యాంధ్రకవితాగౌరవజన మనోహరి నన్నయసూరిం గైవారం
బుసేసి హరిహరచరణారవిందవందనాభిలాషిం దిక్కమనీషిన్
భూషించి మఱియు నితరపూర్వ కవి జనసంభావనంబు గావించి
వర్తమానకవులకుం బ్రియంబు వలికి భావికవుల బహూకరించియు
భయకావ్యకరణదక్షుండనై.

ఉ. ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్నిపుచ్చుకొని సొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట వ్రేటులం బడక సమ్మతితో హరికిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్

తే. చేతులారంగ శివునిఁ బూజింపఁ డేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁ డేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁ డేనిఁ
గలుగ నేటికిఁ దల్లులకడుపుఁ జేటు

వ. అని మఱియు మదీయపూర్వజన్మ సహస్రసంచితతపఃఫలంబున
శ్రీమన్నారాయణ కథాప్రపంచవిరచనాకుతూహలుండనై యొక్క
రాకానిశాకాలంబున సోమోపరాగంబురాకం గని సజ్జనానుమతం
బున నభ్రంకషశుభ్రసముత్తుంగభంగ యగుగంగకుం జనిక్రుంకు
లిడి వెడలి మహనీయ మంజులపులినతలమంటపమధ్యంబున మహే
శ్వరధ్యానంబు సేసి కించిదున్మీలిత లోచనుండనైయున్నయెడ.

సీ. మెఱుఁగు చెంగటనున్న మేఘంబు కైవడి
నువిద చెంగటనుండ నొప్పువాఁడు
చంద్రమండల సుధాసారంబు పోలిక
ముఖమునఁ జిరునవ్వు మొలచువాఁడు

వల్లెయుతతమాల వసుమతీజముభంగి
బలువిల్లు మూపునఁ బరగువాఁడు
నీలనగాగ్ర సన్నిహితభానునిభంగి
ఘనకిరీటము దలఁ గలుగువాఁడు

ఆ. పుండరీకయుగముఁ బోలు కన్నులవాఁడు
వెడఁదయురమువాఁడు విపులభద్ర
మూర్తివాఁడు రాజముఖ్యుఁ డొక్కరుఁడు నా
కన్నుఁగవకు నెదురఁ గానఁబడియె.

వ. ఏను నా రాజశేఖరుం దేఱిచూచి భాషింపయత్నంబు సేయు నెడ నతండు దా రామభద్రుండ మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబుఁ దెనుంగు సేయుము. నీకు భవబంధంబులు దెగునని యానతిచ్చి తిరోహితుండయిన సమున్మీలితనయనుండనై వెఱఁగుపడి చిత్తంబున.

క. పలికెడిది భాగవతమఁట
పలికించు విభుండు రామభద్రుం డఁట నేఁ
బలికిన భవహర మగునఁట
పలికెద వేఱొండుగాథ పలుకఁగ నేలా.

ఆ. భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధజనులవలన విన్నంత గన్నంత
దెలియవచ్చినంత దేటపఱతు.

క. కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ
గొందఱకును సంస్కృతంబు గుణ మగు రెండుం
గొందఱకు గుణములగు నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యై యెడలన్.

మ. ఒనరన్ నన్నయతిక్కనాదికవు లీ యుర్విం బురాణావళుల్
దెనుఁగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దా నెట్టిదో
తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్.

మ. లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతాశోభితముౕ సువర్ణసుమనస్సుజ్ఞేయముౕ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబు నై
వెలయుౕ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై

వ. ఇట్లు భాసిల్లెడు శ్రీమహాభాగవతపురాణ పారిజాతపాదపసమా
బునను హరికరుణా విశేషంబునను కృతార్థత్వంబు సి
బుద్ధినెఱింగి లేచిమరలి కొన్నిదినంబులకు నేకశిలానగరం
జనియందు గురువృద్ధబుధబంధుజనానుజ్ఞాతుండనై......

## భాగవత కృత్యాదియందలి ప్రక్షిప్త భాగములు

ఈగద్యపద్యముల లో గుర్తులమధ్యభాగముప్రక్షి
నాయభిప్రాయము. ఈపద్యములు రెండునచ్చట నుండవలసినవి
ఉత్పలమాలలోని "హరికిచ్చిచెప్పె" అనుభూతక్రియతోఁ
వాక్యమునెవ్వరో వ్రాసి యీనడుమనిమిడ్చిరని చెప్పుటకుఁదగి
ఈపద్యమునకుఁ బూర్వముననున్న వచనములో భాగవతరచన
బోతనపూనుకొనియున్నట్లు చెప్పియుండలేదు. ఆపద్యమునకుఁ
నున్నవచనములో శ్రీరామచంద్రుఁడు స్వప్నమునఁగన్పడి భాగ
నాంధ్రీకరించి తనకంకితముచేయుమని యాజ్ఞాపించినట్లు చెప్
న్నాఁడు. అందుచేఁ బైనిజెప్పినరెండుపద్యముల కితావునఁబ్రక
కావున వీనిని బ్రక్షిప్తములుగా నెంచఁదగియున్నది. ఇవితీసివేసి
నను కథాసూత్రముతెగిపోలేదు. ఇంతేకాదు, ఆభాగము నచ్చట
తిమేని స్వచ్ఛమైయున్నసూత్రమును ద్రెంపి నడుమవేరొక రం
సూత్రమును దెచ్చి ముడివెట్టినట్లు గన్పట్టుచున్నది. "దక్షుండనై
తూహలుండనై" "లోచనుండనై" అనుపదములనుంచివ్రాయుచున్న
తనికవితాప్రవాహమున కీపద్యమడ్డుగానిలిచి యాప్రవాహమును
ముగాఁ బ్రవహింపకుండఁ జేయుచున్నది కావున నివిప్రక్షిప్త ము
తీరదు. పరమభక్తాగ్రగణ్యుఁడగు పోతనామాత్యుఁడు తనగ్రంథము
మేశ్వరార్పితము చేయుటయందెక్కువప్రీతి కలవాఁడై నరాంకి
చేయుటకిష్టపడకపోయినఁ బోవచ్చునుగాని నరాంకితముచేసిన వా
ఋఁ బాపాత్ములనియు వారు నరకబాధలందుదురనియుఁ జెప్పుచున

డొకపద్యమునురచించి భాగవతమునఁ జేర్చినాఁడనిచెప్పుట సమంజసముగాఁదోఁచదు. ఎందరుసంస్కృతకవులు, ఎందరాంధ్రకవులు దమకావ్యములను బ్రభువులకీయలేదు? వారందరు బాపాత్ములనియు- గాలునిచే సమ్మెటపోటులం బడసిరనియు, బోతనామాత్యుఁడు తలంచెననుటసరి కాదు. ఆతఁడెన్నఁడు నట్టియూహను కలిగియుండఁ డనియు నాపద్యమాతనిరచనము కాదనియు నాయభిప్రాయము. కవులను బండితులను బురములిచ్చి మాన్యములిచ్చి సొమ్ములిచ్చి పోషించుట యొకవిధ్యుక్తమైనరాజధర్మము వారిచేఁబోషింపఁబడుచు, విద్యాభివృద్ధిని భాషాభివృద్ధిని జేయుచుఁ దమకావ్యములయందు వారినుగ్గడించి వారికీర్తిని దమకీర్తిని శాశ్వతముగా నుండునట్లు చేయుటకవిధర్మము. వారివారిధర్మములనాచరించునప్పుడు వారుపాపులుకారు. కృతినినరాంకితముచేయుట కన్యనమ్ముకొనుటవంటిది కాదాయని కొందఱనవచ్చును. ఇదియట్టిది కాదు. ఇదిభాషాపోషణ మొనర్చినందులకై తనకృతజ్ఞతను సూచించుటయగునుగాని విక్రయముకాఁజాలదు. పరాపేక్షలేకుండ స్వతంత్రముగా జీవించుచుఁ దనకావ్యములను బరమేశ్వరార్పణము సేయుట సర్వోత్తమమనుమాట నిశ్చయము. పోతనామాత్యుఁడట్లే యొనర్చెను. అట్లని నరాంకితమొనర్చిన కావ్యకర్తలందఱును గాలునిచేసమ్మెట పోటులను దినెదరనుటధర్మముకాదు. పోతనామాత్యుఁ డట్లనువాఁడుకాఁడనియు నాపద్యద్వయ మాతఁడు రచించినది కాదనియు నేనూహించుచున్నాఁడను.

## పోతనామాత్యుఁడు భాగవతము నెవరికిఁ గృతియిచ్చెను ?

పోతనామాత్యుఁడు భాగవతమును శ్రీరామచంద్రునకుఁ గృతియిచ్చినట్లు కృత్యాదియందలి" మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబుఁ దెనుంగుసేయుము" అనిపల్కిన శ్రీరామచంద్రునివాక్యంబువలనను ౧..౨.౩.౪.౭.౮.౯.౧౦ స్కంధముల యాద్యంతపద్యములవలనను స్పష్టముగాఁ దెలియుచున్నది.

ఇప్పటిముద్రితప్రతిలో "శ్రీకైవల్యపదంబు ... నందాంగనాడింభకున్" అనుపద్యము మొట్టమొదటఁ గనుపట్టుచుండుటంబట్టియు, షష్ఠ్యంతములను పేర నాలుగుపద్యములు శ్రీకృష్ణ పరముగానుండుటంబట్టియు .కృత్యా

ద్యంతమున నుండివానికిఁ బిమ్మట "సమర్పితంబుగా... శ్రీమహాభాగవత పురాణంబునకు" అని వ్రాసియుండుటంబట్టియు నీగ్రంథమును బోతనామాత్యుఁడు శ్రీకృష్ణునకు గృతియిచ్చెనని కొందఱనుచున్నారు. కాని యందు సత్యములేదు. పోతన తానురచించినప్రతిస్కంధాదిని శ్రీరామచంద్రునిస బోధించుచు నొకకందపద్యమును వ్రాసియున్నాఁడు. గ్రంథాదిని గూడ "శ్రీకంఠచాపఖండన... రామనృపాలా" అనుపద్యమునో (ఇది దశమస్కంధాదినున్నది) ఇట్టిదే మఱియొకపద్యమునో వ్రాసియుండును. ముద్రాపకు లీపద్యమును ప్రార్థనాపద్యములలోఁ జేర్చినైచి శ్రీకృష్ణప్రార్థనమునందుండవలసిన సంబోధనములేనిపద్యమును గ్రంథాదియందుఁ జేర్చినారు. ఇట్లే యేసందర్భముననో పోతన శ్రీకృష్ణపరముగా షష్ఠీవిభక్తినుంచిరచించిన నాల్గుపద్యములను దెచ్చి షష్ఠ్యంతములుగాఁ జేర్చి శ్రీరామచంద్రునిపర మైనషష్ఠ్యంతములను దొలఁగించిరి. కావున పోతన భాగవతమును శ్రీరామచంద్రునకే యంకితమిచ్చెనని నిశ్చయింపవలయును.

## పోతనామాత్యుని నివాసము

పోతనామాత్యుని జన్మస్థానము నిజాముచాష్ట్రి మండలివరంగల్లునకు సమీపముననున్న బమ్మెర యని కొందఱును గడపమండల మందిలి యొంటిమిట్ట యనికొందఱును వాదించుచున్నారు. ఈవిషయమై పండితులలో వాదములు చెలరేగి కొంతకాలము పత్రికలలో వ్యాసరూపమునను గ్రంథరూపమునను జర్చలుజరిగినవి. సమయము వచ్చినప్పుడెల్లఁ గడపమండలపండితు లిప్పుడును నచ్చటచ్చట నమవాదమును వెలిబుచ్చుచునే యున్నారు. ఆవివరముల నిచ్చట వ్రాయవలయుననినచో నీసంపుట మంతయు నిష్ప్రయోజకమైన యాచర్చతో నిండిపోవును. ఆవాదములన్నిటిని జదివిచూచినపిమ్మట పోతనజన్మస్థానము నిజామురాష్ట్రిమండలిబమ్మెరయే యనియు, పోతనామాత్యుఁడు భాగవతకృత్యాదియందుఁ జెప్పిన "ఏకశిలా"నగరము వరంగల్లు (ఓరుగల్లు) గాని, "ఒంటిమిట్ట" కాదనియు నాహృదయమునకుఁ దోఁచినది. వెలిగందలనారయశిష్యత్వము, రాచకొండప్రభు సంబంధకథనము, మొదలగు ననేకవిషయము లితఁడు నిజామురాష్ట్రివాసి యని సాక్ష్యమిచ్చుచున్నవి.

కావునఁ బోతన నివాసము "వరంగల్లు" అనియే నిశ్చయించుచున్నాఁ
డను.

## పోతనామాత్యుఁడును శ్రీనాథుఁడును బావమఱదులా ?

పోతనామాత్యుని కాలమును నిర్ణయించుట కాధారములు భాగవతమున లేవు. శ్రీనాథుఁ డితని బావమఱదియగుటయు నందుచే నీతఁ డాకాలమువాఁ డని నిర్ణయింపవచ్చునని యుఁ గొంద ఱనుచున్నారు. పోతన శ్రీనాథుని కాలము వాఁడైనచో నది క్రీ.శ. ౧౩౮౦--౧౪౪౦ అగును. పోతన శ్రీనాథుని కాలమువాఁడగునో కాదో నిర్ణయించుటకు వారినిగూర్చి చెప్పుకొనఁబడు కథలే యాధారములు. వాని నిట వ్రాసి యందలి యథార్థమును దెలిసికొనవలసి యున్నది

పోతనామాత్యుఁడు పరమభక్తాగ్రేసరుఁడై వ్యవసాయముచేసి జీవితము గడపుకొనుచు, భగవత్పాదపద్మధ్యానమునకై కాలమును వినియోగించుచుండెడివాఁడట. రాజాశ్రయము నపేక్షింపనివాఁడగుటచే దరిద్రవంతుఁడు గాక, దారిద్ర్యముచేఁ బీడింపఁబడుచున్నయాతని గూర్చి యనేకకథలు చెప్పుకొనుచుందురు. భాగవతమును గర్ణాట రాజులకుఁ గృతి యిప్పింపవలయునని శ్రీనాథుఁడు పోతనామాత్యుని యొద్ద కొకప్పు డరుదెంచుచు, రాజాశ్రయమువలనఁ దాను పొందుచున్న మహైశ్వర్యమును జూపించి, పోతనను, తనవంకకుఁ ద్రిప్పుకొనుటకై తానెక్కివచ్చుచున్న పల్లకిని పోతన వ్యవసాయము సేయుచున్న ప్రదేశము నంటిపోవునట్లు చేసెనఁట. పోతన శ్రీనాథులు బావమఱదులనిచిరకాలానుగతమైన జనశ్రుతి యొకటి కలదు. పోతన తనభూమిప్రక్కనున్న చెఱువుగట్టుపైఁ గూర్చుండి గ్రంథరచనము చేసికొనుచుండ నాతనితనయుఁ డైనమల్లన యఱక దున్నుచుండెనఁట. శ్రీనాథుఁడు తన పల్లకి మోయుబోయీలలో నొకప్రక్కబోయీలను బల్లకిని వదలుఁడ నియెననియు, నాప్రక్కబోయీలు లేకుండగనే పల్లకినడచుచుండుటను జూచి మల్లన తండ్రితో "నాయనా! మామయ్యపల్లకియొక ప్రక్క మోయువారు లేకుండగనే నడచుచున్నది. చూడు"మని చెప్పఁగా నీవు కూడ నొకయెద్దును వదలుమని పోతన చెప్పెననియు, నాప్రక్కయెద్దు

లేకుండగనే నాగలి నడచుచుండెననియు, నదిచూచి, శ్రీనాథుడు రెండవపర్యాయము బోయీలను తగ్గుడని యాజ్ఞాపింప వారట్లు చేసిరనియు బోయీలులేకుండగనే నడచుచున్నపల్లకినిజూచిమల్లన రెండవయెద్దును గూడ విప్పివేయ, యెద్దులేకుండగనే నాగలి నడచుచుండె ననియుఁ జెప్పుదురు. ఇట్లు బావమఱఁదు లిరువురు నొకరితపశ్శక్తి నొకరికిఁ జూపుకొనినపిమ్మట శ్రీనాథుఁడు పల్లకి దిగి పోతనామాత్యునికడకు వచ్చిహాలికులకుఁ గుశలమా! యని పరిహాసపూర్వకముగఁ గుశలప్రశ్నచేయ, నాతనియుద్దేశమును గ్రహించి,

ఉ. బాలరసాలసాలనవపల్లవకోమలకావ్య కన్యకన్
గూళలకిచ్చి యప్పడుపుకూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి గహనాంతరసీమల కందమూలగౌ
ద్దాలికులైననేమి నిజదారసుతోదర పోషణార్థమై.

అని ప్రత్యుత్తరమిచ్చెనఁట

పోతనామాత్యునకుఁ గోపమువచ్చెనని తెలిసికొని శ్రీనాథుఁడాతనికిఁ దగినసమాధాన మొసంగి యుపశమింపఁజేసెనఁట.

పరివారముతోనున్న శ్రీనాథుని గౌరవించుటకు నింటనేమియు లేదని పోతనామాత్యునిభార్య కళవళపడుచుండ భయములేదని చెప్పి, పాత్రలను వంటగదియందుంచి, స్నానముచేసి దేవతార్చనగదియందు గూర్చుండి యిష్టదైవమును బ్రార్థించుచుండుమని భార్యకనుజ్ఞయిచ్చి తానుసరస్వతీదేవిని మనసారఁ బ్రార్థించి పిమ్మట పోతనామాత్యుఁడు శ్రీనాథునితోఁగలిసి స్నానముచేయ బోయెనఁట. తిరిగివచ్చి పాత్రలనిండ వంటకములుండుటఁగాంచి, దేవీకటాక్షమున కపరిమితానందమునొంది భార్యంబిలిచి వడ్డింపుమనియెనఁట! లోపలనుండి సరస్వతియే యందించుచుండ పోతనామాత్యునిభార్య పదార్థములను వడ్డించుచుండ షడ్రసోపేతముగ భుజించిశ్రీనాథుఁడు భోజనానంతరమునఁ దాంబూలమును సేవించుచు, పోతనతో భాగవతమును గర్ణాటప్రభువుల కంకితముసేయు విషయమును బ్రస్తావనలోనికిఁ దెచ్చెనఁట! అప్పుడు సరస్వతి బాష్పోదకనయనములతోఁ బోతనామాత్యున కెట్టయెదుటఁ గన్పట్ట నాతనిహృదయము నీరైపోయి

ఉ. కాటుకకంటినీరు చనుకట్టుపయింబడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల! యోమదంబ! యో
హాటకగర్భురాణి! నిను నాకటికైకొనిపోయి యల్లక
ర్ణాటకిరాటకీచకులకమ్మఁ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ!

యని యామె నాశ్వాసించెనఁట! అందుపై శ్రీనాథుఁడిఁక లాభము లేదని తలఁచి తనప్రయత్నమును విరమించుకొనియెనఁట! శ్రీనాథుఁడు పోతనామాత్యుని భాగవతములోని యొకకథపట్టును జదివి వినిపింపుమని కోరెననియు, నందుపైతన కెక్కువయభిమానముగల గజేంద్రమోక్షమును జదివి వినిపింపనందలి:—

మ. సిరికింజెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయిసంధింపఁడే
పరివారంబును జీరఁడభ్రగపతిం బన్నింపఁడా కర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై.

అనుపద్యమును విని బావగారూ! భగవంతుని మకరమును వధించుటకాయుధములను వెంటఁగొనిపోకుండఁ బరువెత్తునంతటి వెఱ్ఱివానినిగఁ జేసితిరేమి? యని హాస్యము చేసెనఁట! దానికేమియుఁ బ్రత్యుత్తరమీయక పోతన తరువాతనున్న,

మ. తనవెంటన్ సిరిలచ్చివెంట నవరోధవ్రాతమున్ దాని వె
న్కను బక్షీంద్రుఁడు వానిపొంతను ధనుఃకౌమోదకీశంఖ చ
క్రనికాయంబును నారదుండు ధ్వజినీకాంతుండు దావచ్చి రొ
య్యన వైకుంఠపురంబునం గలుగువారాబాలగోపాలమున్.

అనుపద్యమును జదివి యొక్కసారి శ్రీనాథునివంకదృష్టి సారించిపిమ్మట నాకథాభాగమును బూర్తిగఁజదివెనఁట.

మఱియొకప్పుడు శ్రీనాథుఁడు దేవతార్చనగృహమున ధ్యానమగ్నుఁడైయున్నతఱి నాతనికొమరు నొకచోఁ దాచి యొకబండరాయినెత్తి సమీపముననున్న నూతిలో ధ్వనియగునట్లు పడవైచి యొక్కపరుగున లోనికివచ్చి "బావా! పిల్లవాఁడు నూతిలోఁబడిపోయె"నని యొక్కవెఱ్ఱికేక వైచెనఁట! ధ్యానముచేయుచున్న శ్రీనాథుఁడాత్రముతో లేచి, నూయి

యొద్దకుఁ బరువెత్తినూయిచుట్టుఁ దిరుగుచునూతిలోనికిఁ జూచుచుండుట గాంచి "బావా! అట్లుతిరుగుచుండిన నేమిలాభము! నిచ్చెనయేది? త్రాళ్ళేవి? నూతిలోదిగువారేరి?" యనిప్రశ్నించి నీకుఁబుత్రునిపైఁ గలప్రేమకంటె భగవంతునకు గజేంద్రునిపైఁ బ్రేమ వేయిరెట్లధికము సుమీ! యని యానాటికథను జ్ఞాపకముగఁజేసి పిల్లవానిని దెచ్చి చూపెనఁట.

వినువారికీకథలు వినోదకరములే కాని చారిత్రకదృష్టిఁ బరికించు వారికెందు సత్యములేదని తోఁచును. శ్రీనాథపోతన లిరువురును బావమఱఁదులనుటకు గ్రంథస్థనిదర్శనములు కానరావు. శ్రీనాథకవివిరచితము లగు గ్రంథములలో నెచ్చటను బోతనను బేర్కొని యుండలేదు. అట్లే పోతనయు శ్రీనాథునినామమును దలపెట్టియుండలేదు. వారుసమకాలి కులుకాకపోయినను సమకాలికులను వాదమునుబట్టిసమకాలికులని యెం చియందుచే నొకరినిగూర్చియొకరు తమతమగ్రంథములలోఁ జెప్పకొని యుండలేదనుకొందము. తరువాతివారెవరును నాబాంధవ్యమునుగ్రం థస్థముచేసినట్లెక్కడను గనపడదు. పోతనవంశములోని వారైన కేసనకవి మల్లకవులుకూడ శ్రీనాథుని "వరకవిసార్వభౌముని"యని చెప్పిరేకాని తమబాంధవ్యమును దమగ్రంథములలోఁజెప్పలేదు. శ్రీనాథునకొకకుమా ర్తెయేగాని కుమారులున్నట్లాధారములు లేవు.

శ్రీనాథునకు దగ్గుబల్లిదుగ్గనకవి బావమఱఁదియైనట్లునాచికేతో పాఖ్యానమువలనఁ దెలియుచున్నది. దుగ్గనకవిసోదరి శ్రీనాథునిభార్య. ఇఁకపోతనశ్రీనాథులు బావమఱఁదులైనచో శ్రీనాథునిసోదరిని పోతనా మాత్యుఁడు పరిణయమాడి యుండవలయును. లోకమట్లే వాకొనుచు న్నది. శ్రీనాథుఁడు పాకనాటివాఁడు. అనగాప్రస్తుతపు నెల్లూరు గుం టూరుమండల భాగమువాఁడు. ఇతనినివాసము కొండవీడు. ఇతనిపూ ర్వులుకూడ నాప్రాంతమువారే. పోతనామాత్యుని నివాసము నిజాం రాష్ట్రిమండలి వరంగల్లునకుఁ గొన్నిమైళ్ళదూరమున నున్నబమ్మెర. ఉభయుల నివాసములకును నడుమ వందలకొలఁదిమైళ్ళదూరమున్నది. అయోమార్గాది సౌకర్యములున్న యీకాలమున మనవాదూరమొక దూరముగాఁ బరిగణింపకపోయినను నాకాలమువారు సామాన్యముగా

నంతమూరమునకుఁ దమకన్యలనిచ్చి పరిణయ మొనర్చుటకు సమ్మతించెడు వారు కారు. పోతన శ్రీనాథులకు బాంధవ్యము లేదని చెప్పుట కీ కారణ మొక్కటియే చాలును.

పోతనామాత్యుఁడు నిజాము రాష్ట్రములోని రాచకొండసంస్థానా ధిపతియగు సర్వజ్ఞసింగమనరపాలుని యాస్థానకవి కాకపోయినను, నాతనితో సమానయోగ్యుఁడై యా నాఁటికే భోగినీదండకమును రచి యించెననియు, నాతఁడు పోతనకృతమైన భాగవతమును సమర్పింపఁజేసె ననియు, నొక కథను చెప్పుచున్నారు. అందలి యొక్క సత్యాసత్యములను గూర్చి తరువాత వ్రాసెదను. అది సత్యమైనచో నా సర్వజ్ఞసింగభూపా లుని కాలమును శాసనసాహాయ్యమున క్రీ.శ. ౧౩౭౫-౧౪౧౫ అని శ్రీనాథునిచారిత్రమున నిర్ణయించియుంటిని. దీనినిబట్టి పోతన శ్రీ నాథునికంటె నలువ దేండ్లు చిన్నవాఁడగుటచే నాకథలన్నియు నసత్య ములగును. శ్రీనాథుఁడు ప్రథమమున సర్వజ్ఞసింగమభూపాలుని యా స్థానమునకు క్రీ.శ. ౧౪౨౦ ప్రాంతమున వచ్చియుండెనని శ్రీనాథచారి త్రమున వ్రాసియున్నాఁడను. అంతకుఁ బూర్వమాతఁ డాయాస్థానము నకు బోలేదని "దీనారటంకాల" యను శ్రీనాథునిపద్యమే సాక్ష్యమి చ్చుచున్నది.

పోతనామాత్యునిభార్య శ్రీనాథునిసోదరియే యైనచో, సోదరిని జూచుట కొక్క మాఱైనను నాతఁ డతనియింటికి పోకయుండఁడు. పోయియుం డినచో సర్వదా రాజశ్రీయము నపేక్షించు శ్రీనాథుఁడు సింగమనా యనివంటి ప్రతిభాశాలిని, బంధువుని, గవిపండితపోషకుని జూడకయుం డఁడు. దీనినిబట్టికూడ శ్రీనాథుఁడును బోతనామాత్యుఁడును బావమఱఁ దులు కారని యెంచవలసియున్నది. పోతనామాత్యుని శ్రీనాథుఁడు "హాలికులా" యని ప్రశ్నించినపుడు చదివిన "బాలరసాల" అనుపద్యము పోతనామాత్యుఁడు రచించినది కాదు. కేయూరబాహుచరిత్రములో నీ పద్యమున్నది. ఆపుస్తకమును రచించినమంచనకవి పోతనామాత్యు నకుఁ బాలపూర్వుఁడు. ప్రసంగవశమున నాపద్యమును పోతన చదివియుం డునని యొప్పుకొన్నను, పోతనశ్రీనాథులకు బాంధవ్యము కలదనుట కీ పద్యము సాక్ష్యము కాఁజాలదు పోతనామాత్యునకుఁ దనయోన్నత్య

మును జూపి తనవంకకుఁ దిప్పుకొనవలెనని శ్రీనాథుఁడు యత్నించెనని చెప్పెడు కథయు విశ్వాసార్హమైనది కాదు. అందౌచిత్యమును లేదు. పోతనామాత్యుఁడు దారిద్ర్యబాధ నెఱుఁగనివాఁడును కాఁడు. తనయౌన్నత్యము నపుడు క్రొత్తగా జూపినంతమాత్రమున పోతనహృదయము మాఱిపోవునని తలంచునంతటి వెఱ్ఱివాఁడు శ్రీనాథుఁడును గాఁడు. ఆకస్మికముగఁ దనపరివారముతో నేఁగి తనసోదరి నవమానించుటకు శ్రీనాథుడు తలపెట్టియు నుండఁడు. ఇవన్నియుఁ గల్పితకథలు. ఈపుక్కిటిపురాణములు తప్ప శ్రీనాథపోతనలబాంధవ్యమును సత్యమనినమ్ముటకుఁ దగిన సాక్ష్య మిసుమంతయు లేదు.

దగ్గుబల్లిదుగ్గనకుఁ బోతరాజను నగ్రజుఁడుకలడు. [దుగ్గనకవి చరిత్రము జూడుడు] ఆపోతరాజును బమ్మెరపోతనగా భ్రమించి బుద్ధిమంతులీకథలను గల్పించియుందురు. ఇట్టిపుక్కిటి పురాణములనుబట్టి పోతనకాలమును నిర్ణయించుట ప్రమాదము. శ్రీనాథునకును బోతనకును నెట్టిసంబంధమును లేదు. శ్రీనాథుని జీవితమంతయు రెడ్డిప్రభువులతో సంబంధించియున్నది. కర్ణాటనృపతియగు దేవరాయలచేఁ గనకాభిషేక మొందుటయుఁ గొన్నిచాటుపద్యములఁ జెప్పుటయుఁ దక్క శ్రీనాథునకుఁ గర్ణాటప్రభువులతో సంబంధము లేదు. పోతనామాత్యునకున్నచో వెలమభూపతులతోనేగాని రెడ్డిరాజులతో సంబంధము లేదు. అట్టిచోఁ గర్ణాట భూపతులకుఁ గృతియిమ్మని శ్రీనాథుఁ డడిగెననుటలో స్వారస్యము లేదు. శ్రీనాథ పోతనల సమకాలికత్వముగాని బాంధవ్యముకాని సత్యముకాదు. పోతనామాత్యుని కాలనిర్ణయము నితరాధారములచేఁ జేసి శ్రీనాథునకును బోతనకును సంబంధము లేదని యూహామూలమునఁ గూడ నిర్ణయింపఁ బ్రయత్నించెదను. పోతనామాత్యుని కాలనిర్ణయముచేయఁగడంగిన చరిత్రకారులలోఁ బెక్కురు పైనిజెప్పిన పుక్కిటిపురాణముల నాధారముగాఁగొని యుండిరి. ఒక్కింతసేపా కథలను మరచిపోయి పోతనకాలమును స్వతంత్రముగా నిర్ణయించుటకుఁ బ్రయత్నింపవలసి యున్నది.

## పోతనకాలము

పోతనామాత్యుని కాలము పండ్రెండవశతాబ్దియని కొందఱును పదునాఱవశతాబ్దియని కొందఱును బదునాల్గవశతాబ్దియని కొందఱును దలంచి పత్రికలలోను గ్రంథములలోను వ్రాసియుండిరి. ఈమూఁడుశతాబ్దులయందు గూడఁ బోతన లేఁడు. ఆచర్చలనిటఁ జేర్చుట కాని, వానికి బ్రత్యుత్తరములనీయఁ బ్రయత్నించుటగాని యనవసరము. నేను చేయఁబోవుచర్చవలన నాతనికాలము నిశ్చయింపఁబడినప్పు డాచర్చయే పైవాదములకు సమాధానమగును. పోతనకాలము నించుమించుగా నిర్ణయింపఁ బ్రయత్నించినవారిలో శ్రీవంగూరి సుబ్బారావుగారును శ్రీవీరేశలింగముపంతులుగారును ముఖ్యులు. వీరిరువురును నిర్ణయించిన కాలములోఁ బొరపాటుగలదని నాయభిప్రాయము. నానిర్ణయమును సహేతుకముగ నీక్రిందనిర్ణయించెదను. శ్రీసుబ్బారావుగారు పోతనకాలము ౧౪౦౦-౧౫౨౦ అని యొకచోటను, ౧౪౨౦-౧౫౬౦ నడుమయని యొకచోటను శ్రీకృష్ణదేవరాయలకుఁ గొంచెమీవలావల నుండునని యొకతావునను వ్రాసియుండిరి. పోతన ౧౪౫౦ ప్రాంతమునజన్మించి ౧౫౧౦ సంవత్సరమున కొకటిరెండేండ్లలోపునఁ గాలధర్మము నొందెనని నాయభిప్రాయము.

బ్ర॥శ్రీ వీరేశలింగముపంతులుగారు తమయాంధ్రకవుల చారిత్ర ద్వితీయముద్రితప్రతియందు పోతనామాత్యుని కాలమునుగూర్చి యనేకవిధములుగా వ్రాసి యున్నారు.

౧. "పోతన ౧౪౦౫ వ సంవత్సరప్రాంతమున జననమొంది ౧౪౬౦-౧౪౭౦ సంవత్సరములవఱకును జీవించియుండును"

౫౫౭ పుట

౨. "పోతనజన్మదినము ౧౪౦౦ సంవత్సరప్రాంతమునందయి యుండవలయును. పోతన ౧౪౬౦వ సంవత్సరమువఱకైనను జీవించి యుండును........ పోతన శ్రీనాథునికంటె నిరువదిముప్పదియేండ్లు చిన్నవాఁడు—౫౬౦ పుట.

౩. "శ్రీనాథుఁడు ౧౩౬౫ వ సంవత్సరప్రాంతమున జననమొందియుండును," ౪౩౯వ పుట.

౮. "కాఁబట్టి పోతరాజు హూణశకము ౧౪౭౫వ సంవత్సర ప్రాంతమువఱకును జీవించియుండును. అంతకాలము జీవించియున్న పక్షమున మరణకాలమునం దతనికి డెబ్బదియైదుసంవత్సరముల ప్రాయమయియుండును." ౫౬౧వ పుట.

౯. "పదునాఱవ శతాబ్దాంతమునందు బమ్మెరప్రౌఢ సరస్వతిపుత్రుఁడు కేసన్న పోతనకు నాల్గవతరమువాఁడు. ఆకేసకవియొక్క కూఁతురైనయెల్లమను అజ్జరపు పేరయలింగము వివాహమాడెను." ౫౮౬ పుట.

పోతనామాత్యుని కాలనిర్ణయమునకు శ్రీపంతులుగారు ప్రధానాధారముగాఁ గైకొనినది కేసకవిమల్లకవులు రచియించి గురజాలచిన మల్లనసోమయాజి కంకితముచేసిన దాక్షాయణీ పరిణయమును దానికిఁ బోడూరి పెదరామామాత్యుఁడు కృతిపతివంశీయుఁడగు పేరమంత్రి కిఁ బ్రతివ్రాసియిచ్చుచు నందుదాహరించిన కాలము నైయున్నది. పెదరామామాత్యుఁడు దాక్షాయణీపరిణయ ప్రతియందువ్రాసిన పద్యమిది.

సీ. ధాతాశ్వయుజ కృష్ణదశమీందు వారంబు
వఱకు దాక్షాయణీపరిణయంబు
తత్కృతినాథుఁడై తనరిన గురుజాల
చినమల్లసోమయాజికిఁ దనుజుఁ
డగులింగఘనసుతుఁడైనట్టి యజ్ఞప
త్ప్రభునకుఁ దనయుఁడౌ పార్వతీశ్వ
రునకుఁ దిమ్మమకుఁ బుత్రుఁడయి షోడశమహా
దానము లష్టసంతానములును
జేసివంశవర్ధనుఁడయి సిరులవెలయు
పేరమంత్రీశ్వరునకుఁ బోడూరి పెద్ద
రాముఁడెనుబది సంవత్సరములనాటి
ప్రతివిమర్శించి వ్రాసిచ్చెపక్షమునకు.

ఈధాతసంవత్సరము క్రీ.శ. ౧౭౫౬వ సంవత్సరమైనదని శ్రీవీరేశలింగముపంతులుగారు వ్రాసియున్నారు. అదిసత్యమేయని విమర్శనాపూర్వ

కముగఁ బోమ్మారి పెదరామామాత్యుని చరిత్రమున నిర్ధారణముచేసి యున్నాఁడను. దీనినిబట్టి పోతనామాత్యుని కాలమును నిర్ణయింపవలసి యున్నది.

ఈవిషయమును పాఠకులు సులభముగా నర్థముచేసికొనుటకై అజ్జరపు పేరయలింగముయొక్కయు, బమ్మెరవారియొక్కయు, దాక్షాయణీపరిణయకృతిపతియైన గురిజాలవారి యొక్కయు వీరిగురువులైన ఇవటూరివారి యొక్కయు వంశవృక్షము లిట నవసరమగుచున్నవి. వాని క్రింద నిచ్చుచున్నాఁడను.

| అజ్జరపువారి వంశవృక్షము | బమ్మెరవారి వంశవృక్షము | ఇవటూరివారి వంశవృక్షము | గురిజాలవారి వంశవృక్షము |
|---|---|---|---|
| కొండుభట్టు | ఎల్లన | విశ్వేశపండితుఁడు | |
| మల్లమంత్రి | కేసన | వీరభద్రుఁడు | |
| హరిమంత్రి | పోతనామాత్యుఁడు | సోమనాథుఁడు | |
| పేరన | మల్లయ | వీరభద్రుఁడు | |
| కొండయ | ప్రౌఢసరస్వతి | పెదరామనాథుఁడు | |
| పేరయలింగము | కేసకవి మల్లకవి | పర్వతాలు | చినమల్లనసోమయాజి |
| | | | లింగరాజు |
| | | | యజ్ఞన్న |
| | | | పార్వతీశ్వరుఁడు |
| | | | పేరమంత్రి |

ఈవంశవృక్షముల కాధారములివి——

అజ్జరపువారి వంశవృక్షము } ఒడయనంబి విలాసము.
ఇవటూరివారి వంశవృక్షము }

బమ్మెరవారి వంశవృక్షము——భాగవతము; దాక్షాయణీ పరిణయము.

గురజాలవారి వంశవృక్షము——పైనిచ్చిన పోడూరి పెదరామామాత్యుని సీసపద్యము——

పేరయలింగము—— ఒడయనంబివిలాస కృతికర్త; బమ్మెర ప్రౌఢ సరస్వతికి అల్లుఁడు; కేసకవి మల్లకవులకు బావ మఱఁది ఇవటూరి పెదరామనాథునకుశిష్యుఁడు

అజ్జరపు కొండుభట్టు——గజపతిచే అజ్జరమను నగ్రహారమును గ్రహించినవాఁడు.

ఇవటూరి పర్వతాలు—— కేసకవి మల్లకవులకు గురువు. దాక్షాయణీ పరిణయమును జూడుఁడు.

గురిజాల చినమల్లన సోమయాజి —— కేసనకవి మల్లకవులచే దాక్షాయణీపరిణయమును గృతినందినవాఁడు.

పేరమంత్రి—— పోడూరి పెదరామామాత్యునిచే దాక్షాయణీపరిణయమునకుఁ బ్రతివ్రాయించినవాఁడు.

సోమనాథుఁడు—— బమ్మెర పోతనామాత్యునకు గురువు.

పోతనామాత్యుఁడు——భాగవత కృతికర్త

ఈసందర్భమున వీరేశలింగము పంతులుగారు వ్రాసిన వాక్యములివి. "ఈపేరమంత్రి ౧౭౫౯వ సంవత్సరమునందుండును. పోతన మునిమను మనికాలములోనుండిన మల్లనసోమయాజికిని పేరమంత్రికిని నడుమ నాలుగుపురుషాంతరములును మల్లనసోమయాజికిని పోతనకును నడుమ మూఁడుపురుషాంతరములును మొత్తము౧౭౫౯వసంవత్సరమునందుండిన గురిజాలపేర మంత్రికిని బమ్మెరపోతనామాత్యునికిని నడుమ నేడు పురుషాంతరములు గడచినందున నొక్కొక్కతరమునకు నలుబదేసి సంవత్సరములచొప్పునఁ జూచినచో నేడు నలుబదు లిన్నూటయెనుబది సం

వత్సరములు ౧౨౫౬ నుండి తీసివేయగా ౧౪౭౬వ సంవత్సర ప్రాంతము వఱకును బమ్మెరపోతనార్యుడు జీవించియుండవలెను. ఇందులో నుండి పదిపదునేను సంవత్సరములు తీసివేసినను పోతన ౧౪౬౦ వ సంవత్సరమువఱకైనను జీవించియుండవలెను. అతడరువది సంవత్సరములుజీవించెననుకొన్నచో బోతనజన్మదినము ౧౪౦౦ సంవత్సరప్రాంతమునందయి యుండును"

శ్రీపంతులుగారి యీగణనమునందు రెండు పొరపాటులున్నవి. మొదటిది పోతనకును పేరమంత్రికినినడుమ నాలుతరములై యుండగా నేడుతరములనుట. రెండవదితరమునకు 30 లేక 33 లెక్కింపవలసియుండగా నలువదియని లెక్కించుట పోతనగారి పెదరామామాత్యుడు దాక్షారామభీమేశ్వరునకు శాసనము వ్రాసియిచ్చిననాటికి పేరమంత్రి షోడశమహాదానములును సప్తసంతానములుం జేసినవాడై యున్నవాడుగావున ౧౨౫౬ నుండి అరువదియేసు ౫౬గా భావించి దానిని దీసివేసినచో నా పేరమంత్రి జననము ౧౨౦౦ అగును. శ్రీపంతులుగారనినట్లు తరమునకు నలువదిచొప్పున దీసివేసినచో బోతనామాత్యుని జననము క్రీ.శ. ౧౪౨౦వ సంవత్సరమగును. శతాబ్దమునకు మూడుతరములవంతున లెక్కించినచో బోతనజననము ౧౪౫౦ ప్రాంతమగును. శ్రీపంతులుగారు శ్రీనాథునితో సంబంధించిన కథలను మనసునందుంచుకొని వానితో సరిపుచ్చుటకై పురుషాంతరవ్యవధిని నలుబదిసంవత్సరములనిరి. కాని యదిసర్వసాధారణమైన లెక్క కాదు. కావున నావిధానమునువిడిచి శతాబ్దికి మూడుతరములవంతున లెక్కించినలెక్కయే న్యాయమనితలంచి పోతనామాత్యుని జననము ౧౪౬౦ ప్రాంతమనియే నిర్ణయింపవలసియున్నది. ఇందుండి పంతులు గారనినట్లు పదిసంవత్సరములు తీసివేసినను బోతనామాత్యునిజననము క్రీ.శ. ౧౪౫౦కి మించి వెనుకకుబోవదు. ఇదిసరియైనదనుట కింకొక యాధారమున్నది.

అజ్జరపు పేరయలింగకవి భార్యకేసకవిమల్లకవులకు సోదరియగుటచే వారిరువురును సమకాలికులని నిశ్చయింపవచ్చునుకదా! పేరయలింగకవికి బావయైన కొండుభట్టుగజపతిచేత నజ్జరమనుగ్రామమున

నగ్రహారముగాఁబడసెనని పేరయలింగ మీక్రిందిపద్యములోఁ జెప్పి యున్నాఁడు.

శా. శ్రీరంజిల్లఁ జెలంగుచున్న గజరాట్సింహాసనాధ్యక్షునిన్
ధారాళంబుగ వేదశాస్త్రబహువిద్యారూఢి మెప్పించి యా
వీరాగ్రేసరుఁ డియ్యకొండనమహాఖ్యాతిగా గౌతమీ
తీరక్షోణిని నజ్జరంబనఁగఁ దాఁ దెచ్చెన్ మహాగ్రామమున్.

అజ్జరము గోదావరిమండలములోని తణుకుతాలూకాలో, తణుకునకు సమీపముగానున్నది. గజపతులలో నాప్రాంతమును మొట్టమొదటజయించినవాఁడు కపిలేంద్రగజపతి. ఇతఁడు క్రీ.శ. ౧౪౩౩ మొదలు ౧౪౬౬ వరకు కళింగదేశమున రాజ్యముచేసినవాఁడు. ఇతఁడాంధ్రదేశమును జయించినది ౧౪౪౭ సంవత్సరము. క్రీ.శ. ౧౪౩౭ ప్రాంతమున నొకసారి యీతఁడు రాజమహేంద్రవరముపై దాడివెడలఁబ్రయత్నించెను. కానియది కొనసాగలేదు. ౧౪౪౦వ సంవత్సరమువఱకును గోదావరిమండలమంతయును రాజమహేంద్రవరపు రెడ్లపరిపాలనములో నుండెను. ౧౩౭౦ మొదలు ౧౪౪౦ వఱకు రెడ్లపరిపాలనమే; అత్తిలి, కాకరపఱ్ఱుగ్రామములు తణుకుతాలూకాలోనివి. అజ్జరమీరెండు గ్రామములమధ్యప్రదేశములోనున్నది. అత్తిలికాకరపఱ్ఱు గ్రామములయొద్ద జరిగినయుద్ధములలో అన్నచోడదేవుఁడు రెడ్డిరాజులను వారికిసాహాయ్యముగావచ్చిన కర్ణాటకరాజులను జయించి యీప్రాంతము నాతఁడుస్వల్పకాలముపరిపాలించెను.౧౩౭౦వ సంవత్సరమునకుఁబూర్వము కొండవీటి రెడ్లపరిపాలనములోను నంతకుపూర్వము కాపయనాయకుఁడుపోలయనాయకుఁడు మొదలగు వారిపరిపాలనములోనునిడదవోలురాజులపాలనలోను నీప్రాంతముండెడిది. అంతకుపూర్వమీప్రాంతమును గాకతీయులు పాలించిరి.కావునక్రీ.శ ౧౪౫౦వసంవత్సరమునకుఁ బూర్వము౧౦౦-౧౫౦సంవత్సరములకాలములో నీప్రాంతమున గజపతులప్రభుత్వమెప్పుడునుసాగలేదనుట నిశ్చయము. సుప్రసిద్ధ శాసనపరిశోధకులగు ఆచార్య నేలటూరి వెంకటరమణయ్యగారు కపిలేశ్వరగజపతిని కుమారుని చిరువోలితామ్రశాసనమును విమర్శించుచుననేక శాసనముల నుదాహరించి "క్రీ.శ.౧౪౫౦ సంవత్సరమునకు పూర్వము గజపతికపిలేశ్వరుని యధికారము ఆంధ్ర

దేశమునఁ జెల్లలేదు" అని ఖండితముగాఁ జెప్పియున్నారు. కపిలేశ్వరగజ
పతియే మొట్టమొదట నీప్రాంతమును జయించినవాఁడు. కొండుభట్టున
కగ్రహారముగా నిచ్చిన గజపతి యెవ్వరో తెలియదు. కపిలేశ్వరగజ
పతియని కొనినను నతఁ డాంధ్రదేశమును బరిపాలింప నారంభించిన యెం
తకాలమున కీదానమిచ్చెనో యెఱుఁగరాదు. దానమిచ్చినవాఁడు కపిలేం
ద్రగజపతియే యనియు, నాతఁ డాంధ్రదేశమును జయించిన కొలఁది కాలము
లోనే యగ్రహారమును గొండుభట్టున కిచ్చెననియుఁ దలంచినచో దానకాల
ము ౧౪౨౦ వ సంవత్సరమగును. అంతకుఁ బూర్వమీ దానప్రతిగ్రహణము
లు జరిగెనని చెప్పుటకేమాత్రము నవకాశము లేదు. ఆకాలమునకుఁ గొం
డుభట్టు ౪౦ సంవత్సరముల వయసువాఁ డనియనుకొనవచ్చును. అప్ప
టికాతని మనుమఁడు పోతనామాత్యుఁడు పుట్టెనో లేదో చెప్పఁజాలము. పుట్టి
నను ౧౦-౧౨ సంవత్సరములకంటె నెక్కువవయసుకలవాఁడుగా నుండఁడు.
పై వంశవృక్షములను బరికించినచో నాగారిమంత్రియుఁ బోతనామా
త్యుఁడును సమానతరములో నుండిరనియు సమకాలికులనియుఁ గన్పట్టు
ను. ఈగణనమును బట్టి చూచినను పోతనామాత్యుని జననము క్రీ. శ.
౧౪౨౦ సంవత్సరప్రాంతమైనది ఎంత వెనుకకు నెట్టవలెనని చూచినను నా
తని జననకాలము ౧౪౨౦ సంవత్సరమునకు వెనుకకుఁ బోవదు. భాగవతర
చనాకాలము నాఁటికి పోతనివయసు ౪౦ సంవత్సరము లుండునని
యనుకొనినచో క్రీ.శ. ౧౪౬౦ ప్రాంతమున భాగవతము పుట్టియుండునని
నిశ్చయింపవచ్చును. ఎవరెంత ప్రయత్నించినను పోతనజననము
౧౪౨౦కి వెనుకకు గెంటలేరని ఘంటాపథముగాఁ జెప్పవచ్చును. బమ్మెర
పోతనామాత్యుని బూర్వకవినిగాఁ నుతించినవారిలో, మొట్టమొదటి
వాఁడు నేనెఱిఁగియున్నంతవఱకు అయ్యలరాజు రామభద్రుఁడు. మల్హ
ణచరిత్రమును రచించిన యెఱ్ఱనామాత్యుఁడు కూడఁ బోతనను నుతించి
యుండెను. వీరిరువురు నించుమించుగ సమకాలికులు. పదునాఱవ
శతాబ్దియందుఁ బ్రథమార్ధమున నున్నవారు. ఇంతకుఁ బూర్వపుఁగవు
లెవ్వరు నీతనిని స్మరింపకపోవుటచేఁ గూడఁ బైకాలము సరియైనదని
తలంచుట కవకాశము కలుగుచున్నది.

దీనినిబట్టి పోతనామాత్యుఁడు శ్రీనాథుని కాలములో లేఁడనియు నాతఁడు చనిపోయినపిమ్మటనే పోతన జన్మించెననియు స్పష్టమగు చున్నది. ఇందువలన శ్రీనాథు తో సంబంధించిన కథలన్నియు నభూత కల్పనలనియు నం దణుమాత్రమును సత్యము లేదనియు నిస్సంశయము గాఁ జెప్పవచ్చును. పోతనామాత్యుని జననము నేననిన దానికంటె నిరువదిసంవత్సరములు వెనుకకు నెట్టినను (వాదముకొఱకుమాత్రమే) నసంభవమైనను సంభవముగానే యెంచి వీరేశలింగముపంతులుగారి లెక్క ననుసరించి తుదకాతని జననము ౧౪౦౫ వ సంవత్సరమని యంగీకరించినను నాతనికిఁ బరిణయవయస్సు వచ్చునప్పటికిని భాగవత రచనము నాఁటికిని శ్రీనాథుఁ డవసానదశలోనో బొడ్డుపల్లి వ్యవసాయముఁ జేయుచునో యుండియుండును. లేదా చనిపోయియుండును. దీనినిబట్టి చూచినను నాకథలన్నియుఁ బుక్కిటిపురాణము లని స్పష్ట మగుచున్న ది. వీరభద్రవిజయమునఁ బోతనామాత్యుఁడు తన గురువు ఇవటూరి సోమనారాధ్యుఁడని చెప్పియున్నాఁడు. అజ్జరపుపేరయలింగకవి ఒడయ నంబివిలాసమునఁ దన గురువు ఇవటూరి పెదరామనాథుఁ డని చెప్పుచు నాతని వంశము నిచ్చియున్నాఁడు. దానినిబట్టి వారి వంశమును బైనిఁ గనుపర్చితిని. అందుఁ జూపిన "పర్వతాలు" తమగురువైనట్లు దాసూ యణి పరిణయగద్యమునఁ గేసకవి మల్లకవులు వ్రాసికొనియున్నారు. అజ్జరపువారిది భారద్వాజగోత్రము. బమ్మెరవారిది కౌండిన్యగోత్రము. ఇవటూరివారిది కాశ్యపగోత్రము.

## —: సర్వజ్ఞ సింగమహీపాలుఁడు భాగవతమును బాతిపెట్టించెనా? :—

పోతనామాత్యుఁడు భాగవతము పండ్రెండు స్కంధములును బూర్తిగ రచియించెననియు, నందుఁ గొంతభాగము శిథిలమై పోఁగా నీతని శిష్యులైన వెలిగందల నారయాదులు పూరించిరనియుఁ జెప్పు చున్నారు. ప్రస్తుతము మనకు లభించుచున్న ముద్రితప్రతులలోఁ బం చమస్కంధము బొప్పనామాత్య పుత్రుఁడైన గంగనార్యునివలనను షష్ఠస్కంధము కసువయామాత్యపుత్రుఁ డగు సింగయామాత్యుని వలనను నేకాదశద్వాదశస్కంధములును దశమస్కంధోత్తరభాగము లో

గొంతయు వెలిగందల నారయచేతను మిగిలినదంతయు బోతనామా త్యునిచేతను రచియింపఁబడినట్లు గద్యలవలనఁ గన్పట్టుచున్నది. పోత నామాత్యునిరచన మనియున్న భాగములోఁగూడ నచ్చటచ్చటఁగొన్ని పద్యములు పోతనామాత్యకృతములుగాక యితరులు రచించినవనియుఁ జెప్పుచున్నారు.

పోతనామాత్యుని భాగవతము శిథిలమైపోవుటకుఁ గారణమిది యని తెలుపు కథయొకటి చిరకాలానుగతముగ వచ్చుచున్నది. నిజాము రాష్ట్రమండలి రాచకొండ సంస్థానాధిపతి యగు రావుసర్వజ్ఞసింగమ భూపాలుఁడు భాగవతమును దనకుఁగృతియిమ్మని పోతనామాత్యుని వేఁడగా నరకృతివిముఖుఁడైన యాతఁడందుల కీయకొనలేదనియు నం దుసై నిసుకవహించి సింగమనృపతి భాగవతమును గవియొద్దనుండి బల వంతముగాఁ గైకొని భూమిలోఁ బాతిపెట్టించెననియు, శ్రీరామచంద్ర మూర్తి సర్వజ్ఞనరపాలుని భార్యస్వప్నమునఁగనుపడి, తనకుఁగృతినిచ్చిన భాగవతము నిట్లుభూమిపాలు సేయుటుచితముకాదు కావున భర్తతోఁ జెప్పి యాగ్రంథమును బయటకుఁ దీయింపుమనిచెప్పె నవియుభార్య వలన నాసంగతిని విని యాభూపతి యాపుస్తకమును బైకిఁదీయించెనని యు, నందుచేనప్పటి కందలికొన్ని భాగములుత్సన్నము లయ్యెనని యుఁ జెప్పుచున్నారు. నిజముగా సర్వజ్ఞసింగమభూపతి యట్లుచేసినయే యుం డెనేని, సంతకంటె దారుణమైన పాపకార్యమింకొకటి యుండదు. కాని విమర్శించి చూచినప్పుడాకథయందు లేశమును సత్యములేదని స్పష్టము గుచున్నది.

సింగనరపతి సర్వజ్ఞబిరుదాంకితుఁడై సంస్కృతమున నలంకార శాస్త్రమును రచించిన మహాపండితుఁడు. శ్రీనాథాదిమహాకవులను సత్కరించి పేరొందినవాఁడు. ఇట్టిమహీపాలుఁడొక కవిరచించిన మహా కావ్యమును, దన కంకితమీయలేదను కారణమునభూమిపాలొనర్చునం తటి నీచకృత్యమున కొడిగట్టుకొనెనని తలంచుట కేవల మన్యాయము. నిజముగా నాగ్రంథము నడఁచివేయటయే యాతని యుద్దేశమైనచో దానిని భూమియందుఁ బాతిపెట్టించు టెందులకు? అగ్నిహోత్రము

పాలుచేయలేఁడా ? ముక్కలుముక్కలుగాఁ జించిపారవేయింపలేఁడా? గ్రంథము నశించిపోవుచున్నదని పశ్చాత్తాపముం జెంది పోతన తనకంకిత మిచ్చునని యెంచి భయము కల్గించుటకై యాపని నొనర్చె నందురేమో! అట్లయినచో దానిని తనయొద్దనే భద్రపఱచి ప్రచారము లోనికిరాకుండఁ జేయును గాని నాశనముఁ జేయయత్నింపఁడుకదా ?

సర్వజ్ఞుఁ డిట్టియకృత్యమును, పోతనామాత్యుఁడు జీవించియుండగనే చేసె నని తలంచుటకు వీలులేదు. అతఁ డుండగనే యాగ్రంథమున కిట్టిగతి పట్టినయెడలఁ దననిస్సహాయతను, దనయాగ్రహమును, దనదుఃఖమును దెలుపుపద్య మొక్కటియైనఁ బోతన రచింపకుండ నుండునా ? తనగ్రంథము నొరులకుఁ గృతియిమ్మని యెవ్వరో వచ్చి చెప్పినంతమాత్రముననే, "కాటుకకంటినీరు" అనుపద్యమును జెప్పినమహానుభావుఁడు. తనజీవితమును ధారవోసి రచించినయంతటిమహాకావ్యపుత్రిక తనకండ్లయెదుట నొరులచే బలవన్మరణము నొందుచున్నప్పు డాతఁడనుభవించుచున్నదురవస్థఁ దెలుపుపద్య మొక్కటియైన నప్రయత్నముగనైన నాతని నోటనుండి వెలువడకుండ నుండునా ? వెలువడినచోఁ బ్రచారములో నుండక మానునా ? అట్టివేవియు మనకు వినఁబడకుండుటయే యీకథయందు సత్యము లేదని చెప్పుటకుఁ జాలియున్నది. ఆకథయే నిజమై కొలఁదికాలములోనే శ్రీరామచంద్రునియాజ్ఞానుసారముగ బయటకుఁ దీయుట తటస్థించినయెడల, శిథిలభాగములను బోతనామాత్యుఁడే పూరించునుగాని, నారయాదుల కేల విడిచిపెట్టును? భూమిలోఁ బోతనామాత్యునియనంతరమువఱకు చాలకాల ముండె నన్నచో, గ్రంథమంతయు నశించును. గానిస్వల్పభాగము నశించి, తక్కినది నిలిచియుండుట తటస్థింపదు. అందుచేఁ బోతనామాత్యునిజీవితకాలములో నిట్టిపని జరిగియుండదు. ఇఁక నాతనియనంతర మిట్టికార్యము నారాజు చేసెనా ? ఎట్టిమాట? తనకుఁ గృతియిచ్చుటకు నిరాకరించిన పోతనామాత్యు నేమియుఁ జేయఁజాలక నాతనియనంతరమునఁ దలుపుఁ దెఱచినయింటఁగుక్క జొచ్చిన ట్లిట్టిపనికిమాలినపని నాపండితప్రభువు చేసెనని యనుట మహాసాహసము. గ్రంథమును భూమిలోఁ బాతిపెట్టి నప్పుడది యెట్లుంచఁబడినను, అన్నిసగ్రంథములయందును గొంతకొంతభాగము శిథిలమై

గును. గాని కొన్నిస్కంధములు పూర్తిగా నశించుటయు, కొన్నిస్కంధములలో నేమియు నశింపకుండుటయు సంభవింపదు. ఎట్లుచూచినను నీఖననగాథ యసత్యమనియే నిశ్చయింపవలసియున్నది. ఈగాథను గ్రంథస్థముచేసి సర్వజ్ఞసింగమభూపాలునిపై నేరారోపణ మొనర్చినవాఁడు కూచిమంచితిమ్మకవి. పూర్వపులక్షణవేత్తలు భాగవతమునుండి లక్ష్యములను గ్రహింపకుండుటకుఁ గారణము పోతనామాత్యుఁడు రేఫశకటరేఫలకు యతిప్రాసమైత్రి కల్పించుటయే యని

ఉ. బమ్మెరపోతరాజకృతభాగవతంబు సలక్షణంబు గా
కిమ్మహి నేమిటం గొదవ యెంతయు నారసిచూడఁగాను రే
ఫమ్ములు ఱాలునుం గలిసి ప్రాసము లైనకతంబునం గదా
యిమ్ముల నాదిలాక్షణికు లెల్లరు మాని రుదాహరింపఁగన్."

అనుపద్యములో నప్పకవి వ్రాసినదానియందు సత్యము లేదనియుఁ బోతనరచించినభాగవతమునఁ గొన్నిభాగములు శిథిలములగుటచే నాభాగములను బూరించినవారట్టిమైత్రి కల్పించిరేగాని పోతనామాత్యరచితభాగములలో నట్టిలక్షణవిరుద్ధప్రయోగములు లేవనియుఁ బోతనను సమర్థించుటకై వ్రాయుసందర్భమునఁ దిమ్మకవి యీగాథ నీక్రిందిపద్యములలో గ్రంథస్థ మొనర్చియున్నాఁడు.

ఆ. వె. కాకునూరి యప్పకవి యహోబలపతి
ముద్దరాజు రామముఖ్యు లెల్లఁ
బోతరాజుకబ్బమున ఱాలు రేఫలు
గదిసె నంచుఁ జెప్పి రది హుళిక్కి.

సీ. ఘనుఁడు పోతనమంత్రి మునుభాగవతము
రచించి చక్రికి సమర్పించునెడల
సర్వజ్ఞసింగమక్ష్మావరుం డది తన
కిమ్మని వేఁడఁగా నీయకున్న
నలిగి యాపుస్తకం బవనిఁ బాఁతించిన
జివికి యందొకకొంత శిథిలమయ్యె
గ్రమ్మఱ నది వెలిగందలనారప్ప
రాజును మఱి బొప్పరాజుగంగ

రాజు మొదలగుకవివరుల్ తేజ మెసఁగఁ
జెప్పి రాగ్రంథములయందె తప్పు లొందవె?
గాని పోతకవీంద్రునికవితయందు
లక్షణం బెందుఁ దప్పునా దక్షహరణ !

పరంపరగా వచ్చుచున్నగాథను బోతనమీఁదియపవాదను దొలఁగించుటకై యత్నించుసందర్భమునఁ దిమ్మకవి వ్రాసియుండును. తిమ్మకవివ్రాఁత నాధారముగాఁ గొని సర్వజ్ఞసింగమనాయునిపై నిట్టి మహాపరాధము నారోపించుటకు వలను గాదు. తిమ్మకవికిఁ బూర్వు లెవరు నీకథను వ్రాయలేదు. భాగవతమును బూరించినవారు గూడ నెవరు నీకథను సూచింపలేదు. కావున నిస్సంశయమైన, నిర్బాధకమైన సాక్ష్యము లభించువఱకు సర్వజ్ఞసింగమనృపాలునిపై నేరస్థాపనమొనర్చుట కూడదు. అయినచో, పంచమషష్ఠస్కంధములను నేకాదశద్వాదశస్కంధములను, నారయాదు లేల పూరింపవలసినదనుప్రశ్న కాయాకవులచరిత్రములలో సమాధానము వ్రాయుచున్నాఁడను.

పోతన భాగవతమును రచించి దేవతార్చనపెట్టెలోఁ బెట్టి పూజించుచుండె ననియు నవసానకాలమునఁ గుమారునిం బిలిచి పెట్టెను జూపి యందున్నయమూల్యధనమును గాపాడు మని చెప్పి చనిపోయెనని యుఁ బిమ్మట నాతఁ డాపెట్టెను తెఱచి చూచి గ్రంథమును గాంచియు నప్పటి కందుఁ గొన్నిభాగములు క్రిమిదష్టములై యుండుటం జూచి, శిష్యుఁడైననారయాదులా భ్రష్టభాగములను బూరించిరనియు నొకకథ ప్రచారములో నున్నది. మొదటికథకంటె నిందుఁ గొంత సత్యముండ వచ్చును. మొదటికథయం దున్నంత యస్వాభావికవిషయము లీకథయందు లేవు. కావున నీకథయందు సత్యమున్నదని విశ్వసింప వచ్చును. లోకములో నెన్నియో యుత్తమకావ్యముల కిట్టిగతి సంభవించె ననుట బహుజనవిదితము.

**—: సర్వజ్ఞసింగమప్రభువును బోతనయును నేకకాలమువారుకారు :—**

పైనివ్రాసినదానినిబట్టి భాగవతమునుసర్వజ్ఞసింగమభూపాలుఁడు పాతిపెట్టింపలేదని యూహాచేతనుయుక్తిచేతనుసాధించితిమి. కాలముచే

గూడ నీగాథయందు సత్యము లేదని నిరూపించెదను. అనేక శాసన వాఙ్మయసాధనములచే మొదటిసర్వజ్ఞసింగమనీఁడు క్రీ. శ ౧౩౮౦-౧౪౧౦ సంవత్సరములనడుమ నుండెనని శ్రీనాథచరిత్రమున నిర్ధారణము చేసియుంటిని. దానిని గాదనుట కవకాశము లేదు. పోతనామాత్యుని జననము ౧౪౫౦ వ సంవత్సరమని పైనిఁజెప్పితిని. దీనినిబట్టి సర్వజ్ఞసింగయప్రభువు చనిపోయిననలువదిసంవత్సరములకుఁగాని పోతనజన్మింపలేదు. శ్రీ వీరేశలింగముపంతులుగారు వ్రాసినట్లు పోతనజననము ౧౪౦౫ ప్రాంతమనుకొన్నను గూడ, సర్వజ్ఞసింగమనాయని జీవితకాలములో భాగవతముపుట్టలేదని పైకాలనిర్ణయమునుబట్టిస్పష్టమగుచున్నది. భాగవతజననగాథ సత్యమని చెప్పుటకుఁ బోతనామాత్యుని జననకాలమును నూఱుసంవత్సరములు వెనుకకు జరుపవలసియుండును. ఆకథ నెట్లయిన సత్యమని చెప్పుటకుఁ బైనివంశవృక్షములలోఁజూపిన పోతన వేఱనియు, భాగవతకర్తయగుపోతన యాపోతనకుఁ బౌత్రయనియుఁ జెప్పెడి బుద్ధిమంతు లుండిన నుండవచ్చును. ఈ వాదమును గేసకవిమల్లికవులు దాశరథీయశతకమున నిట్లు చెప్పిన:—

చ. "వెరిగుఁడిగల్లునన్నయమనీషినిఁ దిక్కన శంభుదాసునిన్
బరువడి మత్పితామహుని బమ్మెరపోతన భాస్కరాహ్వయున్
వరకవి సార్వభౌముని నవారితభక్తి నుతింతు మెప్పుగన్
గురుకరుణాఢ్యు లంధ్రకవికుంజరులం దగభూతిశోభిలన్."

అనుపద్యమును, భాగవతవీరభద్రవిజయములందుఁ బోతనామాత్యుఁడు తనపూర్వులనుగురించి చెప్పినపద్యములును, ఖండించుచున్నవి. ఇంకను నిట్టియపూర్వవాదములను జేయువా రుండురేని, వారికొక్కవందనము. వారు ససాక్ష్యముగాఁ దమవాదములను ఋజువు చేయవలసియుండురు.

కవిపండితపోషకుఁడును బండితుఁడు నైనరావుసర్వజ్ఞసింగమభూపాలునిపై నారోపితమైన యీయపవాదమునుండి యీపండితప్రభువు విముక్తినందుఁగాక! నిరాధారమైనయీయపవాదమే యాధారముగా గల్పితమైనయొక దృశ్యకథ చలనచిత్రము (సినీమా) లోని కెక్కుట

విచారకరమైనవిషయము. ఈచిత్రమును బ్రదర్శింపకుండ నిషేధించుట యవసరము.

**—: భాగవతము రెండవసర్వజ్ఞసింగమప్రభువు పాతిపెట్టించెనా? :—**

మొదటిసర్వజ్ఞసింగభూపతి నిర్దోషియని పైచర్చవలన స్పష్టమైనది. రెండవసర్వజ్ఞనృపతి యీదారుణకార్యమును జేసెనా యనువిషయమునుగూడఁ దేల్చవలసియున్నది. ఇతనిజననము క్రీ. శ. ౧౪౦౦ ప్రాంతమని శాసనసాహాయ్యమున శ్రీనాథచరిత్రమునఁ జెప్పియుంటిని. భాగవతారచనాకాలము క్రీ. శ. ౧౪౫౦ ప్రాంతమని పైనివ్రాసితిని. ఆకాలమునకు రెండవసర్వజ్ఞసింగనృపతి జీవించియుండఁడు. అతఁడు తొంబదియేండ్లు జీవించెననుట కాధారములు లేవు. ఆతఁ డావయసున నిట్టియకార్యకరణ మొనర్చె ననుటకంటె నమ్మఁదగని విషయ మింకొకటియుండదు. ఎటుచూచిన నీభాగవతఖననగాథ యసత్యమనియు నసంభవమనియుఁ ఖండితముగాఁ జెప్పవచ్చును.

**—పోతన భోగినీదండకమును రచించెనా :?—**

పోతనామాత్యుఁడు సర్వజ్ఞసింగమభూపాలుని నాయకునిగా జేసి యొకవేశ్యావిరహమును వర్ణించు "భోగినీదండకము"ను రచించె ననిచెప్పెదురు. దండకములలోఁ బోతనపేరు లేదు. ఆగ్రంథాంతమున నున్న

"ఉ. పండితకీర్తనీయుఁ డగుబమ్మెరపోతన యాసుధాంశుమా
ర్తాండకులాచలాంబునిధితారకమై విలసిల్ల భోగినీ
దండకము న్రచించె బహుదానవిహర్తకు రావుసింగభూ
మండలభర్తకు న్విమతమానవనాథమదాపహర్తకున్"

అనుపద్యమునుబట్టి యీదండకకర్తృత్వము పోతనకారోపితమైనది. ఇందుదాహృతుఁడైనసర్వజ్ఞసింగభూపాలుఁడు రసార్ణవసుధాకరాది గ్రంథకర్త యగు సింగభూపాలుఁడే యని యనుచున్నారు. అది సత్యమైనచోఁ, నీదండకము పోతనామాత్యరచితము కాదనుట నిశ్చయము. ఆదండకము నాపండితప్రభువు వ్రాయించుకొనలేదనుటకు దండకమునందే యాధారము లున్నవి. ఆదండకమునందలి

సర్వజ్ఞసింగమనాయుని తండ్రి కుమారాన్నపోతభూపాలుఁడు; తల్లి పోచమాంబ; తాతసింగమనాయుఁడు.

"కుమారాన్నపోతావనీనాథసూనున్ ... ... ... పోచమాంబా ఽసద్గర్భసంజాతున్......... రావు సింగక్షమానాథపౌత్రున్ సమీచీనరేచర్లగోత్రాంబుజాతాప్తమిత్రున్ సర్వజ్ఞసింగోర్వరాధ్యక్షు..... కామినీలోక పాంచాలు డాసింగభూపాలు డాబాలన్".

అను వాక్యములు పైయంశములను ధ్రువపఱుచుచున్నవి. సర్వజ్ఞసింగనామధేయు లిరువురున్నారు.

మొదటి సర్వజ్ఞసింగమనాయని (రసార్ణవసుధాకరకర్త) తల్లి అన్నమాంబ యైనట్లు రసార్ణవసుధాకరము నందలి

శ్లో. అన్నమాంబేతి విఖ్యాతా తస్యాసీ ద్ధరణీపతేః
దేవీ శివా శివాస్యేవ రాజమౌళీ ర్మహోజ్జ్వలా॥

అనియెడి శ్లోకమువలనను, రత్నపాంచాలికానాటక గద్యమువలనను దెలియుచున్నది. కావున నీదండకము పోచమాంబాసుతునిపైఁ జెప్పినది. కాని అన్నమాంబ కుమారుఁడైన మొదటి సర్వజ్ఞసింగమనాయనిపైఁ జెప్పినది కాదని ఘంటాపథముగాఁ జెప్పవచ్చును.

ఇరువురు సింగభూపాలుర తండ్రులును అనపోతానాయుఁడులే. కాని మొదటి సింగభూపతి తండ్రికిఁ గుమారశబ్దము లేదు. ఉండుట కవకాశములేదు. అదివఱకీవంశములో ననపోతానాయుఁడు లేఁడు. అందుచే నీదండకమందలి సింగభూపాలుఁడు రెండవసర్వజ్ఞ సింగమనాయఁడే యని చెప్పనొప్పును. దీని కింకొక యాధార మున్నది. దండకమునందే " వసంతావనీనాథ సంసేవితాంచత్పదాంభోజు" అని సింగభూపాలుని కొక విశేషణ ముపయోగించినాఁడు. ఈ వసంతావనీనాథుఁడు రెండవసర్వజ్ఞుని రెండవసోదరుఁడు (శ్రీనాథచారిత్రమున నిచ్చిన రావువారి వంశవృక్షమును జూడుఁడు) వసంతనాయఁ డనుపేరుగలవా రింకొకరు బేతాళరెడ్డి వంశమున లేరు. ఆకాలమున వసంతరాయఁ డను బిరుదు రెడ్డిరాజులలో ననవేమారెడ్డికిని ననపోతారెడ్డి తనయుఁ డగు కుమారగిరిరెడ్డికిని గలదు. కాని యారెడ్డిరాజులు సింగమనాయని పదాంబుజములను సేవించువారుగా నున్నారనుట కాధారములు

లేవు. కావున నీవసంతావనీనాథుఁడు రెండవసర్వజ్ఞుని సోదరుఁడనుట నిశ్చయము. దీనినిబట్టి భోగినీదండకమునఁ బేర్కొనఁబడిన సింగభూపాలుఁడు మొదటి సింగభూపాలుఁడు కాఁడనియు, రెండవయాతఁడనియు నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. సంశయమున కించుకేనియు నవకాశము లేదు.

ఈరెండవ సింగభూపాలుని జననము క్రీ. శ. ౧౪౦౦ సంవత్సరప్రాంత మని శ్రీనాథచరిత్రమున నిర్ణయము చేసియుంటిని. పోతనామాత్యుని జననము ౧౪౫౦ ప్రాంతము. ఆతని యిరువదియైదవ సంవత్సరమున నీదండకము వ్రాసెననిన నప్పటికి సింగభూపాలునివయసు డెబ్బదియైదు సంవత్సరము లుండును. ఆతఁడప్పటికి జీవించియుండెననుట కాధారములు లేవు. అట్టి వృద్ధాప్యదశయందు దీతఁ డట్టిశృంగారదండకమును వ్రాయించుకొనియుండఁడు. కావున నీదండకము పోతనామాత్యకృతము కాదు. పోతన జననము ౧౪౭౫ వ సంవత్సరమునకు గెంటినను (అందులకవకాశము లేదు) దండకరచనము నాఁటికి సింగభూపాలున కేఁబదియేండ్లుండును. అట్టివయసునఁగూడ నీతఁ డాదండకమునకుఁ బ్రోత్సాహకర్త కానేరఁడు. కేవల మీదండక కర్తృత్వాపాదనమునకై పోతనజననకాలము ననేకకారణములచే సిద్ధాంతమైన ౧౪౫౦ నుండి యేఁబదియేండ్లు వెనుకకుఁ దఱిమి ౧౪౦౦ వ ప్రాంత మని చెప్పుట పొసఁగదు.

" వీరేశలింగముపంతులుగారుకూడ మొదట నీదండకము పోతనకృతముకాదని యభిప్రాయపడియు, దానిం జదివినపిమ్మట శైలినిబట్టి యది పోతని కృతమేయని నిశ్చయించి యందలిశైలిం జూపుటకై యీక్రిందిభాగము నుదాహరించియున్నారు. "కామానలజ్వాలల న్వేఁగి చింతాభరక్రాంతయై యున్న యింతిం బరీక్షించి" తన్మాత్ర మాయాపరాభూతజామాతమిథ్యానయోపేత విజ్ఞాతనానావశీకారమంత్రౌషధావ్రాత లోకైక విఖ్యాత వారాంగనాధర్మశిక్షాదిసంఖ్యాత: సమ్మోహితానేకరాజన్యసంఘాత వాచాలతాబద్ధనానామహాభూత: యే తెంచి కూఁతున్ బరీక్షించి రీతి న్విచారించి బుద్ధి న్వివేకించి బాలన్ మిళత్కుంతలవ్రాతఫాలన్ గరాంభోజరాజత్కపోలన్ సమంద్రోష్ణనిశ్వాసజాలన్

విపర్యస్తసంవ్యానచేలన్ మహాందోళనప్రేంఖితస్వర్ణడోలన్ మృగేంద్రావలగ్నన్ దయావ్యాప్తిమగ్నన్ మనోజాగ్నిభగ్నన్ ... ... ... విలోకించి లోనం బరాయత్తయై చిత్తజాతాసిధారాచలచ్చిత్తయై విన్నయై ఖిన్నయై భిన్నయై యున్నభావంబు భావించి నెయ్యంబు గావించి బాలాజితత్వంబు మేలా విచారింప వేలా వినోదింప వేలా వయోధర్మముల్ రిత్తగా బుచ్చి నీవృత్తికి న్మెత్తురే వత్తురే కాముకుల్ డాయ గాయంబు విన్యస్తకాయోపమేయంబు ప్రాయంబు ధారాధర చ్ఛాయ మెన్నేను పాయంబులన్ విత్తమాయత్తముం జేయుమా రిత్తవారంబు నేరంబుగా దీవిచారంబు వంశానుచారంబు సంసారసారంబు లాభాధికారంబు”

శైలినిబట్టి కాలనిర్ణయము సేయుట ప్రమాద భూయిష్ఠ మని పలుమారులు నేననియున్నాఁడను. అందును విశేషించి యొకగణమాత్రాబద్ధ మగుదండక శైలినిబట్టి కవిని కాలమును నిర్ణయించుట మఱింత ప్రమాద మని నాయభిప్రాయము.” పోతనరచించిన దశమస్కంధ మందలి యా[illegible]రదండకమునకును దీనికిని పోలిక లున్నమాట నిజము. ఇది సర్వవిధములఁ బోతనశైలిని బోలియున్నసంగతి కూడ వాస్తవము.” మఱియు సప్తమస్కంధమందలి

“మందారమకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మలమందాకినీ వీచికల దూఁగు
రాయంచ సనునె తరంగిణులకు
లలితరసాలపల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరకం
బరుగునే సాంద్రనీహారములకు

గీ. నంబుజోదరు దివ్యపాదారవింద
చింతనామృతపానవిశేషమత్త
చిత్తమేరీతి నితరంబుఁ జేరనేర్చు
వినుతగుణశీల మాటలు వేయునే.

అనుపద్యమందలిభావములే భోగినీదండకమున నీక్రిందిభాగములోఁ గనఁబట్టుచున్నవి.

"నే నామరుఁ డైన గౌరీవరుండైన లక్ష్మీశ్వరుండైన వాణీధరుండైన దేవోత్తముండైన నన్నున్ మదిం గోరఁగా నొల్లనే యుల్లసత్ఫుల్లమందార రాజన్మరందంబునందంబునన్ గ్రోలుమత్తాళి ఝుత్కారమున్ గ్రోలునే, హేమరాజీవరాజీరజోరాజితాకాశగంగానదీలోలకల్లోలడోలాసటద్రాజహంసంబు శైవాలజంబాల గండూపదీభేకఢేకీధులీసంకులాసారకాసారముఁ జేరునే మండితాఖండలానీలజీమూతనిర్యత్పయోధారలన్ ద్రావు సారంగి కుంభాంతరాళాంబుపూరంబులన్ ద్రావునే మాధవోజ్జాతచూతాంకురస్వాదులీలాలసత్కోకిలేంద్రంబు ఝుల్లీరవక్రూరభల్లాతకీశాఖకుం బోవునే సింగభూపాలుబాహాపరీరంభసంరంభసంభోగమున్ గోరు యోషాశిరోరత్నముం గోరునే నీచసంభోగ మంబా"

ఈరెంటికిని శబ్దసామ్యమంతఁగా లేకపోయినను, భావసామ్యమున్నది. అందుచేఁ బోతనామాత్యుఁ డీదండకమును రచించెనని చెప్పుట తప్పదని కొందఱనుచున్నారు. కాని నాకది యంగీకార్యముగాఁ దోఁచుట లేదు. భోగినీదండకము భాగవతమునకుఁ దరువాత రచించెనని యెవ్వరు ననుటలేదు. "మందారమకరంద" మనుపద్యము నందలిభావములు సంస్కృతభాగవతమున లేవు. ఈదండకములోని భావములను బోతన శృంగారమునుండి భక్తిరసమునకు మార్చి తనభాగవతమున వ్రాసియుండెనని చెప్పవలసియున్నది. భక్తిశృంగారములు రెండిటికిఁ బ్రేమయే ప్రధానము. కావునఁ బోతనామాత్యుఁ డీదండకమునుండి యీభావములను గ్రహించిభక్తిరసమును బోధించుటకై వ్రాసియుండును, భాగవతమందలిశ్రీకృష్ణలీలలలో నీభావమే యిమిడియున్నది. కాని పోతనామాత్యుఁడీభావములను గ్రహించి నాఁడన్నంతమాత్రమున దండక మాతఁడు రచించెనని నిశ్చయింపరాదు. అది యెవరి రచనమైనను దానియందలి స్వారస్యమును గ్రహించి తనగ్రంథమునఁ జేర్చుకొనియెనని చెప్పవచ్చును. కావున నీభావసామాన్యమునుబట్టి యీదండకకర్త పోతనయని ధ్రువపడదు. పోతనామాత్యునకును నీదండకకర్తకును గూడ పాలకురికిసోమనాథునిబసవపురాణతృతీయాశ్వాసమందలి యీక్రిందిపద్యములు లాధారములని నాయభిప్రాయము.

"క్షీరాబ్ధిలోపలఁ గ్రీడించుహంస
గోరునే పడియలనీరు త్రావంగ ?
జూతఫలంబులు చుంబించుచిలుక
భాతి బూరుగుమ్రానిపండ్లు గన్గొనునె ?
రాకామలజ్యోత్స్నఁ ద్రావుచకోర
సూకాంక్ష సేయునే చీఁకటిఁద్రావ ?
విరిదమ్మివాసన విహరించు తేఁటి
పరిగొని సుడియునే బబ్బలితరుల ?

ఈభావములకుదండకకర్త మెఱుఁగు వెట్టి తనదండకమునఁబ్రకాశింపఁజేసినాఁడు. అందుపైఁ బోతనామాత్యుఁడాభావముల కేవన్నె వెట్టి తనపద్యము స్కంధమున వెలయింపఁజేసినాఁడు.

కావునిబట్టి యీదండకము పోతనదని శ్రీవీరేశలింగముపంతులుగారు నిర్ణయించియున్నారు. ఆదండకమందలి కొన్నివాక్యములను పైని వ్రాసియున్నాఁడను. ఈక్రిందిదండకభాగమును బరికింపుఁడు.

"సుస్నాతయై ధౌతపట్టాంబరం బొప్పుగాఁ గట్టి బంగారుటందెల్మణీఘంటికాకాంచిమాణిక్యపుం గంకణాలుంగరంబుల్ మణీహారముల్ ముత్యపున్నత్తు నాసామణీరత్నముం గర్ణభూషాళిముక్తాలలామంబు సూర్యేందుభూషావిశేషంబులున్ లోనుగాఁగల్గు నాత్మీయదివ్యాంబరాలంకృతిస్తోమమెల్లం బొకాటంబుగాఁ దాల్చి మేల్పన్నపున్ భాతిమధ్యంబునం గుంకుమంబుం జగాజంపుబొట్టించి బంగారుటందెల్ రవాళింపఁగా లాహిరీతింజడారేఖ పూగాడ లేగౌనుజవ్వాడఁ గ్రొవ్వాడిచూపుల్ మదుల్గాడ బల్గుబ్బచన్గుబ్బలన్ హారముల్ నట్టువల్ ద్రొక్క బంగారపుం పైటు జీరాడ సొనాన్న విగారంపుశాల్మల్ ముసుం గందమై రంగులు ప్పొంగ నెమ్మేనిజవ్వాదిదావు ల్లెలంగంగ భూషాప్రభల్ దిక్కులం చిక్కటిల్లంగ గ్రొక్కారుక్రొమ్మెరుంగోయనన్ భూమికేతెంచు రంభావధూరత్నమో నాగ ముస్తాదు జెన్నారగా దీరుగా జగ్గుముగ్గుల్లిగారింపగా మందయానంబుతో నొక్కపూఁబోడికైదండఁ గైకొంచు.

"శయ్యపైఁజేరి కూర్చుండి హస్తారవిందంబు పైఁజేర్చి కోపింపనో నామనంబెల్ల శోధింపనో నవ్వుటాల న్వినోదింపనో యోరూపరేఖాశ

శాంకోపమా కోపమా యొక్కమాటాడితే నేరమా నేరమా చిత్రమై నట్లువర్తింపఁగా జాలమా జాలమా సుందరాకారఁ గానంబు నిస్సార ముగా సారమా యీచమత్కారమా...

"దళ్కువజ్రాలకంబాలు బంగారపు న్నిల్వుటద్దాలు మిన్నాప నల్ చిత్రపుంజిత్రపుంబొమ్మలుర్ దాపుతోచందువాలందుఁ బూఁబా నువుల్ పచ్చరాతోరణంబుల్ జగాముత్యపుం జప్పరంబుల్ సొగారం గైనమానిక్యసింహాసనంబుల్ పదార్వన్నెబంగారపుందల్పులుర్ ద్వార బంధంబులుం బొల్పుగా సర్వతస్థాపితోద్యన్మణీధూపధగ్యంబులున్ ధైగ ధిగ్యంబులున్ నైగనిగ్యంబులున్ జాకచక్యంబులున్ విన్యాసమందంగనం దొప్పుగాధారుణీనాయకుల్ గాయకుల్ వైణికుల్ దివ్యపౌరాణికుల్ సత్క వుల్ వేదవేదాంగవిత్పుంగవుల్ మంత్రిచంద్రుల్ బుధేంద్రుల్ మహాసూరు లేకాంగవీరుల్ పరీహాసకుల్ మాగధుల్ వందివైతాళికుల్ గొల్వఁగా థక్కథైథిక్కథై తద్ధినాంతక్క తెయ్యంచు రంభాదిజంభారిసంభోంద్ర కుంభద్వయీసన్నిభోరోజకుంభాసదృగ్వారమత్తేభయానామణుల్ నా ట్యముల్ సల్పఁగా..."

"భల్లాణదండకము"

ఈదండకమును భోగినీదండకము నొక్కపోలికలో నున్నదని నాయభిప్రాయము. ఇంకను నిట్టిదండకములను గొన్నిటిఁజూపవచ్చును. శబ్దాలంకారమునుగూర్చ సమర్థుఁడైన యేకవియైనను నిట్టిదండకమును వ్రాయఁగలడనియు దండక శైలినిబట్టి కవిని నిర్ణయింపరాదనియుఁ దలం చుచున్నాడను. రెండవ సర్వజ్ఞసింగభూపాలుని యాస్థానమున నాపాటి సామర్థ్యము గలకవి యెవ్వరైన నుండెనేమోయనియు నాతఁ డీదండక మును రచించెనేమోయనియుఁ దోచుచున్నది.

రెండవ సర్వజ్ఞసింగభూపాలునితో సమకాలికుఁడై శ్రీనాథమహా కవిశిష్యుఁడైన దగ్గుబలి దుగ్గనకవి రచించిన దండకము పోతనామా త్యుని యశూరదండకమును బోలియున్నది. పరికింపుఁడు. ఆ దండక మందలి కొంతభాగము నిట నిచ్చెదను. ఇతఁడు పోతనకుఁ బూర్వుఁడు.

"......ప్రపంచంబు నీవొక్కడుం దక్క వేఱొక్కఁ డెవ్వాఁ డు సృష్టింప బాలింప మాయింప శక్తుండు భక్తానురక్తా చతుర్వక్త్రి నిన్నుర్ సదా యజ్ఞితేంద్రియుల్ సదాభ్యస్తసంద్రియుల్ సదాచారయుక్తుల్

సదాయోగనిష్ఠుల్ సదాసత్యవాదుల్ సదాబ్రహ్మవాదుల్ దయాధర్మశీలుర్ తపోజ్ఞానలోలుర్ సదా సన్నిధింగానలే రట్టి నీ విప్ర మూకుం బ్రసన్నుతింపన్ తప్త హేమప్రభాభాసమానాంగవర్ణంబుఁ గోటీరదివ్యచ్ఛత్రరత్నకంబుల్ రసజ్ఞాచతుష్కాది తామ్నాయవరంబు... ...”.

కొఱవి గోపరాజ కృతసింహాసనద్వాత్రింశికలో నొక నిరోష్ఠ్య దండకము ముక్తపదగ్రస్తాలంకారముతోఁ గూడినది కలదు. పోతనకవిత్వమునకును గోపరాజుకవిత్వమునకును బోలికలుకలవని గోపరాజుచరిత్రమున వ్రాసియుంటిని. ఈదండకము నిరోష్ఠ్యము గాదేని పోతనయసూరిరదండకమును బోలియుండును. గోపరాజకవి పెదతాత కుమారులు రెండవసర్వజ్ఞునికడ మంత్రులు. ఆపరిచయముచే నాతఁడా యాస్థానమునకువచ్చి భోగినీదండకమును రచియించె ననుకొనుట కవకాశమున్నది.

ఎట్లయిన భోగినీదండకమును పోతనామాత్యుఁడు రచింపలేదని సిద్ధాంతముచేయుటకై శ్రమపడుట నాయుద్దేశముకాదు. ఆదండకమును రచించె ననినంతమాత్రమున నాతని స్వభావమునకుఁ గళంకము రాదు. యౌవనమునఁ బ్రభుప్రోత్సాహముచే నట్టిదండకము నాతఁడు చేసెననిన నందు దోషములేదు. ఈదండకమునకు నాయకుఁడు రెండవ సర్వజ్ఞుడనుట నిశ్చయము. ఆకాలమున నెందఱో ప్రభువులు మంత్రులు వేశ్యాలంపటత్వము దోషముగాఁ దలంపలేదు సరికదా గౌరవముగా భావించుచుండిరని మన కనేక కావ్యములవలనఁ దెలియుచున్నది. అది దోషమేయగునేని, యాసింగమప్రభువును దానినుండి తప్పింపలేము. కాల మంగీకరించెనేని యాదండకకర్త మఱియొకఁడు గన్పడకుండెనేని పోతనామాత్యుఁడా దండకమును రచించెనని నిర్ణయించుటకును నేను సందేహింపను.

రెండవ సర్వజ్ఞసింగమనాయఁడు పదియవతరము వాఁడని యంగీకరించినచో నాతఁడును బోతనయు సమవయస్కులై యాదండకమును బోతనయే రెండవసర్వజ్ఞసింగమనాయకునిపై రచించెనని నిర్ణయించుటకుఁ గాల మాటంకము చేయదు. కాని యాతఁడు పదియవతరము వాఁడనుట పొసఁగకున్నది. ఎట్లయిన నీదండకమునకుఁ బోతనను గర్తగాఁజేయుట తప్పనిసరి యగునేని సర్వజ్ఞుని జననము నయిదు లేక పది

సంవత్సరములు ముందునకుఁ దెచ్చి పోతన జననము నయిదు లేక పదిసంవత్సరములు వెనుకకు గెంటినచో సింగభూపాలున కఱువది లేక యేబదేండ్ల వయసునను బోతన కిరువదేండ్లవయసునను నీదండక ముత్పన్నమయ్యె నని తేలును. అది యొకపక్షములో నస్వాభావికమై ననునొకపక్షములో స్వాభావికము కావచ్చును. ఇంతకంటె దీనిని సమన్వయముచేయుటకు వేఱుమార్గము లేదు. భోగినీదండకకర్త పోతన యని యంగీకరించినను భాగవతఖననకథ యసత్యమే కాని నిజము కాదు. ఇందులకు హేతువులను బైనిజూపియే యున్నాఁడను.

**—: వీరభద్ర విజయము పోతన రచించినదేనా:—**

"వీరభద్రవిజయము నాలుగాశ్వాసములు కలది. గద్యనుబట్టి యును గృతికర్తవంశాభివర్ణమునుబట్టియును నీగ్రంథము పోతనామాత్య రచన మని స్పష్ట మగుచున్నది." ఈగ్రంథ మందిచ్చినపోతనామాత్యుని వంశ వృక్షమిది:—

మల్లయ

భీమన

అన్నయ = గౌరమాంబ

సోమన = మల్లమ

రేచన నన్నయ ఎల్లన = నయ్యాలు పెగ్గడ మాచయ
మాచాంబిక

కేసన = లక్కమ్మ మాధవుఁడు ఇమ్మడి

కేసన

తిప్పన పోతన

కేసనభార్య యైనలక్ష్మమ్మతండ్రిపేరు మంచి. తల్లిపేరుమాచమ. అన్నగారిపేరు గోపన. భాగవతమున నిచ్చినవంశవృక్షమునకును దీనికిని భేదములేదు. భాగవతమున పినతాత పెదతాతలను బినతండ్రులను జేర్చలేదు. ఇది ప్రథమగ్రంథమగుటఁ దీనియందు వారిని జెప్పియుండును. ఇంతియే భేదము. వీరభద్రవిజయరచనమునాఁటికిఁ దండ్రిజీవించి యున్న ట్లీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

ఉ. భూసురవంద్యునిన్ సుగుణభూషణు నాశ్రితకల్పవృక్షమున్
దాసజనప్రపన్న శివతత్త్వమనోరథకౌతుకోన్నతున్
కేసనమంత్రి సత్యనిధిఁ గీర్తివిశాలుఁ జిరాయురున్నతున్
జేసి రుమామహేశ్వరులు చెన్నుగఁ గాతురు గాక సత్కృపన్.

ఈపద్యమునఁ దల్లినిఁ జేర్పకపోవుటచే నప్పటికిఁ దల్లి స్వర్గమునుజేరెనేమో యని సంశయము కలుగుచున్నది. కాని నిశ్చయముగాఁ జెప్పలేము.

భాగవతమున "సహజపాండిత్య" యనివ్రాసికొనినను, వీరభద్రవిజయమున "జనకశిక్షితవిహితాక్షరాభ్యాసుండనై"యని చెప్పుకొనినందువలనఁ బ్రథమమునఁ దండ్రియొద్దనే విద్యాభ్యాసముచేసి కొంతవఱకు జ్ఞానమును సంపాదించి పిదప స్వయంకృషివలనఁ బండితుఁడై భాగవతము నాంధ్రీకరించియుండు నని తలంపవలసియున్నది.

పోతనామాత్యున కివటూరి సోమనాథుఁడు గురువైనట్లు వీరభద్రవిజయమునఁ జెప్పుకొనియున్నాఁడు. అజ్జరపు పేరయలింగకవి తనకు సోమనాథుని మనుమఁడైన యివటూరి పెదబారాపనారాధ్యుఁడు గురువైనట్లును, కేసకవి మల్లకవులు పెదరామనారాధ్యుని కుమారుఁడు పర్వతాలు గురువైనట్లును చెప్పుకొనియుండుటచేత బమ్మెరవారి కివటూరివారు మొదటినుండియు గురువులైనట్లును శైవమతమును బమ్మెరవారు వారివలననే గ్రహించినట్లును నూహింపఁదగియున్నది. పేరయలింగమునకు గురువైన సోమనాథుని తాతయగు సోమనాథుఁడే పోతనకు గురువైనట్లూహించి పైవంశవృక్షములోఁ గనుపఱచితిని.

సోమనాథుఁడు తనశిష్యుఁడైన పోతనను బిలిచి
"వింతపండువుబోలెను వీరభద్ర
విజయ మెల్లను వినఁ గడువేడ్క యయ్యె
నది దెలుంగున రచియింపు మభిమతముగ.

ఆ. పిన్నవాఁడ ననియు బెక్కుసంస్కృతులను
విననివాఁడ ననియు వెఱపు మాను
మత్ప్రసాదదివ్యమహిమచే నెంతైన
కవిత చెప్ప లావు గలదు నీకు

వ. అదియునుంగాక వీరభద్రేశ్వర ప్రసాదంబుఁ గలదు. కావున వాయుపురాణసారం బగు నీకథావృత్తాంతంబంతయు. దెలుంగున రచియింపు"మని యానతిచ్చినట్లు పోతన వ్రాసియుండుటచే వీరభద్ర విజయమునాఁటి కాతఁడు పిన్నవాఁడనియు విశేష గ్రంథపరిచయము లేనివాఁడనియు స్పష్ట మగుచున్నది. అప్పటికి భాగవతమును రచియించియుండలేదు. వీరభద్రవిజయమున "కుమ్మరి గుండయ్య, మడిగూలు మాచిరాజు మొదలగు వీరశైవులను స్మరించియుండుటనుబట్టి భాగవతమును రచించువఱకును నీతఁడు శైవమతాభిమానియై యుండెననియుఁ బిమ్మట శివకేశవులయందు సమానబుద్ధిగలవాఁడయ్యె ననియు స్పష్ట మగుచున్నది.

ఈక్రిందిపద్యమునుబట్టి భాగవతరచనానంతరమున వీరభద్రవిజయమును రచించినట్లు గన్పట్టుచున్నది. కాని యది సత్యము కాదు.

ఉ. భాగవతప్రబంధ మతిభాసురత న్రచియించి దక్షు
న్యాగకథాప్రసంగమున నల్పవచస్కుఁడ నైతి తన్నిమి
త్తాగతవక్త్రదోషపరిహారముకై యజనైకశైవశా
స్త్రాగమవీరభద్రవిజయంబు రచించెద వేడ్క నామదిన్.

ఈపద్యము కొన్ని తాళపత్రప్రతులలో మాత్రమే కలదు. విలేఖకు లెవరో యీపద్యమును రచియించి యందుఁ జేర్చియుందురు. కావున నీపద్యమును విడిచివేసి పోతనామాత్యుఁడే వీరభద్రవిజయకర్త యని

యు భాగవతమునకు ముందు దీనిని రచియించెననియు నిశ్చయింపవలసి యున్నది.

ఇప్పుడు ముద్రితమై యున్నవీరభద్రవిజయమందలి నాల్గవయాశ్వాసము పోతనామాత్యవిరచితము కాదనియు నెవరోరచియించినభాగము నిందెవ్వరోఁ జేర్చిరనియు శ్రీమానవల్లిరామకృష్ణకవిగారు భారతి పత్రికలో (రక్తాక్షి-ఆషాఢము-పుష్పాంజలి) నీక్రిందివిధముగా వ్రాసియున్నారు. "నాల్గవయాశ్వాసములోనిపద్యములు కొంచెము నీరసములుగా నున్నవి. ఇది యేమనియాలోచించుచుండ వీరభద్రవిజయము తాటియాకులప్రతియొకటి లభించె. దానిఁ బరికించిచూడ నాల్గవయాశ్వాసము ముద్రితపాఠమున కంటె సర్వదా భిన్నము శివపార్వతీకైలాసవిహారవర్ణనమును కుమారజననమును దారకాసురసంహారమును దెలుపుకథాభాగము విస్తరించు నదిగా నున్నది. నూతనముగా లభించిన యీభాగమునను పూర్వాశ్వాసములలోవలెనే మహర్షులకు వాయుదేవుఁడీకథ చెప్పినట్లున్నది. ఆశ్వాసాంతమునఁ గొన్నిపత్రములు లేనందున నీభాగము పోతనకృతమగునా కాదా యనునంశము స్పష్టముగాఁ జెప్పుటకు వీలులేకపోయినను, గవిత్వధోరణి ననుసరించియుఁ గథానుస్యూతత్వమును జూచియు నిది పైమూఁడాశ్వాసములకు సంబంధించి యేకకవికృతమని తోఁచుచున్నది. ముద్రితమగుభాగము పరకవిప్రణీతమగుటచేఁ గాఁబోలు నుత్పలమాలతోఁ బ్రారంభింపఁబడియె. ఇట్లిప్పుడు లభించినభాగములోనుండి కొన్నిపద్యము లుదాహరించుచున్నారము."

శ్రీకవిగారియొద్దనున్న తాళపత్రప్రతిని నేను జూచుటతటస్థింపలేదు. ముద్రితప్రతిలోనినాల్గవయాశ్వాసమునకుబదులుగా నీతాళపత్రప్రతియందున్నగ్రంథము నాల్గవయాశ్వాసముగా నుండఁదగుననియు ముద్రితప్రతియందలి నాల్గవయాశ్వాస మైదవయాశ్వాసముగాఁదగుననియు నిశ్చయింపవలసియున్నది. అట్లుకాదేని గ్రంథమునకు వీరభద్రవిజయ మనుపేరు సార్థకముగాక పోఁగాఁ గుమారసంభవమని పేరుపెట్టవలసియుండును. ముద్రితప్రతియందలి నాల్గవయాశ్వాసమును దీసివైచినచోఁ దక్కినగ్రంథములో వీరభద్రప్రశంసయే యుండదు. ముద్రిత

ప్రతి నాల్గవయాశ్వాసములోనిపద్యములు నీరసములుగా నున్నవని శ్రీ కవిగారనుచున్నారు. కాని నాకట్లు తోఁచుటలేదు. భాగవతములోని కవిత్వమునుబట్టి చూచినప్పు డిది కొంత నీరసముగాఁ గనుపట్టినను, వీర భద్రవిజయమందలి తక్కినభాగముతోఁ బోల్చిచూచినప్పు డిది నీరస ముగాఁ గాన్పింపదు. ఈనాల్గవయాశ్వాసమునందలి పద్యములతో భాగ వతమందలిపద్యములకుఁ బోలికకలదు. ఒక్కపద్యము నుదాహరించె దను.

క. పాపఁబని చింతింపక
పాపాత్ముని దక్షుఁ గూడి మతిమాలి వెసం
బాపవుఁజన్నముఁ జూచిన
పాపాత్ముల కింత వలదె పాపము ధరణిన్.

వీరభద్రవిజయము.

క. పాపాత్ముల పాపంబులఁ
బాపంగాఁ జాలునట్టి పద్మాక్షునిపైఁ
బాపము గలదని నుడివిన
పాపాత్ముని పాపమునకుఁ బారము గలదే.

భాగవతము.

"ఈనాల్గవయాశ్వాసమందలి వీరభద్రదండకమునకును భాగవత మందలి యక్రూరదండకమునకును సామ్యమున్నది." కేవలమీసామ్య మునుబట్టి యీనాల్గవయాశ్వాసమును బోతనరచించెనని చెప్పఁజాలము. కాని యాశ్వాసాంతగద్యము పోతనదని చెప్పుచున్నది కావున నీసామ్య మాకర్తృత్వమును సాధించుటకొక బలవత్తరమైన కారణమగుచున్నది. ప్రథమాశ్వాసమున దక్షయాగకథఁజెప్పి నాల్గవయాశ్వాసమందు మరల దక్షయాగకథ నుడువుటచే, నీయాశ్వాసము పోతనది కాదని శ్రీరామ కృష్ణకవిగారు వ్రాసినారు. కాని యందు సత్యములేదు. దక్షుఁడు రెండు మారులు యజ్ఞముచేసినాఁడు. మొదటియజ్ఞకాలమున నీశ్వరునిభార్య దాక్షాయణి గౌరి. ఆమె యాయజ్ఞవాటికయం దాతనువునువీడి పిమ్మట పార్వతిగా జన్మించినది. ఆయజ్ఞమున వీరభద్రుఁడు జన్మింపలేదు. శివుఁ

డానాడు దక్షునకు శాపం బిచ్చుటతోc దనకోపము నుపసంహరించు కొనినాడు.

మ. పుడమిన్ రాజ్యముc గోలుపోయి తగ నేడ్పుం బొంది శోకించు నా
జడధీ (శాకల్యుడు) శాంతకుc డైనయిందు్రిని కిన్ జన్మించి రోషాం
బుధిం
బడ వైవస్వతమన్వునాcడు ముదమొప్పన్ రాజ్యముం జేయcగాc
గడతేర్తు న్నని పాపదక్షునకు వేగన్ శాపమిచ్చెన్ వడిన్".

ఈశాపానుసారముగా దక్షుcడు వైవస్వతమన్వంతరమున జన్మించి నట్లు నాల్గవ స్కంధమందలి యీక్రిందిపద్యమువలనc దెలియ వచ్చి నది.

క. మఱి వైవస్వతమన్వం
తరమున నొకకాలమందు దక్షుcడ దక్షుం
డుసుతర పాపవిచక్షుcడు
పరcగన్ జన్మించె ఘోరపాపాత్మకుcడై.

మొదటి యజ్ఞవృత్తాంతమును శివునకుc దెల్పినది నారదుcడు. ఈ రెం డవ యజ్ఞకథను దెలిపినవాcడు దధీచి. ఈరెండవ యజ్ఞధ్వంసమునకే యీశ్వరుcడు వీరభద్రుని సృష్టించినాcడు. యజ్ఞము ధ్వంసమైనది. దక్షుcడు చచ్చిబ్రతికినాcడు. ఈయజ్ఞకథలోc బార్వతి సంబంధము లేదు.

ఈగ్రంథమున నీయజ్ఞద్వయకథ యెందులకుc గల్పితమైనదో చెప్పcజాలను. పరమేశ్వరునికుమారులలో వీరభద్రునికంటెc గుమార స్వామి పెద్దవాcడు. అతcడు పార్వతీనందనుcడు. మొదటియజ్ఞములోనే వీరభద్రుcడు జన్మించియున్నచో నాతనికిc గుమారస్వామి తమ్ము డగును గాని యన్న కాcజాలcడు. ఈవ్యత్యాసమును దొలcగించుట కొఱ కీరెండవయజ్ఞగాథ కల్పితమయ్యెనేమో. ఈయజ్ఞద్వయకథ బ్రహ్మ పురాణములోcగూడ నిట్లేయున్నది. ఈగ్రంథకర్త యాపురాణము నను సరించి యుండును.

భాగవతకవిత్వమునకు వీరభద్రవిజయకవిత్వము చాలఁదీసికట్టు గానున్నది. ఇది పోతనకుఁ బాల్యకవిత్వమగుటచే నిట్లున్నదని యను కొనవచ్చును.

మాబంధువులును మిత్రులునగు కవిరాజహంస శ్రీ బాలాంత్రపు వేంకటరావుగారు వీరభద్రవిజయము పోతనామాత్యకృతము కాదనియు దీనిని కేసకవి మల్లకవులు రచియించి, పోతనపేరుపెట్టిరనియు వారు చేసిన దాక్షాయణీపరిణయమును దాముచదివియుంటిమనియు, సీగ్రంథ ద్వయము నొక్కశైలిలో నున్నదనియుఁ బోతనకవిత్వశైలికిని వీరభద్ర విజయశైలికిని జాలభేదముకలదనియు నాతోఁజెప్పియుండిరి. దాక్షా యణీపరిణయము నాకులభింపలేదు. అందుచే నావిషయమున నేనే మియు వ్రాయఁజాలనైతిని.

## —: పోతనామాత్యుఁడు భాగవతము నెంతవఱకు రచించెను :?—

పోతనామాత్యుఁడు భాగవతమును బూర్తిగనే రచియించెననియు నేకారణముచేనైననేమి యదికొంత శిథిలముగాఁగా గంగయ సింగయ నారయలు పూరించిరనియు, నొకకథకలదు. ఇదియే లోకమున వ్యాప్తి నందినది. దాని నటుండనిండు. దశమస్కంధమునం దుత్తరభాగమున రుక్మిణితో విరసోక్తులాడుటవఱకే పోతన రచియించెననియు, నప్పటి కాతనికిఁ గాలమాసన్నముకాఁగా నంతటితోనది యాగిపోయెననియు, నాతనియనంతరమున వెలిగందలనారయ దానినిఁబూరించెనని యు నొక వాదమున్నది. ఇందే సత్యమున్నదని నాయభిప్రాయము. వెలిగందల నారయ పోతనామాత్యుని శిష్యుఁడు.

భాగవతమును బోతనామాత్యుఁడు పూర్తిగరచియింపలేదనియు, గజేంద్రమోక్షము, వామనచరిత్ర, ప్రహ్లాదచరిత్రము, అంబరీషోపాఖ్యా నము, ధ్రువోపాఖ్యానము, శ్రీకృష్ణలీలలుమొదలుగాభక్తిరసప్రధానము లగు కథలనుమాత్రమే రచియించెననియుఁ దక్కినభాగములనితరులుపూ రించి పోతనపేరుపెట్టిరనియు నింకనొకవాద మున్నది. ఈవాదము నాకు రుచింపలేదు. భక్తిరసావేశముచేఁ దన్మయుఁడైనయామహాభక్తుఁడాయా కథపట్టులను రచించినపద్యము లమృతగుళికలవలెనుండి మనలనుగూర్చఁ

దస్మ్రయములనుగాఁ జేయుచుండుటవలనను, దక్షిణకథపట్టుల యందట్టి తన్మయత్వము గలుగకపోవుటచే నంతరసవంతముగాఁ గన్పడకపోవుటయుఁ జూచి కొందఱీవాదమును జేయ మొదలిడిరని నాయూహ. భాగవతపురాణాంధ్రీకరణభాగ్యము తనకు లభించినదని పోతన మొదటఁ జెప్పియున్నాఁడు. అతఁడు భాగవతపురాణమును బూర్తిగాఁ దెలుఁగుఁ జేయ సంకల్పించి నాఁడు కాని, నడుమ నడుమ కథలను మాత్రమే వ్రాయుఁదల పెట్టలేదు. (పైనివ్రాసిన పద్యములనుజూడుఁడు.)

పోతనామాత్యుఁడు షష్ఠస్కంధమును, నేకాదశద్వాదశస్కంధములను వ్రాయలేదనియు, నందుచేతనే పోతన కిరువది ముప్పదియేండ్ల తరువాతనున్న సూరిభట్టు, షష్ఠస్కంధమును, నేకాదశద్వాదశ స్కంధములను రచియించియున్నాఁడనియు, కవులషష్ఠముకూడ షష్ఠస్కంధమును, సంజీవరాయుఁడనుకవియేకాదశస్కంధమును జేసియుండునని యుఁ గొందఱనుచున్నారు. పోతనామాత్యుఁడు ఏకాదశద్వాదశస్కంధములను రచింపలేదనియే నాయుద్దేశము. అవిశిథిలములయ్యెనని కొందఱందురు కాని నాకది విశ్వసనీయముగాఁ దోఁచుటలేదు. నారయకవిత్వము రసవంతముగా లేదని యీభాగమును హరిభట్టు మొదలగువారు మరల రచియించియుందురు. షష్ఠస్కంధమును పోతన రచింపలేదని నిశ్చయముగాఁ జెప్పఁజాలము. నడుమ నాస్కంధము నాతఁడేలవిడిచి పెట్టును ? అది శిథిలమైనదనుటయే లెస్స.

కూచిమంచి తిమ్మకవి చెప్పినట్లు ర, ఱ, లకు మైత్రికల్పించిన పద్యములు పోతనవి కావనియే నిశ్చయింపవచ్చును. ఎచ్చటనైనఁ బ్రమాదవశమున నాలుగు మూఁడుతావులనున్నను నవిభ్రమప్రమాదములచేఁ గలిగినవి కానియుద్దేశపూర్వకముగనుపయోగించినవై యుండవు.

—: పోతన నారాయణశతకమును రచించెనా? :—

"నారాయణా" యను మకుటముతో ౧౦౩ మత్తేభశార్దూల వృత్తములుగల యొకశతకమును బోతనామాత్యుఁడు రచియించెనని ప్రతీతికలదు. శ్రీవంగూరి సుబ్బారావుగారీశతకమును ముద్రింపించిరి. ఈశతకము పోతనామాత్యునిది కాదని కడపమండలవాసులుప్రతిఘటిం

చిరి. ఈవిషయమున వాదోపవాదములు పెక్కులుజరిగినవి. వానినన్నిటి నిట ప్రస్తావించుట యనావశ్యకము. శతకాంతమునఁ గవిపేరుదాహ రించు పద్యమొకటియుండుట చాలశతకములయందుఁగలదు. ఈశతకము నందట్టిపద్యములేదు. భాగవతమునందలి గద్యవంటి గద్య మీశతకాం తమున నున్నది. శతకాంతములయందుఁ బద్యముఁగాకుండ గద్యలను వ్రాసిన శతకము లున్నవని వానినుదాహరించుచు సుబ్బారావుగా రీగద్యను బోతనామాత్యుఁడే రచియించెనని నిర్ణయించినారు. ఈగద్య తాళపత్రప్రతులలో లేదనియు, రెండుకాగితపు ప్రతులలో గ్రంథ మంతయువ్రాయఁబడిన సిరాలోఁగాక వేఱుసిరాలో నున్నదనియు, శ్రీ నాగేశ్వరరావుపంతులుగారు పీఠికలో వ్రాసియున్నారు. గద్యలు వ్రా సినశతకము లేవేని కొన్నియుండిన నుండుఁగాక ! సంశయరాహిత్యము గా నీగద్యను బోతనామాత్యుఁడే వ్రాసినట్లాధారము లేదు. కావునను, సాధారణసూత్రము ననువర్తింపక విశేషసూత్రముచే సమర్థింపవలసి వచ్చినది కావునను నీగద్యను వదలివైచి కవిని నిర్ణయింపవలసియున్నది.

—:శతకమందలి ౯౨ వ పద్యములో:—

మ. అపరాధంబులు నిన్ను నమ్మి విను మే నాజన్మపర్యంతముం
 విపరీతంబుగఁ జేసినాఁడ నిఁక నీవేదిక్కు నాలోనికన్
 గపటం బింతయు లేక దండధరుకున్ గట్టీక రక్షింపుమీ
 కృపకుం బాత్రుఁడనయ్య ధర్మపురి లక్ష్మీనాథ నారాయణా !

అని ధర్మపురి లక్ష్మీనారాయణస్వామిని బేర్కొనియున్నాఁడు. ధర్మపురి నైజామురాష్ట్రములోనిది. సుప్రసిద్ధమైన పుణ్యక్షేత్రము గౌతమీ నదీతీరము. ఆగ్రామమున నున్న నృసింహస్వామిపై శేషప్ప యనుకవి యొక సీసపద్య శతకమును వ్రాసియున్నాఁడు. అచ్చట లక్ష్మీ నారాయణాలయముకూడ నున్నదని శ్రీ నాగేశ్వరరావుపంతులుగారు వ్రాసియున్నారు. పోతననివాసమైన యోరుగల్లునకిది సమీపమందుదు. అందుచేఁ బోతన యీ శతకకర్తయని యూహింప నను వగుచున్నది. కాని పోతన ధర్మపురినివాసుఁ డనుట కాధారములు లేవు. అతని నివా ములు బమ్మెర, ఓరుగల్లు అని మాత్రమే యిదివఱ కనుకొనుచున్నా

రు. ధర్మపురినివాసుఁడైన మఱియేకవియైన దీనిని రచింపఁగూడదా యని యనుమానమును గలుగుచున్నది. భాగవతమునకు బీజము లీశతకమునందున్న వనియు నీ బీజములనే భాగవతమున విస్తరించి రచించెననియు సుబ్బారావుగారు వ్రాసిరి. కాని యది శతకకర్తను నిర్ణయించుటకుఁ దగిన యాధారముకాదు. భాగవతమును జదివిన యే కవియైనను నందలి భావములను సంక్షేపించి యీ శతకమును వ్రాసి యుండవచ్చు ననుట కవకాశమున్నది. నారాయణశతకమును రచించి తిననిచెప్పినకవి యెవ్వఁడైన నుండెనేమోయని పరిశీలించి చూచితిని గాని యింతవఱకు నాకట్టికవి స్ఫురింపలేదు. ముందుఁ గన్పడెనేని విమర్శించి యర్హుఁడైనచో నాతని కీకర్తృత్వము నీయవచ్చును.

అంతవఱకు నీశతకమును గవిపేరు తెలియనిశతకములలోఁ జేర్చుట మంచిదని నాయభిప్రాయము.

## —: పోతన కవిత్వగుణము: —

పోతన కవిత్వమందలి యాధిక్యమును వర్ణించి చెప్పలేను. ఏకవితయందును గానని మాధుర్య మీతనికవితయందుఁ బొంగి పొరలు చుండును. భాగవతమునందు భక్తిని వేదాంతమును బ్రబోధించుకథలు విశేషముగాఁగలవు. ఈరెండును బాలకుని హృదయమున దృఢముగ నాటుకొనునట్లు చేయుటలో నీ మహాకవి కడునేర్పరి. అందులకుఁగావలసిన పదజాల మీతని కవితయందు సహజముగా వచ్చిపడినది.

ఈతని కవిత్వము నందొక ప్రత్యేకలక్షణమున్నది. పద్యపాదాంతము సామాన్యముగా పదమధ్యమున నుండదు. అట్లే యతిస్థానము గూడ పదమధ్యమున నుండక సామాన్యముగాఁ బదాదియందుండును. మఱియు నంత్యనియమము నీకవి యెక్కువగాఁ బాటించుచుండును. ఈలక్షణములనుబట్టి యెవరైన పద్యమును జదివినప్పుఁడిది పోతన కవిత్వమని హృదయమునకు స్ఫురించుచుండును. ప్రజ్ఞాధురీణులగు మహాకవు లెందఱో యున్నారు కాని యీలక్షణములలోఁ బోతన ననుకరించినవారు లేరు.

ఈకవి కవిత్వగుణమును భాగవతపీఠికాకారులు - మువ్వురును జాలగఁ బ్రశంసించియున్నారు. అందు నాగపూడి కుప్పుస్వామయ్యగారి వాక్యముల నిట నుదాహరించి తృప్తిఁ జెందెదను. "పోతనామాత్యుని శైలినిగూర్చి యెంతేని వ్రాయఁదగియున్నను బీఠికావిస్తరభయమున నింతకంటె నిట విపులముగాఁ జర్చింపనయితి కాదామె. ఇమ్మహాకవి పదలాలిత్యమును, రచనాసౌకుమార్యమును, సరసపదప్రయోగవైచిత్ర్యంబును, నుభయభాషాపాండిత్యంబును, హరిలీలావర్ణనాపాటవంబును, వేదాంతార్థనిరూపణ వైదగ్ధ్యంబును నితని రచనలఁ జదువఁ జదువ గోచరించును.

ఇతనిపదము లతికోమలములు. అలంకారములు మనోజ్ఞములు. రచనలు సరసములు. పాకము మధురము. హరిభక్తియగ్గలము. పాండిత్యము మిక్కుటము. లోకానుభవం బహీనము. వేదాంతార్థచింతనంబు మెండు."

ఇతనికి రామాయణము రచింపవలయుననికోర్కె విశేషముగాఁ గలదు. కాని యద్దానిని భాస్కరాదు లదివఱకే యాంధ్రీకరించి యుండుటచే నాతనిదృష్టి భాగవతముపైఁ దిరిగెనఁట. ఈసందర్భమున "బదిరెను భాస్కరుఁడు లేగా రామాయణము బండ్లకెక్కింపనా" యని పోతనామాత్యుఁ డనినట్లు చెప్పుదురు.

## —: పోతన తత్త్వము :—

పోతనామాత్యుని తలిదండ్రులు శివారాధనతత్పరులు. కాని వీరశైవులుకారు. పోతనకూడఁ గొంత కాలము శివభక్తుఁడే. క్రమక్రమముగ నాభావముపోయి శివకేశవులయందు సమాన ప్రతిపత్తి గల స్మార్తుఁడయ్యెను. వేదాంతవిషయము వచ్చినప్పుడీతఁ డద్వైతి.

పరమేశ్వరానుగ్రహమును సంపాదించుటకు భక్తియే ప్రధానమని యీతని యుద్దేశము. ఆసందర్భము వచ్చినప్పుడు తన్మయుఁడై గ్రంథరచనమును గావించినాఁడు. ఆభాగమును జదువునప్పుడు పాఠకులుకూడఁ దన్మయులగుచుందురు. ప్రహ్లాదచరిత్రము, గజేంద్రమోక్షణ

ము, ధ్రువోపాఖ్యానము మొదలగు నుపాఖ్యానము లిందులకు నిదర్శనములు.

పోతన కేవల భక్తుఁడే గాక విరాగియునై యుండెను. ప్రాపంచికవిషయములయం దాతనికిఁ గాంక్షలేదు. దేహధారణమాత్రము నకే యవసర మగు వృత్తిఁ జేసికొనుచుఁ గాలమంతయు భగవదారాధనయందే కడపిన మహాపురుషుఁడు. ఇతని మనోభావములు, ప్రహ్లాద చరిత్రయందలి "యెల్లశరీరధారులకు" వామనచరిత్రమందలి "కారే రాజులు" అను సీ మొదలుగాఁగల పద్యములందువ్యక్తమగుచుండును. ఇతని మనస్తత్వమునుగూర్చి వ్రాయఁదలచిన నదియొక చిన్నగ్రంథ మగును విరమించెదను.

పోతనామాత్యుని ప్రభావమునుగూర్చి కొన్నికథలు ప్రచారమున లోనున్నవి. గజేంద్రమోక్షణమునందలి "అల వైకుంఠపురంబులో నగరిలో" అను నంతవఱకు వ్రాసి తక్కినభాగము నెట్లుపూర్తిచేయ వలయునో తోఁపక యెచ్చటికో వెళ్లెననియు, భగవంతుఁడు పోతన రూపమున వచ్చి పోతనకుమార్తె నడిగి యూతాకుకవిలెఁ దీసికొని తనువ్రాయ పద్యమును బూర్తిచేసిననియు దరువాత పోతనవచ్చి చూచుకొని యీపద్యమును వ్రాసినవాఁరెవరని కుమార్తె నడిగి తెలిసికొని "అమ్మా! నాకంటె నీవుధన్యురాలవు. నీకుభగవంతుని దర్శనమైనది." అని యనియెననియుఁ జెప్పుదురు. పైపద్యమందలి తక్కినభాగము నిజముగా భగవంతుఁడు రచించినట్లే యున్నది. ఇట్టి కథలింకను గొన్ని కలవు. గ్రంథవిస్తరభీతి నిం దీయలేదు. భాగవతముద్రితప్రతి పీఠికలో నిట్టి వింకను గలవు.

అమృతమునువర్షించు నీతని కవితాశైలి నొకటిరెండు పద్యములలోఁ జూప నలవి గాదు. అయినను నానియమము ననుసరించి భాగవతమునుండి కొన్ని పద్యముల నిట నుదాహరించెదను.

ఉ. ఉత్తమకీర్తులైన మనుజోత్తము లాత్మహితంబు లెన్నడుం
జిత్తములందుఁ గోరరు హసించియు లోకుల కెల్ల నర్థసం

పత్రియు భూతియున్ సుఖము భద్రముఁ గోరుదు రన్యరక్షణా
త్యుత్తమ మైన మేను విభుఁ డూరక యేల విరక్తిఁ బాసెనో.

ప్ర. స్కం.

ఉ. అక్కట ! పుత్రశోకజనితాకులభారవిషణ్ణచిత్తనై
పొక్కుచు నున్నభంగి నినుఁ బోరఁ గిరీటి నిబద్ధుఁ జేసి నేఁ
డిక్కడి కీడ్చి తెచ్చుట సహింపనిదై భవదీయమాత నేఁ
డెక్కడ నిట్టిశోకమున నేక్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో.

ప్ర. స్కం.

మ. అణువో కాక కడుం మహావిభవుఁడో యచ్ఛిన్నుఁడో భిన్నుఁడో
గుణియో నిర్గుణుఁడో యటంచు విబుధుల్ గుంఠీభవత్తత్త్వమా
ర్గణులై యేవిభుపాదపద్మభజనోత్కర్షంబులం దత్త్వవీ
క్షణముం జేసెద రట్టివిష్ణుఁ బరమున్ సర్వాత్ము సేవించెదన్.

ద్వి. స్కం.

చ. హరిఁ బరమాత్ము నచ్యుతు ననంతునిఁ జిత్తములం దలంచి సు
స్థిరత విశోకసౌఖ్యములఁ జెందిన ధీనిధు లన్యకృత్యము
ల్మఱచియుఁ జేయనొల్లరు తలంచిన నట్టిద యౌ సురేంద్రుఁడున్
బరువడి నుయ్యి ద్రవ్వనె పిపాసితుఁడై సలిలాభిలాషితన్. ద్వి. స్కం.

చ. పురుషుఁడు నిద్రలోఁ గలలఁ బొందు సమస్తసుఖంబు లాత్మసం
హరణ శిరోవిఖండనము లాదిగ జీవునికిం బ్రబోధ మం
దరయఁగఁ దోఁచుచున్నగతి నాదిఁ బరేశుఁడు బంధనాదులం
బొరయక తక్కఁ బెట్టనుచు బుద్ధిని సంశయమందె దేనియున్.

తృ. స్కం.

సీ. తలఁప బ్రాహ్మణు లుత్తములు వారికంటెను
వేదవేత్తలు వేదవిదులకంటె
విలసితవేదార్థవిదులు వారలకంటె
సమధిక శాస్త్రసంశయము మాన్పు

మీమాంసకులు మఱి మీమాంసకులకంటె
నిజధర్మవిజ్ఞాననిపుణు లరయ
వారికంటెను సంగవర్జితచిత్తులు
దగ వారికంటె సద్ధర్మపరులు
తే. ధార్మికులకంటె నుత్తమోత్తములు వినుము
మత్సమర్పిత సకలధర్మస్వభావ
మహిమములు గల్గి యితరధర్మములు విడిచి
సమత వర్తించు నప్పుణ్యతముఁడు ఘనుడు. తృ. స్కం.

క. కొందఱు కర్మం బందురు
కొందఱు స్వాభావ్యమందురు కొందఱు కాలం
బందురు కొందఱు దైవం
బందురు కొంద ఱోగిఁ గామమందురు మహాత్మా! చ. స్కం.

చ. ఎనయఁగ జారకామిని నిజేశుని మ్రొచ్చిలి జారపూరుషుం
దనపతిగాఁ దలంచుగతిఁ దర్పయు మూఢమనస్కులై తన
ర్చిన నరపాలరూపము ధరించిన యీశ్వరు నన్నెఱుంగ క
న్యుని భజియింప మీ రిహపరోన్నతసౌఖ్యములంద రెన్నఁడున్.
చ. స్కం.

ఉ. ఎల్లశరీరధారులకు నిల్లను చీఁకటినూతిలోపలం
ద్రెళ్లక మీరు మే మను మతిభ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వము న్నతనిదివ్యకళామయ మంచు విష్ణు నం
దుల్లముఁ జేర్చి తా రడవి నుంటట మేలు నిశాచరాగ్రణీ. స. స్కం.

ఉ. బాలకులార! రండు మనప్రాయపుబాలుర కొంద ఱిప్పుడే
కూలుట గంటిరే గురుఁడు కూర్చుఁడ దర్థచయంబునందు దు
శ్శీలత నర్థకల్పనముఁ జేసెడి గ్రాహ్యముగాదు శాస్త్రముల్
నే తెలిగించెదన్ వినిన మీకు నిరంతరభద్ర మయ్యెడిన్.
స. స్కం.

మ. సరఘుల్ గూర్చిన తేనె మానవులకున్ సంప్రాప్త మైనట్లు లో
భరతుల్ గూర్చినవిత్తముల్ పరులకుం బ్రాపించుఁ బ్రాప్తాశిమై

తిరుగంబోని మహోరగంబు బ్రదుకున్ దీర్ఘాంగమై యుండియుం
జిరకాలం బగువానివర్తనము నేఁ జింతించి యేకాంతినై. స. స్కం

శా. కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే
వారేరీ సిరి మూటఁ గట్టికొని పోవంజాలిరే భూమిపైఁ
బేరైనం గలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా.
అ. స్కం.

మ. చెలియే మృత్యువు చుట్టమే యముఁడు సంసేవార్థులే కింకరుల్
శిలలం జేసెనె బ్రహ్మ దన్ను దృఢమే జీవంబు నోచెల్లరే
చలితం బోటఁ నెఱుంగ రీకపటసంసారంబు నిక్కంబుగాఁ
దలఁచున్ మూఢుఁడు సత్యదానకరుణాధర్మాదినిర్ముక్తుఁడై.
అ. స్కం.

శా. సప్తద్వీపవిశాలభూభరము దోస్తంభంబునం బూన్చి సం
ప్రాప్తశ్రీయుతుఁడై మహావిభవసంపచ్ఛాతురిం గల్గి దు
ర్వ్యాప్తిం జెందక వైష్ణవార్చనల మేరం గాలముం బుచ్చుచున్
సుప్తిం బొందక యొప్పె సద్గుణ గరిష్ఠుం డంబరీషుం డిలన్.
న. స్కం.

ఉ. పాపుఁడ బాలఘాతకుఁడ బంధువిరక్తుఁడ దుష్టచిత్తుఁడన్
గోపనుఁడన్ జరన్మృతుఁడఁ గ్రూరుఁడ బ్రాహ్మణహంతభంగిమీ
పాపలఁ జంపితిం బయలిపల్కుల నమ్మితి సాధులార నా
పాపము లుగ్గడింపక కృపామతులై కనరే శమింపరే. ద. స్కం.

మ. మణి కంఠంబునఁ దాల్చి నేఁ డడవిలో మావాఁడు వర్తింపఁగా
మణికై పట్టి వధించినాఁడు హరికి న్మర్యాద లేదంచు దూ
షణముం జేయఁగ వానిదూషణము గంసధ్వంసియాలించి యే
వ్రణము న్నాయెడ లేదు నింద గలిగెన్ వారించు టేరీతియో!
ద. స్కం.

నారాయణశతకము.—

మ. ధర సింహాసనమై నభంబు గొడుగై తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయములెల్ల వందిగణమై బ్రహ్మాండ మాగారమై
సిరి భార్యామణియై విరించి కొడుకై శ్రీగంగ సత్పుత్త్రియై
వరుస న్నీఘనరాజసంబు నిజమై వర్తిల్లు నారాయణా!

మ. వరదుగ్ధాబ్ధితరంగశీకరకలలో వైకుంఠలోకంబులో
విరజానీరవిహారయోగ్యములలో మధురలో రేపల్లెలో ద్వారకా
పురిలో బ్రహ్మశివేశ్వరాదికహృదాంభోజంబులో నుండునీ
ఖరి నాలోపలనుండు భాగవతనూతమ్మాకార! నారాయణా!

మ. ఏభావంబున నిన్ దలంచె గజయోధేంద్రుండు నాపన్నుడై
యేభావంబున ద్రౌప దాయెడ రమానాథేశా యనెన్ వాయసం
బేభావంబున నీశరణ్యమనెనో యీశా కృపాదృష్టిచే
నాభావంబు దలంపు నేర్పు కృపసేయం బాడి నారాయణా!

## 84 వెలిగందలనారయ

ఇతఁ డాంధ్రమహాభాగతమున నేకాదశద్వాదశస్కంధములను బూర్తిగాను, దశమస్కంధోత్తరభాగమున శ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవితోఁ గేళీగృహంబున విరసోక్తులాడుకథ మొదలుగాఁ దుదివఱకును రచించిన పుణ్యపురుషుఁడు. ఇతఁడు భాగవతము నాంధ్రీకరించిన బమ్మెరపోతనామాత్యుని ప్రియశిష్యుఁడనని యీక్రింద నుదాహరించినగద్యలో వ్రాసికొనియున్నాఁడు. "ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసన మంత్రిపుత్త్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రియశిష్య వెలిగందల నారయనామధేయప్రణీతంబైన శ్రీమహాభాగవత మను మహాపురాణంబు"

దశమస్కంధోత్తరభాగమున నీకవి కొంతభాగమును రచియుంచి యున్నను, గద్యయందుఁ దనపేరు వ్రాసికొనక తనగురువునందలి గౌరవముచే నాయన రచియించినట్లు వ్రాసియుండెను. ఏకాదశద్వాదశస్కంధములగద్యలలో "ప్రియశిష్య వెలిగందలనారయ" అనువాక్యములను

మాత్రము చేర్చెను. తక్కిన భాగమంతయుఁ బోతన గద్యవలెనే యుంచెను.

ఈనారయరచించినభాగ మంతయును మొదటబమ్మెరపోతనామాత్యుఁడు రచించియుండె ననియు,నది శిథిలమై పోఁగా నీతఁడు మరల రచించెననియుఁ జిరకాలానుగత మైనజనశ్రుతి కలదు.పోతన యీభాగమునురచింపనే లేదనియు, నంతవఱకును రచించినపిమ్మట నాయన కాలధర్మమునందుటచే తరువాయిభాగమును నారయ పూర్తి చేసెననియు నాయభిప్రాయము. ఈవిషయమై పోతనచారిత్రమున వ్రాసియుంటిని.

భారతారణ్యపర్వశేషమును రచించినయెఱ్ఱాప్రెగ్గడ యీభాగమును నన్నయరచించినట్లు గద్యలో వ్రాసియుండినట్లే దశమస్కంధోత్తరభాగమును బోతనరచించినట్లే నారయకవియు గద్యలో వ్రాసియుండెను: పోతనరచనలోని తుదిపద్య మిది :—

సీ. సాల్వజరాసంధ చైద్యాదిరాజులు
చెలఁగి న న్వీక్షించి మఱయుచుండ
నదిగాక రుక్మి నీయన్నయు గర్వించి
వీర్యమదాంధుఁడై వెఱయుచున్న
వారిగర్వంబులు వారింపఁ గాఁ గోరి
చెలువ నిన్నొడిచి తెచ్చితిమిగాని

ఇంతవఱకే పోతనరచనము. తక్కినపద్యభాగమును నారయపూరించెను.

కాంతాతనూజార్థకాముకులము గాము
కామమోహాదులఁ గ్రిందుకొనము
తే. వినుముదాసీనులము క్రియావిథహితులము
పూర్ణులము మేము నిత్యాత్మబుద్ధితోడ
వెలుఁగుచుందుము గృహదీపవిధము మెఱసి
నవలతాతన్వి మాతోడ నవయవలదు.

ఈనారయకవిచరిత్ర మీతఁడురచించినభాగవతగ్రంథభాగము వలననేమియుఁ దెలియుటలేదు. ఈతనిగృహనామమునుబట్టి యీతఁడు వెలిగందలనివాసియని యూహ పొడముచున్నది. వెలిగందలగ్రామము నిప్పుడు కనిగిరిసగరమని పిలుచుచున్నారు. ఇదినిజాము రాష్ట్రములోనిది. మడికిసింగనకవిచేఁ గృతులనందిన వానసకందనామాత్యుని నివాసము కూడ నీ వెలిగందలయే. ఈకందనను వెలిగందల కందనామాత్యుఁ డనికూడఁ బిలిచెదరు. పోతన నిజాము రాష్ట్రనివాసుఁ డనినిర్ధారణ మైనందున నాతనిశిష్యుఁ డైననారయకూడ నాప్రాంతమువాఁడై యుండు నని చెప్పుటకు సంశయ మక్కఱలేదు. ఈతఁడు బ్రాహ్మణుఁ డనుమాట నిక్కము. ఏశాఖకుఁ జెందినవాఁడో తెలియదు వెలిగందలకందనామాత్యునివలెనే యితఁడును నియోగిబ్రాహ్మణుఁ డైన నయియుండును.

ఈతఁడు రచించిన యేకాదశద్వాదశస్కంధములలోని పద్యములలోఁ గొన్ని యీతఁడు రచించినవి కావనియు, హరిభట్టు రచించినపద్యముల నిందుఁ జేర్చి ముద్రాపకులు ముద్రించిరనియుఁ దోఁచుచున్నది. రాజమహేంద్రవరమున గౌతమీపుస్తకభాండాగారమున నల్లనికాగితములపై వ్రాయబడిన వ్రాతప్రతియొకటి హరిభట్టుకృత మైనది యున్నది. హరిభట్టుకవిత్వమును నారయకవిత్వమును బోల్చిచూడవలయు ననుసుద్దేశముతో నా వ్రాతప్రతిని బరిశీలించిచూడఁగా ముద్రితప్రతిలోనున్న పద్యములే యందుండుట గాంచి, సంశయచిత్తుఁడ నైయిందేదియో రహస్యమున్నదనియుఁ దానిని బరిశీలింపవలయుననియు, నిచ్ఛ పొడమినది. నాయభిప్రాయమును దెలుపుటకు ముందుఁ గొన్నివిషయములను పాఠకులకుఁ దెలుపవలసియున్నది.

పోతనామాత్యుఁడు భాగవతమున, వేదాంతఘట్టములయందును వర్ణనావసరములయందును వచనముల నెక్కుడుగా వ్రాసియున్నాఁడు. కొన్నితావులలో వచనములు చాల పెద్దవిగా నున్నవి. ఆతనిశిష్యుఁ డైన నారయకూడ గురువుననుకరించి యుండెను. నారయరచించినభాగము నందలిపంక్తులను లెక్కించిచూడఁగా దశమస్కంధోత్తరభాగమున మొత్తము 4200 పంక్తులలో ౧౨౦౦ పంక్తులు వచనమున్నది. ఏకాదశస్కం

ధమున మొత్త మెనిమిదివందలపంక్తులలోను ౧౮౦పంక్తులుమాత్రమే పద్యములు. మిగిలినదంతయు వచనము. ద్వాదశస్కంధమున మొత్త మైదువందలయిరువదిపంక్తులలోను ఎనుబదిపంక్తులుమాత్రమే పద్యములు. తక్కినదంతయు వచనము. ఈద్వాదశస్కంధమున పద్యములు ముప్పదిమాత్రమే యున్నవి. దీనినిబట్టి నారయకవిత్వమునఁ బద్యములకంటె వచనభాగమే యెక్కువగాఁ గన్పించుచున్నది. నారయవచనముగా రచించినభాగమును హరిభట్టు పద్యములలో రచించియుండెను. హరిభట్టు ఏకాదశద్వాదశస్కంధములలోని కొన్నిపద్యములు వెలిగందలనారయ రచించిన ఏకాదశద్వాదశస్కంధములని మన కిప్పుడు లభించుచున్న ముద్రితప్రతిలోఁ గన్పట్టుచున్నవి. హరిభట్టుకంటె నారయ పూర్వుఁడగుటచే నాతనియందు గ్రంథచౌర్య మారోపించుటకు వీలు లేదు. కొందఱు నారయపద్యములను హరిభట్టు తనగ్రంథమున వేసికొనెనని యాతనియందు గ్రంథచౌర్యము నారోపించుచున్నారు. నారయకవి వచనముగారచించిన భాగములనుగూడ హరిభట్టు పద్యములనుగా రచించియుండఁగా నాతనిపద్యములను గొన్నిటిని దొంగిలించి తనగ్రంథమునఁ జేర్చికొనినాఁ డనుటకంటె నన్యాయమింకొకటి యుండదు. హరిభట్టు సామాన్యకవికాఁడు. మూఁడుపురాణముల నాంధ్రీకరించిన మహాకవి. ఆతనియందు గ్రంథచౌర్యదోష మారోపింపరాదు.

ఈకవులిరువురును గ్రంథచోరులుకారు. ప్రతివిలేఖకులు హరిభట్టురచించినపద్యములను గొన్నిటిని, నారయగ్రంథమునఁ జేర్చి యచ్చటి వచనభాగమునుసవరించి యుందురనితలంచుటయే యిప్పటున సమంజసముగా నుండును. హరిభట్టుగ్రంథములోనుండి నారయకవివని ముద్రితప్రతిలోఁ జేర్పఁబడినపద్యముల నన్నిటి నిటవ్రాయుట గ్రంథవిస్తర మనియెంచి వాని మొదళ్ళను గొన్నిటి నీక్రింద నిచ్చుచున్నాఁడను.

ఏకాదశస్కంధము.

౨౭ వాలాయము

౯౫ దారలయందు

ద్వాదశస్కంధము.

3. నరవర

౨౭. మృతియును

ఏకాదశస్కంధము.

౩౪ వినుము.

ద్వాదశస్కంధము.

౨౬. ఏనుమ్మృతుండ

౧౪ నరవర

౧౭ ఈజగంబేలు

౧౯ ఉత్తమశ్లోకు

ఈకవి పోతనామాత్యుని శిష్యుఁ డగుటచే నాతని కాలమున నాతనికంటె ఇరువదిముప్పదేండ్లు చిన్నవాఁడై యుండునని తలంపవచ్చును. ఈతని రచనము ౧౪౯౦-౧౫౦౦ ప్రాంతమున నై యుండును.

ఈతనిరచన మింకొకటి యేదియుఁ గన్పడలేదు. ఈతనికవిత్వము పోతనకవిత్వమును బోలదు. కాని మొత్తముమీఁద సరసముగనే రచియించినాఁడని చెప్పవచ్చును. పోతనామాత్యుఁడు రచించిన విగిలిన భాగములలో శిథిలములైన భాగములయం దీతనికవిత్వముండెనని తలంపవీలు లేదు.

భాగవతములోని ౨,౩,౪ స్కంధములలోఁ గొన్ని భాగములు శిథిలములైనవనియు, నాభాగములను నారయ పూరించెననియుఁ గొందఱియభిప్రాయము. ఏకాదశద్వాదశస్కంధములయందున్న వ్యాకరణదోషము లీస్కంధములయం దచ్చటచ్చటఁ గనుపట్టుచుండుటయే యిందులకుఁ గారణము. ఈసందర్భమున "నారయ్య జీవించియుండగనే భాగవతము శిథిలమయ్యెనేని, పంచమషష్ఠస్కంధముల నీతఁడేల పూరింపలేదు? గంగనసింగన లేల పూరింపవలసివచ్చినది? యను ప్రశ్న యుదయించుచున్నది. గంగనసింగనలును నారయయును సమకాలీనులనియు శిథిలావస్థలో నున్న భాగవతమును జూచి వీరు మువ్వురును, దానిని బూరింపఁ బూనిరనియు నందు గంగన పంచమస్కంధమును సింగన షష్ఠస్కంధమును దక్కినభాగములను నారయయుఁ బూరించిరనియుఁ నాప్రశ్నలకు సమాధానములును దోఁచుచున్నవి. గంగనసింగననారయలు సమకాలము వారని చెప్పుట కాక్షేపణము లేమియు లేవు.

పోతన మొదటి యాఱుస్కంధములను నొకకవిలెగాను తుది యాఱుస్కంధములను నొకకవిలెగాను గట్టి యొక పెట్టెలోఁ బెట్టియుం

డుననియుఁ జెదపురుగులు అడుగుభాగమునుండి పట్టి తినుట కారంభించి మొదటికవిలెలోఁ బంచమషష్ఠస్కంధము లును (ఈభాగము అచ్చులో ౨౦౮ పుటలు) రెండవకవిలెలో ఏకాదశద్వాదశస్కంధము లును దశమస్కంధోత్తరభాగములో. గొంతభాగమును (ఈభాగము అచ్చులో ౧౭౬ పుటలు) దినివేసియుండుననియు, నొకయూహా వాడముచున్నది. కాని యిదియూహామాత్రమే. ఈసందర్భమున నిదమిత్థమని నిర్ణయించుట కాధారములు గన్పట్టుటలేదు. మొత్తముమీఁద ఏకాదశ, ద్వాదశస్కంధము లును, దశమస్కంధోత్తరభాగమునఁ దుదిభాగమును బోతన రచింపలేదనియు నారయదానిని రచించెను. గాని పూరింపలేదనియు నానమ్మకము. నారయ క్రీ.శ. ౧౫౧౦ ప్రాంతమున దీనిసిరచించియుండును.

# 85 గంగనార్యుఁడు

ఇతఁడు భాగవతమునందలి పంచమస్కంధము నాంధ్రీకరించి శ్రీకృష్ణున కంకితమొసఁగెను. షష్ఠస్కంధమును రచించిన ఏర్చూరిసింగనవలె నీతఁడు తనకుఁ గోత్రనామాదుల నేమియుఁ గృత్యాదిని రచింపలేదు. షష్ఠ్యంతములను జెప్పలేదు. పంచమస్కంధమును రెండాశ్వాసములుగా విభజించి శ్రీకృష్ణపరముగా నాశ్వాసాద్యంతపద్యములను రచియించినాఁడు. గద్యలో "ఇది శ్రీసకలసుకవిజనానందకర బొప్పనామాత్యపుత్ర గంగనార్యప్రణీతం బైనశ్రీమద్భాగవత మహాపురాణంబునందు" అని మాత్రమే వేసికొనియున్నాఁడు. తండ్రికి, అమాత్యశబ్దము చేర్చుటచే నీతఁడు నియోగిబ్రాహ్మణుఁడని యూహింపఁదగియున్నది. ఇతఁడు పోతనామాత్యునకును దచ్ఛిష్యుఁడైన వెలిగందల నారయకును దరువాతివాఁడనియు, ఏర్చూరిసింగనతో సమకాలికుఁడనియు, నిజాము రాష్ట్రవాసియనియు నేనుదలంచుచున్నాఁడను. ఇంతకంటె నీకవిని గూర్చినవిషయము లేమియుఁ దెలియరాలేదు.

ఇతనియాంధ్రీకరణము పోతన తెలిఁగింపువలె ప్రౌఢముగా లేదనియుఁ గొన్నితావుల మూలమునకు భిన్నముగను గొన్నిచోటుల నతి

న్యూనముగను నున్నదనియు సోదాహరణముగ భాగవతపీఠికాకారులు వ్రాసియున్నారు. కవిత్వవిషయమున "ఈతనికవన మంతరసవంతము కాదు. దానిని సింగనకవనముకంటెఁ దక్కువయని చెప్పవచ్చును. అయినను మొత్తమునకు నితనికవిత్వము కొంత లలితముగాను సింగనదానికంటె సుకుమారముగాను నుండును" అనిపీఠికలో నుదాహరించి యుండిరి. పోతనకవిత్వమువలె నుండకపోయినను, సింగననారయల కవిత్వమునకుఁ దీసిపోదనియు, సింగనకవిత్వముకంటె నొక్కింత యిదియె వాసిఁగాంచుననియు నాయభిప్రాయము. సింగనకవిత్వమునందువలెనే యీతనికవిత్వమునందును దోషములు గన్పట్టుచున్నవి.

శైలికై పంచమస్కంధమునుండి కొన్నిపద్యముల నుదాహరించుచున్నాఁడను.

చ. కటిపలిఁ బాయువస్త్రమును గట్ట నెఱుంగవు చూడ్కిదిక్కులం
బరపుచుఁ జంచరీకములభాతిఁ జెలంగెడుఁ గంధరంబు నం
బొరలెడు ముక్తకేశభరముం దుఱుమంగఁ దలంప విప్పి డి
ట్లిరుదుగ రత్నకందుకవిహారము సల్పెడు సంభ్రమంబునన్.

మ. భరతుం డల్లన యంత్యకాలము వెసం బ్రాపింపఁగా నప్పు డా
హరిణంబుం గడుభక్తిఁ బుత్రుగతి నత్యాసక్తి వీక్షింప నా
హరిణంబుం దనయాత్మలో నిలిపి దేహం బంతటం బాసి తా
హరిణీగర్భమునన్ జనించి హరిణంబై యొప్పెఁ బూర్వస్మృతిన్.

తే. అతులమృష్టాన్నమైన శుష్కాన్నమైన
నద్ది పెట్టిన జిహ్వకు హితవుగానె
తలఁచి భక్షించుఁ గా కొండు దలఁచి మిగులఁ
బ్రీతిసేయఁడు రుచులందుఁ బెంపుతోడ.

మ. జ్వరితార్తుం డగురోగి కౌషధ మతీష్టం బైనచందంబునన్
ధరలో నాతపతప్తదేహి గడుశీతం బైనతోయంబునన్
గరిమం గోరినరీతి నెంతయు నహంకారాహిదష్టుండనై
పరఁగు న్నాకును నీవచోమృతము దప్పన్ మందు వేఱున్నదే.

ఉ: భారతవర్షజంతువులభాగ్యము లేమని చెప్పవచ్చు నీ
భారతవర్షమందు హరి పల్మఱుఁ బుట్టుచు జీవకోటికిన్
నేరతతోడఁ దత్త్వ ముపదేశముసేయుచుఁ జెల్మి సేయుచు
న్నారయ బాంధవాకృతిఁ గృతార్థులఁ జేయుచునుండు నెంతయున్.

ఆ. పార్థివేంద్రు నరుఁడు పాషండదర్శనుఁ
డగుచు ధర్మమార్గ మడఁచెనేని
వాఁడు నరకమందు వైతరణీనది
నడుగ నెపుడుఁ బొరలి పడుచునుండు.

మ. ధనవంతుం డగుమానవుండు గడఁకన్ ధర్మోపకారంబులన్
ఘనతం జేయక యుండెనేని, యమలోకంబందు సూచీముఖం
బనునాదుర్గతిఁ బట్టి త్రోచి యిది గాపై యున్నభూతం బట
న్నను పాశంబులఁ బట్టి కట్టి వడిలో నొప్పింతు రత్యుగ్రులై.

పంచమస్కంధమును బూర్తిగ రచియించినట్లు గంగనార్యుఁడు గద్యలో వ్రాసికొనియున్నను, నీస్కంధమునఁ బోతనామాత్యునికవిత చాలగా నున్నదని నాయభిప్రాయము. షష్ఠస్కంధమును రచించుటకు హరిభట్టుమొదలగువారు పూనుకొనిరి గాని పంచమస్కంధము నెవ్వరును రచియించినట్లు కన్పట్టదు. పోతనామాత్యుఁడు పంచమ,షష్ఠ స్కంధములను రచియింపనే లే దనియొకవాదమున్నది. కాని యది యంగీకరింపఁదగినది కాదు. పంచమస్కంధాదిని ముద్రితప్రతిలో శ్రీకృష్ణ సంబోధకమైన పద్యము గంగనార్యరచితమైనదికలదు. కొన్నివ్రాఁత ప్రతులలో.—

క. శ్రీసీతానయనోత్పల
శ్రీసతిసహజన్మ త్రిదశసేవితయాశా
వాసప్రకాశజయ భా
సాసురపతి హరణరామచంద్రనృపాలా ?

అనుశ్రీరామసంబోధక మైనపద్యమున్నది. ఇది పోతనవిరచితమే కా ! పోతనరచనములో స్కంధాదిని మొదటిపద్యమునకుఁ బిమ్మట

'మహనీయగుణగరిష్ఠు లగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యాన వైఖరీసమేతుం డైనసూతుం డిట్లనియె" అని యున్నది. పంచమస్కంధాదిని ట్లియున్నది. కాని పంచమస్కంధద్వితీయాశ్వాసాదిని షష్ఠస్కంధాదిని యీగద్యరూపాంతరమును బొందియున్నది.

పంచమస్కంధమునం దేది పోతనకవిత్వమో యేది శిథిలభాగపూరణమో నిర్ణయింపలేము. కాని దానిం జదివిచూచినవారికది పూర్తిగా శిథిలము కాలేదనియు నందుం బోతనకవిత్వముగూడ నున్నదనియు దోఁపకమానదు.

## 86 ఏర్చూరి సింగన

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; కసువనామాత్య ముమ్మడాంబలకుఁ బుత్త్రుఁడు; నాదయామాత్యపోలమాంబలకుఁ బౌత్త్రుఁడు;

ఈకవి శ్రీమహాభాగవతమందలి షష్ఠస్కంధమును రచించి శ్రీకృష్ణున కంకిత మొనర్చెను. అందుఁ దనవంశమునీక్రిందిపద్యములలో వర్ణించియున్నాఁడు.

సీ. శ్రీవత్సగోత్రుండు శివభక్తియుక్తుఁ డా
పస్తంబసూత్రుఁ డపారగుణుఁడు
నేర్చూరిశాసనుం డెఱ్ఱప్రెగ్గడ
పుత్రుండు వీరన పుణ్యమూర్తి
కాత్మజుం డగునాదయామాత్యునకుఁ బోల
మాంబకు నందను లమితయశులు
కసువనామాత్యుండు ఘనుఁడు వీరనమంత్రి
సింగధీమణియు నంచితగుణాఢ్యు

తే. లుద్భవించిరి తేజంబు లూర్జితముగ
సారిది మూర్తిత్రయంబున శుభకీర్తిఁ
బరఁగి రందులఁ గసువనప్రభువునకును
ముమ్మడమ్మను సాధ్వియిమ్మేను వెలసె.

ఉ. ఆడదు భర్తమాట కెదురాడదు వచ్చినవారి వీడఁగా
నాడదు పెక్కుభాష లెడనాడదు వాకిలి వెళ్లికల్లమా
టాడదు మిన్నకేని సుగుణావళి కిందిరగాక సాటియే
చేడియలేదు చూరికులశేఖరు కన్యయ ముమ్మడమ్మకున్.

క. ఆకసువయమంత్రికిఁ బు
ణ్యాకల్పశుభాంగి ముమ్మడమ్మ మను న్న
వ్యాకులచిత్తుల నిరువుర
శ్రీకరగుణగణులఁ బుణ్యశీలురఁ గాంచెన్

క. అంగజసమలావణ్యశు
భాంగులు హరిదివ్యపదయుగాంబుజవిలస
ద్భృంగాయమానచిత్తులు
సింగయ తెలగయలు మంత్రిశేఖరు లనఁగన్.

క. అం దగ్రజుండ శివపూ
జం దనరినవాఁడ విష్ణుచరితామృత ని
ష్యంది పటువాగ్విలాసా
నందోచితమానసుండ నయకోవిదుఁడన్.

ఈవంశమునకు మూలపురుషుఁడైనపెట్టినపెద్దగడ ఏర్చూరిశాస నుం డని శైపద్యములో నుండుటచే నాతని నేర్చూరునకుఁ గరణమని మన మూహింపఁదగియున్నది. గ్రామనామములే గృహనామములుగా నుండుటకూడ కలదుకావున నీకవి గృహనామము ఏర్చూరనియూహించి యితనిని ఏర్చూరిసింగనయని పిలుచుచున్నారు. దీని కొకయూధారముకూడఁ గన్పట్టుచున్నది. పైనివ్రాసినయుత్పలమాలలోఁ గవి తండ్రిని "చూరికులశేఖరుఁడని చెప్పియున్నాఁడు. దీనినిబట్టి యీతని యింటిపేరు "చూరివార"ని తేలినది. ఇది యసంగతము. ఈచూరి యనుమాటకు ముందున్న "లేదు" అనుశబ్దమును "యేరు" అనిమార్చినచో "యేరుచూరి" కులశేఖరుఁడనియన్వయము కుదురును. అట్లు మార్చినందువలన పూర్వవాక్యముల కర్థలోపమును రాదు. అప్పుడాపూర్వవా

క్యమిట్టుండును. "సుగుణావళికిందరగాక సాటి యేచేడియ ? యేరుచూ రిశుల శేఖరుకన్యయముమ్మడమ్మకున్" కవియుద్దేశ మిదియే యై యుండు ననియు, లేఖకప్రమాదముచే "యేరు"నకు బదులుగా "లేదు" అనుశబ్దముపడినదని యు నాయభిప్రాయము.

ఈవంశమునకు మూలపురుషుఁ డైనఎఱ్ఱనపెగ్గడయే కవిత్రయములోని "ఎఱ్ఱాప్రెగ్గడ"యని కొంద అభిప్రాయపడుచున్నారు. కాని యది వాస్తవముకాదు. ఇతఁడేర్చూరునకుఁ గరణము. ఏర్చూరు నిజాం రాష్ట్రములోనిది. ఆయెఱ్ఱాప్రెగ్గడ గుడ్లూరు, చెదలువాడ, గ్రామములు నివాసముగాఁ గలవాఁడు. ఆతఁడు కరణ మైన ట్లెచ్చటను జెప్పఁలేదు.

సింగనకవి తనవంశము వర్ణించుపద్యములో ఎఱ్ఱనప్రెగ్గడను ఏర్చూరిశాసనుం డని చెప్పనేకాని, కవియనిచెప్పలేదు. పూర్వకవులను వర్ణించినయీ క్రిందిపద్యములోఁ గవిత్రయమునందలి యెఱ్ఱాప్రెగడను వేఱుగా వర్ణించియున్నాఁడు. అందాతఁడు తనవంశములోనివాఁడని చెప్పియుండలేదు. ఆతఁడే యాతఁడైనచో నావిషయమును దప్పక చెప్పియుండును.

సీ. వరకవిత్వాద్రికి వాల్మీకిఁ గొనియాడి
భాగవతార్థవైభవము బలుకు
శుకమంజులాలాపు శుకయోగిఁ బ్రార్థించి
బాణమయూరుల ప్రతిభ నొడివి
భాస సౌమిల్లిక భారవి మాఘుల
ఘనసుధామధురవాక్యములఁ దలఁచి
కాళిదాసుఁ గవీంద్రకల్పవృక్షముఁ గొల్చి
నన్నపాచార్యు వర్ణనలఁ బొగడి

తే. వెలయఁ దిక్కనసోమయాజుల భజించి
యెఱ్ఱనామాత్యు భాస్కరు నిచ్చఁ గొల్చి
సుకవిసోముని నాచనసోము నెఱిగి
కవిమనోనాథు శ్రీనాథు ఘనత మెచ్చి.

ఎఱ్ఱనలిరువురకును నామసామ్య గోత్రసామ్యము లుండుటచే నాతఁడీతఁడని భ్రమపడిరి కాని యందు సత్యములేదు.

పోతనామాత్యుఁడు రచించినషష్ఠస్కంధము శిథిలమైపోఁగా దానిని తానురచించి నట్లీతఁడు చెప్పలేదు. కాని పోతనామాత్యుని బూర్వకవినిగా నీక్రిందిపద్యములో నుతించియున్నాఁడు.

ఉ. ఎమ్మెలు సెప్పనేలఁ జగ మెన్నఁగఁ బన్నగరాజశాయికిన్
సొమ్ములు వాక్యసంపదలు సూఱలు సేసినవాని భక్తిలో
నమ్మినవాని భాగవతనైష్ఠికుఁడై తగువాని బేర్మితో
బమ్మెరపోతరాజుఁ గవిపట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్.

పంచమషష్ఠస్కంధము లొకకవితగాఁ గట్టియుండె ననియు, నీకవిత, పోతనామాత్యుని కాలములోఁగాని యాతనిశిష్యుఁడైన వెలిగందలనారయ కాలములోఁగాని భ్రష్టముకాలేదనియు, దరువాత నీసింగన కవియు, గంగనార్యుఁడును, భాగవతమునకుఁ బ్రతి వ్రాసికొనుటకై పోతనామాత్యునితనయు నొద్దకుఁ బోయిచూచునప్పటి కీకవిత, పూర్ణముగ శిథిలమై యుండుటను జూచి, యాభాగమును వీరిరువురును బూరించియుందు రనియు నాకుఁ దోఁచుచున్నది. వీరిరువురును వెలిగందల నారయ కొక్కింత తరువాతివారై యుందురు.

ఈకవి విద్యార్థిదశయం దున్నప్పుడే వాణిస్వప్నమునఁ బ్రత్యక్షమైనదఁట ! నాఁటనుండియుఁ గవిత్వతత్త్వజ్ఞానంబు గోచరమైనదఁట ! ఈకథ పైనిఁజెప్పిననాయూహ కొక్కింత సాహాయ్యమొసంగుచున్నది. ఈస్వప్నగాథను వర్ణించినపట్టున వ్రాసినగద్యపద్యముల నీక్రింద వ్రాయుచున్నాఁడను.

“ నేను విద్యాభ్యాసంబునం దగిలి కొండికనై యుండ నొక్కనాఁడు ! దివంబున

చ. కలితవిశేషవస్త్రములు గట్టి హిమాంబుసుగంధచందనం
బలఁది వినూత్నభూషణము లారఁగఁ దాల్చి వినోదలీల నిం
పుల మృదుశయ్య నిద్రఁ దగఁ బొందినచోఁ గనుపట్టెఁ బల్మఱుం
దలమునఁ గ్రిమ్మఱుమ్మెఱుఁగుతండము రూపున నిల్చుపోలికన్,

సీ. ఉరవడిఁ బ్రాగ్వీథి నుదయించు మార్తాండ
కోటిబింబచ్ఛాయ గూడినట్లు
హరిహరబ్రహ్మల యాత్మలలో నుబ్బి
కరుణయొక్కట మూర్తి బెరసినట్లు
ఖరకరకరతీవ్రగతిని గరంగుచు
హేమాద్రిచెంతఁ బె ల్లగసినట్లు
ఫణిరాజఫణరాజిమణిగణవిస్ఫూర్తి
సుషిరంపువెలిఁదల చూపినట్లు

తే. లుట్టిపడ్డట్లు కట్టెదుట నూఁదినట్లు
తేజమొప్పఁగంగ నామ్రోల దివ్యవాణి
పూని సాక్షాత్కరించి సంపూర్ణదృష్టిఁ
జూచి యిట్లనిపల్కె మంజులముగాను.

ఉ. ఆటలు పాటలుం జదువు లద్భుతముల్ విననొప్పువాద్యముల్
సాటి తలంపరానిబలుసాములు మున్నగువిద్యలెల్ల నీ
కాటలుఁ బాటలయ్యె విను మన్నిఁటికిన్ మొఱుఁ గిష్టభంగి నా
చాటునఁ జాటుకారపదసాధుకవిత్వముఁ జెప్పు మింపుగన్.

వ. అని యానతిచ్చుజగన్మాతృకృపావలోకనసుశ్లోకుండనై యేనొక్క
శ్లోకంబు నాక్షణంబ నుడివితి నది యెట్టిదనిన

శ్లో. హంసాయ సత్త్వనిలయాయ సదాశ్రయాయ
నారాయణాయ నిఖిలాయ నిరాశ్రయాయ
సత్సంగ్రహాయ సుగుణాయ సదీశ్వరాయ
సంపూర్ణపుణ్యపతయే హరయే నమస్తే.

వ. ఈశ్లోకం బద్దేవియంగీకరించె నంత మేలుకాంచి యానందభరితుం
డనై నాఁటనుండి చంద్రానుగత యగుచంద్రికయుంబోలె నారా
యణాంకితంబైన కవిత్వతత్త్వజ్ఞానంబు గోచరంబయ్యె. దానికి ఫలం
బుగా గోపికావల్లభుని నుల్లంబున నిడుకొని

ఆ. పలుకఁగలిగె మొదల భాగవతార్థంబు
భర్త కృష్ణుఁ డయ్యె భాగ్య మొదవె

నమృతరసముఁ గోర నలరుచింతామణి
పాత్రి సంభవించు భంగినిపుడు.

షష్ఠస్కంధమంతయు నీతఁడు రచింపలేదనియు, శిథిలమైనప్రతిలో లభించిన కొన్నిపద్యములు పోతనవే యిందుఁ గవివేసికొనెననియు శైలిని బట్టివానిని గ్రహింపవచ్చు ననియుఁ గొందఱనుచున్నారు. ఆవిషయము నిదమిత్థమని నిర్ణయింపఁజాలము. అజామిళోపాఖ్యాన, చిత్రకేతూపాఖ్యానములలోఁ గొన్నిపద్యములు పోతనరచితములవంటివి గన్పట్టుచున్నవి. కాని మొత్తముమీఁద నధికభాగము సింగనకవిత్వమే.

సింగనకవిత్వమునుగూర్చి భాగవతపీఠికలో విపులమైన విమర్శనము కలదు. ఈతనియాంధ్రీకరణము మూలమునకు సరిగా లేక విరుద్ధముగాఁ గొన్నియెడల గొన్నిపట్టుల నతివ్యాఖ్యానముగాను నున్నదనియు, వ్యాకరణమంగీకరింపనిప్రయోగములు సమాసదోషములు నీతనికవిత్వమునం దచ్చటచ్చటఁ గన్పడుచున్నవనియు నైనను "కేవలకవిత్వమును బట్టిచూడ నితఁడు గంగనారయలకంటె నెక్కుడై పోతనవలె స్వకపోలకల్పితములగు వర్ణనములనుగూడఁ జేర్చి మధురముగాను మనోహరముగాను దనస్కంధమును దెలిఁగించినాఁడని చెప్పనొప్పును" అని పీఠికాకారు లభిప్రాయ మిచ్చియున్నారు.

కవిత్వశైలి తెలియుట కిదివఱకు వ్రాసినపద్యములే చాలియున్నను, మఱియుఁ గొన్నిపద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

ఆ. పద్మనయనుమీఁది భక్తియోగం బెల్ల
ముక్తియోగమనుచు మొదలెఱుంగు
వారివారి వారివారిఁ జేరిన వారి
తోవ దలఁపవలదు మాతలార.

చ. అరయఁగ నెల్లలోకములు నంకిలి నొంద మహార్ణవంబులోఁ
నొరగి నిమగ్నమైనధర నుద్ధతిఁ గొమ్మున నెత్తినట్టి యా
కిరిపతి యగ్నికల్పుఁ డురుశైలుఁడు నూర్జితమేదినీమనో
హరుఁడు కృపావిధేయుఁడు సదార్థ్యముల న్ననుఁ గాచుఁ గావుతన్.

ఉ. కందఁడు భీతిఁ గుందఁడు ప్రకంపము నొందఁడు పెద్దనిద్దురం
జెందఁడు తత్తఱింపఁడు విశేషముఁ దప్పఁడు వైష్ణవీజయా
నందపరైకవిద్యను మనంబున బాల్పుచుఁ నుండెఁ గాని, సం
క్రందనుఁ డానిశాచరునిగర్భములో హరిరక్షి తాంగుఁడై.

క. సతులెవ్వరు సుతులెవ్వరు
పతులెవ్వరు మిత్రశత్రుబంధుప్రియసం
గతులెవ్వరు సర్వాత్మక
గతుఁడై గుణసాక్షియైన ఘనుఁ డొక్కనికిన్.

ఈకవి కృత్యాదియందు స్వప్నకథఁ జెప్పియు సంస్కృతశ్లోకమును రచించియుఁ దిక్కనసోమయాజి ననుకరించియున్నాఁడు. ఈతని షష్ఠస్కంధము తక్కనభాగవతభాగమువలె లేదనికాఁబోలు హరిభట్టను కవులషష్ఠమును షష్ఠస్కంధమును మరల రచించియున్నారు. కాని వీరికంటె సింగన పూర్వుఁడగుటచేఁ గాఁబోలు నాతఁడురచించినషష్ఠస్కంధము భాగవతములో భాగముగాఁ దాళపత్రప్రతులలోను ముద్రితప్రతులలోను జేరినది. హరిభట్టు పోతనామాత్యునికంటె నిరువదియేండ్లు చిన్నవాఁడు. గంగన, సింగనలు తమస్కంధములను క్రీ.శ. ౧౫౧౦ ప్రాంతమున రచియించి యుందురు.

ఈసింగనకవి కువలయాశ్వచరిత్ర మనుప్రబంధమునుగూడ రచియించినట్లు కనుపట్టుచున్నది. అందలిపద్యములను బెదపాటిజగ్గనకవి తనప్రబంధరత్నాకరమున సమకూర్చియుంచినాఁడు. ఆగ్రంథ మిప్పు డెచ్చటను లభించుట లేదు. ప్రబంధరత్నాకరమునుండి గైకొని కొన్ని పద్యము లీక్రిందఁ బొందుపఱచుచున్నాఁడను.

ఉ. మీఱినభద్రనాగములమీఁదికి దాఁటి తదీయకుంభముల్
చూఱలువట్టి కేసరికిశోరనఖావళినుండి రాలి సాం
పారినమౌక్తికంబులు ప్రియంబున నేరి కిరాతబాలికల్
గీరనగింజ లాడుదురు గేలిఁ దలిర్పఁగఁ బక్కణంబులన్.

సీ. తిమిరమంతయుఁ బాసి దిక్కులు తెలివొందె
నమృతాంశువులు సెందె నభ్రవీథి

కువలయానందమై కోరిక లిగురొత్తె
విబుధులమదిలోన వెట్ట లోదివె
నక్తంచరశ్రేణి నయమెల్ల దిగజాఱె
జిత్తజోల్లాసంబు చెలువు మిగిలె
దివ్యసీరంబుల తేట లల్లనఁ బర్వె
భువనాధిపతి వేడ్కఁ బొంగి పొరలె

గీ. దీపికాజాల మెల్ల చిత్రించినట్టి
రమణఁ దోఁపంగ దృక్చకోరములు మెచ్చ
నమిత తేజోవిరాజమానాత్ముఁడైన
పుత్త్రచంద్రుండు జననంబు వొందునపుడు

ఉ. వైరితమ స్తమంబడఁగ వంశమహార్ణవ ముబ్బ బాంధవో
ద్ధారచకోరసంతతి ముదంబునఁ దేలఁగ సర్థివర్గస
త్కైరవజాత మెల్లను వికాసముఁ బొందఁగఁ బుత్త్రచంద్రజ
న్మారవచంద్రికానుభవ మబ్బినచిత్తము మిన్ను ముట్టదే?

శా. ఆదిబ్రహ్మముఖాళిచాలక విహారార్థప్రయత్నంబుతో
వేదంబుల్ భువి ధర్మపోషణకునై విఖ్యాతిగాఁ బుట్టెనో
కాదే నిట్టిమహత్త్వ మన్యులయెడం గానంబునాఁ బొల్తురా
భూదేవోత్తము లప్పురంబున మహాపుణ్యప్రభావంబులన్.

సీ. తనజన్మ మప్పులఁ దలమున్క లని రోసి
పులిన మీపొంకంబు బొందె నొక్కొ?
పరికింపఁ దనపట్టు తిరిగాడిపా టని
పెన్నిధి సుడిమూర్తి బెరసె నొక్కొ?
బ్రతుకెల్ల గతి బట్టబయలాయె నని చూచి
గగన మీపుట్టువు గనియె నొక్కొ?
పనిలేక పాసెడి పాపంబుఁ దలపోసి
జక్క వలీరీతి కెక్కె నొక్కొ?

గీ. యనఁగ లలన జఘన మంబుజముఖి నాభి
చామ నడుము బాల చన్నుదోయి

మహితరుచులఁ దెగడి మానవపతికన్ను
దోయిపండువగుచు దొరసె నంత.

సీ. తమచూపు లొగిఁ శాంఫతతులపైఁ బూనిన
భావజుకరవాలభాతు లనఁగఁ
దమకుచుల్ యువమృగేంద్రములకై తీర్చిన
మరునసమానంపు టురు లనంగఁ
దమహాసములు విటోత్కరమానములఁ బట్టు
వలరాజుపూవులవల లనంగఁ
దమకాంతి పురుషులఁ దాపంబు నొందించు
రతిరాజుమోహనరస మనంగ

గీ. జలజకాహళకదళికాఫులినగహన
కోకబిసశంఖచంద్రాళికులముఁ దెగడు
పాదజంఘోరుకటిమధ్యపటుకుచోరు
బాహుగళవక్త్రకచముల పుణ్యసతులు.

---

# 8. ఈశ్వరఫణిభట్టు

ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; గార్గ్యస గోత్రుఁడు; ఈశ్వరభట్టునకును రామమ్మకును బుత్త్రుఁడు; వెంగళార్య కొండమాంబలకుఁ బౌత్రుఁడు; ఫణిభట్ట లచ్చాంబలకుఁ బ్రపౌత్రుఁడు. ఇతనికి ఫణిపతియని నామాంతరము కలదు. ఇతని గృహనామము "ఈశ్వర".

ఈకవి పరతత్త్వరసాయన మను నైదాశ్వాసముల వేదాంత పద్య ప్రబంధమును రచియించి తనగురువైన సదానందావధూత కంకితము చేసెను. అం దీయనవంశావళి నీక్రిందిపద్యములలోఁ జెప్పుకొని యున్నాఁడు.

సీ. సురుచిరాపస్తంబసూత్రుఁ డీశ్వరవంశ
పాత్రుండు గార్గ్యసగోత్రుఁ డఖిల
వేదశాస్త్రపురాణవిఖ్యాతుఁ డభినవ
వ్యాసుండు సద్యశోభాసురుండు
ఫణిపతిభట్టనఁ బ్రఖ్యాతుఁ డతనికి
లక్ష్మమ్మ యను శుభలక్షణాంగి
పరమపాతివ్రత్యగరిమచే గిరిజాత
యన నుతిఁ గన్నయయ్యతివ పత్ని

గీ. వారి కుదయించి రఖిలవిద్యారసజ్ఞు
లైన వెంగళభట్టు, సూరార్యుఁ, డనఘుఁ
డైనగరుడాద్రిభట్టన నాత్రిమూర్తు
లనఁ బూర్వజుఁ డగు వెంగనార్యవరుఁడు.

క. ఆతనిసతి యన్నపాన
వ్రతయుక్తి హితార్థిబంధువర్గసమగ్ర
ద్యుతి పత్యనురక్తియుఁ గల
యతిసద్గుణ కొండమాంబ యలరు ధరిత్రిన్.

క. ఆదంపతులకు సుతుఁడై
మేదిని వెలుఁగొందె విబుధమిత్రుం డనఁగా
వేదవిదుం డీశ్వరభ
ట్టాదరమున నరణులందు నగ్నియ పోలెన్.

గీ. అతని కొసఁగెను దోర్బాలచతురుఁ డనఘుఁ
డమలవాధూలగోత్రతిరుమలభట్టు
అఖిలవిధుఁ డలలక్ష్మమ్మయందుఁ గనిన
కన్య రామమ్మ నధికసౌజన్య నెలమి.

క. ఆమిథునమునకుఁ బుట్టిరి
మేము త్రిమూర్తులను బోలి నిల మువ్వుర ము
ద్దామయశుఁడు గొండయ శో
భామణి నారాయణయ్య ఫణిపతి యనఁగన్.

ఈకవికాలమును నివాసమును తెలిసికొనుట కాధారములు గ్రంథములోఁ గన్పట్టలేదు. పూర్వకవులను స్తుతించుటలో నన్నయను తిక్కనను మాత్రమే నుతించియుండుటచే తిక్కనకుఁ దరువాతివాఁడ నుట మాత్రము స్పష్టము. ఆంధ్రభాగవతమునందలి సప్తమస్కంధము నందలి ప్రహ్లాదచరిత్రమున పోతనమహాకవి రచించిన "కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే పవనగుంభితచర్మభస్త్రిగాక" ఇత్యాది పద్యములవంటి పద్యములు కొన్ని యీగ్రంథమునఁ గానవచ్చుటచే నీతఁడు పోతనకుఁ దరువాతఁ బదునేనవశతాబ్ది చివరభాగమునందుండి యుండు ననియు; మనుచరిత్రాదిధోరణి దీనిలో లేదు గాన నీతఁ డంతకంటె ముందికి దిగఁ డనియు పరతత్త్వరసాయన ముద్రితప్రతిపీఠికలో బ్ర. శ్రీ వేంకటపతి శాస్త్రిగారు వ్రాసియున్నారు. అనుకరణము నాధారముగాఁ గొని కాలనిర్ణయము సేయఁ గూడంగ రాదనియు నది ప్రమాదభూయిష్ఠ మనియు నాయభిమతము. కొన్నియెడల నది సత్యమును గావచ్చును. బ్ర. శ్రీ వీరేశలింగము పంతులుగా రీకవిని బూర్వకవులలోఁ జేర్చియున్నారు. పీఠికాకారుల యభిప్రాయానుసారముగా నీతఁడు ని బ్రస్తుతము క్రీ.శ. ౧౫౫౦-౧౬౦౦ ప్రాంతమువాఁడని నిర్ణయింతము. ఇతఁడు తనగురువగు సదానందయతికిని పరబ్రహ్మమునకు నభేదము గల్పించి కృత్యాది పద్యమును మఱికొన్ని తావుల ననేకపద్యములను రచించియున్నాఁడు. వచ్చినట్టి కృత్యాది పద్యము నిట నుదాహరించుచున్నాఁడను.

శా. శ్రీకైవల్యరమావివాహమున కౌచిత్యంపుభూషాళిగా
లోకంబుల్ పదమస్తకావధి సమాలోక్యంబులై మించు వి
శ్వాకారస్థితిఁ బొల్చు బ్రహ్మము దయాస్వాంతుండు నిత్యంబు దా
నాకిష్టార్థ మొసంగుఁ గావుత సదానందాదిదేవుం డిలన్.

ఈతఁడు రచించిన పరతత్త్వరసాయనమందలికథ వేదాంతవిషయమైనను, దీని నీకవి ప్రబంధముగాఁ జేయ సంకల్పించుకొని సందర్భోచితముగా పట్టణారణ్యాది వర్ణనములఁ గావించియున్నాఁడు. మోక్షసాధనము నుపదేశింపుమని ధర్మరాజు భీష్మునడుగఁగా నాతఁడు హంసనత్కుమారసంవాద మను నితిహాసమును ధర్మరాజునకు బోధించె నని సూ

తుఁడు శౌనకాదులకుఁజెప్పినట్లున్న భారతమందలి కథ నాధారముగాఁ గొని యీకవి యీగ్రంథమును రచించెను. భారతమున ననుశాసనిక పర్వమున నీ హరసనత్కుమార సంవాదమున్నది. సంస్కృతభారతమున దక్షిణహిందూదేశపు ప్రతులలోమాత్ర మీకథకలదనియు, నుత్తర హిందూదేశపు ప్రతులలో నీకథ లేదనియు నందుచే నీకథ నెవ్వరో రచియించి భారతమునఁ జేర్చియుందురని తలంపవలసియున్నదనియు నీ పరతత్త్వరసాయన పీఠికలో శ్రీకోరాడ రామకృష్ణయ్య పండితులు వ్రాసియున్నారు. ఈ హరసనత్కుమారసంవాదమును దిక్కనసోమయాజి యాంధ్రీకరించియున్నాఁడు.

ఈపరతత్త్వరసాయనమున కర్మయోగ, సాంఖ్యయోగ, యోగతంత్ర, రాజయోగవిషయములను గురువు తన కుపదేశించిన విధమునఁ గవి వివరముగా సుబోధక మగునట్లు రచియించినాఁడు. ఇం దుపదేశింపఁదలంచినది కేవలాధ్యాత్మిక విషయమే యైనను, నచ్చటచ్చట శ్రీహరి స్మరణభజనాదులు మోక్షసాధనములని, భాగవతమునందువలెనే ఇందును భక్తియోగమును గవి బోధించియున్నాఁడు.

ఈతని కవిత్వమునం దచ్చటచ్చట వ్యాకరణ మంగీకరింపనిప్రయోగములు గన్పట్టుచున్నవి. అందుఁ గొన్ని బాలురకుఁగూడఁ దెలియునట్టి "పదాదియందు వు, వూ, వొ, వో లుండవు" అనుసూత్రములకు విరుద్ధముగావొక, వక, యిత్యాదిప్రయోగములుకలవు. కవియజ్ఞానముచే వీనిని ప్రయోగించెనని చెప్ప వలనుపడదు. పండితలోకమునఁ బ్రచారములో నుండుటవలననివి ప్రయోగార్హములుగాఁ దలంచెనేమో. ఈప్రయోగములు యతిస్థానములందుండుటచే లేఖక ముద్రాపకదోషములుగాఁ దలంపరాదు.

గ్రంథస్థవిషయము కఠినమైనదైనను గవి సులభమైన పదములలో భావమును జక్కగాఁ బ్రదర్శించినాఁడు. ఈతనికవిత్వధోరణి తెలియుటకై కొన్నిపద్యముల నుదాహరించి యీతనిచరిత్రమును ముగించుచున్నాఁడను.

మ. చిద్రూపంబు నిర్మలంబు మహావిభవమై చిన్మాత్రమై సత్యమై
పరమై సంతతసంయమీశ్వరమనఃపాత్రైకమై నిత్యమై
దురితారణ్యదవార్చిరగ్నియై మదిని భక్తుల్గోరు నర్థంబునై
స్థిరభావంబుల నొప్పుచు బ్రహ్మము మదిన్ సేవింతుఁ దత్త్వార్థినై ౧ఆ

ఉ. మోహమహాగ్రహంబు వడి ముజ్జగముల్ కబళింప నెవ్వరున్
సాహసవృత్తి దీనికొన రసాధ్యము గావున దాని నోర్చు బ్రి
జ్ఞాహితరాగవర్జనతఁ గన్పడు నిర్మమతావిభూతిచే
నీహ దొలంగి సద్గురుమహేశ్వరబోధితమాంత్రికుం డిలన్. ౨ఆ

ఉ. నేనను మాట నేనను ననిత్యశరీరము దోఁచు భ్రాంతిచే ౩ఆ
నేనను నేన నేనని నిర్మలనిత్యతఁ గల్గుఁ గావునన్
నేనన దాని కాది యగు నేఁగద యాత్మన దానిఁ గన్గొనం
గాని యొనర్చు యోగమునఁ బొందఁగవచ్చు సమాధిసౌఖ్యముల్.

చ. అలయక నాసికాగ్రమున నంటఁగఁ జూపులు గూర్చి ధ్యానమం
డలగతచిత్ప్రకాశ మనటం గని చిత్తము దద్గతంబుగా
నిలిపి నిరంకుశక్రమవినిగ్గత వాయునిరోధనంబునం
దొలఁగక యోగి నొందుఁ బరితోషమహామృత వార్ధిమగ్నతన్. ౪ఆ

శా. భూమీదేవోత్తముఁడై నిజాత్మరతుఁడై పూర్ణానుభావుండునై
మోదంబొప్ప సమస్తుఁడై యకృతియై ముక్తాశ్రమాచారుఁడై
భేదాభేదము లేనివర్తనలచేఁ బెంపొందియుం బూజ్యుఁడై
చోదల్ వాసి సదావధూతగతిఁ దోఁచున్ సద్గురుం డెల్లెడన్. ౫ఆ.

సదానందశతకమునురచించిన సదానందవధూత యొకఁడున్నాఁడు. కాని యాతఁ డీఫణిభట్టునకు గురువైన సదానందుఁడగునో కాదో చెప్పఁ జాలము. ఆతఁడే యాతఁడైనను, శతకకర్త కాలమును నిర్ణయించుటకుఁ దగిన యాధారములును దొరకలేదు.

ఈకవి తనతండ్రి యీశ్వరభట్టనియు నతఁడు వేదవిదుఁడనియుఁ జెప్పియున్నాఁడు. మల్యాల గుండయ దండనాయకునిభార్య కుప్పాంబిక

వ్రాయించిన శా. శ. ౧౫౯౮ వ సంవత్సరపు శాసనకవి యీశ్వర భట్టోపాధ్యాయులు (గోనబుద్ధభూపతిచరిత్రమును జూడుము.) అతఁడు పదక్రమయుత యజుర్వేదపారగుఁడు. శబ్దవిద్యావిశారదుఁడు. కవీశ్వరుఁడు. పణిభట్టు తనతండ్రిని గవియనిచెప్పలేదు. అందుచే నాతఁడే యీతఁడని చెప్పుట కవకాశము లేదు.

ఈకవి కృత్యాదియందు రచించిన విఘ్నేశ్వరస్తవమును అల్లసానిపెద్దనకవి రచించిన వినాయకస్తుతియు నించుక పోలికకలిగియున్నవి. అవి యీక్రింద వ్రాయుచున్నాఁడను.

శా. హస్తం బోక్కటఁ బట్టి యొక్కకుచ మన్యం బాత్మతుండాగ్రవి
న్యస్తప్రోక్షిమ దుగ్ధముల్ గొనుచు దివ్యామోదమా మోదకం
బస్తోకాకృతి మెక్కుచున్ జననినాహ్లాదించు విఘ్నేశుఁ డీ
ప్రస్తోతవ్యమదీయకావ్యమున కాపాదించు నిర్విఘ్నమున్.

పరతత్త్వరసాయనము.

ఉ. అంకముఁజేరి శైలతనయా స్తనదుగ్ధము లానువేళ బా
ల్యాంకవిచేష్టఁ దుండమున నవ్వలిచ న్గబళింపఁబోయి యా
వంక కుచంబుగాన కహివల్లభహారముగాంచి వే మృణా
ళాంకురశంక నంటెడు గజాస్యుని గొల్తు నభీష్టసిద్ధికిన్.

మనుచరిత్రము.

ఈపద్యములను బట్టియు వేదాంతగ్రంథమునంబుఁ బ్రబంధవర్ణనములను జేయుటంబట్టియు, నీతఁడలసానిపెద్దన కించుక తరువాతివాఁడేమోయని యనుమానము కలుగుచున్నది.

సంస్కృతభారతమునందలి శ్లోకములును దిక్కనసోమయాజి యాంధ్రీకరణపద్యములును పరతత్త్వరసాయనమందలి పద్యములు నేకఘట్టములోనివి. సమకూర్చి యీగ్రంథము ద్రితప్రతి పీఠికలో నిచ్చియున్నారు. గ్రంథవిస్తరభీతిచే నిందవి యుదాహరింపలేదు.

ఇతనిగురుఁడైన సదానందయోగి తనయింటికివచ్చి తనకుఁబ్రహ్మోపదేశమును జేసెనని యీక్రింది పద్యమునను దానితరువాతి గద్యపద్యములలోను జెప్పియున్నారు.

సీ. తనమనోహరమూర్తి ధావళధళ్యంబుల
దిక్కామినీదేహదీప్తిఁ బెనుపఁ
దనముఖచంద్రికాతతి దర్శనాగత
జనలోచనచకోరచయముఁ దనుపఁ
దనయానపదరేణు వనుగతాఖిలమాన
వావళికల్మషవర్గ మడఁపఁ
దనకటాక్షేక్షణ ఘనసుధాధారాళి
భక్తాఘపరితాపపటలి నాఁపఁ
తే. తనదుసల్లాపసుచి పార్శ్వజనుల శ్రుతుల
దప్పి దీర్పంగ వెంచేసెఁ దగ మదీయ
మందిరంబున కల సదానంద మౌని
విభుఁడు మత్పూర్వభవ పుణ్యవిభవమునను.

---

# 88 సదానందయోగి

"నవ్యతరభోగి శ్రీసదానందయోగి" యనుమకుటముతో నొక శతకమును సదానందయోగి యనుకవి రచియించియున్నాఁడు ఇతనికాలముగాని నివాసముగాని యేమియుఁ దెలియవు. పరతత్త్వరసాయనమను వేదాంతగ్రంథమును రచియించిన ఈశ్వరఫణిభట్టు తనగురువు సదానందమౌని యని తనగ్రంథమునఁ జెప్పుకొని యాగ్రంథము నాతనికే కృతియిచ్చియున్నాఁడు. పరతత్త్వరసాయనమందలివర్ణనమును బట్టిచూచి నచో నాసదానందయతి తత్త్వవేత్తయు వేదాంతవిద్యాపారంగతుఁడని యుఁ గన్పట్టుచున్నది. కాని యాతఁడు కవియనిగాని కవిత్వముచెప్పఁగల వాఁడనికాని స్ఫురించుటలేదు. శతకకవులచరిత్రకారులగు శ్రీవంగూరి సుబ్బారావుగారు, ఫణిభట్టుగురువు శతకకర్తయగు సదానందయోగి యై యుండునని యనుమానించినారు. ఈతనికాలము నాకు సరిగాఁ దెలియరాకున్నను. నీతఁడే ఫణిభట్టుగురువని నిశ్చయించుటకుఁ దగినయాధారములు నాకులభింపకున్నను భావిపరిశోధకుల కనుకూలముగానుండునని

తలంచి ఫణిభట్టునకుఁ దరువాత నీతనిఁ జేర్చితిని. ఇతఁడురచించినశతకము నాకు లభింపలేదు. ఇతనిశైలికై శతకకవులచరిత్రము నందిచ్చిన పద్యములనైదిటి నీక్రింద నిచ్చుచున్నాఁడను.

గీ. శ్రీమహోన్నత విజ్ఞానసిద్ధి నొసఁగు
సద్గురుస్వామి చరణాబ్జములు దలఁచి
సకలతత్త్వార్థములనెల్ల సంగ్రహించి
గీతశతకంబు రచియింతుఁ గీర్తి వెలయ. ౧

గీ. బట్టబయలైన యాపరబ్రహ్మమహిమ
దేశికస్వామికృపఁగాని తెలియరాదు
యెన్నిచదువులు చదివిన నేమిఫలము... నవ్య ౪

గీ. శివుఁడు జీవుఁడు రెండువస్తువులటంచు
నెంచు నెంచినసాయుజ్యమెట్లుగల్గు
జీవశివభేద మెన్నఁడు సేయరాదు... నవ్య ౧౩

గీ. తన్నుఁదెలిసిన జగమెల్ల తానెయయిన
మర్మ మెఱుఁగఁగ జాలని మందమతులు
గడువఁజాలరు సంసారఘనపయోధి... నవ్య ౬౦

గీ. చుట్టములు తల్లిదండ్రులు సుతులు సతులు
తాను బోయ్యేటిగతులకుఁ దగిలిరారు
వారు త్రోవకువచ్చేటివారు గారు... నవ్య ౯౭

---

## ౪౯. పెనుమత్స వెంకటాద్రి

ఇతఁడు క్షత్రియుఁడు, ధనంజయగోత్రుఁడు. తండ్రి పద్మరాజు; తల్లి గన్నమాంబ; తాత తెలగరాజు; సర్వమ పితామహి.

ఈకవి "ఇందుమతీకళ్యాణ" మనుప్రబంధమును రచియించినట్లు బమ్మెరకేసకవి మల్లకవులు తాము రచించిన విష్ణుభజనానంద మనుగ్రంథమునఁ గృత్యాదియం దీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నారు.

సీ. ర్యాలి కేశవదేవరమణీయ పదపద్మ
మహితభృంగీ భవన్మానసుండు
నాటకాలంకారనైపుణీ రచితగీ
ర్వాణాంధ్ర కవితాపవర్తనుండు
* * *

గీ. చెలఁగ గీర్తిలతాసముజ్జ్వల దిగంత
రాంబరుండు పద్మభూప జంభారికూర్మి
సుతుఁడు పెనుమెచ్చ వేంకటక్షితివరుండు
సకలబుధులందుఁ గల్పవృక్షం బనంగ.

గీ. ఇందుమతీ కల్యాణము
పొందుగ రచియించె సకలబుధులకు శ్రోత్రా
నందంబుగఁ బద్మప్రభు
నందనుఁడౌ వేంకటాద్రి నరపతులెంచగ

ర్యాలి గ్రామము గోదావరీమండలములో రాజోలుతాలూకా యందు గౌతమీనదీతీరమున నున్నది. ఇందుఁగేశవస్వామికలఁడు ఈవిగ్రహముమిగుల రమణీయమైనది. దీనిని పేరూరుద్రావిడులు, దక్షిణదేశము నుండి యాంధ్రదేశమునకు వలస వచ్చినప్పు డిక్కడకుఁదీసికొని వచ్చి రని చెప్పుదురు.

ఈకవిసోదరుఁడైన గోపరాజు అంతర్వేదిమాహాత్మ్యమును రచియించియుండెను. వెంకటాద్రికవి రచించిన, ఇందుమతీకల్యాణ మిప్పు డెచ్చటను గానవచ్చుటలేదు. ఈతనికాల నిర్ణయమునకుఁ దగినసాధనములు లభింపలేను. కాని కేసకవిమల్లకవులు విష్ణుభజనానందమున నిచ్చిన వంశవర్ణనమును బట్టియీకవి క్రీ. శ. ౧౫౦౦ ప్రాంతమువాఁ డనిచెప్పదగి యున్నది ఇతఁడు ర్యాలినివాసముగా నుండెడివాఁడు.

# 90. పెనుమత్స గోపరాజుకవి

ఇతఁడు క్షత్రియుఁడు ధనంజయగోత్రుఁడు. పద్మరాజుగన్నమాంమాంబలపుత్రుఁడు; తెలగరాజు సర్వమలకుఁబౌత్రుఁడు. ఇందుమతీకళ్యాణమును రచించిన వెంకటాద్రికవికి సోదరుఁడు.

ఈకవి యంతర్వేది మాహాత్మ్యము మొదలగుకృతులను రచించి ర్యాలికేశవస్వామి కంకితముచేసినట్లు విష్ణుభజనానంద కృత్యాదిని కేసకవి మల్లకవు లీక్రిందిపద్యములోఁ జెప్పియున్నారు

సీ. మహిమ నంతర్వేది మాహాత్మ్యమాది యౌ
కృతులిచ్చె ర్యాలికేశవునకుఁ
గ్రమ మొప్ప భూసురోత్తములకుఁ దగనిచ్చె
వర్షాశనంబుల వ్యాదిగాఁగ
* *

గీ. ప్రౌఢి నొనరించెఁ బెనుమెత్స పద్మనాభు
తనయుఁడైనట్టి గోపభూధవ వరుండు.

ఈతఁడు రచించిన కృతులిప్పుడెచ్చటను గానవచ్చుట లేదు. ఇతని రెండవకుమారుఁడైన అనంతరాజు అంబరీషచరిత్రాది కృతులను గృతినందినట్లును ర్యాలికేశవస్వామికి గోపురప్రాకారాదులను గట్టించినట్లును రచింపఁబడిన పద్యములను కేసకవిచారిత్రమునం దుదాహరించినాఁడను.

ఈకవినివాసము ర్యాలియేయై యుండును. ఇతఁడు క్రీ శ. ౧౫౦౦ ప్రాంతమువాఁడు

# ౯ – అడిదము నీలాద్రికవి

ఈతఁడారువేలనియోగ బ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. భారద్వాజగోత్రుఁడు

ఈ కవినిగూర్చి శ్రీ అడిదము రామారావు, యమ్. ఎ. గారు. అడిదము సూరకవి చారిత్రమునందిట్లు వ్రాసియున్నారు.

"ఆంధ్రదేశమునఁ గవితావృత్తిచేఁ బ్రఖ్యాతిగాంచిన నియోగి కుటుంబములలో నడిదమువారి కుటుంబమొకటి యని చెప్పనగును. తొలుదొల్త వీరియింటిపేరు మోదుకూరువారు" ఈకుటుంబమునఁగొందరు ప్రసిద్ధకవులు తమగ్రంథములను నేనుంగులపైని వేసికొని దేశాటనముచేయుచు, రాజాస్థానములనుదర్శించి జీవయాత్ర గడపుచువచ్చుట చేత గొంతకాలము వీరికి "గ్రంథవారణము" వారని యు గృహనామము గలిగియుండెడిది. మరికొంతకాలమునకు బిదప నీవంశజులలో నొకఁడగు నీలాద్రికవి కళింగరాజులలో నొకనియొద్ద నాస్థానకవిగానుండి యొకా నొకసమయమునఁ దన ప్రభువుతోఁగూడ యుద్ధమునకు వెడలెను. బ్రాహ్మణుఁడయ్యును, నపరద్రోణాచార్యునివగిది నీలాద్రికవి యుద్ధరంగమున వెల్లడించిన సాహసపరాక్రమంబులకు రాజెంతయు నాశ్చర్యమునొంది నీలాద్రికవి నుచితరీతిని గౌరవింప సంకల్పించుకొనెను. కవియు నాయుద్ధమునఁ దన మేలిక గాంచినవిజయము నగ్గడించుచు "రణరంగవిజయ" మనుపేర నొక యాంధ్రప్రబంధమును రచించి రాజున కంకితమొనర్చెను. నిండుకొల్వున రాజీగ్రంథమును సాంతముగ విని యానందించికవికి ద్రవ్యరూపమగు పసదన మొసఁగుటయేగాక నీలాద్రి యుద్ధరంగమున వెల్లడించిన ధైర్యసాహసములకుఁ దగిన పారితోషక మనియొంచి యొక గరవాలము (అడిదము)ను గానుకగా నొసంగికవిని గౌరవించెను. నాఁటనుండియు నీవంశజులకు అడిదము వారని యింటి పేరు కలిగెను

మీఁదియంశములను సప్రమాణముగఁ దెలుపుటకుఁ దగినయాధారములు గానరాకున్నను సంప్రదాయసిద్ధముగ వచ్చుచున్న విషయములగుటచే నిందుఁబొందుపరుపఁబడినవి."

*　　*　　*

ఈవాక్యములపై అడిదముసూరకవి చారిత్రపీఠికలో శ్రీబురాశేషగిరిరావు యమ్. ఎ. గారిట్లువ్రాసియున్నారు.

*　　*　　*

ఈసూరకవి జీవితమందలి యూహలనుగూర్చి అభిప్రాయభేదముల కవకాశములేకపోలేదు. ఉదాహరణము:— "అడిదము" అను గృహనామమును గురించినయూహ శ్రీరామారావుపంతులుగారి వాక్యము లీసందర్భమున సమంజసమే యైనను కేవలము లోకవాడుక ననుసరించి యున్నది. 'ఆడిదము' అనునది పౌరుషనామమనుట లోకవాడుక. విమర్శించిచూడఁగా శాసనములం దడిదము రాజను మండలము పూర్వముండినట్లు కనఁబడుచున్నది. అడిదమను గ్రామము గలదు. సాధారణముగా తెనుఁగుబ్రాహ్మణుల గృహనామములు గ్రామనామములై యుండుటవలన నీయడిద మనునదియు గ్రామనామమే యైయుండును. కాని నీలాద్రికవినాఁడది యాతని పరాక్రమాతిశయముల వలన నన్వర్థనామమైయుండును. గ్రంథవారణ మనునది పామరులనోటబడి రూపుమారిన గ్రంథవారణయనుబిరుదము. ఇది నీలాద్రికవికి సేనాధిపతిత్వము వలన చెల్లియుండును. అతనితరువాతి వారు గ్రంథవారణమువారై యుందురు. అట్లేగోదావరి మండలమందలి మోదుకూరు కాపురము వచ్చిన యడిదము వారికుటుంబము మొదటమోదుకూరి యడిదమువారయి రానురాను మోదుకూరు వారయియుందురు. ఇట్లుగృహనామములు మారుట కెన్నియోనిదర్శనములు కలవు. కాని సూరకవిగారి కుటుంబము వారుమాత్రము నీలాద్రికవిగారి కోవలోని వారే.

ఈనీలాద్రి కవినేలిన పూసపాటిప్రభువు రాచిరాజుగారో ఆతని కుమారుఁడగు తమ్మిరాజుగారో కావలెను.

ఇందుముఖ్యముగా 'వసిష్ఠగోత్రావనీశకోటికిమేటికిరీటి విభుండు" గానుతింపఁబడిన శ్రీతమ్మిరాజ మహామండలేశ్వరుని కొలువుననే సన్మానితుడై పరాక్రమముచూపి యడిదము నీలాద్రికవి 'యడిదము'ను గానుకగాఁ గొనుటయు రణరంగవిజయకావ్యమును (తనయేలిక విజయమునుగూర్చి) రచించుటయు జరిగియుండునని నాయూహ. శ్రీమన్మహా

మండలేశ్వరమహామండల రాయమన్నసుల్తాన్ శ్రీపూసపాటి రాచిరాజయ్యదేవ మహారాజులుంగారి కుమారుడగు శ్రీతమ్మిరాజులుంగారు "స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు వేయిన్నిమున్నూటయునప్పైయగునా...యన్ తమపూర్వస్థానమైన బెజవాడకు తమబంధువులైన సూర్యసోమవంశపురాజులున్ను తామున్ను వచ్చిఅక్కడయింద్రకీలాద్రియందున పాండవులగుళ్ళ దక్షిణభాగమందు కృష్ణవేణీ మల్లిఖార్జున నరసింహులు సాక్షిగాను విజయశాసన శిలాస్తంభంబు వేయించిరి.

అనగా క్రీ.శ. ౧౩౫౫ సం॥ ప్రాంతమున నీయఫణిదముసీలాద్రి కవి పూసపాటిభూపతుల సన్మానమునకు పాత్రుడైన పోటరియు, కవియునైన తనయేలికయగు తమ్మిరాజమహామండలేశ్వరుని విజయముల నుగ్గడించుచు "రణరంగవిజయ కావ్యము"ను రచియించి యుండెను. పూసపాటిభూపతులు కృతిసందిన నవభారతాది గ్రంథములువలె నీరణరంగవిజయమును నామావశిష్టమై పోయినది. కాని యీతమ్మిరాజుగారినిగూర్చిమాత్రము చక్కనిపద్యములు గలవు. అందుఁగొన్నియైనను రణరంగవిజయములోనివై యుండవలెను. (సూరకవి తన యేలికను గూర్చిచెప్పిన పద్యములన్నీ భట్టుపద్యములైనవి) కాన నుదాహరణము నకై కొన్ని యీక్రిందచేర్చఁబడినవి.

సీ. హేమాచలముదాఁక నేకచక్రంబుగా
భువినేలె మీతాత బుద్ధవర్మ
మీతాత గురియించె మెరసి మాధవవర్మ
కరిమచే బెజవాడఁ గనకవృష్టి
పాండ్యకేకయచోళ పరవీరనృపతులఁ
దెగటార్చె మీతాత దేవవర్మ
పిడుగుముత్తునియగా వడినేసె మీతాత
భీకరంబుగ చిక్కభీమనృపతి
చండవిక్రమ యినవంశజలధిచంద్ర
బాపుమగధీర రణరంగ భైరవాంక

పోసఁగ నెవ్వరు నీసాటి పూసపాటి
పగర కనుదిమ్మ రాచభూధవునితిమ్మ.

మ. అతిశౌర్యుండగు పూసపాటి కులరాజాధీశు తమ్మయ్య కు
న్నతిగావింపుచు నాశ్రయించి రిలవర్ణాటీ పరిచ్ఛేది శౌ
క్తికకోటి ప్రభులాత్మ బాంధవతనో గెల్వంగ లేకో మహో
చతురుండంచునో షట్ఖ్వగ్నిశశభృచ్ఛాకాబ్దకాలంబునన్
(శా. శ. ౧౩౮౦ క్రీ. శ. ౧౪౫౮)

ఉ. కొండలురాజు లప్పనము కొమ్మనియయ్యఁగ బంధువర్గమై
కొండలు గొల్వఁ బేరలిడి కొండలు మొక్కఁగ నూడిగంబులన్
ముందటఁ గొండలుండిరుదు మ్రోవగ రాజులపూజలింగమై
యందునమించె రాచమనుజాధిపుతమ్మన రాజమాత్రుఁడే.

సీ. మెండెండరాజుల గుండెలో గాలాము
విరసించురాజుల వెన్నుతరటు
కలహించురాజుల కడుపులోపల కత్తి
గర్వించురాజుల కాలయముఁడు
మారొడ్డన్నరాజుల మత్తేభసింహంబు
మదవైరిరాజుల మగలమగఁడు
క్రోధించురాజుల కొనమీసముల మిండ
నిరసించురాజుల నెత్తిపిడుగు
సకలసౌజన్యరాజన్య చక్రవర్తి
రాజుకబళేశ్వరస్వామి రాజ్యధుర్య
భూసురారామ తగువాటి పూసపాటి
రాచవిభుతిమ్మవుద్దండ రాచమూన.

(ఇవి భట్టుపద్యములు పాఠములు వికృతములై యున్నవి. కాని తిమ్మరాజు మహామండలేశ్వరుని వనుటస్పష్టము).

ఈసీలాదికవి తరువాతి వంశవృక్షమును అడిదము సూరకవి చరిత్రయందిచ్చియున్నాఁడను. పూసపాటి తమ్మిరాజునుగూర్చి పూసపాటితమ్మభూపాలుని చరిత్రమునందు గొంతవ్రాసియున్నాఁడను.

# 92 మాడయకవి

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; సర్వాయ రాచమాంబలకుఁ బుత్రుఁడు.

ఈకవి మైరావణచరిత్ర మను మూఁడాశ్వాసముల పద్యకావ్యమును రచియించి లేఖళ్ళగోపమంత్రి కంకితముచేసెను. కృతిపతి తనను గూర్చి పలికినట్లుగాఁ గవి రచించిన యీక్రింది పద్యములవలనఁ గవిసామర్థ్యమును గవివృత్తాంతమును దెలియవచ్చుచున్నవి.

క. సర్వజ్ఞ పాదసేవక !
సర్వాగమ శబ్దశాస్త్రచతుర వివేకా !
సర్వాయమంత్రి తనూభవ
సర్వేశ్వర మాడసుకవి ! సన్నుతచరితా !

సీ. మెప్పించినాఁడవు మెఱవడిఁ గర్ణాట
నరనాయకుని వీరనారసింహు
ఘట్టించినాఁడవు తస్కరకవిరాజుఁ
గోటసింగనమంత్రి కొలువులోనఁ
గాంచినాఁడవు కనకాంచనా భరణంబు
లేపార నందాపురీశుచేత
నందినాఁడవు నుత్తమాశ్వద్వయంబును
కిమిడి భూమండలరమణుచేత
నవమతిస్ఫూర్తిఁ గ్రోడించినాఁడ వఖిల
కావ్యలక్షణలక్ష్య సాగరము నెరయ
నిన్ను వేర్వేర నింక వర్ణింపనేల
పోడ వన్నింట సర్వాయమాడసుకవి.

క. నీతండ్రి సర్వధీమణి
నీతల్లి దయావిశుద్ధనియ మాదరణ
ఖ్యాతిని భూదేవికి నెన
యాతతమతి యైన రాచమాంబ ధరిత్రిన్.

క. నీయగ్రజుండు దక్షిణ
రాయనృప ప్రవిమలాబ్ధిరమణీయుఁడు రా
మాయణపఠన వ్రత ని
త్యాయత ఘనయశుఁడు మల్లనార్యుఁడు పేర్మిన్.

వ. నీవు మఱియును.

చ. రసములు తొమ్మిదిం గలుగురమ్యనవార్థసుశబ్దమాధురీ
విసరము లుల్లసిల్ల నతివిస్ఫుటలక్షణరూఢిఁ బ్రౌఢిమన్
రసికులనెమ్మనంబు లనురాగము నొందఁ దెనుంగుబాస నిం
పెసఁగఁగఁ జెప్పనేర్తు సరియెవ్వరు నీకును మాడధీమణీ!

క. నావియ్యమైనకాస
ప్పావిన తుని సుతున కెఱ్ఱమంత్రీంద్రునకున్.
దేవేంద్రజయ మనుకథ
శ్రీవెలయఁగ ద్విపద మీరుసెప్పితి రెలమిన్.

గీ. ధాత్రిలోన మనకు గోత్రంబు శాఖయు
నొక్కటగుట మంచి యోగ్య మయ్యె
గానఁ జెప్పు డంధ్రకవిత మైరావణ
చరిత మొప్ప నాకు జయకరముగ.

చ. అని దయఁజూచి భవ్యకనకాంబరగోహయభృత్యవేదికా
ఘనఘనసారకుంకుమసుగంధవినూత్నభూషణాలితో
వినయముతోడఁ గప్పురపువీడియ మర్థిని భక్తి నిచ్చి న
న్ననిపిన మద్గృహంబునకు హర్షముతోడుత వచ్చి యెంతయున్.

చ. వలనుగ నాత్మలోన గుడివాడపురాధిపు భీమలింగనిం
దలఁచి కరంబులెత్తి ప్రమదంబున మ్రొక్కి నుతించి భక్తని
శ్చలమతి నివ్వటూరిపురశాసను మద్గురుమల్లికార్జునున్
గొలిచి తదాజ్ఞచేఁ బ్రకటకోమలకావ్యకళావివేకినై.

ఇన్ని పద్యములు చెప్పినను గవి తనగృహనామమును జెప్పలేదు. కవినామము 'మారయ' యని ఆంధ్రకవులచరిత్రమునఁ జెప్పబడినది. మాదయ యని కొందఱనెదరు. కాని, పైపద్యములలో "ప్రౌఢ వనిన్నంటు

సర్వయు మాడసుకవి" యని యతిస్థానమునం దుంచి మాడయ యని చెప్పుటచే నీతనినామము మాడయ యనుట నిశ్చయము. గుడివాడ భీమలింగని పైపద్యములోఁ దలంచియుండుటయే నీతనినివాసము కృష్ణామండలమందలి గుడివాడయో తత్ప్రాంతమో యయియుండును. గోదావరీ మండలమున పిఠాపురమునొద్ద నొకగుడివాడయున్నది. కానియది కవినివాసమువలెఁ గాన్పింపదు. కవిగురువు ఇవటూరునకుఁగరణము.

ఈగ్రంథము అబ్బయామాత్యునిపుత్త్రుఁడైన గోపమంత్రి కంకితము చేయఁబడినది. "మనకుగోత్రంబు శాఖయు నొక్కటగుట" అని పైపద్యములోఁ జెప్పియుండుటచేఁ గృతిపతియు నియోగిబ్రాహ్మణుఁడును శ్రీవత్సగోత్రుఁడు నగుట స్పష్టము. కృతిపతిని వర్ణించినపద్యములు గలప్రతియొకటియు లభింపకపోవుటచేఁ గృతిపతినిగూర్చిన విశేషము లేమియుఁ దెలియరాలేదు. "లేజర్లయబ్బధీమణిగోపా" యని తృతీయాశ్వాసాదిపద్యమునను "లేజర్లయబ్బమంత్రిగోపయామాత్యా" అనిగద్యాదులందును నుండుటచే, నీలేజర్లశబ్దము కృతిపతి గృహనామమని తోఁచుచున్నది, కాని యీక్రిందియాశ్వాసాంతపద్యములను బట్టి చూడఁగా నీతనియింటిపేరు కాండవవారయినట్లు కన్పట్టుచున్నది.

చ. కవిజనమిత్ర! బంధుజనకల్పమహీరుహ! సర్వధారుణీ
ధరవరసత్సభాంతర ప్రధాననుతస్ఫుటధీవిచార! కాం
డవకులకంజభాస్కర! దృఢవ్రత! నిష్ఠురమంత్రిభీకరా
ర్ణవబడబాగ్నిరూప! సురరాజనుత ప్రతిమానవిక్రమా!

చ. యవనకళింగవంగ మగధాంధ్రపుళింద దశార్ణకోసల
ద్రవిడవిదేహకుంతల విదర్భయుగంధరభోజమేదినీ
ధవవరమంత్రివర్గనిరతస్తుత చారుకవిత్వకార స
త్ప్రవిమల వాగ్విలాస! ఘనబంధుర! కాండవవంశవర్ధనా!

మొదట 'కాండవ' యనుగృహనామము గలవారైపిమ్మట లేజర్ల యనుగ్రామనివాసులగుటచే లేజర్లవారైరేమో! కృతిపతితల్లిపేరు అబ్బమ్మ. భార్యరామాంబిక. ఇతఁడు వైష్ణవమతాభిమానియఁట. ఈవిషయములాశ్వాసాంతపద్యములవలనఁ దెలియవచ్చినది. గ్రంథవిస్తరభీతిచేఁ నిం దుదాహరింపలేదు.

శ్రీరామచంద్రుఁడు రావణునివధించుటకుఁ బూర్వము కుంభకర్ణాదులను సంహరించినపిమ్మట, రావణుఁడుపాతాళలంకానివాసుఁ డగు మైరావణునిఁ బిలిపించి మాయోపాయముచే రామలక్ష్మణులను దీసికొనిపోయి సంహరింపు మని ప్రోత్సహించుటయు, నావృత్తాంత మెఱింగి విభీషణుఁడు రామలక్ష్మణులునిద్రలోనుండినప్పుడు రక్షింపుచుండుమనిహనుమంతున కెఱింగింప నాతఁడు తనవాలమును బెంచి రామలక్ష్మణులకుఁ గోట గట్టుటయు, మైరావణుఁడు విభీషణవేషధారియై వచ్చి యాంజనేయుని మోసపుచ్చి లోని కేఁగిరామలక్ష్మణుల నెత్తుకొనిపోయి పాతాళలంక యందుంచుటయు, నాయుదంతమును విభీషణునివలన నెఱింగి యాంజనేయుఁ డాలంక కేఁగి వానిని వధించి శ్రీరామచంద్రులను యథాస్థానమునకుఁ దీసికొనివచ్చుటయు నిందలికథ.

ఈతనికవిత్వము నిర్దుష్టము గాకపోయినను, సరసమై మనోజ్ఞముగా నున్నది. కవిత్వశైలి తెలియుటకై మూఁడు పద్యము లిట నుదాహరింపఁబడుచున్నవి.

చ. పరులకు నవ్వుపట్టు తనబంధుజనంబుల కెల్ల నింద య
స్థిరముల కాలయంబు కడు సిగ్గులచేటున కాస్పదంబు స
త్వరమునఁ ద్రోవ గాక కడు భాసురకీర్తికి మూలహాని యె
వ్వరికిఁ బరాంగనం గవియ వర్తనయే బలమెంత గల్గినన్. ౧ ఆ.

ఉ. రావణుపంపు పూని కపిరాజుల నన్నును మోసపుచ్చి మై
రావణతస్కరుం డిపుడు రాఘవులం గొనిపోయె నేను దై
త్యావలితోడ వాని నురుమాడి పరాక్రమ మొప్పఁ గ్రమ్మఱన్
భూవరచంద్రులం గొనుచుఁ బోయెద నంచును నేనువచ్చితిన్. ౨ఆ.

ఉ. కావున నేను తుమ్మెదలఁ గ్రిక్కన నొక్కటఁ గూడఁబట్టు నీ
లావునఁ జంపితేని వికలత్వముఁ బొందుచు నాఁడె భూమి మై
రావణుఁ డిల్లి యంతకుపురంబున కేఁగుట గాక తక్కినన్
దేవనిశాచరామరులకుఁ దీరదు గెల్వఁగ వీని నావుడున్. ౩ఆ.

ఈతఁడు రచించిన దేవేంద్రవిజయ మను ద్విపదకావ్య మిప్పుడెచ్చటను గానవచ్చుట లేదు. ఈకవి కాలనిర్ణయముసేయుటకుఁ దగిన

యాధారములు గ్రంథమున స్పష్టముగ లేవు. నన్నయ తిక్కనలను మాత్రమే కవిస్తుతిలోఁ జేర్కొనియున్నాఁడు. కృతిపతివంశవర్ణనముఁ గలపద్యములు లభింపలేదు. కృతిపతియు నాతనితండ్రియు సుప్రసిద్ధులు కారు. కవిస్వామ్యమునుగూర్చి వర్ణించినసీసపద్యములోఁ గొంతయాధారము గన్పట్టుచున్నది. కర్ణాటకప్రభు వగువీరనరసింహభూపాలు నీతఁడు మెప్పించినట్లందుకలదు. ఆవీరనరసింహుఁడెవ్వరో తెలిసికొనవలసియున్నది. పైపద్యపాదము ముద్రితప్రతిలో "మెప్పించినాఁడవు మెఱవడిఁ గర్ణాటనరనాయకుని వీరనారసింహు" అనియున్నది. కాని యిందులోఁ గొంత లేఖకప్రమాద మున్నట్లు గాన్పించుచున్నది. "నరసనాయకు వీరనారసింహు" అనియుండవలయునని నాయభిప్రాయము. కర్ణాటప్రభువులలో నరసింహనామధేయులు మువ్వురున్నారు. ౧ సాళువనరసింగరాయలు ౨ తుళువనరసనాయకుఁడు ౩ ఇతనికుమారుఁడైన వీరనరసింహరాయలు. పైపద్యములో నుదాహరింపఁబడిన వీరనరసింహరాయలితఁడే యని నాయభిప్రాయము. ఈమువ్వురు నరసింహులును క్రీ.శ. ౧౪౮౬-౧౫౦౯ నడుమఁ గర్ణాటరాజ్యసింహాసనము నధిష్ఠించినవారు. ఇందులోఁ బైపద్యమున నుదాహృతుఁడైనయాతఁ డేతఁడైనను గవి యీనడుమకాలములో నున్నవాఁడని నిశ్చయింపవచ్చును. ౧౫౦౩-౧౫౦౯ నడుమ నీగ్రంథము రచితమైనదని నిశ్చయింపవచ్చును.

కవులచరిత్రకారు లీకవికాలనిర్ణయమును జేయక యధునాతన కవులలోఁ ననఁగా బదునెనిమిదియవశతాబ్దికవులలోఁ జేర్చియున్నారు. కాని యిది పొరపాటు. బ్ర. శ్రీవేటూరిప్రభాకరశాస్త్రులుగారు రాజశేఖరచరిత్రను రచించినమల్లనకవితండ్రి యీతఁడే యనివ్రాసియున్నారు. ఇందలి నిజానిజములను మల్లనకవిచరిత్రమునఁ జర్చించెదను. ఇతఁడు మల్లనకుఁ దండ్రియైనను, నీతనికాలము పైనఁ జెప్పినదే యగును గాని మారిపోవదు.

ఈమాడయకవి, కోటసింగయమంత్రికొలువులో నున్నకవులను జయించినట్లు పైపద్యములోఁ జెప్పఁబడియున్నది. ఈసింగయమంత్రి ముప్పదియిద్దరుమంత్రుల సీసమాలికలో: —

"పట్టిసపువీరభద్రుని ప్రేమచేఁ
జెన్నొందె శ్రీకోటసింగరాజు."

అని కొనియాడఁబడియున్నాఁడు. ఇతఁడు రావూరునకుఁ గరణ మైనట్లూహింపఁదగియున్నది. ఇతఁడు నిరతాన్నప్రదాత యైనట్టే క్రిందిచాటుపద్యములవలనఁ దెలియుచున్నది. రావూరు గుంటూరుమండలములోనిది. పట్టిసముగోదావరిమండలములోనిది. సింగరాజేమండలమువాఁడో తెలియదు. ఈపద్యమును మాప్రాంతముల భట్రాజులుచదువుచుందురు. పట్టిసపు వీరభద్రునిఁదల పెట్టియుండుట నీసింగరాజు గోదావరిమండలము వాఁడనితోఁచుచున్నది. అయిన నీవిషయమింకను బరిశోధనీయము.

సీ. పాయసాన్నప్రౌఢి పరిపాకమే చాలు
పిండివంటలరుచుల్ మెండుమేలు
ఆజ్యప్రవాహంబు రాజ్యమేనని చెప్పఁ
బల్చని పెసరొల్పుబప్పుతెప్ప
మెత్తనై స్వచ్ఛమై మెదవెడు రాజాన్న
మెన్నఁగైకొంటి మోయన్న నిన్న
బహువిధశాకప్రపంచంబు మదిముట్ట
నూరుఁగాయలరుచు లూరవులుట్ట
గీ. అనుచు నీపంక్తి భుజియింతు రనుదినంబు
భూసురశ్రేష్ఠు లెలమి నుప్పొంగి పొంగి
మహితచారిత్ర! కొండయామాత్యపుత్త్ర!
కుటిలదుర్మంత్రిమదభంగ! కోటసింగ!

సీ. రావూరుపురి డిల్లిరాజ్యంబులం దుండి
సింధుబర్బరకుడ్యసీమనుండి
పాంచాలమాళవ పాండ్యభూములనుండి
కటకకల్యాచలగయలనుండి
ఘోట్టాణ కొంకణ ఘూర్జరోర్వులనుండి
మళయాళ కేరళమహులనుండి
భోజ కర్ణాట కాంభోజ భూములనుండి
సాల్వాంధ్రముఖ్య దేశములనుండి

గీ. చాల నేతెంచు సద్ద్విజసంఘములకు
నన్నదానంబు గావించు చున్నదొరవు
భవ్యచారిత్ర! కొండయప్రభుసుపుత్త్ర!
కుటిలదుర్మంత్రిమదభంగ! కోటసింగ!

క. నరజన్మంబునఁ బుట్టినఁ
గరణీకమె యుత్తమంబు కరణంబైనన్
పురుషార్థపరుఁడు గావలె
శిరసెత్తినఫలము కోటసింగనవర్యా!

చ. గడుసరిలోభియర్థ మది కన్నపుదొంగలబందిపోటుకున్
బుడమిని వారకాంతలకు భూపతికిం జనుఁ గోటసింగ! నీ
పడసినయర్థ మార్తులకు బాంధవకోటికి యాచకాళికిన్
గుడికిని సత్త్రశాలకును గూపతటాకవనప్రతిష్ఠకున్.

గీ. కోటసింగరాజు మాటవాసియె కాని
గంగమాంబవలన ఘనత కెక్క-
గంగమాంబ జగతి గయ్యాళి యైనను
సింగరా జిఁకేమి సేయఁగలఁడు?

ఈపద్యములు శ్రీప్రభాకరశాస్త్రులుగారు ప్రకటించిన గ్రంథములోనివి.

కోటసింగరాజు కాలమేదియో తెలిసికొనుటకుఁ దగినయాధారములు నాకు లభింపలేదు. ఇతనియాస్థానమున తక్కరుఁ డనెడికవి యుండెడివాఁడనియు, నాతని నీమాడయకవి వాదమున జయించె ననియుఁ బైపద్యములో నున్నది. ఈతక్కరకవి యెవ్వరో తెలియలేదు. సంస్కృతమున బిల్హణచరిత్రమును రచించినచోరకవి యొకండున్నాఁడు. కాని యాతఁ డింతకంటెఁ బ్రాచీనుఁ డని తెలియుచున్నది. ఈమాడయకవి నందాపురీశుచేతను, కిమిడిప్రభువుచేతను బహునుతులనందినట్లు పైసీసపద్యములో నున్నది. నందాపుర మనఁగా నిప్పటిజయపురమే. కిమిడిసంస్థానము ప్రస్తుతపుగంజాముజిల్లాలోనిది. కృష్ణామండలనివాసి యగు

నీకవి యటు పడమటబళ్లారిమండలమునకును పూర్వున గంజాముమండలమువఱకును బోయితనపాండిత్యమును గనుబఱచి బహుమతులనందెన నుట శ్లాఘనీయమయినవిషయము.

---

## 93 పిడుపర్తి రెండవ బసవకవి

ఇతఁడు వీరశైవాచార తత్పరుఁడైన నియోగిబ్రాహ్మణుఁడు ; పాలనార్యపుత్త్రుఁడు; ఈకవి పిడుపర్తిసోమనాథుఁడు రచియించినద్విపదప్రభులింగలీలల నైదాశ్వాసములబద్యకావ్యముగాఁ జేసిన ట్లీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు. సోమనాథకవి కితఁడు తమ్మునికుమారుఁ డని శ్రీవీరేశలింగముపంతులుగా రీకవిచరిత్రములోఁ జెప్పియున్నారు. ఈబంధుత్వమును బసవకవి చెప్పియుండలేదు. కాని యితఁడు సోమనాథునకుఁ దమ్మునికుమారుఁడగుట నిశ్చయమే. సోమనాథునితండ్రి బసవన. ఆతఁడును గవియే. ఆతనిచరిత్రమును వేఱుగా వ్రాసియున్నాఁడను. ఈపిడుపర్తివారివంశవృక్షము నాచరిత్రమునం దిచ్చియుంటిని.

ఉ॥ చామరుసయ్య మున్ను పదసంఖ్యకు వేయును నూటపద్దెనిం
డై మఱి యిర్వదేనుగతులందును నీప్రభులింగలీల యెం
తేమహిమన్ రచించె నది తెల్లముగాఁ బిడుపర్తివాసుఁడౌ
సోమగురుండు దా ద్విపద చొప్పెడఁ జెప్పె విచిత్రవైఖరిన్.

క. ఆసోమగురుఁడు ద్విపదగ
జేసినప్రభులింగలీల క్షితి వెలయంగా
నాసక్తి పద్యకావ్యము
భాసురగతి పాలనార్యబసవన చేసెన్.

ఈగ్రంథమందుఁ జెప్పబడినయొక్కొక్కవిషయమున కొక్కొక గతి యని పేరుపెట్టినాఁడు. కైలాసగతి, మాయోత్పత్తిగతి. బసవయ్యగతి, మొదలైనవి. ఇందు అల్లమప్రభునిలీలలు విశేషముగా వర్ణింపఁబడుటచే నీగ్రంథమునకుఁ బ్రభులింగలీల లని పేరువచ్చినది. ఈయల్లమప్రభువు బసవనారాధ్యుఁడు మొదలగువారికి గురువైగొప్పశివభక్తుఁడైన ట్లీక్రిందపద్యములవలనఁ దెలియవచ్చుచున్నది.

ఉ. పన్నినమాయ దోసి శివభక్తుని గర్గయఁ బ్రోచి శిద్ధరా
మన్నకు బుద్ధి చెప్పి బసవన్నకు బోధ యొనర్చి శ్రీగిరిం
జెన్నసలార మహానులను జేకొని ధన్యుల నెల్ల ముక్తిసం
పన్నులఁ జేయునల్లమను బ్రస్తుతిఁ జేసెద సార్వకాలమున్.

ఈకవి గ్రంథాంత గద్యలో "ఇది శ్రీమత్పాలకురికి సోమేశ్వర వరప్రసాదలబ్ధకవితాచాతుర్యధుర్యుఁడ ననియు, గ్రంథారంభపద్యము నందు.—

"శ్రీకర వీరశైవము ప్రసిద్ధముగా నొనరించి భక్తి భూ
లోకమునందు నించి, మదిలోపల శ్రీబసవేశు నిష్ఠతోఁ
జేకొని పద్యగద్యములఁ జిత్రగతిన్ బ్రణుతించి మించున
స్తోకగుణాఢ్యుఁ బాల్కురికి సోమగురున్ భజియింతు నెంతయున్."

అని "పాల్కురికి సోమగురుఁడనియు" వ్రాయుటచే నీతఁడు పాల్కురికిసోమనాథుని శిష్యుఁ డని స్ఫురించుచున్నది. కాని యీతఁడు సోమనాథునకుఁ బ్రత్యక్షశిష్యుఁడు కాఁడు. శిష్యపరంపరలోనివాఁడు. పదునాల్గవశతాబ్దియందున్న పాల్కురికి సోమనాథునకుఁ బదునాఱవ శతాబ్దియందున్న యీతఁడు శిష్యుఁడు కాఁజాలఁడు. పిడపర్తి సోమనాథునికంటె ముప్పదియేండ్లకుఁ బిమ్మట నీకవియుండుట నిశ్చయము. కావున నీతని జననము ౧౫౮౦ ప్రాంతమై నీతనిరచనము క్రీ. శ. ౧౬౧౦ ప్రాంతమునందై యుండును.

ఈతని కవిత్వము, అంత శ్రేష్ఠమయినదికాదు. వ్యాకరణదోషము లున్నవి. వ్యర్థపదప్రయోగము లధికము. శైలి తెలియుటకై కొన్ని పద్యముల నుదాహరించెదను.

మ. విను మోయల్లమ! మాయ నిన్ను పతిగా వేడ్కం దగం జేసి మ
న్నన సౌఖ్యంబులు జెందఁగోరెఁ దగవా నా శ్రీ మహాలక్ష్మిరా
జను మోకాలికి నొగ్గనీవిరసముల్ బాలించి మే లెంచి నీ
వనుమానింపక మాయఁ జేకొనగదయ్యా నీకు నేమొక్కెడన్.

౧౬.

ఉ. అక్కమదేవి నన్ను శివునందును గూర్పఁగఁజాలు సద్గురుం
డెక్కడఁ గల్గునో యనుచు నేటితటంబుల సైకతంబులం
జెక్కువనంబులం గిరులఁ జేరఁగ భక్తులమందిరంబుల
న్మక్కువఁ జూడఁబోయిన సమస్తజను ల్వినుతింపుచుండఁగన్. ౨ఆ.

శా. ఎవ్వాఁడో యొకజంగమయ్య యిట కేతెంచి మిమ్మెంతయుం
గొల్వన్ నీమఱఁగ న్దొడఁగె రాముఁడనఁగా గోపించి యాధూర్తుచే
నొవ్వ న్వస్త్రమి శిష్యులందఱము మానోమీఫలంబయ్యె మే
మీవార్తల్ సముఖానఁ దెల్పెదము మేమేమందుమో దేశికా.
3 ఆ.

క. బసవన్న మహిమ యెవరికి
వశమే పొగడంగ నతనివలనను ధరలో
నసమానభక్తి ప్రబలెను
పొసఁగఁగ నని యల్లమప్రభుఁడు వినుతించెన్. ౪ ఆ.

మ. వినుకొండ న్దగరాళ్లు దెచ్చి ధరణి న్వేయించి యామీఁద వ
జ్రనికాయంబులు మెట్లఁ గట్టి మణులన్ రంజిల్ల కుడ్యంబు దే
ర్చి నయం బొప్పగ రత్నముల్ దఱుచుగాఁ జెక్కించి సింహాసనం
బనురక్తిం బసవన్న యేర్పరచి యుద్యల్లీల నాపీఠకన్. ౫ ఆ.

ఈబసవకవి రచించిన ప్రభులింగలీలల ముద్రితప్రతి యొకదానిని నేనుజూచితిని. అందుఁ గృత్యాదిలేదు. సృష్టిగతియందుఁ జాలకురికి సోమనాథుని స్తుతిచేయు పద్యముతో గ్రంథము ప్రారంభమైనది. ప్రథమాశ్వాసాంతపద్యములును, ద్వితీయాశ్వాసాద్యంత పద్యములును, చతుర్థాశ్వాసాంత పద్యములును మాత్రమే యందున్నవి. మిగిలిన యాశ్వాసాద్యంతపద్యములు లేవు. ఉన్నంతవఱకాపద్యముల నీక్రింద వ్రాసెదను. వీనినిబట్టి యీగ్రంథకృతిపతిని నిర్ణయింపవచ్చును.

చ. గురుబుధమిత్రభృంగరిట గోత్రయుగంధర నీతిపాత్ర! యం
తరరిపుజైత్ర! కీర్తి సముదంచితగాత్ర! గుణాభిరామ! బం
ధురకవిసార్వభౌమ! పటుదోర్బలభీమ! సమస్తభాగ్య ని
స్తరసిజధామ! చల్లపలిశాసనవైభవ పాకశాసనా!

క. ఖండేందుధరకృపారస
మండితయుత ! సకలభోగమహిమాతి శయా
ఖండలసన్నిభ ! సుమనస
కాండపరితిమానరూప ! ఘనకులదీపా !

మాలిని. సరసగుణవిశేషా ! సత్యవాచాభిలాషా !
నిరసభవవిదూరా ! వీరశైవావిచారా !
శరణగణవరేణ్యా ! సజ్జనస్తోమగణ్యా !
విరచితరవితేజా ! వీరమాంబాతనూజా ! ౧ ఆ.

క. శ్రీనగజాధీశ్వరకరు
ణానిత్యసమగ్రవిభవ నాళీకరుహా
జ్ఞానూనపరాయణ
మానస! యో చల్లపల్లి మల్యారాధ్యా !

చ. శరశరదిందుచంద్రహారిచందన కుందమరాళబృందభా
సురసురభూజరాజధర శుభ్రపయోరుహసారసాతు యిం
దిరదరహాస నిర్జరధునీరజనీకరకాంతకాంత వి
స్ఫురితయశోవిలాస ! బుధపోషణ ! సంతతసత్యభాషణా !

క. నిరతాన్నదాన ! విద్యా
పరిచితబుద్ధి ప్రభావ ! భావజహర వి
స్ఫురితమృదుచరణసరసిజ
సురుచిరమృదుభృంగ ! ధైర్యసురగిరిశృంగా !

మాలిని. శ్రీగిరీశనానుధేయ చిత్కళాభిరంజనా !
యోగసుప్రసిద్ధవేది కార్థసాధనాంజనా !
రాగముఖ్యదోషహార విరాజమానసా !
నాగనాథవంశపావనా మహేశసేవనా ! ౨ ఆ.

శా. జంభారాతిసమానవైభవ ! శివాచార్యైకసంపన్న ! దో
స్తంభప్రాభవశారభేశ ! సకలక్ష్మాపాలజాలస్తుతా !
గంభీరార్ణవ ! శాతకుంభగిరిశృంగఖ్యాతివైరోన్నతా !
శంభుద్వీరమహేశ్వరప్రథితసంస్తుత్యప్రభావోదయా !

క. కరుణాభరణా! సద్గురు
చరణారుణపంకజాత సౌరభయుత ష
ట్చరణాశరణాగతవి
స్ఫురణా నిజశిష్యనిచయభూషితచరణా! ౨ ఆ

ఈపద్యములనబట్టి చల్లపల్లిగ్రామకరణమును వీరమాంబాతనూజుఁడును నైన మల్లారాధ్యున కీగ్రంథము నంకితముచేసినట్లు కన్పట్టుచున్నది. "నాగనాథవంశపావనా!" యని సంబోధించియుండుటచేతఁ గృతిపతి గృహనామము నాగనాథునివారని తోఁచుచున్నది. చల్లపల్లి కృష్ణామండలములో నున్నది. నైజామురాష్ట్రములోఁగూడ నున్నదని తెలియుచున్నది. కవి నివాసము నిజామురాష్ట్రములోని పిడపర్తి గ్రామము. కావునఁ గృతిపతి నివాసము నిజామురాష్ట్రమైయుండునని తలంపవచ్చును.

---

# 95 వేమన

ఆంధ్రదేశమునఁ గొంచెము చదువనేర్చినవారిలో వేమనపద్యముల నెఱుంగనివారును అధమ మొకపద్యమునైనఁ గంఠస్థముచేయనివారునుండరు. వేమనశతకమను పేర నూఱుపద్యములే యీకవి రచించినవని మొట్టమొదట ననుకొనిరి. కాని క్రమక్రమముగ ముద్రణసౌకర్యము హెచ్చినకొలఁదిని నివి యైదువేలవఱకుఁ బెరిగినవి. ఇవిగాక వేమనపద్యము లింకను గలవనియు, మొత్తము మూఁడువేలవఱకు నుండవచ్చుననియుఁ గొందఱనుచున్నారు.

వేమన రెడ్డికులోత్పన్నుఁడు. రెడ్డికులజులను కాఁపులని పిలుచుటయుఁ గలదు. వేమనపద్యములలో నితనికులమును సూచించు నీక్రింది పద్యపాదములు కలవు.

"ఎడ్డె రెడ్డె కుల మదేమని చెప్పుదు"
"విదితము గాఁగను వేమనరెడ్డి!"

"కలియుగమున నున్న కాఁపుకులానకు
వేమన తనకీర్తి విక్రయించె"

దీనినిబట్టి ఇతఁడు రెడ్డికులమున జన్మించెనని నిశ్చయింపవచ్చును. ఒకచోట "వేమనృపాలశేఖరా" యనిసంబోధించియుండుటచే నితఁడు రెడ్డిప్రభువంశమున జన్మించినట్లు తలంపవచ్చును. కొండవీటిరెడ్డిరాజ్యమును రాజమహేంద్రవరరెడ్డిప్రభుత్వమును క్రీ శ. ౧౪౫౦ తో నంతరించినను గొన్ని చిన్నసంస్థానములు రెడ్డిసామంతులచే మఱికొంతకాలము పాలింపఁబడియున్నట్లు చరిత్రలవలనఁ దెలియుచున్నది. కావున నీతఁ డేదియేనిచిన్నసంస్థానప్రభువు లైనరెడ్లవంశమున జన్మించియుండవచ్చును. కాని యాసంస్థానమేదియో నిర్ణయించుట కాధారములు దొరకలేదు.

రెడ్లలోఁ, బాకనాటిరెడ్లు, పంటరెడ్లు, మొటవాడరెడ్లు, మొదలుగాఁ బెక్కు తెగ లున్నవి. వేమన యిం దే తెగకుఁ జెందినవాఁడో చెప్పఁజాలము. వేమనపద్యములకుఁ బీఠిక వ్రాసిన శ్రీ శేషాద్రిరమణకవులు బాలవేమచక్రిశతకము నాధారముచేసికొని వేమనజన్మస్థానము దత్తమండలములోని కటారిపల్లెయని వ్రాసి యాప్రాంతముల యందుఁ బాకనాఁటిరెడ్లు విశేషముగా నుండుటచే వేమన పాకనాఁటిరెడ్డికులజుఁ డై యుండునని వ్రాసినారు. వేమన సిద్ధిపొందినస్థలము కటారుపల్లె యఁట. ఈసందర్భమున శ్రీశేషాద్రిరమణకవులు వ్రాసినవాక్యములివి.

"బాలచక్రవేమశతకములో వేమన నివాసాదికములు దెలుపు నీపద్యములు గలవు.

తే. కదిరి తూర్పుదిక్కు ఘనతశోభిల్లఁగాఁ
బరగ వరకటారుపల్లెయనఁగ
అచట నునికిఁ జేసి యమరియుండుదు రయా
బాలచక్రివేమ భవ్యనామ!

తే. తల్లిదండ్రి యన్నదమ్ము లాత్మసఖులు
ఎలమి బంధువు లాది యెల్లజనులు
గలిగి వర్ధిల్లి రావూరు ఘనత మీఱ.

ఈపద్యములవలన వేమనకవి దత్తమండలములలోని దగు కదిరి చెంతఁగల కటారుపల్లెలోఁ బుట్టి యచటనే మరణించెనని తెలియుచున్నది. వేమనచరిత్రద్విపదగూడ నీవిషయమునే స్థాపించుచున్నది. కటారుపల్లెలో వేమనసమాధికలదు. సమాధిని గలుపుకొని యట నొక యిల్లు కట్టఁబడియున్నదనియు వేమనధరించినదుస్తులు పావుకోళ్ళు నా గృహమునఁ దద్వంశీయులచేఁ బూజింపఁబడుచున్నవనియుఁ దెలియుచున్నది. వేమన్న పేరుతో సమాధిచెంత నొక విశృతకట్టువిగ్రహము గలదనిక్యాంబెలుదొరగారు వ్రాసియున్నారు. వేమన శార్వరినామసంవత్సరచైత్రశుద్ధనవమిదినమున సిద్ధిపొందినటులఁ గటారుపల్లెవారు చెప్పుచుందురు. వేమనవంశీయులు ప్రతిసంవత్సరము నుత్సవాదులఁ జేయుచునున్నతాళ్వముల నెక్కి పసపుగుడ్డలతో వేమన్నలమని చెప్పికొనుచు నుత్సవాదులకు ధనము ప్రోవుచేయుచున్నారు." (కటారుపల్లె యేమండలమునం దేతాలూకాలోనున్నది నాకుఁ దెలియలేదు నాయొద్దనున్న గ్రామములపట్టికలోనీ పేరుకన్పడలేదు.) "ఇతని సంతతివారు కదిరి తాలూకాలోని నల్లచెరువు, కటారపల్లిగ్రామములలో నితనిసమాధికిఁబూజాదులునడుపుచు ధర్మకర్తలైయున్నారని వినుచున్నాను. ఇతఁడు కర్నూలియన వేమారెడ్డి కుటుంబమునకు సంబంధించినట్లునువాడుక కలదఁట" అని శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు పీఠికలో వ్రాసియున్నారు. కటారుపల్లె నల్లచెరువునకు శివారుగ్రామమేమో! విరాగియై దేశద్రిమ్మరియైన వేమన కటారిపల్లెలో సిద్ధిపొందినంతమాత్రమున నతనిజన్మస్థానము కటారిపల్లె యని నిర్ణయింపలేము. కటారిపల్లెప్రశంస వేమనపద్యములలో నెచ్చటను గన్పట్టదు. సరియేకదా యతనినివాసమునుగూర్చి యీక్రిందిపద్య మొకటి వేమనపద్యములలోఁ గనఁబడుచున్నది.

"గీ. ఊరుకొండవీడు ఉనికిపశ్చిమవీథి
మూగచింతపల్లె మొదటియిల్లు
ఎడ్డి రెడ్డి కుల మదేమని తెలుపుదు"

అనుపద్యము నుదాహరించుచు శ్రీశేషాద్రిరమణకవులు "వేమన జన్మస్థానము వఁగవోలు తాలూకాలోని మూగచింతపల్లియనియుఁ గొండవీడు పిదపనివాసస్థలమనియుఁ దెలియుచున్నది" అనివ్రాసియు

న్నారు. మూగచింతపల్లియనుగ్రామము వంగనోలు తాలూకాలోనున్నట్లు కన్పట్టదు. నెల్లూరుమండలములోఁ బొదిలి తాలూకాలో నొకటియుఁ గందుకూరు తాలూకాలో నొకటియు "మూగచింతల" యను పేరుగల గ్రామములున్నవి. ఇందేదియోయొకటి వేమనజన్మస్థానమనియుఁ బిమ్మటఁ గొంతకాలమునకుఁ గొండవీడు నివాసముగాఁ జేసికొనెననియు "మొదటి యిల్లు" అనువాక్యమునుబట్టి నిశ్చయింపవచ్చును. ఆప్రదేశములలోఁ బంటరెడ్లున్నారు. కావున వేమన పంటరెడ్డియగునేమో! ఇతనినిగూర్చి పెక్కుకథలుప్రచారములోనున్నవి. అందుముఖ్యమైనదిది. వేమన కొక యగ్రసోదరుఁడు కలఁడు. ఆతనికిఁ దరువాతఁ జాలకాలమున కీవేమన జన్మించెను. ఈతనిచిన్నవయసుననే తలిదండ్రులు చనిపోయిరి. ఇతని యన్నయు, నాతనిభార్యయుఁ జిన్నవయసులో నున్నవేమనను గన్నపుత్రునివలె నతిగారాబములోఁ బెంచుచుండిరి. వేమన యన్నగారి కాతనివృత్తియందేమియు సాహాయ్యముచేయక యల్లరిగాఁదిరుగుచు నింటనున్నధనము వ్యయము సేయుచుండెను. ఇంతేగాక వేశ్యాలంపటుఁడై యింటనున్నవస్తువులదొంగిలించి తీసికొనిపోయి వేశ్యకిచ్చుచుండెను. ఈతనినడవడినిజూచి యగ్రజుఁడసహ్యించుకొనుచు నాగ్రహమును జూపుచున్నను, నన్నభార్యమాతృము పుత్త్రప్రేమతోఁ జూచుచుఁ గోపమును జూపినచో నెక్కడికేని లేచిపోవునేమోయనియు నన్నముఁ దినకపోవునేమోయనియు భయపడి యడిగిన వెల్ల నిచ్చుచుండెను. ఒకనాఁడు వేశ్యకొఱకు ధనమిమ్మని వేమన వదినెగారి నడిగెను. ఆనాఁడింట ధనమేమియు లేదు. లేదని యెంత బ్రతిమాలినను, వేమన వినలేదు. మంకుపట్టుపట్టి "నీమెడలో మంగళసూత్ర మిమ్మని" నిరోధించెను. ఆమె "నేనుచెప్పినట్లు చేసెదవేని యిచ్చెద"ననెను. వేమన అట్లేచేసెదనని యంగీకరించెను. "ఈమంగళసూత్రమునునీవు గడపపైఁబెట్టి యావేశ్యను దిగంబరియైవచ్చి వెనుకకు మొగ్గవైచి తీసికొనుమని చెప్పుము" అనిచెప్పి మంగళసూత్రమునిచ్చెను, వేమనదానిని దీసికొనిపోయి వేశ్యతోవదినె చెప్పినట్లు చెప్పెను. ధనమునం దత్యద్భుతశక్తి కలదు. అది మానవునిహృదయమున లజ్జాశంకలకునుచితానుచితములకు భయానురాగములకుఁ దావు లేకుండఁ జేయఁగలదు. వేశ్య వేమనచెప్పినట్లే

చేసెను. ఆరూపమునుగాంచిన వేమన కేహ్యమును విరాగమును జని యించెను. గిఱ్ఱున వెనుకకుఁ దిరిగి యెటకో లేచిపోయెను. ప్రపంచమును విమర్శించి చూచుట కారంభించెను. ఈకథయందలిసత్యాసత్యవిమర్శ నముతో మనకుఁబని లేదు. మానవునిహృదయమున నేకారణముచేనైన నొకపరి సంపూర్ణవిరాగ ముదయించెనేని యాతఁడు సమస్తమును దృటి లోఁద్యజింపఁగలఁడు. వేమనదృష్టిపథము వేఱైనది. సన్యాసియై యావ జ్జీవము సన్యాసిగనె చరించినాఁడు.

వేమనకాలమునుగూర్చి భిన్నాభిప్రాయము లున్నవి. బ్రౌను పండితుఁడు ౧౭వశతాబ్దివాఁ డనియెను. క్యాంబెలుపండితుఁడు ౧౬ వ శతాబ్దివాఁ డనియెను. శతకకవులచరిత్రను రచించిన వంగూరి సుబ్బా రావుగారు వేమనకాలము క్రీ.శ. ౧౪౧౨-౧౪౮౦ నడుమవాఁడని నిర్ణ యించిరి. వేమనపద్యములకుఁ టీకవ్రాసిన శేషాద్రిరమణకవు లీకవి క్రీ.శ. ౧౫౪౦-౧౬౦౦ నడుమనుండెనని వ్రాసిరి. శ్రీబండారు తమ్మ య్యగారు వేమన క్రీ.శ. ౧౬౫౨-౧౭౩౦ మధ్యకాలమునం దున్నాఁ డనిరి. (అక్షయ సంవత్సరాదిసంచిక) శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిలు గారు, మొదట క్రీ.శ.౧౪౦౦ ప్రాంతమువాఁడని యభిప్రాయపడియుఁ దరువాత వేమనపద్యములలోని రెండుపద్యముల నాధారముగాఁ గొని బదునేఁడవశతాబ్దిపూర్వార్థమునం దున్నవాఁడనియు నంతకింకను దర్వా తికిఁ దెచ్చుట కాధారములు కానరావు సరికదా బాధకములున్నవి." అనివ్రాసియున్నారు. "౧౯౩౫ సంవత్సరాదిసంచిక-క్రోధన"

సుబ్బారావుగారు వేమన కాలనిర్ణయమున కాధారముగాఁ గొనినవిషయములను ముందుగ విమర్శించిచూతము. ఆయన వేమనను నుతించినకవుల నొకపట్టికగా నిచ్చియున్నారు. అందు ముఖ్యములైనవి రెండు.

"౧. తురగారామకవి నాగరఖండమునువ్రాసెను. ఇతఁడు ౧౬.వ శతా బ్దాంతమునం దుండవచ్చునని కవులచరిత్ర మనుచున్నది. నాగర ఖండము ౧౫౮౧ క్రీ. శ. నందున్నకుతుబుశాహి కాలమునందుఁ బుట్టినది. ఈగ్రంథమునందు "శరభాంకు రాజశేఖరుని వేమ్ను" అని

రామకవి పొగడియుండెను. కావున వేమన్న క్రీ.శ.౧౬౮౧కే బూర్వుఁడై యుండవలెను."

౨. కృష్ణరాయలకాలమునం దున్న ఎడపాటియెఱ్ఱాప్రెగడ తనమల్హాణచరిత్రమునందు వ్రాసినపద్యములు రెండు చూపెదను.

ఉ. ఇట్టిమహాప్రధానపరమేశ్వరమూర్తివి గాని నీవు చే
పట్టితి మేలు చుండిపరిపాలక! కాశినమంత్రిచంద్ర! ము
న్నట్టిగఁ గృష్ణరాయజనకాంతున కీయక గాచినట్టియా
రట్టడి యైన యెఱ్ఱకవిరాజితమల్హాణకావ్యకన్యకన్.

ఈకవి కృష్ణరాయనికాలమువాఁడుకదా! ఈతఁడు వేమన్నను బొగడెను.

చ. వినుతు లొనర్తు నాంధ్రసుకవిప్రభు నన్నయభట్టుఁ దిక్కయ
జ్వను, శివదేవు, భాస్కరుని, జక్కన, నాచనసోము. సర్వదే
వుని, భవసూరు, వేము, నలపోతనఁ బిల్లలమఱ్ఱివీరభ
ద్రుని, శరభాంకు, వీరకవి, ధూర్జటిఁ, గేతన, భట్టబాణునిన్.

కాబట్టి వేమన్న యీయెఱ్ఱాప్రెగడకంటెఁ బూర్వుఁడు కావలెను. అనఁగాఁ గృష్ణరాయనికిఁబూర్వుఁడు."

శ్రీసుబ్బారావుగారుచూపిన యీయాధారములను బట్టిచూఁచినచో వారుచూపినకాలము సరియైనదే యని యొప్పుకొనక తప్పదు. శ్రీశేషాద్రిరమణకవులు పీఠికలో "నాగరఖండములోని కవిస్తుతిలోని వేమనప్రశంస యసంగతమని వంగూరి సుబ్బారావుగారే యొప్పుకొనిరి" అనివ్రాసి పైనవ్రాసిన మొదటియాధారమును ద్రోసివేసిరి. ఆయాధారమును శతకకవులచరిత్రమున శ్రీసుబ్బారావుగారే వ్రాసియున్నారు. వారాప్రశంస యసంగతమని చెప్పలేదు. ఆగ్రంథముక్రీ.శ. ౧౯౨౮ వైశాఖమాసములోముద్రితమైనది. శ్రీశేషాద్రిరమణకవుల పీఠికాకాలము ౧-౮-౧౯౨౯. ఈనడుమకాలములో శ్రీసుబ్బారావుగారియభిప్రాయమెచ్చటను నేనెఱిఁగినంతవఱకు ప్రకటితము కాలేదు ఇఁక రెండవయాధారమువిషయమై. —

"ఎంతయోకాలము కృష్ణదేవరాయల కావలనున్న యెడపాటి యెఱ్ఱాప్రెగడ వేమన్నను బూర్వకవిగాఁ బొగడుటవలన యెన్నటికిఁబూర్వుఁడు కాఁజాలఁడు. ఏమందురా? వేమన్ననటుండనిత్తము. ఎడపాటి యెఱ్ఱన శ్రీకృష్ణదేవరాయలయాస్థానముననున్న ధూర్జటినేపూర్వకవిగా జెప్పియున్నాఁడు. అందువలన నెఱ్ఱన ధూర్జటి కావలవాఁడని తెలియుచుండ వేమన్న నొకశతాబ్ది వెనుకకుఁదీసికొనిపోయి కూర్చుండఁబెట్టవలసినయవసరము కనుపింపదు.......రాయలకాలములోనున్న ధూర్జటి పూర్వకవియగుటవలన ఎడపాటి యెఱ్ఱన, రాయల కావల ధూర్జటి ప్రశస్తి బాగుగా వ్యాపించినకాలములోనుండియుండును. అట్టివాఁడు పొగడినందున వేమనరాయలకంటెఁ బూర్వుఁడని సిద్ధాంతము చేయవీలుండదు. దీనినిగురించి యింకనువ్రాయవలసియున్నది. గాని విస్తారమగునని వదలితిమి." అనివ్రాసియున్నారు. వారువ్రాయఁదలఁచుకొనివదలిన విషయములనుగూర్చి నేనేమియుఁ జెప్పజాలను గాని వ్రాసినవాక్యములు శ్రీసుబ్బారావుగారి సిద్ధాంతమును బూర్వపక్షము సేయుటలేదు. ఎఱ్ఱనకవి శ్రీకృష్ణదేవరాయలకును ధూర్జటికవికిని ఎంతయోకాలముతరువాతివాఁడని శ్రీశేషాద్రిరమణకవు లూహించిరి. కాని యది సరి కాదు. ఆతఁడు చాలతరువాతివాఁడైనచోఁ దనకృతినికృష్ణరాయలకీయక దాఁచియుంచుట పొసఁగదు. ఎఱ్ఱనకవి కృష్ణరాయలకాలమువాఁడే యనియు, సమకాలికుఁడైనధూర్జటికవిని నంతకించుక పూర్వుఁడైనవేమనను పొగడియుండెనని యుఁ దలంచుటలోఁ దప్పులేదు. సమకాలమువారినిపొగడినకవులు పెక్కురున్నారు. ఎఱ్ఱనకవికాలము క్రీ.శ. ౧౬౦౦కుఁ బిమ్మటనని శేషాద్రిరమణకవులు ఋజువుచేయలేదు. పైపద్యములలో నుదాహృతు లైనవేమన వేఱొకఁడను వాదములేదు. కావున శ్రీసుబ్బారావుగారిసిద్ధాంతము నిర్బాధకముగా నిలిచియున్నది. సుబ్బారావుగారు తమకాలనిర్ణయమునకు వేఱొకమార్గమును జూపియున్నారు. అదియిది. వేమన్న యొకచోట నాదికవిస్తుతి నిట్లొనరించియుండెను.

భవదూరుఁడు, శరభాంకుఁడుశివ
శీలుఁడు వేయుగోటిసిద్ధేశ్వరుఁడున్

శివభృత్యుఁడు వటమూలుఁడు, శివమయ
చిన్మయుఁడు సోమశేఖరగురుఁడున్.

(౧౨-౧-౩౫ ఓ. వై.)

ఈసోమశేఖరగురుఁ డెవ్వరనిచూడ ౧౫ వ శతాబ్దమునందు పోతన్నగురు వని వీరభద్రవిజయమునందుఁ జెప్పిన "సోమశేఖరుఁడు కన బడుచున్నాఁడు. ఈసోమశేఖరుఁడే వేమన్న, పోతన్నలను స్వతంత్రకవుల నిద్దఱ "శివాద్వైతుల" నొనరించి మనకుఁ బ్రసాదించె ననితోఁచుచు న్నది. పోతన్నకాలముకూడఁ గృష్ణరాయని కించుకపూర్వమే గనుక నీ వేమన్నకవికూడ మన మూహించునట్లు ౧౫వశతాబ్దమునందే పుట్టుట నిర్ధారణమగునేని క్రీ.శ.౧౪౧౨ సంవత్సరమునకు సరియైన నందననామ సంవత్సర కార్తికశుద్ధపున్నమినాడుపుట్టి క్రీ శ.౧౪౮౦కి సరియైనశార్వరి నామసంవత్సర చైత్రశుద్ధనవమినాఁడు సిద్ధిపొందెనని యూహింపఁదగి యున్నది."

శ్రీ సుబ్బారావుగారియీయూహల నెవ్వరును సహేతుకముగఁ గాదనలేదు. ఆయననిర్ణయించినకాలము సరికాదనువారు తమకాధార ముగాఁ గైకొనినపద్యములు మూఁడు. ఇవి వేమనరచించినవని వేమన పద్యముల వ్రాఁతప్రతులలోను ముద్రితప్రతులలోనుగూడ నున్నవి.

౧. అధముఁడైన మనుజుఁ డర్థవంతుండైన
నతనిమాట నడచు నవనిలోన
గజపతింటనున్న గవ్వలు చెల్లవా ?

ఈపద్యములో గజపతిని దలపెట్టి యుండెను. కావున గజపతు లాంధ్రదేశమునఁ బరిపాలన మారంభించినపిమ్మట వేమన యుండవల యునని వారివాదము. కావచ్చును. గజపతులు క్రీ. శ. ౧౪౫౦ మొద లుగ నాంధ్రదేశమును బరిపాలించునట్లు చరిత్రలు చెప్పుచున్నవి. శాస నములుసాక్ష్యమిచ్చుచున్నవి. (ద.హిం.శా.సం. ౪, సంఖ్య ౭౬౧.శా. శ.౧౩౮౭) క్రీ.శ, ౧౪౮౦ వఱకు జీవించినవేమన గజపతులనుగూర్చి వ్రాసినాఁడనిననం దసంభవమేమియులేదు. అందుకొరకాతనిని ౧౫౪౦

వఱకు దీసికొని పోనక్కఱయుండదు. కావున నీపద్యము శ్రీసుబ్బారావు గారిసిద్ధాంతమును బూర్వపక్షము సేయఁజాలదు.

౨. పరఁగ రాయనికులబాచని ధన మెల్ల
భట్లపాలు కవులపాలు దలఁప
నొనర హీనజనునిధనము దాయాదుల
పాలు వారకాంతపాలు వేమ.

ఈపద్యమునుబట్టి వేమన రాయనిభాస్కరుని కాలమువాఁ డని కొందఱివాదము. గతకాలమువారినైనను కవులు కీర్తికాయులనుగా జేసి యుండవచ్చును. కావున నీపద్యమునుబట్టి రాయనిభాస్కరుఁడును వేమనయు, సమకాలికులని తలంపనక్కఱలేదని శ్రీబండారు తమ్మయ్యగారి యభిప్రాయము. అదియంగీకరింపఁదగినదె. వారిరువురు సమకాలికులని యీపద్యమునుబట్టి ధ్రువపడదు. అయినను వదాన్యులైన భాస్కరులు పెక్కురున్నారు. శ్రీశేషాద్రిరమణకవులు పీఠికలో నొకచాటుపద్యము నుదాహరించి, యది క్రీ. శ. ౧౫౧౬లోనున్న రాయనిభాస్కరునిదని వ్రాసియున్నారు. కాని యందుల కాధారములు లేవు. అనవేమారెడ్డి కాలములో (క్రీ.శ.౧౩౬౦ప్రాంతము) నొకమహాదాత రాయనిభాస్కరుఁడున్నాఁడు. తమ్మయగారని నట్లాభాస్కరు నుద్దేశించి వేమన యీపద్యమును జెప్పియుండవచ్చును. ౧౫౧౬లోనున్న రాయనిభాస్కరునిజననకాల మేదియో శ్రీశేషాద్రిరమణకవులు చెప్పలేదు. కానియంత్యము క్రీ.శ.౧౫౨౦అని చెప్పియున్నారు. ౧౫౧౬నాటి కాభాస్కరున కరువదియేం డ్లున్నవనినచో నాతఁడు వేమనకాలమునం దేయుండెనని చెప్పుట కవకాశమున్నది. కావున నీపద్యమును సుబ్బారావుగారుచేసిన కాలనిర్ణయమున కభ్యంతరము సేయఁజాలదు.

3. ప్రకటముగ ............ గుంటు
పల్లి ముత్తెఁ డెన్నఁ బరమగుణుఁడు
అన్నదానమునను హరుపూజచేతను
హరుని లోనఁ గాంచె నరసి వేమ.

గుంటుపల్లిముత్తామాత్యుని వేమన యీపద్యములోఁ బేర్కొని యున్నాఁడు. శ్రీశేషాద్రిరమణకవులును తమ్మయ్యగారును బ్రభాకర శాస్త్రిలుగారును నీపద్యముపై నాధారపడి సుబ్బారావుగారు చేసినకాల నిర్ణయమును ద్రోసివైచిరి. సుబ్బారావుగారు తమశతకకవులచరిత్రము నం దీపద్యము నుదాహరించి దీనిని బ్రక్షిప్తమని త్రోసివైచిరి. ఈసందర్భ మున శేషాద్రిరమణకవులు వ్రాసినవాక్యము లివి.—

"పూర్వవినిర్ణీతనిర్ణయములనమ్మి వంగూరు సుబ్బారావుగారీ పద్యము ప్రక్షిప్త మనిరి. తమకు బాధకమగుపద్యము ప్రక్షిప్తమగుననుట స్వపక్షబలమునకు మనవారుచూపుసాధనములలో నొకటి. గుంటుపల్లి ముత్తనామాత్యుఁడు సామాన్యుఁడుగాఁడు ఈతనివివరములుచాటుపద్య మణిమంజరిరత్నాకరములేగాక ముత్తనామాత్యచరిత్ర మనుగ్రంథము వలనవిశదముగాఁ దెలియ గలవు. ముత్తనామాత్యుఁడు దాతయై యడిగిన కవిగాయకభట్టుమూర్తులకు లేదనక దానములు గావించుచు వితరణకర్ణుఁ డని ప్రశస్తివహించెను. ఇతఁడు గోలకొండనవాబులకుఁ బ్రతినిధియై సర్వాధికారములతో కొండవీడు వినుకొండ బెల్లముకొండ నాగార్జున కొండ యనునాలుగుదుర్గములకు నధ్యక్షుఁడై యుండి శ్రీశైలము మొద లు రామేశ్వరమువఱకుఁ గలదేవస్థానములలో దానములఁ గావించెను. ఇతని ప్రశస్తిని చాటుపద్యము లుదాహరించెదము.

ఉ. సంతత మారగించు నెడ సజ్జనకోటులఁ బూజసేయుశ్రీ
మంతుఁడు గుంటుపల్లికులమంత్రిశిఖామణి ముత్తమంత్రి మే
ల్బంతియె బంతిగాక కడు పందగులాములమంత్రులెల్ల నా
ల్బంతులు దుక్కిటెద్దు మొదబంతులు విప్రవినోదిగారడీ
బంతులు దొంగవాండ్రములుబంతులు సుమ్ము ధరాతలంబునన్.

మ. అని నీవైరులు మంత్రు లిట్లని రని న్నార్యుల్ కవుల్ పండితుల్
ఘనదానంబున మేఘునిన్ శిబిఘనున్ స్కంధీశ్వరున్ గర్ణునిన్
జనులెల్లన్ వినుతింపఁ గెల్చెనని విశ్వాసంబుగాఁ బల్కెరా
మ్మును నీసేయుతపంబు పెంపునను శ్రీముత్తప్రధానాగ్రణీ!

చ. కమలభవాండభాండ మనఁగల్గిన సందవరంపుటిండ్లలో
ప్రముఖుఁడు రాయనప్రభునిభాస్కరుఁడే నెఱదాత పిమ్మటన్
విమలచరిత్ర గుంటుపలివీరయముత్తఁడె దాత భట్టసం
భ్రమఘనదానరూఢి నొకపాటివదాన్యుల నెన్న నేటికిన్.

మ. అనఘప్రాభవ గుంటుపల్లిసచివేంద్రా! ముత్తనామాత్య! నీ
ఘనహస్తాబ్జసుగంధవాసన మదంగవ్యాప్త మైనప్పుడే
కనుగొంటిన్ జతురంతయానపదవుల్ గైగొంటి మేల్వస్తువుల్
కనకస్నానము లబ్బె మాకు సెలవా? కర్ణాటకక్షోణికిన్.

ఈపద్యములవలన ముత్తనామాత్యుఁడు అన్నదానమున హరుని పూజయందు నసమానుఁడని చెప్పవచ్చును. అట్టిచో వేమన పొగడుటలో నించుకేని వింతలేదు. ఇది ప్రక్షిప్తమని యనుకొనవలసినంతయవసరము కానరాదు.

క. పొందుగ శరజలనిధి హరి
చందనతరు చంద్రసంఖ్య శకవర్షంబుల్
దుందుభినామాబ్దంబున
నందముగా వీరముత్తఁ డరిగెన్ దివికిన్.

అనుపద్యమువలన ముత్తనామాత్యుఁడు శా.శ. ౧౪౪౫ లకుసరియగు క్రీ.శ.౧౬౨౩లోఁ బరమపదవి నలంకరించెను ఈచరిత్రాంశములను సమన్వయించి చూచితిమేని వేమనయోగి రాయనిబాచని (భాస్కరునియంత్యము క్రీ శ ౧౪౨౦) చివరకాలమునను గుంటుపల్లి ముత్తనామాత్యుని మధ్యకాలమునను గజపతులరాజ్యకాలమున క్రీ.శ. ౧౪౪౦ మొదలు ౧౬౦౦ వఱకు నుండియుండునని తలంపవచ్చును" అని వ్రాసియున్నారు.

పెదపాటియెఱ్ఱన తనమల్హణచరిత్రమును కృష్ణరాయనికీయక దాఁచి యుంచితి నని చెప్పినపద్యమును సత్యమని నమ్మితిమేని వేమనపద్యములలో గుంటుపల్లిముత్తననుగూర్చి చెప్పినపద్యము ప్రక్షిప్తమని యనక తప్పదు ఎఱ్ఱనచెప్పినమాట యసత్యమనుటకుఁగాని, యీపద్యము ప్రక్షిప్తమనుటకుఁ గాని యవకాశమును నవసరమును లేదు. వేమనపద్య

ములలోఁ బ్రక్షిప్తము లధికముగానున్నవని పండితుల యభిప్రాయము. ఈ రెండుపద్యములలోను నేదియో యొకటి ప్రక్షిప్తమని నిర్ధారణచేయ వలసి వచ్చినప్పుడు వేమన పద్యమునే ప్రక్షిప్తమని తలంచుట న్యాయము. కావున సుబ్బారావుగారు చేసినకాలనిర్ణయమే సరియైనదని నాదృఢనమ్మకము. శ్రీశేషాద్రిరమణకవులు.—

“ఆ. తిరుమలకును బోవఁ దురక దాసరిగాఁడు
కాశిఁ బోవ లంజె గాదు గరిత
కుక్క సింహ మౌనె గోదావరిఁ బోవ.”

అనుపద్యమును దమకాలనిర్ణయమున కాధారముగాఁ గొని దానిపై నీక్రిందివాక్యములను వ్రాసియున్నారు.

“తిరుపతికిఁ బోయినంతనఁ దురక దాసరి కాఁడని చెప్పుటవలన మహమ్మదీయు లాంధ్రదేశము నాక్రమించి దేవస్థానముల ముట్టడిం చినకాలమున వేమన యున్నటుల నూహింపవీలగును. రెడ్డిరాజులు కొండవీడు, రాజమహేంద్రవరము పాలించువఱకుఁ దురకలు తెలుగు దేశములోఁ బ్రవేశించి నిలువలేదు. తురకలు తెలుఁగుదేశములలో క్షేత్రములలోఁ బ్రవేశించి కలకలదనము జూపినది రెడ్డిరాజ్యావసాన మునసేగాని మహమ్మదీయవిజృంభణకాల మగు క్రీ. శ. ౧౫౦౦ ప్రాం తములలో వేమన పైనుడి వాకొనియుండును.”

పైపద్యపాదములో శ్రీ శేషాద్రిరమణకవు లూహించినంతయర్థ మిమిడియుండలేదు. పాతివ్రత్యమునందునమ్మకములేని కులట పుణ్య క్షేత్రమగుకాశి కేఁగినను నిల్లాలు గానేరనట్లే విగ్రహారాధనమునందు నమ్మకములేనితురక తిరుపతికిఁబోయినను దాసరి కానేరఁ డనుసంత వఱకే యీపద్యార్థము. దేవస్థాననాశనముతోఁగాని తురక లాంధ్ర దేశమున నిలుకడగా నుండుటతోఁగాని యీపద్యమునకు సంబంధము లేదు. తురకలు విగ్రహారాధనకు వ్యతిరేకులనుభావము పదునాఱవ శతాబ్దియందుగాని యాంధ్రులకుఁగలుగ లేదని తలంపరాదు. పదు నైదవ శతాబ్దిలోఁ దురకలాంధ్రదేశమునకు రాలేదని చెప్పలేముగదా! పదు నాల్గవశతాబ్దియందే ఆంధ్రదేశములోని వరంగల్లు దేవాలయములను

మహమ్మదీయులు ధ్వంసము చేయలేదా? దక్షిణహిందూదేశమున మహమ్మదీయులు పదునాల్గవశతాబ్దిప్రారంభముననే ప్రవేశించి యనేక దుండగములు చేసినట్లు చరిత్రలు చెప్పుచున్నవి. కావున నీపద్యమును బట్టి వేమనకాలమును పదునాఱవశతాబ్ది వఱకు దీసికొని పోరాదు.

ఈసందర్భములనన్నిటిని విమర్శచేసి చూచినచో శ్రీ సుబ్బారావుగారినిర్ణయమే సరియైనదిగా తోఁచినది. కావున యట్లే నిర్ణయింతము.

వేమనకవిత్వము మిగుల మనోహరమైనది. విధాత వేమనలలాటమున "ఈతఁడాటవెలఁదిప్రియుఁడు" అనివ్రాసియుండెనోటు. యౌవనమునఁ గామియై యాటవెలఁదిప్రియుఁడై గడపెను. విరాగియై సర్వసంగపరిత్యాగియయ్యును వేదాంతబోధ చేయునప్పుడును విధాతవ్రాఁత బలమునఁగాఁబోలు ఆటవెలఁదిప్రియుఁడేయయ్యెను. ఈతనిపద్యములలో నూటికి తొంబదివంతులు ఆటవెలఁదులు. ఈపద్యముల నీతఁడాత్మసంబోధనము చేయుచుఁ జెప్పెను. వీనిలోఁ జాలభాగము నాల్గవపాదము "విశ్వదాభిరామ వినురవేమ!" అనియుండును. చెప్పఁదలచినవిషయము మూఁడుపాదములలో నిముడక నాల్గవపాదమునకు మిగిలియున్నప్పుడు తుదను "వేమ" అనిమాత్రమే సంబోధించుచుండును.

ఇతఁడొకశతకమునుగాని శతకములనుగాని వ్రాయవలయునని సంకల్పించుకొని యీపద్యములను వ్రాసినట్లు కనుపడదు. గంటము తాటియాకులనుగైకొనిగాని కలమును గాగితమును గైకొనిగాని యీతఁడీపద్యములను వ్రాయలేదు. ఆతఁడు పద్యము నాశువుగాఁ జెప్పినప్పుడచ్చటనున్నశిష్యుఁడో భక్తుఁడో యాపద్యమును వ్రాసికొనియుండునని తలంపవలసియున్నది. ఈతనిమత ముపనిషదీరితమైన యద్వైతమే యైనను వేదాంతగ్రంథములయందలిభావముల నన్నిఁటి నీతఁడు వరుసగా జెప్పవలయునని సంకల్పించుకొనలేదు. ఎప్పుడేభావ మాతనిహృదయమునకుఁ దట్టునో యాభావమును సులభములైన చిన్నమాటలతో లోకమునఁ గనపడు నుదాహరణములతోఁ జేర్చి యెంతమూఢుని హృదయమునందైనను గట్టిగా నాటుకొనునట్లు చెప్పఁగలశక్తి యీతని

నికిఁ దక్క మఱియొకరికి లేదు. పోతనకవిత్వమువలెనే పదమధ్యమున యతిగాని పాదాంతముగాని యుండక యాస్థానములయందు పదాంతమగునట్లీతఁడు దనపద్యములను రమ్యముగా రచియించెను. ఈతనిపద్యములలో పెక్కులు విమర్శనాత్మకములు. ఈతఁడు గొప్పవిమర్శకుఁడు. కాని యీతనివిమర్శనములు సామాన్యులుచేయువిమర్శనములవంటివి కావు. ఇతఁడు విరాగి. ప్రాపంచికవిషయభోగవిముఖుఁడు. ఆదృష్టితోడనే ప్రతివస్తువును విమర్శించుచుండును. అందువలన నీతనిదృష్టికిఁ బ్రతికార్యమునందును లోపములే కాన్పించుచుండును. ఇతఁడు అద్వైతసిద్ధినందిన మహాజ్ఞానియగుటచే జ్ఞానసంపాదనమునకై సామాన్యవ్యక్తి చేయుసాధనము లన్నియు నీతనికండ్లకు కథమకార్యములవలె గన్పించి వానిని నిరసించుచు బద్యములను జెప్పెను. వానిని జదివి కొందఱు మతాచారవ్యవహారములను నిరసించుట కాపద్యముల నుపయోగించుచున్నారు. కాని వేమన యాపద్యముల నేసందర్భమున నెవరికొఱకుఁ జెప్పెనో ఆతఁ డెంతజ్ఞానియై యేదృష్టితోఁ బ్రపంచమును జూచుచు నాపద్యములను రచియించెనో యోచించుకొనుట లేదు. అట్టివానిఁ జూచి వేమన విచారము నొందును గాని సంతసింపఁడు. వేమనపద్యములందు బరస్పరవిరుద్ధధర్మప్రతిపాదకము లైనపద్యములు కలవనియు నట్టిపద్యముల నాతఁడురచించియుండఁడనియు నవి ప్రక్షిప్తములనియు గొందఱు దలంచుచున్నారు. వేమనపద్యములలోఁగొన్ని ప్రక్షిప్తములున్నమాట నిజమే. కొందఱు కవులు "విశ్వదాభిరామ వినురవేమ" యనుమకుటమును జేర్చి తక్కినమూఁడు పాదములనల్లియుండుటయు నవి వేమనపద్యములలోఁ జేరుటయు సంభవమే "పీఁడికల్లి మొగుఁడు పీ డెంతవాఁడ యా విశ్వదాభిరామ వినురవేమ" అనునంతవఱకుఁగూడ నట్టిపద్యములు బయలు దేరినవి. వానిమాటయటుండనిండు. వేమన కేవలజ్ఞానులకొఱకే కాక సామాన్యమానవులకుఁగూడ ననుసరణీయము లైనకొన్నినీతులను ధర్మములను నప్పుడప్పుడు బోధించుచుండెడివాఁడు. మానవులహృదయస్థితులనుబట్టి యేధర్మము లుపయోగపడుచుండును. కేవలమూఢునకు, నించుకజ్ఞానవంతునకు, నభ్యాసస్థితిలోనున్నజ్ఞానికి, పరిపక్వస్థితినందఁబోవువానికి, సంపూర్ణసిద్ధునకుఁగూడ నుపకరించుధర్మములను వేమన

యుపదేశించెను. కావున యాయుపదేశములరహస్యము నెఱింగిఅధికార తారతమ్యముకొలఁది వానిని బాటింపవలయును. వేమన కొకజాతిపైఁ గాని యొకకులముపైఁగాని యొక యాచారముపైఁగాని యొకధర్మముపైఁ గాని ద్వేషములేదు. మానవులందఱును నాత్మజ్ఞానులై యద్వైతసిద్ధి నంది తరింపవలయునని యాతనికోర్కె.

ఆత్మజ్ఞానసంపాదనమునకే ప్రయత్నింపవలయునని తఱుచుగా నీతనిపద్యములు బోధించుచుండును. ఆత్మజ్ఞానసంపాదనమున కాటంకము గలుగఁజేయు కామక్రోధమోహలోభాదులను వానినిబట్టిచేయుకార్యములను, వానికి లొంగినమానవులను వేమన యతినిశితముగ నిర్మొగమాటముగ విమర్శించుచుండును. స్థూలదృష్టిచేఁ జూచువారి కీతఁడు బ్రాహ్మణద్వేషియు, వేదశాస్త్రదూషకుఁ డనియుఁ దోఁచును. కాని యందు యథార్థములేదు. అతఁడు చేసినబోధనలు వేదశాస్త్రవ్యతిరేకములు కావు. జ్ఞానప్రదములు. వేమన శూద్రుఁడనియు, వేదములను ఉపనిషత్తులను జదువలేదనియుఁ గొందఱు నిరసింతురు. వివేకానందుఁడు కాయస్థుఁడుకాఁడా? అతఁడు వేదములను వల్లించెనా? వేమన శూద్రుఁడైనను బూర్వపుణ్యవశమువలన నాతనికిఁ బ్రహ్మజ్ఞాన ముదయించినది. అతఁడుచేసినబోధనలాదరణీయములు. తర్కవేదాంతాదిశాస్త్రములను, జదివి యనుభవజ్ఞానమును సంపాదించిన మహామహులు కీతని పద్యములయవసరము లేకపోవచ్చును. కాని, సామాన్యమానవుల కవి యుపయోగకరములే యగును. ఎవరైనను వీనిని జదివినందువలనఁ బ్రత్యవాయముండదు.

వేలకొలఁదిగల యీతనిపద్యములనుండి శైలికై నేను పద్యముల నెన్నిటి నీయఁగలను? పదిపద్యములనిచ్చి తృప్తిఁ జెందెదను.

"తనదు బాగుఁ గోరి ధర్మంబుఁ జెప్పిన
దిట్టుచుండ్రు మొఱకు లెట్టయెదుట
గడ్డివేయ పోట్లగొడ్డుకొమ్మాడించు ... వి.

కావిపంచెగట్టి కడుయోగివలెనుండి
వెలికిఁ గోర్కెలెల్ల విడిచిపెట్టి
తొలఁగి తిరుగువాఁడు దొంగసన్యాసిరా ... వి.

ఏమహాత్మునందు నిజ్జగములు పుట్టు
నామహాత్ముభజన యనువుమీఱ
నియమనిష్ఠ నెఱపి నెమ్మదిఁ గనవలె ... వి

పూర్వజన్మమందుఁ బుణ్యంబు సేయని
పాపి తా ధనంబుఁ బడయలేఁడు
విత్తు మఱచి కోయ వెదకినచందంబు ... వి

"కొండగుహాలనున్నఁ గోవెలలందున్న
మెండుగాను బూది మెత్తియున్న
దుష్టబుద్ధులకును దుర్బుద్ధిమానునా ... వి.

అతులవైరాగ్యబోధోపరతుల నెఱిఁగి
సతులవలపునఁ జిక్క కసత్య మెఱిఁగి
మతిని జెదరక పట్టుట మాన్యరీతి ... వి.

చిలుకగర్భమందు (శ్రీ)శుకుఁ డుదయించి
మునివరేణ్యులందు ముఖ్యుఁడయ్యెఁ
బత్తికాయఁ జిత్రపటములు పుట్టవా ... వి.

ఎకటికలిమిఁ జూచి యేడ్చెడువారికి
భాగ్య మెటులఁ గూర్చుఁ బరమగురుఁడు
తనదుపూర్వకర్మ దైవ మెఱుంగఁడా ? ... వి.

ఉర్విజనులు పరమయోగీశ్వరునిఁజూచి
తెగడువారె కాని తెలియలేరు
అమృతపు రుచులను హస్తమెల్లెఱుఁగును ... వి.

భక్తియున్నచోటఁ బరమేశ్వరుం డుండు
భక్తిలేనిచోటఁ బాపముండు
భక్తి కలుగు వాఁడు పరమాత్ముఁ డగునయా ... వి.

దానధర్మములను దయయును సత్యము నీతి
వినయధైర్యశౌర్యవితరణములు
రాజుపాలిటి కివి రాజయోగంబులు ... వి.

వేమనకు బంగారముచేయువిద్య తెలియునని యీతఁడు రచించినపద్యములనుబట్టి తెలియుచున్నది. అందుఁ గొన్నిపద్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

"ఇంగిలీకమహిమ హేమింపనేరక
చిత్రపటమువ్రాసి చెఱచినారు
బొంతచెముడుపాల, బూసఁగింప నేరు, .. వి.

తాళకంబు తెచ్చి తాటికమ్మరసాన
వంపునిపుణ తెఱఁగ వెండియగును
కల్లగాదు నిజము కరకంఠనీయాన ... వి.

ఇంటివెనుకతీఁగ యింగ్లీక ముండంగ
పారదంబు గలుగఁ బసిఁడి యేల
సత్తు పొత్తు చేసి సాధింపవచ్చుగా ... వి.

ఇంకను నిట్టిపద్యములు మఱికొన్నియున్నవి. గనులనుండి స్వాభావికముగా నుత్పత్తియయ్యెడిబంగారమువంటి బంగారమును బాదరసము సత్తు ఇంగిలీకము మొదలగుకొన్నివస్తువులసంయోగముచేఁ జేయవచ్చునని మనదేశములోఁ జిరకాలానుగతమైనవాడుక కలదు. దీని నిప్పటివిద్యాధికులు ప్రకృతిశాస్త్రజ్ఞులు నమ్మరు. కాని, వేమనపద్యములను బట్టియు మఱికొన్నికథలనుబట్టియు నిట్టివిద్యకలదని నమ్మువారును నమ్మి దానికై ప్రయత్నించి విఫలులైనవారును నిప్పుడునున్నారు.

ఈ హేమవిద్యనుగూర్చి యనేకకథలు ప్రచారములో నున్నవి. వసిష్ఠమహర్షికడ నందినియనుకామధేనువున్నదనియు, నాయన దానివలనఁ గోరినవస్తువుల నెల్లఁబిదుకుచుండెడివాఁడనియు, పురాణములయందొకకథగలదు. ఆకామధేనువే హేమవిద్యయనియు హేమమువలన లభింపనివస్తువుండదనియుఁ జెప్పుదురు. ఆవిద్యను దన కిమ్మని విశ్వామిత్రుఁడు నిర్బంధించినను రాజుల కీవిద్య నీయరాదని వసిష్ఠుఁ డీయలేదనియు నందుపైఁ గోపించి విశ్వామిత్రుఁడు పరిశ్రమచేసి (Experiments) యావిద్యను సంపాదించెదననియు, నైనను వసిష్ఠుఁడు బరీక్షించి యది సరియైన కనకమగునో కాదోనిర్ణయింపవలయునను నుద్దేశముతో "వసి

ష్ఠుఁడు తనను బ్రహ్మర్షి యనినఁగాని తానంగీకరింప”నని చెప్పెననియు వసిష్ఠుఁడు విశ్వామిత్రుఁడు తనంతవాఁడయ్యెననియంగీకరించెననియు నొకకథ చెప్పెదరు. విశ్వామిత్రుఁడు హేమవిద్యను సంధ్యావందనములో మాఱుమాటలతో నిమిడ్చి చెప్పియుండెననియు గాయత్రీమంత్రమున హేమవిద్యకీలకమున్నదనియుఁ గొందఱందురు. విద్యారణ్యునకు హేమ విద్య తెలియుననియు సంగమవంశజులగు హరిహరరాయ, బుక్కరాయల కిట్టికృత్రిమబంగారమును విశేషముగాఁ జేసియిచ్చెననియుఁ జెప్పెదరు. ఈవిద్యారహస్యమును గ్రహించినవారొరులకుఁ జెప్పరు. చెప్పుట యుచితమునుగాదు. ఆహారాదులకై వస్తువులయుత్పత్తి కావలయును గాని కేవల హేమోత్పత్తివలన నయ్యెడు ప్రయోజనము లేదు. అందుచేతనే వేమనయు హేమవిద్యను బహిరంగము చేయక మాఱుమాటలతో జెప్పియుండెను. ఈమాటలనుబట్టి యెంతపరిశ్రమచేసినను నీవిద్య లభింపదు. గురుముఖమున నారహస్యము నెఱుంగవలసియున్నది. దానిని గ్రహింపఁజాలక యీవిద్యయే లేదనితలంచుట యశక్తతకుఁ దార్కాణముగును. ఏయమెరికాపండితుఁడో జర్మనుశాస్త్రవిజ్ఞాతయో కనిపెట్టి యీవిద్యను బ్రకటించినచో మనవారప్పుడు “ఈవిషయమును మన పూర్వులు పూర్వమే చెప్పియున్నారు” అని చెప్పనారంభింతురు. సీసమునకు యోగేష్ట మని వప్ర మని పేర్లు కలవు ఈశబ్దములకర్థము బంగారముచేయుయోగమునం దుపయోగించునదియని నామలింగానుశాసనమున వ్యుత్పత్తి వ్రాసియున్నారు. ఇట్లే పాదరసము మొదలగు కొన్నివస్తువులకునిట్టి వ్యుత్పత్త్యర్థములున్నవి. నాగశబ్దము పామునకును సీసమునకునుగూడ వర్తించును. శుద్ధిచేసిననాగ మని చెప్పుటకు వేమన పాముకుబుస మని యొకపద్యములోఁ జెప్పియున్నాఁడు. ఈరహస్యమును దెలియకుండ పాముకుబుసమును దెచ్చి నూఱు పుటము పెట్టిన బంగారము లభింపదు.

హేమవిద్యను సంపాదింపుఁడని ప్రోత్సహించుటకై నేనీ వాక్యములను వ్రాయలేదు, వేమన వెఱ్ఱివాఁడని తలఁపరాదనియు, నట్టివిద్య యున్నదని తలంచుట వెఱ్ఱితనమని భావింపఁగూడ దనియుఁ దెలుపుటకుమాత్రమే నేనీవాక్యములను వ్రాసితిని. మనయింటిపెరటిలోనున్న

కాక రాక్షసరుచే స్వర్ణరజము భస్మమై యౌషధయోగ్యము గుచున్నది. ఆయుర్వేదమున నిట్టియోషధీరహస్యము లనేక మున్నవి. నాగార్జునుఁడు, మీననాథుఁడు మొదలగు రససిద్ధులు పూర్వ ముండెడివారు. ఇప్పుడుకూడ నట్టివారుండవచ్చును. మనకుఁదెలియనివన్నియునసత్యము లనరాదు.

వేమనను గూర్చిన కథ లనేక మున్నవి. వాని నిటవ్రాసి వాని సత్యాసత్యములను జర్చించుటకిందుఁదావులేదు. అందువలన నయ్యెడు ప్రయోజనమును లేదని చెప్పుచు వేమనచారిత్రమును ముగించుచున్నాఁడను.

శ్రీ రాళ్లపల్లిఅనంతకృష్ణశర్మగారు' వేమనచరిత్రము నొకగ్రంథముగా వ్రాసియుండిరని తెలిసినది. నేనాగ్రంథమును జూచుట తటస్థింపలేదు.

## ౭5 రేవణూరి తిరుమలకొండయార్యుఁడు

ఇతఁడు నందవరీకబ్రాహ్మణుఁడు; శ్రీవత్సగోత్రుఁడు. సంకీర్తనాచార్యుఁ డనిప్రఖ్యాతిం గాంచినతాళ్ళపాక యన్నయాచార్యునకీతఁడల్లుఁడు' శకుంతలాపరిణయకావ్యమును రచించిన రేవణూరివెంకటార్య సుకవికిఁ గుమారుఁడు. ఆతఁడు గద్యలో "రేవణూరివంశపయఃపాథోధిసుధాధామ, రామచంద్రోపాఖ్యాన ప్రబంధసంధాన, విద్వత్ప్రచండతిరుమలకొండయాభిధబుధాగ్రణీతనూభవ" అని వ్రాయుటచే మనమీతనిరామచంద్రోపాఖ్యాన మెఱుంగఁ గల్గితిమి.

ఈగ్రంథ మిప్పు డెచటను గన్పట్టుట లేదు. ఈకవినిగూర్చిన విషయము లేమియుఁ దెలియవు అన్నయాచార్యుఁడు క్రీ.శ. ౧౪౦౮–౧౫౦౩ నడుమనున్నవాఁడు. కావున నీకవి ౧౪౫౦ ప్రాంతమున నున్నవాఁ డనిచెప్ప నొప్పును. కర్నూలుమండలమునఁ గోయిలకుంట్ల తాలూకాలో రేవణూరు అనుగ్రామ మున్నది. ఆగ్రామమునుబట్టి యీకవి గృహనామ మేర్పడియుండును ఈకవినివాసముకూడ నాప్రాంత మని యనుకొనవచ్చును.

కాకినాడ :—జార్జిప్రెస్ వందు ముద్రింపఁబడియె—1949.